

# మనసులు మారాయి

హరికిషన్

ప్రగతి సచిత్రవారపత్రిక
నుంచి పునర్ముద్రితము

# మనసులు మారాయి

హరికిషన్




సర్వోదయ పబ్లిషర్సు
విజయవాడ-2

సర్వోదయ ప్రచురణ నెం. 63
ప్రథమ ప్రచురణ
జనవరి 1973

వెల : రు 6-00

ఎడిటర్ :
'మిస్టర్ రావ్'

ముద్రణ :
రమణా ప్రింటర్స్
విజయవాడ-1

# మనసులు మారాయి

ఆరోజునే రిజల్ట్సు వచ్చినయ్యి. నళిని బి.కాం. సెకండ్ క్లాస్‌లో ప్యాసయింది. నళిని సంతోషానికి అవధులులేవు. తండ్రి రఘునాధరావు ఆలోచనలు ఎటో పోయినయ్యి. అన్నీ కలసి కలగా పులగంగా కందిపప్పు గోధుమలూ కలిసినట్లుగా ఉన్నాయి, ఆయన మనోభావాలు. తల్లి సుభ ద్రమ్మ మనసు అల్లుళ్ళను వెదకుతున్నది. చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ గొడవ చేస్తున్నారు. వాళ్ళకి నోరు తియ్యబడాలి.

"అక్కయ్య పరీక్ష పాసయింది. మనందరికీ కిలో చాక్లెట్లుఇవ్వాలి" అన్నది పెద్ద చెల్లెలు.

అందరి ముఖాలూ చూసింది నళిని. "అమ్మా, నీ మనస్సు అల్లుళ్ళ వేటకు వెళ్ళిందికదూ? నాకు తెల్సు"అన్నది.

"అవును తల్లీ" అన్నది సుభద్రమ్మ.

"నన్ను తల్లీ అన్నావంటే, నా కడుపున నిమిషాలమీద ఓ కాయ కాసి, ఆ కాయతో నువ్వు అమ్మమ్మవై పోయి మురిసిపోదామనుకున్నావు కదూ. మన దేశంలో నీలాంటి అమ్మమ్మలు కొల్లలుగా ఉండటంచేతనే మన దేశ జనాభా ఇంత పెరిగిపోయింది." కాస్త కోపాన్ని కలిపింది.

"బాగా చెప్పావ్ నళినీ ! మీ అమ్మకు తొందరగా అమ్మమ్మగా మారాలనే ఉంది. కాని ఆరోజు రావాలి కదా" అన్నాడు తండ్రి.

"బావుంది — సగం కోరిక నీకూ ఉన్నట్లుంది. అంతాకలిసి నా మనస్సును లొంగదీసుకుని నన్నొక చదరంగపు పావుగా చెయ్యాలను

కుంటున్నారు." చిరుకోపంతో విసుగ్గా అన్నది నళిని. ఆ చిరాకు సుభద్రమ్మ మనసులోని కోరికను రెండుతో హెచ్చవేసింది.

"ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సులో తీర్చటం తల్లిదండ్రుల బాధ్యత నళినీ. చిన్నతనం నిన్ను చిలిపితనంగా ఊహింప చేసినా, పెద్దవాళ్ళు తమ బాధ్యతలు తీర్చుకోటానికి తొందరపడడంలో అసహజం ఏమీ లేదమ్మా" అన్నదావిడ.

నళిని మనస్సులో చికాకు ఇంకా చోటుచేసుకున్నది.

"అమ్మా"

"ఏం తల్లీ"

"అదుగో ఆ మాటే అనొద్దన్నాను. నళినీ అనిపిలు. లేకపోతే ఊరుకో. ఏ గోడతోనో మాట్లాడినట్లుగా చెప్పినా సంతోషిస్తాను. అమ్మా, తల్లీ అంటే నా గొంతుకు ఉరిపొయ్యటానికి సిద్ధపడుతున్నావని అనుకుంటాను. తెల్సిందా" విసుగ్గా అన్నది నళిని. నిర్విణ్ణురాలయింది సుభద్రమ్మ. తల్లీ, కూతురు వైపుచూసి నవ్వుతూ వెళ్ళాడు రఘునాధరావు.

"ఆడపిల్లకు పెళ్ళి కావాలంటే బి.కాం. ప్యాసవాలా అమ్మా. పరీక్ష ఫలితాల్లు తెల్సిన ఆ నిమిషంనుంచే నీ ఆలోచన పెళ్ళివైపు పరిగెత్తిందే. అంటే నాకు పెళ్ళిచేసి వెంటనే నా బరువు వదిలించుకోవాలని అనుకున్నావ్ కదూ."

నళిని ఇట్లా మాట్లాడుతుంటే ఆవిడలో సహనం కొంత నశించింది. తనను ఎగతాళి పట్టిస్తున్నదేమో అనుకున్నది. ఏమైనా ఇంక ఆ నాటికి ఆ ప్రస్తావన చెయ్యకూడదని అనుకున్నది. ఏ సమాధానం చెప్పకుండా అవతలకు వెళ్ళింది.

తల్లినిచూసి మనస్సులోనవ్వుకొంది నళిని. పత్రిక చదువుకుంటున్న తండ్రివద్దకు వెళ్ళింది.

"నాన్నా పదిరూపాయలు కావాలి."

కళ్ళజోడు తీసి, పేపరు మడిచి అవతలకు పడేసి కూతురువైపు చూశాడాయన.

"ఎందుకమ్మా పదిరూపాయలు ?"

"నాకు ముగ్గురు చెల్లెళ్ళున్నారు, ఇద్దరు తమ్ముళ్ళున్నారు. వాళ్ళకు కిలో చాక్లెట్లు కొనివ్వాలి" చిన్నవాడి తల నిమురుతూ అన్నది నళిని.

"అయితే మాత్రం అన్ని చాక్లెట్లు ఎందుకమ్మా డబ్బు దండుగ."

"ఆ మాట నువ్వు అంటావని తెలుసు నాన్నా ! వాళ్ళకు ఆశ పెట్టాను. నా మాట చెల్లించుకోవాలి." ఆఖరి తమ్ముడిని ముద్దు పెట్టుకుంటూ అన్నది.

"అయితే మాత్రం కిలో చాక్లెట్లు ఎందుకమ్మా, డబ్బు దండగ. ఈ రోజుల్లో పది రూపాయల చాక్లెట్లు కొంటె పిచ్చివాళ్ళంటారు. డబ్బు విలువ నువ్వుకూడా తెల్సుకోకపోతే ఎట్లాగమ్మా నళినీ" ఆర్థిక బాధ ఆయన ముఖంలో తొంగిచూసింది.

నళిని నవ్వింది. స్వచ్ఛమైన ఆమె మనోభావాలు ఒక రూపాన్ని సంతరించుకున్నయ్యి.

"నేను పుట్టినప్పుడు మీ రేమనుకున్నారో చెప్పమంటావా నాన్నా" అన్నది నళిని. ఏమిటో అర్థంకాక చెప్పమన్నట్లుగా చూశాడాయన.

"ఈ ఆడపిల్లను పెంచి పెద్ద చేసి ఒక అయ్యచేతిలో పెట్టి మీ బాధ్యతను వదలించుకోవాలనే భావం మీలో అప్పుడే కలిగింది. అప్పటికి నా మనస్సు ఎంత చిన్నదో ఈనాడు అంత పెద్దది. వయస్సు కన్నా రెట్టింపు భావాలతో, ఆలోచనలతో నా మనస్సు నిండిపోయింది. నేను పెళ్ళిచేసుకోను. జీవితాంతమూ కన్యగానే ఉండిపోతాననే చెప్పటం లేదు. నా పెళ్ళి విషయం మీరు ఆలోచించటం మానేస్తే నాకు అవే పదివేల దీవెనలు" అన్నది నళిని.

తండ్రి మనస్సు ఆశ్చర్యంతో నిండిపోలేదు. "నాకు తెలుసు నళినీ నువ్వు ఉద్యోగం చేస్తావని. నీ ఉద్దేశ్యం తప్పకుండా నెరవేరుతుందమ్మా" అన్నాడాయన కళ్ళు తుడ్చుకుని

తండ్రి దగ్గర పదిరూపాయలూ తీసుకుని ముగ్గురు చెల్లెళ్ళకూ, ఇద్దరు తమ్ములకూ చాక్‌లెట్లూ, బిళ్ళలూ, బిస్కట్లూ కొనిపెట్టింది.

నళిని పెద్ద చెల్లెలు రాజేశ్వరి.

"నాన్నకు పెద్దకొడుకువయ్యే ఛాన్సు కొట్టేశావే అక్కయ్యా! నీ అవతార మార్పిడికి నా జోహార్లు. అయితే నేనే పెద్ద కూతుర్ని. నాకు పెళ్ళిచేసుకోవాలని ఉన్నది. నా పెళ్ళికి నువ్వు సాయం చేస్తావు కదూ" ఎగతాళిగా అన్నది రాజేశ్వరి.

"నువ్వు పెద్ద కూతురువయి పెళ్ళిచేసుకుంటా నంటే నా కేమీ అభ్యంతరం లేదు. ముద్దు కూతురివి మాత్రం కాకుండా ఉండేచాలు. అయినా పదిహేడేళ్ళ దానివి స్కూలుఫైనల్ చదువుతున్నావు. నిజంగా నువ్వు ముద్దు కూతురివే" అని నెత్తిన ఓ మొట్టికాయ వేసింది నళిని.

"అమ్మయ్యో హత్య. ఖూనీ" అని అరిచింది రాజేశ్వరి. నళిని ఖంగారు పడ్డది. రెండో చెల్లెలు జయలక్ష్మి పక పక నవ్వింది.

"ఎందుకే ఆ నవ్వు!" కోపంతో అన్నది నళిని.

"కాదు; రాజేశ్వరక్కయ్య ఈ మధ్య డిటెక్టివ్ పుస్తకాలు చదువుతున్నది. ఆ భాష అదే" అన్నది జయలక్ష్మి.

ఎలాకపోయి చూడసాగింది నళిని. ఇంతకాలమూ తన చదువు ధోరణిలోపడి ఈ చెల్లెళ్ళు ఎట్లా చదువుకుంటున్నారో తెల్సుకునే అవకాశం లేకపోయింది. తన దారిని తాను కాలేజికి వెళుతుంటే మిగతావాళ్ళు హైస్కూలికో, ఎలిమెంటరీ స్కూలుకో పోతున్నారు. ఎవరు ఎట్లా చదువుతున్నారో తను ఎన్నడూ పట్టించుకో లేదు.

బుద్ధి తెల్సిన రాజేశ్వరి, స్కూలుఫైనల్ చదువుతూ పాఠ్య పుస్తకాలకు బదులు డిటెక్టివ్ నవలలు చదువు తున్నదంటే మనస్సు గిలగిలలాడింది. ఈ పిల్లల మనస్తత్వాలు ఇట్లా మారిపోతున్నందుకు ఏం చెయ్యాలో నళినికి తోచలేదు.

"రాజూ, బడిపుస్తకాలు మానేసి డిటెక్టివ్ పుస్తకాలు చదువు తున్నావా" సాత్వికంగానే అడిగింది.

"అవును చదువుతున్నాను" అంతకన్నా గంభీరంగా చూస్తూ అన్నది రాజేశ్వరి.

"అందులో ప్రశ్నలేమైనా పరీక్షల్లో వస్తాయా."

"పరీక్షలు అయ్యాకనే చదువుతున్నాను. మార్చిలో స్కూలు ఫైనల్ పబ్లిక్ పరీక్షలైనయ్యి. ఇది మే-నెల. మా రిజల్ట్సు జూన్ మొదటి వారంలో వస్తయ్యి. అంతవరకూ కాలక్షేపానికి డిటెక్టివ్ నవలలు చదువు తున్నాను. తప్పా" తన తప్పేమీ లేనట్లుగానే ధైర్యంగా సమాధానం చెప్పింది రాజేశ్వరి.

"నిజమే, అడగటం నాదే తప్పు, నన్ను క్షమించు, డిటెక్టివ్ నవలలు చదువుకోవచ్చు, తప్పులేదు."

కోపం విచారంలో కలిసిపోయింది. విచారం పెద్దరికాన్ని మింగి వేసింది. ఏదో బాధ్యత తీసుకుందా మనుకున్న నళిని, తను ఓడిపోయి నట్లుగా బాధ పడింది.

మరో నాలుగు రోజులు గడిచాయి. నళిని, చేతిలో కొన్ని కాగి తాలు పుచ్చుకుని తండ్రి వద్దకు వచ్చింది.

"నన్ను మనస్ఫూర్తిగా ఆశీర్వదించండి నాన్నా" నవ్వుముఖంతో తండ్రిని అర్థించింది.

"ఏమిటమ్మా, ఏమని ఆశీర్వదించను, నా ఆశీర్వాదం నీకు కోపం తెప్పిస్తుందేమో" అనుమానంతో అన్నాడాయన.

"కొంతవరకూ నిజమే నాన్నా, 'కళ్యాణమస్తు' అని ఆశీర్వదిద్దా మనుకున్నారు, అంతే కదూ."

"అవునమ్మా నళినీ" సంతోషాన్ని వ్యక్తం చేస్తూ అన్నాడాయన.

"బి. కాం. పాసయినాను. 'ఉద్యోగ ప్రాప్తిరస్తు' అని ఆశీర్వ దించాలని నీకు తోచలేదా నాన్నా" అన్నది నళిని.

అవ్యక్త వ్యధతో పాటు ఆయన ముఖంలో ఆశించని ఆశారేఖను చూసింది నళిని. ఆనందాతిశయంతో ఆయన కళ్ళు చమ్మగిల్లాయి. ఆ కన్నీరు వెనక ఆయన మనస్సులోని భావాలు వెలుగునీడలను సంతరించు కున్నయ్యి- ఏమీ అనకూడ దనుకొంటూనే అనేశాడాయన.

"నేను బ్రతుకుండి నీ చేత ఉద్యోగం చేయించవలసి వచ్చినందుకు నా మనస్సు కొట్టు మిట్టు లాడుతున్నది నళినీ. కాని ఒక్కమాట చెపుతున్నాను. నీ నిర్ణయానికి నేను ఏ అడ్డూ చెప్పనమ్మా, నువ్వు ఉద్యోగం చెయ్యటం నాకు మనస్ఫూర్తిగా ఇష్టమే" అభిమానంతో కూడిన స్వరంలో మార్దవం లేకపోయినా, మనస్సులోని మార్దవాన్ని పూర్తిగా తెల్పుకుంది నళిని.

"నాన్నా! నా కూతురు ఉద్యోగం చేసి ప్రయోజకురాలవుతున్నదని ఎంతో సంతోషించాలిగాని ఏదో పెద్ద తప్పుచేస్తున్న దానిలా అంత బాధ పడతావెందుకు నాన్నా. సరే, నువ్వు ఒక నిర్ణయాని కొచ్చినందుకు నీ కన్న వెయ్యిరెట్లు - సంతోష పడుతున్నాను. ఉద్యోగ ప్రయత్నానికి వెళుతున్నాను నాన్నా. అడగనిది అమ్మయినా పెట్టదు అనే సామెత ఉంది. కాని ఉద్యోగం సంగతి అమ్మ నడిగితే ఆవిడ మనస్తత్వం వంద సంవత్సరాలు వెనక్కు పోతుంది. ఇక నే వెళ్ళొస్తాను."

తండ్రికి నమస్కరించి వెళ్ళింది నళిని. అక్కయ్య అటు వెళ్ళగానే ముగ్గురు చెల్లెళ్ళూ, ఇద్దరు తమ్ముళ్ళూ వంటింట్లోకి వెళ్ళారు.

"అమ్మా" అన్నది రాజేశ్వరి. వంటిల్లు సర్దుకుని వక్క పలుకు నవుల్తున్న తల్లి ఏమిటన్నట్లుగా వాళ్ళవైపు చూసింది.

"అక్కయ్య ఆఫీసుకు వెళ్ళింది" అన్నది రాజేశ్వరి.

"చాలా జీతం" అన్నాడు పెద్ద తమ్ముడు రాధారమణ.

"నాన్న వప్పుకున్నాడులే" అన్నది మూడోపిల్ల జయలక్ష్మి.

"నాకు బిళ్ళలు తెస్తుంది" అన్నాడు రెండో తమ్ముడు లక్ష్మణరావు.

"నాన్నకు చెప్పింది. ఈ సంగతి నీతో ఎందుకు చెప్పలేదో" అన్నది నాలుగో పిల్ల అనుపమ.

ఎవరికి తోచినట్లు వాళ్ళు చెప్పారు. ఆమె మనస్సు తల్లడిల్లింది. చిన్నబోయింది. అర్థంకాని అనుమానం తలెత్తిచూసింది. పిల్లలతో మాట్లాడ

కుండా వరండాలో కొచ్చింది. చుట్ట కాల్చుకుంటూ గతాన్ని వక్కపలుకులా నవుల్తున్నాడు రఘునాధరావు.

"నళిని ఆఫీసుకు వెళ్ళిందటగా" అన్నది.

చిటికినవ్రేలితో చుట్టనుసి రాల్చుతూ తాపీగా చూశారాయన.

"మిమ్మల్నే"

"ఏ ఆఫీసుకు వెళతానన్నది"

"నాకేంతెలుసూ, మీరంతా ఆలోచించే పంపించారుగా. ఆ జీతం నాకు అక్కర్లేదు మీ తండ్రీ కూతుళ్ళే దాచుకోండి, మాకు తిండిపెట్టలేక నా కూతురుచేత ఉద్యోగం చేయిస్తున్నారా, హవ్వా" అన్నదావిడ చెయ్యి నోటికి అడ్డం పెట్టుకుని.

చుట్ట గిరాటువేసి ఒక్క నిట్టూర్పు విడిచాడాయన

"ఆ చేత్తో నానోరు మూస్తే ఎంతో బావుండేది" అన్నాడాయన నిర్లిప్తతగా.

"ఆమాత్రం చేతవుతే ఈ సంసారం ఎప్పుడో బాగుపడేది" కసిగా అన్నదావిడ.

"నీ మనస్సులో ఇలాంటి భావాలున్నాయని ఇంతవరకూ తెల్సుకోలేక పోయాను. ఛీ ఛీ ! వయస్సుతోపాటు నీకు అర్థంలేని ఆలోచనలూ, ఆవేశమూ ఎక్కువై పోతున్నది" కోపంగా అన్నాడాయన. ఆవిడ ఏం మాట్లాడలేదు. పెళ్ళి కావాలసిన ఆడపిల్ల ఇట్లా ఉద్యోగాలు చెయ్యటం ఆవిడకు ఏమాత్రం ఇష్టంలేకపోయింది. తల్లికి ఇష్టంలేదని తెలిసే నళిని ఆవిడతో తన ఉద్యోగం విషయం సంప్రదించలేదు.

ఆరోజున నళిని తన స్నేహితురాలు యామిని ఇంటికి వెళ్ళింది. యామిని కాపురానికి వెళ్లి రెండేళ్ళయింది. ఈ రెండేళ్ళల్లోనూ వాళ్ళింటికి వెళ్ళటం నళినికి ఇది రెండోసారి. అంతకు క్రితం వెళ్లి సంవత్సరం పైగా అయింది.

రాకరాక వచ్చిన స్నేహితురాల్ని చూసి యామిని ఆశ్చర్యపడింది.

# మ న సు లు మా రా యి

"ఆకాశం నిర్మలంగా ఉంది, వాన కురిసి వెలిసిన నిర్మల నీలాకాశంలా ఉంది నా మనసు. ఏమిటా ఇంత ప్రశాంతంగా ఉందీవేళ అనుకున్నాను" గంభీరంగా అన్నది యామిని.

"తరువాత ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగింది నళిని.

"పువ్వులు నన్నుచూసి పరవశించాయి. మా పెంపుడు నెమలి పురివిప్పి నాట్యం చేసింది, అదిచూసి మా ఆల్సేషియన్ డాగ్ చిందులువేసింది. దాన్నిచూసి మా లేడిపిల్ల భయపడి చెంగుచెంగున దూకుతూ నా దగ్గరికొచ్చింది. అంతలో-"

"ఏం జరిగింది యామినీ" నళిని గుండెలు దడదడ లాడినయ్యి. ఏం జరిగిందోనని భయపడింది.

"అంతలోకి ఒక వెలుగు కనిపించింది"

"ఎక్కడన్నా ఇళ్ళు అంటుకున్నయ్యా, ఆషాక్ నుంచి నువ్వింకా తేరుకోలేదేమో, కాస్త విశ్రాంతి తీసుకో యామినీ, తరువాత మాట్లాడుకుందాం" యామిని చెయ్యి పుచ్చుకుని ఆదుర్దా పడుతూ అన్నది నళిని.

"ఏడీకాదు. అలాంటి చక్కని వాతావరణంలో నువ్వు మాయింటికి వెంచేశావు." నళిని తేరుకుని నవ్వేసింది. ఆ నవ్వుని రెండతో హెచ్చు వేసింది యామిని.

చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకున్నారు.

"ఆ వయస్సులో కబుర్లు ఈ వయస్సులో చెప్పుకున్నామేగాని, ఆ వయస్సుకు మళ్ళా పోలేం కదూ యామినీ" అన్నది నళిని.

ఇద్దరి వయస్సూ నెలల తేడానే అయినా, యామిని వయస్సులో నళినికన్న కొంచం పెద్దదిగానే కనిపిస్తుంది. ఆ తేడా ఇద్దరూ గుర్తించారు.

"ఎందుకుపోలేం నళినీ, పరికిణీ, చొక్కా వేసుకుందామా" నవ్వుతూ అన్నది యామిని. నవ్వలేకపోయింది నళిని.

"పోనీ నీరాకకేదో కారణం ఉందికదూ; నీముఖం చూసి చెప్పేస్తున్నాను. నాకు థాట్ రీడింగ్, ఫేస్ రీడింగ్ వచ్చు. నీ మనస్సులో ఆలోచనలు చెప్పేస్తాను" అన్నది యామిని.

"అందుకనే ఈ మహారాణిగారి దగ్గరకు ఈ చిన్ననాటి నేస్తం వచ్చింది. ఈ ముఖం చూసి నా కోరికను మన్నించు. కొట్టిపారెయ్యకు."

"ఓయస్. యువర్ రిక్వెస్ట్ విల్ బి కంప్లైడ్ విత్, ఇంతకీ తమ కనీస కోరిక" ఆత్రంగా అడిగింది యామిని.

"ఏమీలేదు, ఊరికనే వచ్చాను, నిన్ను చూసి పోదామని అంతే. నాకు ఏ కోరికా లేదు. నీ థాట్ రీడింగ్ బోగస్" చప్పట్లు చరుస్తూ నవ్వింది నళిని.

"సరే అయితే నన్ను చూసిపోదామని వచ్చావు, ఆల్‌రైట్. పోనీ నన్ను మేసిపో, సంతోషిస్తాను."

"నేను మేకనూ, ఆవునూ కాదు మేసిపోటానికి. ఐయామ్ యాన్ అనేంప్లాయిడ్ గరల్" అన్నది నళిని.

"దొరికిపోయావే దొంగా, నిరుద్యోగ పట్టభద్రురాలమ్మా, ఉద్యోగం కావాలా" అన్నది యామిని.

అవునన్నట్లు చూసింది యామినివైపు నళిని.

"ఐ విల్ సీ" స్టైలిష్‌గా అన్నది యామిని.

"మహారాణీవారి దయ" రెండు చేతులూ ఎత్తి నవ్వుతూ నమస్కరించింది నళిని.

"ప్రాప్తిరస్తు"

# 2

యామిని భర్త హరగోపాల్‌కి పెద్ద వ్యాపార సంస్థ ఉన్నది. ఎగుమతి, దిగుమతి వ్యాపారాన్ని నిర్వహించటంలో హరగోపాల్ పేరెన్నికగన్నాడు. పోటీ వ్యాపారస్తులందరూ హరగోపాల్ని 'బిజినెస్

మాగ్నెట్' అంటారు. అతని కంపెనీలో అయిదారుగురు గుమాస్తాలూ, ఒక మేనేజరూ, ఇద్దరు స్టెనోలూ ఉన్నారు. ప్రస్తుతం ఏ ఉద్యోగమూ ఖాళీ లేకపోయినా భార్య స్నేహితురాలు కావటంచేత, యామిని పట్టు బట్టటంచేతా నళినికి ఉద్యోగం ఇచ్చాడు హరగోపాల్. జీతం నూటఏభై.

నళిని ఉద్యోగంలో చేరి వారం రోజులైంది. కూతురు రోజూ ఉద్యోగానికి వెళ్ళి వస్తుంటే సుభద్రమ్మకు చీమలు, జెర్రులు పాకినట్లున్నది. తండ్రి రఘునాధరావు ఎంతో సంతోషించాడు.

"మా అక్కయ్య ఉద్యోగం చేస్తున్నది. జీతం తెస్తుంది. మాకు బిళ్ళలు కొంటుంది. సినిమాలకు తీసుకు వెళుతుంది" అని తతిమ్మా పిల్ల లంతా మురిసిపోతున్నారు. నళిని ఆఫీసుకు వెళుతుంటే ఆఖరి పిల్లలు ముగ్గురూ అక్కయ్య వెంట కొంతదూరం వెళ్ళి సంతోషంతో సాగనంపి ఇంటికి వస్తున్నారు.

ఆఫీసులో నళినికి ఎక్కువ పనిలేదు. రోజూ ఓ గంట మాత్రమే కరస్పాండెన్సు చూస్తున్నది. అదయినా మధ్యాన్నం రెండు గంటల లోపలే. తరువాత అసలు పనిలేదు. ఆఫీసు మేనేజరు రామశాస్త్రి.

ఒక రోజున హరగోపాల్ మేనేజరుని అడిగాడు నళిని ఏ పని చేస్తున్నదని?

"పనిచేసే వాళ్ళని చూ స్తున్నది" అన్నాడు మేనేజరు రామశాస్త్రి. హరగోపాల్ తొణకలేదు, ఆశ్చర్యపడలేదు.

"అయితే కాస్త పుషింగ్ నేచర్ ఉన్న అమ్మాయే నన్నమాట" శాపీగా అన్నాడు లెడ్జరు చూస్తూ.

అర్థం కాక ఏమీ అనలేదు మేనేజరు.

"సమాధానం చెప్పరేమండీ శాస్త్రిగారూ" లెడ్జరు చూస్తూ అన్నాడు. అది తీసుకుని ఎళ్ళబోయాడు మేనేజరు.

"కూర్చోండి. మనది వ్యాపారసంస్థ, ధర్మ సంస్థ కాదు. మన సంస్థను పెంపు చేసేటపు, [illegible] ఎంత చూసుకోవాలి.

అర్థమైంది కదూ" సిగరెట్ వెలిగించుకుని లైటర్ ఆర్పి టేబిల్‌మీద ఉంచాడు.

"అయితే నళినికి ఏ పని ఇవ్వమంటారు" హరగోపాల్ ఆంతర్య మేమిటో మేనేజరుకు అర్థం కాలేదు. తనను సంప్రదించకుండా ఎందుకు ఉద్యోగం ఇచ్చారో తెలీక ఇన్నిరోజులనుంచీ సతమతమై పోతున్నాడు.

"దటీజ్ యువర్ లుకౌట్" ఫైల్సు చూడసాగాడు హరగోపాల్. మేనేజరు తన సీట్లోకి వచ్చేశాడు.

"నళినీ" కోపం, అధికార దర్పం ఒకదానితో ఒకటి పోటీపడ్డయ్యి. చూస్తున్న ఫైలు బల్లమీద ఉంచి నెమ్మదిగా వచ్చింది నళిని.

"మీరేం చేస్తున్నారు ?"

"భానోజీ కంపెనీతోవున్న కరెస్పాండెన్స్ ఫైలు చూస్తున్నాను."

"మీరు ఫైలు చూస్తున్నారేగాని, పనిచెయ్యడం లేదు. ఇది వ్యాపార సంస్థ. ధర్మ సంస్థ కాదు" తారాస్థాయికి వెళ్ళిన కోపం దిగి వచ్చింది.

"ఏ సంస్థలో అయినా జీతం తీసుకుంటున్నప్పుడు పని చెయ్యవల సిందే కదండీ, చెప్పండి ఏం చెయ్యమంటారో ?"

"ఎక్స్ప్రెస్ కంపెనీలతో మనం చేసే కరెస్పాండెన్సు చూడండి. ఏమైనా తెలీకపోతే అడిగి తెల్సుకోండి. బట్ డోంట్ వేస్ట్ యువర్ టైం" అధికార యుక్తంగా అన్నాడు మేనేజరు.

వ్యక్తుల తరహాలు వివిధ రకాలు అని మనసులో అనుకొని వెళ్ళింది నళిని.

మధ్యాహ్నానికి ఓ పది ఫైల్సు డిస్పోజ్‌చేసి మేనేజరుకు పంపింది నళిని. అన్నీ చూశాడు మేనేజరు ఆశ్చర్యపోయాడు. ఇంత తొందరలో పని తెల్సుకుంటుందని ఆయన అనుకోలేదు.

నెలాఖరయింది, అయిదో తారీఖు వచ్చింది. ఆ కంపెనీలో అందరికీ అయిదో తారీకున జీతాలిస్తారు. నళిని జీతం తీసుకున్నది. ఆమె సంతోషానికి అవధులులేవు. తన ఇరవై ఏళ్ళ జీవితంలో ఆ రోజు ఒక మైలురాయి. స్వార్జితం కళ్ళారా చూసింది. కళ్ళ కద్దుకుని డబ్బు పూసల

బేగ్‌లో దాచుకుంది. సాయంత్రం ఇంటికి బయల్దేరింది. నెల జీతం చేతిలో ఉన్నది. మనస్సులో ఆలోచనలు ఆనందంతో ఉరకలు వేసి అల్లరి పెట్టసాగాయి. అమ్మకూ, నాన్నకూ బట్టలు కొంటాను, తమ్ముళ్ళకు చెల్లాయిలకూ పళ్లూ, మిఠాయిలు కొంటాను. ఆలోచనలు ఇల్లా ఉంటే కాళ్ళు ఇంటికి చేర్చినయ్యి.

నళిని ఇంటికి వెళ్ళేసరికి తండ్రి ఇంటికి రాలేదు. సంతోషంతో తల్లి దగ్గరకు వెళ్ళి జీతమంతా తల్లి చేతికిచ్చింది. ఆమె పాదాలకు నమస్కరించింది.

"ఉద్యోగంలో చేరగానే ఈ వేషాలూ నేర్చావా" అన్నది సుభద్రమ్మ.

తల్లి తత్వం తెల్సిన నళిని మనస్సులో నవ్వుకుంది.

"అమ్మకు నమస్కారం చెయ్యడం వేషం వెయ్యడంతో సమానమా అమ్మా."

"వేషం కాకపోతే ఏం, దానుడి తప్పు దణ్ణంతోసరి అన్నట్టుంది. నీ జీతం నా కెందుకుగాని మీ నాన్నకే ఇవ్వు. ఆయన అప్యాయంగా జేబులో వేసుకుంటారు" అన్నదావిడ ఈసడింపుగా.

"అట్లాగేనమ్మా" అని వెళ్ళింది నళిని.

ఆడపిల్లలు ఉద్యోగం చేయడం అమ్మకు ఎందుకు గిట్టదో నళినికి అర్థంకాలేదు. ఇంక ఆ విషయమే ఆలోచించలేదు.

రాత్రి ఎనిమిది గంటలకు తండ్రి ఇంటికి వచ్చాక భోజనంచేసి చుట్టకాల్చుకుంటున్న సమయంలో తండ్రి దగ్గరకు వెళ్ళింది నళిని.

"జీతం ఇచ్చారు నాన్నా" సంతోషంతో తండ్రి కివ్వబోయింది.

"సంతోషం తల్లీ. ఆ, చూడూ. నా ఓటు ఎప్పుడూ నీకే. ఆ జీతం అమ్మకివ్వు. సంతోషిస్తుంది" నెమ్మదిగా అన్నాడాయన కూతురువైపు చూస్తూ.

"వెయ్యవలసిన అక్షింతలు అమ్మ ఇందాకనే వేసింది. నువ్వుకూడా నన్ను అపార్థం చేసుకోకు నాన్నా".

నళిని కంఠంలోని ఆవేదన ఆయన గ్రహించాడు. కూతురు ఉద్యోగం చెయ్యడం ఆవిడకు ఎంతమాత్రం ఇష్టంలేదని ఆయన మరో సారి తెల్సుకున్నాడు. భార్య తత్వం మారనందుకు ఆయన మనస్సులో బాధపడ్డా, కాలానుగుణ్యంగా కొద్దిరోజుల్లో ఆవిడ మనస్సు మార్చుకుంటుందనే అనుకున్నాడు.

"నళినీ ! నే చెప్పినట్లుగా చేస్తావుకదూ" అర్థిస్తున్నట్లుగా అన్నాడాయన.

"తప్పకుండా నాన్నా" అన్నది నళిని.

"ప్రయోజకత్వం మనదే అయినా, ఆ ప్రయోజకత్వాన్ని ప్రసాదించేది ఆ పరాత్పరుడేనమ్మా. మొదటిసారిగా పూచిన పూలన్నీ ఇంట్లో వాళ్ళే అలంకరించుకునే కన్నా కొన్ని పుష్పాల్ని భగవత్ పూజకు వినియోగించటంలో తప్పులేదేమో" అన్నాడాయన.

తండ్రి అభిప్రాయాన్ని సాకల్యంగా అర్థంచేసుకున్నది నళిని.

"నల్లని నామాల స్వామికి. ఒక సంవత్సరం నిత్య హారతికి కొంత డబ్బు పంపుదామానాన్నా" అన్నది నళిని.

ఈ ఆలోచన అప్పటికప్పుడే కలిగినందుకు ఆమె తనువెల్లా భక్తి ప్రపత్తులలో నిండిపోయింది.

ఆ మర్నాడు కొంత డబ్బు దేవస్థానంవారికి మనియార్డరు చేసింది నళిని. తెల్లని నామాలు గల నల్లని స్వామి కైంకర్యార్థం తన ప్రథమ సంపాదనలో కొంత డబ్బు పంపి సద్వినియోగం చేసినందుకు ఎంతోతృప్తి పడింది నళిని.

మర్నాటి సాయంత్రం వచ్చేటప్పుడు తల్లికీ, తండ్రికి బట్టలు కొన్నది. చెల్లాయిలకూ, తమ్ముళ్ళకూ పళ్ళు, బిళ్ళలూ, మిఠాయి కొన్నది.

ఇంటికి వెళ్ళగానే పిల్లలందరికి అవన్నీ పంచింది. అంతా ఆనందంతో గంతులు వేశారు.

"వేషాలు నేర్చుకోకుండానే అమ్మకు ఈ చీరె తెచ్చానమ్మా" అని తల్లిచేతికి చీరె ఇచ్చింది నళిని.

"ఈ బట్టలు నాన్నకు" అన్నది మళ్ళా.

"అవును. నువ్వు ఉద్యోగంచేసి సంపాదించకపోతే మేమిద్దరం ఎంతో ఇబ్బంది పడిపోయేవాళ్ళం, ఆ చేత్తో నువ్వా ఒకచీర తెచ్చుకోక పోయావా" అన్నదావిడ ముఖం ముడుచుకుని. నళిని నవనాడులూ కృంగి పోయినయ్యి. "నన్ను చూసేసరికి అమ్మ సవతి తల్లిగా మారిపోతున్నది." అని మనస్సులో అనుకుని ఒక్కనిట్టూర్పు విడిచింది నళిని.

మొదటినెల జీతం అట్లాకర్చయింది. రెండోనెల జీతం రాగానే నళినికి మరో ఆలోచన తట్టింది. తండ్రితో సంప్రదించింది. ఆయన తన ఆమోదాన్ని తెలిపాడు.

అరవై రూపాయల్లో చక్కని సేతజరీచీరె, దానికి తగిన జాకెట్ గుడ్డ కొన్నది నళిని. వాటితో పాటుగా కొన్ని పళ్ళుకూడా కొనుక్కుని ఆ రోజు సాయంత్రమే యామిని ఇంటికి వెళ్ళింది నళిని.

"యామినీ హరగోపాల్‌కి నమస్కారం" అన్నది నళిని స్నేహితు రాలిని చూస్తూ.

"మిస్. నళిని. బి.కాం. గారికి సుస్వాగతం" అన్నది యామిని, నళిని చేతులు పుచ్చుకుని.

కుశల ప్రశ్నలయాక నళిని అన్నది, "స్నేహితురాలికి ఉద్యోగం ఇప్పించి యజమానురాలివి అయావు యామినీ. ఈ చిన్నకానుకను తను వెల్లా సంతోషంతో పొంగిపోగా నీకు సమర్పించుకుంటున్నాను." అని బొట్టుపెట్టి తాను తెచ్చిన బహుమానం ఇచ్చింది నళిని.

ఒక్క క్షణం ప్రూన్పడి చూసింది యామిని "ఇంత డబ్బుపెట్టి ఇవన్నీ కొని తీసుకురాకపోతే, రెండు అరటిపళ్ళు ఇస్తే ఎంతో సంతో షించేదాన్ని నళినీ. డబ్బుతో స్నేహాన్ని కొనలేవు. అందులో మనస్నేహా నికి ఈ బహుమతి నిజంగా అనవసరం"అన్నది యామిని.

నళిని మనస్సు కుంచించుకుపోయింది. అభిమానం దెబ్బతినక పోయినా ఆమె అనుభూతి దెబ్బతిన్నట్లనిపించింది. మొదటి నెల జీతంతో అమ్మ అట్లా అన్నది. ఈ నెల జీతంతో యామిని మనస్సు ఇట్లా బాధ పెట్టాను. నా జీతం ఎవ్వరినీ సంతోషపెట్టదు. అని అనుకున్నది నళిని,

నా జీతం డబ్బుని ఆ నోరులేని నల్లనయ్య ఒక్కడే ఏ భావమూ వెలిబుచ్చకుండా స్వీకరించాడనుకుంది.

"క్షమించు యామినీ, నా మనస్సుకు సంతోషం కలిగించిన ఈ సంఘటన, నీ మనస్సుని గాయపర్చింది" కళ్ళు తుడ్చుకుంది నళిని. అర్థం చేసుకుంది యామిని.

"నళినీ. మంచితనమే ఒక్కొక్కప్పుడు కోపాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది. ఈ విషయాన్ని ఇంక మర్చిపో" అన్నది యామిని నవ్వుతూ.

ఒక అరగంట మాట్లాడుకున్న తరువాత నళిని ఇంటికి బయలు దేరింది.

"నువ్వేమీ అనుకోకుండా ఉంటే ఒక్క మాట నళినీ" అన్నది యామిని.

"ఏమిటది యామినీ" మళ్ళీ సోఫాలో కూర్చున్నది నళిని.

తనకు తోచిన భావాల్ని వ్యక్తపరచింది యామిని. ఆశ్చర్యపోయి విన్నది నళిని. ఆమాటలనే నెమరువేసుకుంటూ వెళ్ళింది. దురభిప్రాయంతో తానేమి చెప్పలేదని తృప్తిపడింది యామిని.

మూడోనెల్లో నెల జీతం వచ్చేరోజు.ఆవేళ అక్కయ్య జీతంతెస్తుందని రాజేశ్వరికి తెల్సు.

"ఈనెల జీతంలో మా అందరికీ బట్టలు తెస్తావా ? అక్కయ్యా, నాకు కంచి పట్టు పరికిణీ తెస్తావు కదూ" అన్నది రాజేశ్వరి. ఈ ప్రాగి గాలి వాన ఏ రీతిగా అంతమవుతుందో నళిని ఊహించుకునే ఉన్నది.

"నా జీతం లేకపోతే మీరంతా కట్టుకునేందుకు బట్టల్లేక ఇబ్బంది పడుతున్నారా ? రాజేశ్వరీ నిజంగా మీకు బట్టల్లేవా" అనునయంగా

"అదేమీకానే కాదు. ఊరికేనే అడిగాను. నీ జీతం నీ ఇష్టమొచ్చినట్లుగా చేసుకో మాకెందుకూ." చిరుకోపంతో అన్నది రాజేశ్వరి. నవ్వుకుంది నళిని.

[illegible]

నళిని.

"ముందు బావగారు రావాలికదా. ఆ బావను చూసి అప్పుడు నా నిర్ణయం చెప్తాను." పకపక నవ్వింది రాజేశ్వరి. ఆ నవ్వును ఒక రీతిగా అర్థం చేసుకుంది నళిని. మనస్సులో ఆలోచనకు మారాకు వేసింది. ఇంక మొగ్గ తొడగాలి. ఆ మొగ్గ వికసించటానికి తను కుదురుచేసి నీళ్ళు పోయాలి.

"అట్లాగే రాజేశ్వరీ. ముందు నాపెళ్ళే అవుతుంది" అన్నది నళిని. తన భావాలకు స్థిరరూపాన్ని ఇచ్చి ఓ నిర్ణయానికి వస్తూ —

"ఎవరా రాబోయే బావగారు. ప్రేమించేశావా" వాళ్ళంతా చెవులు చేసుకుని ఆ శుభవార్త వినాలనే ఉత్సాహంతో అన్నది రాజేశ్వరి.

"ప్రేమంటే ఏమిటో నీకూ తెల్సినట్లే ఉన్నదే."

"సినిమాటి వాళ్ళను చూసి తెల్సుకున్నాను. నేర్చుకోలేదు."

రాజేశ్వరి చెంపమీద నళిని అయిదు వేళ్ళూ తేలాయి. నిరుత్తరురాలై ఆ చంపను అట్లాగే అదిమి పట్టుకుని, కన్నీరు చెంపలవెంట జారుతుంటే తల్లి దగ్గరకు వెళ్ళింది.

నళిని మనస్సు బాధతో మునిగిపోయింది. మెల్లిగా తను తల్లి దగ్గరకు వెళ్ళింది. రాజేశ్వరి అంతా చెప్పింది తల్లికి. ఆమెకు కోపం రాలేదు. "ఈ సంసారాన్ని మీ నాన్న ఒక్కరేపాదు. అక్కయ్యా కూడా పోషిస్తున్నది." అన్నది తల్లి నళినివైపు చూస్తూ. తల వంచుకుని వెళ్ళింది రాజేశ్వరి. తన ఉద్యోగం మీద అమ్మకు ఇంత అక్కసు ఎందుకో నళినికి అర్థం కాలేదు.

ఆ రోజున జీతం తెచ్చింది నళిని. ఈసారి ఎవ్వరికీ బట్టలు కొనలేదు. తండ్రికీ చెప్పలేదు. ఆ రోజున బీరువాలో దాచి మర్నాడు ఉదయమే బ్యాంకుకు వెళ్ళి ఎకౌంట్ ఓపెన్ చేసింది నళిని.

వారం రోజులు గడిచాయి. జీతం సంగతి నళిని చెప్పకపోయేసరికి రఘునాధరావు కొంచం ఆలోచనలో పడ్డాడు. కూతుర్ని అడగటానికి ఆయనకు మనస్కరించలేదు.

తరువాత నెల జీతం [illegible] అట్లాగే చేసింది. అడగలేక అడగలేక

"నా జీతం బ్యాంకులో వేస్తున్నాను నాన్నా" అన్నది నళిని.

"అట్లాగా" అన్నాడాయన. తండ్రి ఆశ్చర్యాన్ని చూసి మనస్సులో నవ్వుకుంది నళిని. కూతురు మనస్సు కొత్తగా అర్థంచేసుకున్నాడాయన.

# 3

ఆ ఊరిపేరు గోగులేశ్వరం. ఆ ఊరు చేరాలంటే చాలా సునాయాసంగానే పోవచ్చు. ఇది ఆ ఊరివారి అభిప్రాయం. చాలా ఇబ్బంది ప్రయాణమంటారు చాలామంది. ఎవరు ఏమనుకున్నా ఆ ఊరి ప్రత్యేకత ఆ ఊరికుంది. గోగులేశ్వరం వెళ్ళాలంటే గుంటూరులో దిగి, అక్కడ నుంచి పదహారు మైళ్ళు బస్సులో కూర్చుని ప్రయాణం చెయ్యాలి. సరిగ్గా పదహేడో మైలురాయికి ఎదురుగా రోడ్డు పక్కన ఒక డొంక ఉంటుంది. అక్కడే 'గోగులేశ్వరం' నాలుగుమైళ్ళు అని రాసివున్న బోర్డు ఉంటుంది. ఆ డొంక వెంబడే మూడున్నర మైళ్ళు నడచిపోతే ఒక పెద్ద వాగు కనిపిస్తుంది. ఆ వాగు వానాకాలంలో అందదు. అరడుగులకు పైగా నీళ్ళుంటుయ్యి. సీతాకాలం పరవాలేదు. వేసవికాలం ఏ తగాదా లేదు. ఆ ఏటికి ఆవలిగట్టున పెద్ద తాటితోపు అరమైలు ఉంటుంది. ఆ తాటితోపు దాటగానే గోగులేశ్వరం ఊరు కనబడుతుంది.

ఆ ఊరి జనాభా అయిదు వందల లోపు. మొత్తం మూడు నిలువు బజార్లు. తొమ్మిది అడ్డ సందులూ ఉన్నాయ్యి. ఆ ఊరికి పది గూడేలుకూడా కలిపారు. ఆ ఊరికి కరణం, మునసబులున్నారు. ఆ ఊరి ఆయకట్టు దాదాపు వెయ్యి ఎకరాలకు కాస్త తక్కువ, పంట రాలుబడి ఓ మోస్తరు.

కొన్ని ఊళ్ళల్లో కరణం, మునసబులకు పడదు. ఇద్దరిమధ్యా శిస్తు వసూలు పుస్తకాలు పచ్చగడ్డి వేయించి భగ్గుమనేలా చేస్తాయి. కాని ఆ ఊళ్ళో గ్రామాధికార్లు ఇద్దరూ ఒకటే. ఊళ్ళో వాళ్ళంతా ఒకటే. ఇద్దరూ కలిసికట్టుగా ఉండకపోతే ఏ వానాకాలంలోనో ఇద్దర్నీ వాగుపాలుచేస్తారని వాళ్ళకి తెలుసు. అందుకే ఎప్పుడూ కలిసే ప్రయాణం చేస్తారు. కరణం

మున్సబుల పొలాలు తొంభై ఎకరాలు. అందులో మున్సబుగారిది ఏభై ఎకరాలు.

ఇది రెండో ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమైన రోజుల్లోసంగతి. ఇప్పటికీ ఊరు, ఊరిఎల్లలూ, బజార్లూ,పొలాలూ అన్నీఅట్లాగే ఉన్నాయి. ఏమీ మార్పులేదు. గ్రామాధికార్లు మాత్రం మారారు. ఆ తండ్రుల పెద్ద కొడుకులు ఆ ఉద్యోగాలు చేస్తున్నారు. పెద్దకరణంగారికి కొడుకు ఒక్కడే. మునసబుగారికి ముగ్గురు కొడుకులు. ఇప్పటి కరణంగారికి పాతిక ఎకరాలూ, మునసబుగార్కి అరవై ఎకరాలూఉన్నాయి. ఇప్పుడు ఇద్దరిమధ్యా ఏ గడ్డి వేసినా భగ్గుమనదు.

ఆ రోజు శనివారం. పెద్ద కరణంగారు పూజకు కూర్చోటమూ, చిన్న కరణంగారి రెండో కొడుకు ముకుందమాధవరావు, తాతగారికి వేంకటేశ్వర సుప్రభాతం వినిపించేలాగున ట్రాన్సిస్టరు ట్యూన్ చెయ్యటం ఒక్కసారే జరిగాయి. చిన్న కరణంగారి పెద్దకొడుకు శ్రీనివాసరావుకి దేవుడంటే ఎలర్జీ కావడంతో ఆ సుప్రభాతం శ్లోకాలని వినలేక విసుక్కున్నాడు. అంతా భక్తికి పారవశ్యంతో ఆ శ్లోకాలు వింటుంటే శ్రీనివాసరావు విసుగుదలని ఎవ్వరూ లెక్కచెయ్యలేదు.

"ఆ గోల ఆపండి. లేదా ...." నిద్ర మంచం మీదినుంచే ఒక్క ఉదుటన లేచాడు కోపంతో. కాళ్ళకట్ట నవారు తెగిన మంచమేమో, కుడి కాలు ఆ గుంటలోపడి దానికి నవారు బద్ది ఏనిద్దట్లోనో చుట్టుకుని ఉండటం ఆ కోపంలో అతను గమనించలేదు. లేవబోయి పడ్డాడు. కుడకాలి పాదం మెణగబడింది. లేచి నిలబడలేకపోయాడు.

ఆ సమయంలో ట్రాన్సిస్టర్‌లో ఈ శ్లోకం వినిపించింది.

వినా వేంకటేశం ననాధో ననాధంః
సదా వేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీదప్రసీదః
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ.

"నీ తల పొగరు కాలికి దిగిందిరా అన్నయ్యా. అందుకే అట్లా అయింది. లేకపోతే ఈ సుప్రభాతం నీకు గోలగా ఉన్నదేం. ఈ శ్లోకం

విన్నా నీకు జ్ఞానం రాలేదురా" అన్నాడు ముకుందమాధవరావు ట్రాన్సిస్టర్ వాయిస్ ఇంకా పెద్దది చేసి.

"నోర్మయ్. మీక్కావాలిస్తే నాకు వినబడకుండా సౌండ్ తగ్గించి పెట్టుకోండి. నాకు వినిపించనక్కర్లేదు".

"వినకపోతే చెవల్లో సీసం కరిగించి పోసుకో" అన్నాడు ముకుంద మాధవరావు.

శ్రీనివాసరావుకు బాధకన్నా కోపం ఎక్కువైంది. "ఇల్లలకగానే పండక్కాదురా. రేపిపాటికి ఆ ట్రాన్సిస్టరు ఎక్కడుంటుందో ఆలోచించు" అన్నాడు, నడవలేక మంచం మీద కూర్చుని. తాతగారి ముఖంచూసి ఏం మాట్లాడలేదు ముకుందమాధవరావు.

సుప్రభాత శ్లోకాలు పూర్తయినయ్యి. ట్రాన్సిస్టర్ ఆపేశారు. తాత గారు పూజలో నిమగ్నులయారు. ఆడవాళ్ళు ఇంటి పనిలో ప్రవేశించారు. ముకుందమాధవరావు పొలం వెళ్ళిపోతున్నాడు. శ్రీనివాసరావు నెమ్మదిగా మంచంమీదనుంచి లేచాడు. తండ్రి రాఘవరావు వరండాలో కూర్చుని కరణీకం లెక్కలు చూచుకుంటున్నాడు. ముకుందమాధవరావుని పిల్చాడు తండ్రి.

"ఏం నాన్నగారూ !"

"అంతా విన్నాను. అన్నయ్యతో తగాదా పెట్టుకోవద్దని నీకు చాలా సార్లు చెప్పాను. ఇంతలోకే మర్చిపోయావా ?"

"తగాదా ఏముంది. సుప్రభాతంశ్లోకాలు వాడికి గోలగాఉన్నయ్యిట. వాడి మాటలు హర్షించాలా" తండ్రి యందున్న గౌరవంతో నెమ్మదిగానే అన్నాడు.

"అవును. వాడి ఇంగిత జ్ఞానం అంతవరకే ఉన్నది. ఆ మాత్రం నువ్వా ఆలోచించుకోకపోతే వాడికీ నీకూ తేడా ఏముంది. సరే వెళ్ళు" అన్నాడు రాఘవరావు.

ముకుందమాధవరావు వెళ్ళిపోయాడు.

"శ్రీనివాసా, ఇట్లారా నాయనా." తల్లి మాణిక్యమ్మ పెద్ద కొడుకు శ్రీనివాసరావుని పిల్చింది.

"ఎందుకమ్మా. చూడమ్మా, నువ్వు నన్నెప్పుడు పిల్చినా ఏదో వ్యధతో నిరాశాభావాన్ని సూచించే గొంతుతో పిలుస్తావెందుకమ్మా. ఒరేయ్ శ్రీనీ అంటే నేను పలకనా అమ్మా" అన్నాడు కుంటుతూ వచ్చిన శ్రీనివాసరావు. అప్పుడే ముఖం కడుక్కున్నాడు. ముఖం తుడ్చుకుంటూ వచ్చాడు. కాఫీగ్లాసు చేతికిచ్చింది తల్లి.

"తమ్ముడి మాదిరిగా చదువుసంధ్యలు లేనివాడివి కావు. బి.కాం. ప్యాసయ్యావు. సరస్వతీదేవి నీకు వరం ఇచ్చినా, ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోలేకపోతున్నావు. అదే నా బాధ, అందుకే నేను కుమిలిపోతున్నాను. అన్నిటికీమించి కన్నతండ్రితో మాట్లాడవేమిట్రా. ఇదెక్కడి న్యాయంరా. నాన్నగారితో అంత కక్ష ఎందుకురా" ముఖంలో దైన్యమూ, కంఠస్వరంలో అనునయ వాక్యాలూ శ్రీనివాసరావుకి చిరపరిచితాలే. తల్లి మాటలకు అతనికి నవ్వొచ్చింది.

"ఇదేం కొత్తకాదుగా అమ్మా. ఎవరి మనస్తత్వం వాళ్ళది. ఒకరినొకరు శాసించేందుకు ఎవ్వరికీ అధికారం లేదు. ఇంతనెమ్మదిగా అమ్మవు కాబట్టి నీకు చెప్పాను". కాఫీతాగి గ్లాసు తల్లిచేతికి ఇచ్చాడు. కుంటుతూ వెళ్ళబోయాడు. ఇది నిత్యమూ జరిగే విషయమే. ఆ రోజున తల్లి ఇంకా మాట్లాడాలనుకుంది.

"శ్రీనివాసా" వెనక్కు తిరిగి చూశాడు.

"నా మాటవిను, నీ చర్యలు దేవుడు గూడా క్షమించడు." ఏమిటో చెప్పబోయి ఈ మాటలు అనేసింది.

"నా చర్యలు దేవుడి కెందుకమ్మా. ఆపేరుతో నన్నెవరూ శాసించలేరు. కన్నతండ్రితోనే నేను మాట్లాడనప్పుడు దేవుడిసంగతి నాకెందుకూ. ఇంతకీ నువ్వనేదేమిటి" ముఖం కందగడ్డలా అయింది. కళ్ళల్లో ఎఱ్ఱజీర కనిపించింది.

"పోనీలే దేవుడితో విరోధం పెంచుకో, నాన్నగారితో మాట్లాడు. తండ్రితో కొడుక్కు విరోధమేమిటి ?"

"ఆ మాటే తిప్పిచదువుకో" కసిగా అనేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు. కళ్ళు తుడ్చుకుని వెళ్ళింది తల్లి.

ముసలాయన రామయ్యగారి పూజ ముగిసింది. ఇవతలకు వచ్చాడాయన. కొడుకు రాఘవరావు దగ్గరకు వెళ్ళాడు.

"ఏమయ్యా. ఏమాలోచించావ్ ?" కొడుకును ఏమయ్యా అని సంబోధించటం ఆయనకు అలవాటు. రామయ్యగారి వయస్సు డెభ్భైఏళ్ళు దాటింది. రాఘవరావూ ఏభై య్యోపడి దాటుతున్నాడు.

"ఏముంది ఆలోచించటానికి. మీ పెద్ద మనవడి కోరిక ఇవాళ కొత్త రూపం దాల్చింది" అడంగు పుస్తకంలో ఏవో సర్వే నంబర్లు చూస్తూ అన్నాడు రాఘవరావు. ముసలాయనకు దగ్గొచ్చింది. ఆయాసం వచ్చింది. కూర్చోలేక స్తంభానికి ఆనుకున్నాడు. ఆ తండ్రి కొడుకుల మధ్య వాతావరణం అదో మాదిరిగా ఉంది. ఆ యింట్లో ఉన్న రెండు తరాల తండ్రి కొడుకుల్లో ఎన్నో విభేదాలున్నాయి. ముసలి తలకాయంటే పెద్ద తలకాయకు ఎంతో గౌరవభావం ఉంది. పెద్ద తలకాయంటే ఎంతో నిర్లక్ష్యభావం ఉంది పెద్ద కొడుక్కి. "రాఘవా" అని కొడుకు ముందున్న పుస్తకం మూసేశాడు. పక్కకు చూస్తూ కూర్చున్నాడు రాఘవరావు.

"ఈ ఇంటి గౌరవం కాపాడ్డంలో నా తరంలో కన్న నీ తరంలో ఒక మెట్టు దిగజారిన మాట వాస్తవం. నా తరంలో నా యందు నీ కున్న గౌరవ ప్రపత్తులు చాలా ఎక్కువ. అంటే అది నీ అసమర్థత కాదు. నా చాకచక్యమూ కాదు. ఆ కాలం అటువంటిది. అందుచేతనే ఎందుకయినా గాని నా చేతి మీదగానే పదిహేను ఎకరాలు అమ్మేశాను. ఆ సంగతి నీకు పూర్తిగా తెల్సు. ఆస్తి హరించిపోతున్నదనే బాధ నాకూ మనస్సులో ఉన్నా, ఆ బాధకు నాలుగు సమిధెలు, ఆ రోజుల్లో నువ్వూ వేసి వుంటే అంత నిర్భయంగా ఆ రోజుల్లో మన పొలాలు నేను అమ్మేవాడిని కాదేమో" మాటలు చెపుతుంటే ఆయన కళ్ళల్లో ఆర్ద్రత కనిపించింది. తండ్రి చెప్పబోయేది రాఘవరావుకు తెల్సు. ఈ తండ్రీ కొడుకుల సంభాషణ శ్రీనివాసరావు తన గదిలో కూర్చుని ఆసక్తిగా వింటున్నాడు. శ్రీనివాసరావువైపు ఒక్కసారి కోపంగా చూసి తల్లి దగ్గరకు వెళ్ళింది సురేఖ.

"ఆ రోజుల్లో పంతాలూ, పట్టుదలలూ, వంశ ప్రతిష్ఠలకూ, వంశ గౌరవానికీ సంబంధించినవిగా ఉండేవి. ఈ రోజుల్లో ఎవరి వంశం వారిదే. ఎవరి పట్టుదలలూ వాళ్ళవే. నా తరం గడిచింది. నీ తరంలో ఈ ఆస్తి ఇంకా తగ్గకూడదని నువ్వు పట్టుదల చూపటంలో అసందర్భమేమీ లేదు. కాని నీ కొడుకుల మాటను నువ్వు వినటంలో అనౌచిత్యమూ లేదు. వాళ్ళు మైనర్లు కాదు." ఇంక చెప్పలేక పోయాడాయన. తాతయ్య చాలా సూటిగా మాట్లాడుతున్నా డీవాళ. నాకు తాతయ్య పోలిక వచ్చింది, అనుకున్నాడు శ్రీనివాసరావు.

"దణ్ణాలు బాబయ్యా. మీ ఇద్దరూ మాట్లాడతా వుంటే నా మనసు పొంగిపోద్ది" అన్నాడు ఆ ఊరి రైతు చలమయ్య.

"రా. చలమయ్యా రా. కూర్చో, ఏమిటి కబుర్లు" అన్నాడు రాఘవ రావు. చలమయ్య ఎదురుగా వున్న అరుగుమీద కూర్చున్నాడు. ముసలా యన కొంచెం పరకాయించి చూసి చలమయ్యని గుర్తుపట్టాడు.

"ఏం చలమయ్యా, బాగున్నావా. అబ్బాయి లేమంటున్నారు. అదృష్టవంతుడివి. రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులిలాంటి నలుగురు కొడుకులు. నీ కేమయ్యా" అన్నాడు ముసలాయన. చలమయ్యకు నవ్వు రాలేదు.

"ఏ మదృష్టం లెండి. మన రోజులు ఏరు. మనం మరీ పెద్దో ళ్ళమైపోయినాం. ఆ రోజుల్లో మీ చేతికి ఎముకలేదు, నా నాగలికి ఇసుగు లేదు. ఆ నాటి రామలచ్మనులే ఈ రోజున నాకు దుట్టచతుట్టయమయారు. ఇప్పుడు నేను దుతరాష్టుడిని".

"సంవత్సరానికో ఎకరం చొప్పున నాన్న అమ్మజూపుతుంటే ఆయనకు ఏవో ఇచ్చకపు కబుర్లు చెప్పి చవగ్గా మా పొలం పదెకరాలు కొన్నప్పుడు తను దశరధ మహారాజునే అనుకున్నాడు ఈ చలమయ్య. ఇప్పుడు దుతరాష్టృడు కావడంలో తప్పేమీలేదు" అని మనసులో అను కున్నాడు రాఘవరావు.

"ఆస్తి పంచమంటున్నారా" అన్నాడు ముసలాయన.

"అవును బాబూ. ఈ భాగాలు చేసి పెట్టమనే అబ్బాయిగార్ని అడుగుదా మనొచ్చాను. సంపాయించే రోజుల్లో కొడుకులింత పెతాప వంతులౌతారని మనకు తెలీదుకదా" అన్నాడు చలమయ్య.

ముసలాయన మనస్సులో నవ్వుకున్నాడు. మరేమీ మాట్లాడలేదు. చలమయ్యకు తను ఎన్ని దస్తావేజులు రిజిష్టరు చేసిందీ నెమరుకు తెచ్చుకుంటున్నాడాయన. రాఘవరావు మనస్సు బాగుండలేదు.

"విభాగాలు అవుదామనుకున్నారా చెలమయ్యా" అన్నాడు రాఘవరావు.

"అవును బాబూ. నలుగురు కొడుకులికీ నాలుగు బాగాలు, నా దొక భాగం. నా తదనంతరం ఆ భాగం ఆస్తి నా కూతురు చెంచమ్మకు చెందాలి. దానికీ మొగుడు పోయాక అత్తారి అండ ఏమీ లేదుగదా. నా అల్లుడు నా కూతురు చెంచమ్మని నిరాధారంగా చేసి చచ్చాడు. అదంతా మీకు తెలియంది కాదు" కళ్ళు తుడ్చుకున్నాడు చలమయ్య. అంతా విన్న ముసలాయన నిట్టూర్చాడు. రాఘవరావు మనస్సులో ఆలోచనలు ముందుకు సాగలేదు.

"సరే, ఆలోచిద్దాం. అన్నాడు రాఘవరావు. చలమయ్య తండ్రీ కొడుకులికి మరోసారి నమస్కారం చేసి నెమ్మదిగా నడుస్తూ వెళ్ళిపోయాడు.

"రాఘవా! చలమయ్య పరిస్థితి అర్థంచేసుకున్నావు కదా. దానికి మన పరిస్థితీ జోడించిచూడు" అన్నాడు ముసలాయన.

రాఘవరావుకు కంపరం పుట్టుకొచ్చింది. పొలం వైపు వెళ్ళిపోయాడు.

* * *

"ఎక్కడినుంచిరా ఉత్తరం" అన్నది తల్లి శ్రీనివాసరావుతో.

"ఇప్పుడే వచ్చింది. చదువుతున్నాను" శ్రీనివాసరావు కార్డు చదివాడు. సురేఖకూడా తల్లిపక్కనే నిల్చుంది. తన బావగారేమయినా రాసేడేమో ననుకుంది సురేఖ.

"రఘునాథరావు మామయ్య ఉత్తరం రాశాడు. అంతా కులాసాగా ఉన్నారుట. నళిని ఉద్యోగం చేస్తున్నదట. జీతం నూటఏభై. ఇదీ సారాంశం" అన్నాడు శ్రీనివాసరావు.

"కాలం ఖర్మం కలిసొచ్చినప్పుడు ఆడవాళ్ళయినా కుదురుగా ఉద్యోగాలు చేసుకుంటారు. మనకు ఏదీ కలిసిరాదు కాబట్టి నీకు ఉద్యోగమంటే తలనెప్పిగా ఉంది" అన్నది తల్లి.

"కాలం, ఖర్మం అనేది అసమర్థతకు మారుపేరమ్మా. ఉద్యోగం చెయ్యనంత మాత్రాన నేను అసమర్థుడినని నాన్నగారి అంచనా. మీ అసమర్థతకు ఒక జీవితకాలం చిహ్నంగా ఎంచుకున్నారు సురేఖని. ఎవరు అసమర్థులో ఎవరి మనస్సుకు వారికి తెల్సు." అన్నయ్య మాటలు సురేఖకీ పరిచితమే అయినా ఈ పరిస్థితిలో విస్తుపోయింది సురేఖ.

"ఏమిటాగ్రి నువ్వనేది. నే బ్రతికుండగా నువ్వు కుదురుగా మాట్లాడవనుకుంటాను" అన్నది తల్లి. ఎనాడో కుదురు చేసిన విచారానికి మరిన్ని నీళ్ళుపోస్తూ.

"నాన్నగారి మనస్తత్వం మారదు. ఆ మనస్తత్వానికి వడుగ్గా, పేకిగా ఉన్నావు నువ్వు. ఆ మార్గం మీద తయారయిన బట్టలు మీ పిల్లలమైన మేం కట్టుకోవలసిందే, కాని మా అభిరుచులకు అనుగుణ్యంగా ఆ బట్టలు కత్తిరించి కుట్టుకుంటాము. ఆ మాత్రం స్వతంత్రం కూడా నాన్న ఇవ్వరు. అదే నా బాధ" అన్నాడు శ్రీనివాసరావు.

"అందుకనేగా నాన్నగారితో మాట్లాడటం మానేసింది" అన్నది సురేఖ.

"అవును సురేఖా. నువ్వూ ఆ మూసలోపోసి కరగబడ్డదానివే. తీగ నా చేత లాగించకు, డొంకంతా కదుల్తుంది" అన్నాడు.

నిరుత్తరురాలైంది సురేఖ. నిట్టూర్పు విడిచింది తల్లి. నూరేళ్ళ పసుపు కుంకుమగా పద్దెనిమిదేళ్ళకే నట్టేటిలో కలిసిపోయిన కూతుర్ని చూసి ఆమె విచారపడని రోజులేదు. అంతకన్నా ఆమె ఏమీ చెయ్య గలిగిందీ లేదు. [illegible] పుట్టింటికెవరి [illegible].

"నా కన్నా రెండేళ్ళ చిన్నదానివి. పెళ్ళి పేరంటమూ, విధవరికమూ అన్నీ అనుభవిస్తున్నావు నువ్వు. నీలోని అలంకార జ్యోతి ఆరే పోయింది. కరిణీకపు లెక్కలకే తన జీవిత కాలాన్ని అంకితం చేసుకున్న నాన్నగారు, తన పిల్లల జీవితాల్ని..."

"అన్నయ్యా! అప్రస్తుత ప్రసంగం చెయ్యటం నీకు బాగా అలవాటయిపోయింది. నా జీవితం తెల్లవారి పోయిందని నువ్వు బాధపడకు. నీ జీవితం సంగతి నువ్వు చూసుకుంటే చాలు. నీకు కావలసింది ఆస్తిలో భాగం" కటువుగా అన్నది సురేఖ.

"అవును, అదే నా ధ్యేయం" ... విసురుగా వెళ్ళిపోయాడు శ్రీనివాసరావు.

"వాడసలే కోతి. వాడిని రెచ్చ...తున్నావే" అన్నది తల్లి.

* * *

రాఘవరావు పొలం వెళ్ళాడు. పొలం గట్టున రెండో కొడుకు ముకుందమాధవరావు కూర్చున్నాడు. పాలేరు నాగటిచాళ్ళు దున్నుతున్నాడు. ఆవేళప్పుడు తండ్రి పొ... రావడం ముకుందమాధవరావు ఇటీవల చూడలేదు.

"ఏం నాన్నగారూ?" ఆయన ...ందుకు వచ్చాడో అర్థం కాలేదు.

"అట్లా పైకి వెళదాం రారా ము...ందా."

ఇద్దరూ పొలంగట్టు వెంట పైకి వెళ్ళారు.

మెరకగా ఉన్న దిబ్బమీద కూ...న్నారు. తనతో తండ్రి మాట్లాడే రాచకార్యం ఏమిటో ముకుందరావుకు ...లియలేదు.

"అన్నయ్య అభిప్రాయం నీకు ...ల్సుకదూ" అన్నాడు రాఘవరావు.

"ఆస్తి పంచమన్నాడా?"

"అవును, నీ ఉద్దేశ్యం." నవ్వు...తూ చూశాడు.

"నాకేం తెలుసు నాన్నగారూ. ...న యింట్లో అందరికన్నా చిన్నవాడిని నేను, నాకేం తెలుస్తుంది. ...య్యగారూ, మీరూ అమ్మా మీరంతా ఆలోచించండి".

"ఆస్తి పంచితే నీ కేమీ అభ్యంతరం లేదా?"

పాలేరు వచ్చాడు.

"ఎడ్లని చూశారా బాబూ. ఆ ఎర్రగిత్తకు తల యిసురు మా జాస్తి. దాన్ని వదిలించుకోవటం మంచిది బాబూ. ఎప్పుడూ మొండి కేస్తూనే ఉంటుంది" అన్నాడు రాఘవరావు వైపు చూసి. కాడికి గట్టిన గిత్తల్ని చూశాడు రాఘవరావు. అవి రోజూ చూసే గిత్తలే. అయినా పాలేరు చెప్పినమీదట ఒక్కసారి పరిశీలనగా చూశాడు.

"నేనూ అదే చెపుదామనుకున్నాను, ఎప్పుడు కాడికింది నించి తప్పించుకుపోదామా అని చూస్తుంది. బేరం వస్తే వదిలేద్దాం" అన్నాడు ముకుందమాధవరావు.

"చిన్నయ్యగారు కూడా అదే ఉద్దేశంలో ఉన్నారు. ఇంక తమరే ఆలోచించాలి".

పాలేరు నవ్వుతూ వెళ్ళిపోయాడు. వాడిని చూడంగానే తల విసిరింది ఎర్రగిత్త.

"గిత్తలూ, కొడుకులూ, ఏమిటో, ఆఁ. సరే ఆస్తి విషయంలో నీ ఉద్దేశ్యం".

"మీ ఇష్టం, అన్నయ్య ఆస్తి పంచుకుని ఏం చేస్తాడో తెలుసా నాన్నగారూ!"

"అమ్ముకోనీ, ఆర్పుకోనీ, తండ్రితో ఆస్తి పంచుకున్నవాడు ఏమైనా చేస్తాడు. సరే, నేను వెళతాను" రాఘవరావు లేచి విసురుగా వెళ్ళిపోయాడు.

రాఘవరావు ఇంటికి వెళ్ళేసరికి శ్రీనివాసరావు తాతగారితో మాట్లాడుతున్నాడు.

"నీ కొడుకు ఆస్తి పంచమంటున్నాడోయ్ రాఘవా" అన్నాడు రామయ్యగారు. గదిలోకి వెళ్ళబోయిన రాఘవరావు ఒక్కసారి కొడుకు వైపుచూసి తండ్రితో అన్నాడు.

"మీరేమన్నారు."

"నాదే ముందిరా, మీ తండ్రీ కొడుకుల ఇష్టం. ఎట్లాగయినా చేసుకోండి".

"అదేమిటి తాతయ్యా, డొంకతిరుగుడుగా చెపితే ఎట్లా ? మీ అభి ప్రాయం చెప్పండి". అన్నాడు శ్రీనివాసరావు.

ముసలాయన నవ్వు మనసులోనే సమసిపోయింది.

"అభిప్రాయాన్ని గౌరవించటం నేర్చుకున్నప్పుడే, అభిప్రాయాలకు విలువ ఉంటుంది. గౌరవించని అభిప్రాయాలు పేలపిండిలా ఎగిరి గాలిలో కలిసి పోతయ్యి".

రాఘవరావు ఆశ్చర్యపడలేదు. తన తండ్రి వాగ్ధాటి తనకు తెలుసు. తన కొడుకు పట్టుదలా తనకు అనుభవమే.

"సలహాలూ, సంప్రదింపులూ నా వల్లకాదు తాతయ్యా. నాకు కావల్సింది తాడో, పేడో తేల్చుకోవటమే" అన్నాడు శ్రీనివాసరావు. ఉడుకు రక్తం కుటుంబ గౌరవంమీద దెబ్బతీస్తుందని గ్రహించాడు రామయ్యగారు.

"ఏమిట్రా నువ్వు తేల్చుకునేది. ఆస్తిలో అరఎకరం కూడా నీకు పంచము, నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో పో" అన్నది తల్లి. ఈ మాటలన్నీ విని, ఆమె మాటల్లో తొట్రుపాటు, మనస్సులో ఆవేదన, కుటుంబ గౌరవం మంటగలిసి పోతున్నదే అన్న బాధ, అన్నీ గ్రహించాడు రామయ్యగారు.

"పెద్దవాళ్ళు ఉండగా, ఆస్తి పంచమని అడుగుతున్నావంటే నీ అహంకారం ఎంతవరకూ పోయిందో అర్థమైందిరా అన్నయ్యా, ఈ ఆస్తి తాతగారిది. ఆయన జీవితకాలంలో ఈ ఆస్తి విడగొట్టటానికి నాన్నగారికి హక్కులేదు. ఈ ఆస్తి నాన్నగారి స్వార్జితం కాదు. నీ కన్న వయస్సులో చిన్నదానినైనా, నువ్వు తప్పుదారిన పోతుంటే నీకు హితవుచెప్పే బాధ్యత, నాకూ ఉన్నది. ఆస్తి పంచడానికి వీల్లేదు తాతయ్యా" అన్నది సురేఖ.

అంతా విస్తుపోయి చూశారు. శ్రీనివాసరావు మనస్సు ఉడికి పోయింది.

"ఈఆస్తిమీద ఈవెధవరాలుకి ఇంతహక్కు ఎట్లా, ఎప్పుడు సంక్ర మించిందో నాకు తెలియదు, నీ షేర ఈ ముసలాయన ఇల్లు రాశాడా

సురేఖా" మండిపడుతూ అడిగాడు శ్రీనివాసరావు. సురేఖ కొబట్టి సరి పోయింది. ఇదే ముకుందమాధవరావు అయితే ఏమయ్యేదో.

"ఆస్తిమీద నాకు హక్కులేదు. నాకు అవసరము లేదు. ఈ కుటుంబ గౌరవం నీ మూలంగా మంటగలిసి పోతుంటే ఈ విషయంలో జోక్యం కలుగజేసుకునే హక్కు నాకు ఉన్నది" దృఢనిశ్చయంతో ప్రశాంతంగా అన్నది సురేఖ.

"సురేఖా, నువ్వూరుకో తల్లీ. వాడు మనిషికాదు. పశువు" అన్నాడు రాఘవరావు కూతురువైపుచూస్తూ.

తండ్రివైపు నిశితంగా చూశాడు శ్రీనివాసరావు. పొద్దుట్నుంచీ కనుపించిన మబ్బులు దట్టంగా చేరినయ్యి. ఎక్కడో పిడుగు పడిందేమో, ఒక్కసారిగా వాన కురవసాగింది. వరండా అరుగు మీదికి బాగా జల్లు కొట్టసాగింది. ముసలాయన చేతికఱ్ఱ గాలికి అరుగు మీదినుంచి కిందికి దొర్లి, వానలో తడవసాగింది. సురేఖ గబగబా వెళ్ళి ఆ చేతికఱ్ఱ తెచ్చి ఇచ్చింది.

"చేతికర్ర జారిపోయి వానలో పడితే, నీ అవసరం కోసమైనా అది తెచ్చుకొనే ఓపిక పోయింది కదా, ఇంకా ఈ ఆస్తి మీదా, కుటుంబ గౌరవమనే మాగుడు వాసన వేసిన ఊరగాయ మీద-మీకు భ్రమ పోలేదు కదూ?" కటువుగా అన్నాడు శ్రీనివాసరావు తాతగారి వైపుచూస్తూ.

"ఒరేయ్ శ్రీనివాసా, పెద్దవాళ్ళని అంతచులకనగా మాట్లాడ కూడదు. నీ ఆవేశం మితిమీరిపోతున్నది" అన్నది తల్లి.

"అవును. అంతా పెద్దవాళ్ళే, అయినా పశువుని కదూ; అవును పశువునే!" అంటూ తన గదిలోకి పోయాడు.

మరో పావుగంటలో వాన వెలిసింది. కుంభవృష్టిగా అంతా జల మయమైంది.

ఆ రాత్రి గడిచింది. తెల్లవారింది. పక్కమీద శ్రీనివాసరావు లేడు. అంతా ఖంగారు పడ్డారు.

రాఘవరావు ఇంకా కంగారు పడ్డాడు. ఇనప పెట్టెలో సరిగ్గా వెయ్యి రూపాయలు కనబడలేదు. అంతా నిశ్చేష్టు లయ్యారు.

# 4

నళిని ఉద్యోగంలో చేరి నాలుగు మాసాలు దాటింది. ఐదో మాసం ప్రవేసించింది. అంతవరకూ నళిని జీతం బ్యాంకులో వేస్తున్నదని తల్లికి తెలియదు. ఆ రోజు శుక్రవారం - నళిని తలంటి పోసుకుంది. రాజేశ్వరిని తన పెట్టి తీసి, చీర పట్రమ్మన్నది నళిని. చీరెకోసం పెట్టి తీసింది రాజేశ్వరి. బ్యాంకు పుస్తకం కనిపించింది. పుస్తకం తీసి చూసింది. ఆశ్చర్యపోయింది రాజేశ్వరి. బ్యాంకు పుస్తకం అక్కడే ఉంచి చీరె తీసి నళినికి ఇచ్చింది.

నళిని ఆఫీసుకు వెళ్ళాక, రాజేశ్వరి తల్లి దగ్గరకు వెళ్ళింది. పెద్ద నేర పరిశోధన జరిపి హంతకుడిని పట్టుకున్న డిటెక్టివ్ మనస్సులా ఉంది రాజేశ్వరి మనస్సు.

"అక్కయ్య తత్వం ఎట్లాంటిదమ్మా" అన్నది రాజేశ్వరి.

సుభద్రకు అర్థం కాలేదు.

"దాని మనస్సు సంగతి తరవాత ఆలోచిద్దాంగాని ముందా పులుసు గిన్నె తొల్చి పట్రా. కుంపటి మండిపోతున్నది" అన్నది సుభద్రమ్మ.

"నీకు పులుసు గిన్నె, రుబ్బురోలు, చారుగరిటె మీదున్న అభిమానం బ్యాంకు పుస్తకం మీద ఉంటే ఈ కాపరం ఎన్నడో బాగుపడేది" అన్నది రాజేశ్వరి.

సుభద్రమ్మకు ఇదేమీ అర్థం కాలేదు. అప్పటికి తొమ్మిది గంటలు దాటింది. వంట కావాలి. దేవుడి పూజకు నైవేద్యం కావాలి. భర్త ఆఫీసుకు వెళ్ళాలి. రాజేశ్వరి కాలేజికి వెళ్ళాలి. జయలక్ష్మి అనుపమ హైస్కూలుకు వెళ్ళాలి. వీళ్ళందరి భోజనాలూ పది గంటల్లోపే పూర్తవాలి. అదే ఆవిడ తొందర. నళిని మామూలుగా ఉదయం ఎనిమిది గంటలకల్లా ఆఫీసుకు వెళ్ళిపోయింది.

"పోనీలే నువ్వున్నావుగా బాగు చెయ్యటానికి. అమ్మ ఒక్కర్తే వంటకాక తన్నుకుంటున్నదే, కాస్త సాయం చేద్దామనిలేదు. మళ్ళీ అందరూ తొమ్మిదిన్నరకల్లా పీటలమీద కూర్చుంటారు. పెళ్ళివారిలా" విసుక్కుంది సుభద్రమ్మ.

రాజేశ్వరి మాట్లాడలేదు. పులుసు గిన్నె తొల్చి తల్లికిచ్చింది పులుసులోకి చిలకడ దుంప ముక్కలు తరుగుతున్నది. తండ్రి ఎక్కడికో వెళ్ళాడు పెద్ద తమ్ముడు రాధారమణ ఎలిమెంట్రీ స్కూలుకు వెళ్ళాడు రెండో తమ్ముడు లక్ష్మణరావు ఆడుకుంటున్నాడు. జయలక్ష్మి, అనుపమ చదువుకుంటున్నారు.

"అక్కయ్య జీతం నాన్నకివ్వటం లేదమ్మా, బ్యాంకులో దాచు కుంటున్నది. ఈ సంసారానికి ఉద్యోగంచేసి సాయపడుతుందని అను కున్నాను" అన్నది రాజేశ్వరి. అప్పటికి ఈ లోకంలోకి వచ్చింది సుభద్రమ్మ.

"నాకు తెలీదే. జీతం నాన్నకివ్వటం లేదూ? ఏమిటో నాకీ ఆలో చనే రావటం లేదు" అన్నది తల్లి

"లేదమ్మ! అక్కయ్య పెట్లో బ్యాంకు పుస్తకం చూశాను. జీతం నాన్నకివ్వటం లేదు" ఈసడింపుగా అన్నది రాజేశ్వరి. పచ్చిమిరపకాయలు తరుగుతుంటే వేలు తెగింది. రక్తం బొట్లుగా పడింది.

"అబ్బా, వేలు కోసుకుంది" అని వేలు నోట్లో పెట్టుకుంది రాజేశ్వరి.

"ఈ మాత్రం దానికి వేలుకూడా కోసుకుందే, ఇంక లే తల్లీ. వేలికి తడి గుడ్డ చుట్టు, వెళ్ళు" అన్నది సుభద్రమ్మ. రాజేశ్వరి వెళ్ళి పోయింది.

అంతా భోజనాలుచేసి వెళ్ళిపోయారు. పన్నెండు గంటలకు నళిని భోజనానికి వచ్చింది. నళిని ఉద్యోగం చేస్తున్నందుకే సుభద్రమ్మ బాధ పడుతున్నది. దానికితోడు రాజేశ్వరి ఈ కొత్త విషయం చెప్పింది.

తల్లీ, కూతురూ భోజనం చేస్తున్నారు.

"అయితే అమ్మాయ్, జీతం దాచుకుంటున్నావుటగా, బ్యాంకులో వేస్తున్నావుట." అన్నదావిడ.

"అవునమ్మా, రాజేశ్వరి చెప్పిందా" నవ్వు ముఖంతో తల్లివైపు చూసింది.

"అవును. లేకపోతే నా కెట్లా తెలుస్తుంది మీ తండ్రీ కూతురు ఆలోచనలు ఎవ్వరికి తెలుస్తాయి. దాచుకో, నీ జీతమంతా దాచుకుని, టెర్లిన్ చీరెలు కొనుక్కో. మేమంతా ఏమైపోతే నీకేం" పళ్ళెంలోని అన్నం కరుడు, నళిని కంచంలోకి వంచి పడేస్తూ అన్నది సుభద్రమ్మ.

మనసులో నవ్వుకుంది నళిని. అమ్మ కోపంలో ఆపేక్ష ఉన్నది. పెద్దరికం ఉన్నది. పూర్వకాలపు అమాయకత్వం ఉన్నది. అందువల్లనే యిట్లా అంటున్నది. అని అనుకున్నది నళిని.

"నాగరికతలోని గడుసు తత్వాన్ని సూచించేవి టెర్లిన్ బట్టలు. పూర్వకాలపు ఆడంబరాన్ని వేలెత్తి చూపేవి పట్టువస్త్రాలు. ఏ కాలంలో నైనా మానవుడి ఔన్నత్యాన్ని చాటేవి నూలువస్త్రాలేనమ్మా." పచ్చడి ముద్దలో నెయ్యి వేసుకుంటూ అన్నది నళిని.

"మాటలు నేర్చావే నా తల్లీ, ఇంతకీ నీ జీతం నువ్వే దాచుకుంటా నంటావ్" అన్నది సుభద్రమ్మ.

"అవునమ్మా! నా జీతాన్ని దాస్తున్నమాట అక్షరాలా నిజం. నా పేర బ్యాంకులోనే వేస్తున్నదీ నిజమే. మన కుటుంబ క్షేమానికే ఈ పని చేస్తున్నాను."

మనస్సులో ఏమనుకుందోగాని, ఏమీ మాట్లాడలేదు సుభద్రమ్మ.

తల్లీ కూతురూ భోజనం చేశారు. కాసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ ఆఫీసుకు వెళ్ళింది నళిని.

ఆ రాత్రే భర్తని అడిగింది; సుభద్రమ్మ ఈ విషయాన్ని గురించి. ఆయన నవ్వి, ఊరుకున్నాడు. ఇందులో ఆంతర్యం ఆవిడకు అర్థం కాలేదు.

"నేను పెద్దకొడుకుని. నేను ఉద్యోగంచేసి సంపాదించి నాన్నగారికి సహాయం చేస్తాను. అని గొప్పగా డప్పాలు కొట్టిందిగా, ఇప్పుడు జీత

మంతా బ్యాంకులో దాచుకుంటున్నదేం" అక్కసు వెళ్ళబుచ్చుతూ అడిగింది రాజేశ్వరి.

రఘునాధరావు ఏమీ మాట్లాడలేదు. "అక్కయ్యది వట్టికుళ్ళు బుద్ధి" అన్నది జయలక్ష్మి. తనకేదో తెల్సినట్లుగా తండ్రివైపు చూస్తూ.

అందరి మాటలూ, అభిప్రాయాలూ విన్నది నళిని.

"నా మనస్సుని అర్థం చేసుకునే రోజు తప్పక వస్తుంది నాన్నగారూ, అంతవరకూ నేను ఓపికపట్టి ఉంటాను" అన్నది నళిని. ఎవరికి వారు నళిని వైపు చూసి ఊరుకున్నారు.

మర్నాడు ఆదివారం, కంపెనీకి శెలవు. నళిని స్నేహితురాలు యామిని ఇంటికి వెళ్ళింది.

డ్రాయింగ్ రూమ్‌లో హరగోపాల్‌తో కంపెనీమేనేజరు రామశాస్త్రి గారు మాట్లాడుతున్నారు. వరండాలోనుంచి లోపలికివెళ్ళింది నళిని.

చిరునవ్వుతో ఆహ్వానించే యామిని ముభావంగా మాట్లాడింది.

"నళినీ, స్నేహానికి కొలబద్ద - హృదయానుగతమైన ఆప్యాయతే. దానికి వయస్సు అడ్డురాదు. కాని, వాతావరణం వయస్సుతోపాటు మనస్సుని కూడా మార్చివేస్తుంది" అన్నది యామిని.

విస్మయంతో విన్నది నళిని. తాను యజమానురాలిననే భావంతో మాట్లాడుతున్న దేమోననుకున్నది.

"కంపెనీమేనేజరు శాస్త్రిగారు మా సంస్థలో చాలాకాలంగా పని చేస్తున్నారు. పెద్దమనిషి. ఆయనఎవ్వరిమీదా ఏనిందా ఎప్పుడూవెయ్యరు. నా స్నేహితురాలివనేచనువుతో ఆయనమీద అధికృతచూపకు." అన్నది యామిని.

విచలితరాలైంది నళిని. క్షణంసేపు మాట్లాడలేక పోయింది

"మేనేజరుగారి మీద నేను అధికృత చూపానా ? ఎవరన్నారు యామినీ, ఆయనే అన్నారా ?" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును, ఆయన వారితో అన్నారు. వారు నాకు చెప్పారు. చెప్పటమే కాదు నన్ను హెచ్చరించా ".

"ఏమని ?"

"నీ స్నేహితురాల్ని జాగ్రత్తగా ఉద్యోగం చేసుకో"మని చెప్ప మని, నాతో అన్నారు."

ఈ అభాండానికి మూలకారణం ఏమిటో ఎంత ఆలోచించినా నళినికి తెలియలేదు.

"నిజం నిలకడమీద తెలుస్తుంది యామినీ. ఇంతకన్న నా సంజా యిషీ ఏమీలేదు. శలవు" కళ్ళు తుడుచుకుని వెళ్ళిపోయింది నళిని.

నళిని రావటం వెళ్ళటం మేనేజరు రామశాస్త్రి చూశాడు.

సోమవారం ఉదయం యథాప్రకారం ఆఫీసుకు వెళ్ళింది నళిని. తన సీట్లో కూర్చుని ఫైలు చూస్తున్నది. ఒక కంపెనీ తాలుకు ఫైలు తీసుకుని మేనేజరు దగ్గరకు వెళ్ళింది. ఆ ఫైలు చూపించి ఏం రాయాలో అడిగింది. ఆ ఫైలు చూసి ప్రక్కన ఉంచారాయన.

"యామినీదేవిగారు మీకు చిన్ననాటి స్నేహితులా?" అన్నాడు మేనేజరు రామశాస్త్రి.

"అవునండీ." నెమ్మదిగా అన్నది నళిని.

"బాల్య స్నేహితురాలయినా, ఇప్పుడు బాధ్యతగల యజమాని భార్య. వారింటికి తర్చుగా మీరు వెళ్ళకూడదు".

"అట్లాగే, ఈ కారణంచేతనే నేను మీ మీద ఆధిక్యత చూపు తున్నట్లుగా భావించి ప్రొప్రైటర్‌గారితో చెప్పారుగదూ".

ఆయన ఆశ్చర్యపోలేదు. చిరునవ్వుతో చూశాడు.

"ఏం చెప్పినా మీ మేలుకోసమే. సరే మీ పని చూసుకోండి".

నళిని వెళ్ళింది.

సాయంత్రంనళినివెళ్ళేటప్పుడుమళీ పిల్చాడుమేనేజరు.నళినివెళ్ళింది.

"మీకు వీలయినప్పుడు మా యింటికి రండి. వస్తారు కదూ".

"అట్లాగే నండీ" నళిని వెళ్ళిపోయింది.

మళ్ళా ఆదివారం వచ్చింది. నళిని మేనేజరుగారి ఇంటికి వెళ్ళింది. రామశాస్త్రి ఈజీచైర్లో కూర్చొని పేపరు చదువుకుంటున్నాడు.

"రా నళినీ కూర్చో" మరో కుర్చీలో కూర్చుంది నళిని.

"ఏమిటి విశేషాలు" పేపరు పక్కనున్న బల్లమీద పడేస్తూ అన్నాడు.

"నేను చెప్పే విశేషాలేం లేవు. పెద్దలు ఇంటికి పిల్చారని వచ్చాను". ముఖావంగా అన్నది నళిని.

"పిలిచిన పెద్దలందరి ఇళ్ళకూ వెళ్ళటానికి మీకు అభ్యంతరం లేదల్లే ఉన్నది".

"ఇది అర్థంలేనిమాట. జవాబు చెప్పటం అనవసరమనుకుంటాను".

"మీ మాటలు కట్టె విరిచి పొయ్యిలో వేసినట్లుంటయ్యి".

"బుగిలిపోయిన కట్టెలు పొయ్యిలో వెయ్యటం కూడా అనవసరమే ననుకుంటాను. ఇంతకీ మీరు ఎందుకు నన్ను పిలిచారో చెప్తారా?" నిశితంగా చూస్తూ అన్నది.

"నిజమే వయస్సు బుగిలిపోయినా మనస్సు బుగిలిపోలేదు. ఇంతకీ, పిలిచిన కారణమూ ఏమంత చెప్పతగింది కాదు. ఒక కంపెనిలో పని చేస్తున్నాం కనక, మర్యాదకు ఆహ్వానించాను. ఆ, కూర్చోండి. కాఫీ తెస్తాను" వంటగదిలోకి వెళ్ళాడు రామశాస్త్రి.

ఇల్లంతా కలియ జూసింది నళిని. ఎక్కడా ఏమీ ఉన్నట్లులేదు. వరసగా మూడు గదులున్నాయి. సర్వసామాన్యంగా ఉన్నది. గోడలమీద ఫొటోలుగాని, క్యాలండర్లుగాని ఏమీలేవు. నళినికి కొంత భయం కలిగింది. రెండు కప్పుల్లో కాఫీ తెచ్చాడు రామశాస్త్రి.

నళినికొక కప్పు ఇచ్చాడు.

"ఇంట్లో ఎవ్వరూ లేరల్లే ఉంది" కాఫీ తాగబోతూ అన్నది.

"అవును, లేరు" ఎక్కువ వేడిగా లేకపోవటంతో ఒక్కసారే కాఫీ అంతా తాగేసింది. కప్పుకింద పెట్టింది

"ఊరికి వెళ్ళారా?"

సీసాలోని వక్కపొలుకులు రెండు నోట్లో వేసుకుని, సీసా నళిని చేతికిచ్చాడు రామశాస్త్రి.

"పురిటికి వెళ్ళారా?" తన ఆలోచనకు మనస్సులో నవ్వుకుంది నళిని.

"అవును" కళ్ళు తుడ్చుకున్నాడు రామశాస్త్రి.

"పండంటి పిల్లవాడిని ఎత్తుకొస్తారు లెండి. త్వరలోనే మాకొక జూనియర్ మేనేజరు రాబోతున్నందుకు చాల సంతోషం".

రామశాస్త్రి బల్ల మీదున్న పేపరులో హెడ్డింగులు చూడసాగాడు.

"మీ పని డిస్టర్బ్ చేసాను, వెళ్ళొస్తా".

"నళినీ, నువ్వు ఊహించింది కొంతవరకే నిజం. నా భార్య, ఇరవై ఏళ్ళ క్రితం పురిటికి వెళ్ళింది. తిరిగి రాలేదు".

స్థాణువడి పోయింది నళిని.

"అవును, కనపడని లోకాలకు వెళ్ళిపోయింది. ఆనాటి పసివాడు, తల్లిని పొట్టన బెట్టుకున్నవాడు మా లక్ష్మీకాంతం మిగిలాడు. వాడిప్పుడు ఇంజనీరు కోర్సు చదువుతున్నాడు, అనంతపురంలో" ఆయన ముఖంలో వృద్ధాప్యం ఇరవై ఏళ్ళు ఎక్కువ పెరిగినట్లయింది.

"పాపం తల్లిలేని వాడయినా అదృష్టవంతుడు. అతనికి తల్లీ, తండ్రీ ఇద్దరూ మీరే కదా" సానుభూతి మాటల్లో వ్యక్తమైంది.

"ఈ వయస్సులో నన్ను వాడు పెళ్ళిచేసుకో మంటున్నాడు, ఏమిటో వాడి అభిప్రాయం వాడిది. నా వయస్సు నలభై సంవత్సరాలు".

"అట్లాగా" ఈ వయస్సులో ఈయనకు పెళ్ళేమిటని ఆశ్చర్య పడ్డది నళిని. అయినప్పటికీ ఎవరి స్వవిషయాలు వాళ్ళవి అనుకున్నది.

"శలవండీ, వెళతాను" వెళ్ళిపోయింది నళిని.

నళిని వెళ్ళిన పది నిమిషాలకుగాని రామశాస్త్రి తేరుకోలేక పోయాడు. ఆయన ఆలోచనలకు ఒక నిర్దిష్టమైన రూపం ఏర్పడలేదు.

నాలుగు రోజులు గడిచాయి. హరగోపాల్ నళినిని పిలిచాడు. ఆయన గదిలోకి వెళ్ళింది నళిని.

"ఈ సాయంత్రం యామిని మిమ్మల్ని ఇంటికి రమ్మన్నది". ముక్తసరిగా అన్నాడు. "అట్లాగే నండీ" అని తన సీట్లోకి వచ్చేసింది నళిని. యామిని ఎందుకు రమ్మన్నదో నళినికి అర్థం కాలేదు. రామశాస్త్రి ఏదైనా చెప్పారేమోనని అనుకున్నది.

నళిని వెళ్ళగానే యామిని సాదరపూర్వకంగానే ఆహ్వానించింది.

"ఉద్యోగంలో చేరావుకదా, పెళ్ళి ఆలోచనలేదా నళినీ!" నవ్వుతూ అడిగింది.

"ఉద్యోగానికీ, పెళ్ళికీ సంబంధం మేమిటి యామినీ, నువ్వు ఉద్యోగం చెయ్యకుండానే పెళ్ళిచేసుకోలేదూ?"

"నిజమే, నీ మాత్రం నాకు తోచనేలేదు. పెళ్ళిచేసుకునే అభిప్రాయం ఉంటే........"

"ఏదైనా మాంచి సంబంధం ఉన్నదా, నా కోసం రిజర్వు చేశావా యామినీ". ఎగతాళిగా అన్నది నళిని.

"అవును నువ్వు సరేనంటే".

"రామశాస్త్రి గారేకదూ?" ఎట్లా వూహించింది అని ఆశ్చర్యపోయింది యామిని. అసలు వీళ్ళిద్దరూ సంప్రదించుకొని ఇష్టపడ్డ తరువాతనే, ఈ ప్రతిపాదన తనకు వచ్చిందేమోనని అభిప్రాయపడ్డది.

"మీ రిద్దరూ కూడబలుక్కున్నారని నాకు తెలీదు. ఇంతకీ నీ అభిప్రాయం. ఇష్టమేకదూ?" ఆప్యాయంగా అన్నది యామిని.

"యామినీ, నువ్వు యజమానురాలివి. ఉద్యోగం ఇవ్వటం, తీసివేయటం లాంటి వ్యవహారాల్లో నీ జోక్యానికి విలువ ఉంది. అధికారమూ ఉంది. కాని, ఎదుటివ్యక్తిని కించపర్చటానికి నీకు అధికారం లేదేమో".

విభ్రాంతు రాలైంది యామిని. ఇంత నిశితంగా నళిని మాట్లాడుతుందని ఊహించలేదు. పైగా రామశాస్త్రి పేరు తానే చెప్పింది. ఇంతలోనే ఇట్లా ఎందుకు మాట్లాడిందో అర్థం కాలేదు.

పేలవంగా నవ్వి పెదవి విరిచింది నళిని.

జరిగిన విషయమంతా చెప్పింది నళిని. ఆసక్తిగానే విన్నది యామిని.

"రామశాస్త్రిగారు తన అభిప్రాయాన్ని మావారికి చెప్పారు. అందుచేతనే నీకు కబురుచేశాను. నువ్వు చెప్పిన విషయాలు నాకు తెలియవు. సరె, నీకు ఇష్టంలేదని చెప్తాను. బాధపడకు నళినీ" అన్నది యామిని.

"నేను బాధపట్టంలేదు యామినీ, వ్యక్తుల మనస్తత్వాలు అర్థం

చేసుకుంటున్నాను. విద్యార్థిదశలో విద్యను నేర్చుకోవటమేగాని, మనకు నిత్య జీవితంలో తారసపడే వ్యక్తుల్నీ, వారి మనస్తత్వాల్నీ అర్థం చేసుకునే అవసరం ఉండదు. ఇప్పుడు చూస్తుంటే అందరి మనస్తత్వాలూ నాకు వింతగానే కనబడుతున్నయ్యి" అన్నది.

ఇంటిముందు కారాగింది. హరగోపాల్ కంపెనీనుంచి వచ్చాడు, స్నేహితురాళ్ళిద్దర్నీ చూశాడు.

"నీ అభిప్రాయం చెప్పావా నళినీ; రెండో పెళ్ళని సంకోచిస్తున్నావుకదూ". అన్నాడు హరగోపాల్.

"మొదటి పెళ్ళయినా నళిని చేసుకోదు. ఇంక ఈ ప్రస్తావన మర్చిపోవటం మంచిది". అన్నది యామిని.

"కృతజ్ఞురాలిని" అన్నది నళిని. ఏమీ అనకుండానే డ్రాయింగ్ రూంలోకి వెళ్ళిపోయాడు హరగోపాల్.

శలవు తీసుకుని వెళ్ళింది నళిని.

ఇంటికి వెళ్ళింది; మనస్సులో ఆలోచనలు సుళ్ళుతిరుగుతున్నాయి. ఆ రాత్రి తల్లితో అన్నది.

"మా కంపెనీ మేనేజరుగారు రామశాస్త్రిగారు. ఆరువందలు జీతం. ఆయన ఇరవయ్యో ఏటనే ఆయన భార్య పురిట్లో పోయింది. ఆ పసివాడు పెరిగి పెద్దవాడై ఇంజనీరు కోర్సు చదువుతున్నాడు. రామశాస్త్రిగారి వయస్సు నలభై ఏళ్ళు. భార్యపోయిన ఇరవై ఏళ్ళ తరువాత ఆయనకు వివాహం చేసుకోవాలనే కోరిక కలిగింది. ఈ కోరిక సహజమే నంటావా అమ్మా".

అంతా విన్నదావిడ, కూతురు ఎందుకు చెపుతున్నదో తెలీలేదు.

"కోరిక సహజమే. అయినా నలభై ఏళ్ళవాడుకదా ? సరే, సంబంధం కుదిరిందా, పెళ్ళెప్పుడు?"

"నన్ను చేసుకోవాలనే ఉద్దేశ్యం వెలిబుచ్చారు !"

ముక్తసరిగా అని తల్లి మనస్సులోని భావాలను వెతుక్కోసాగింది. ఆవిడ నోట మాటరాలేదు. కాసేపటికి తేరుకుని నవ్వుతూ నళిని ముంగురులు సరిచేస్తూ అన్నది.

"నిక్షేపంలాంటి సంబంధం. ఆరువందలజీతం. నలభై ఏళ్ళ కెవ్వరూ ముసలివారు కారు. మనస్థితికి ఇంతకన్నా గొప్పసంబంధాలు తేగలమా నళినీ. అందులోను వాళ్ళంతటవాళ్ళే అడిగారు కనుక, కట్న కానుకల గొడవ ఉండదు. నువ్వే ఆలోచించుకుని సరేనంటే నాన్నగారి చెవిన వేద్దాం" అన్నదావిడ ఎంతోసంతోషంగా. "ఆడపిల్లల పెళ్ళి, ఇంత అలుసైపోతుందని అనుకోలేదమ్మా. నీ మనస్సు నేను గ్రహించాను. కాని నా మనస్సుని ఎవ్వరూ అర్థం చేసుకోలేరేమో" ఇంకేమీ మాట్లాడ లేదు నళిని.

ఆ రాత్రి సుభద్రమ్మకు నిద్రపట్టలేదు. ఒక రాత్రివేళ ఇంకా లాభం లేదని భర్తను నిద్రలేపి అంతా చెప్పింది. ఆయనా విన్నాడు.

"నళినికి ఇష్టంలేదని తెలిసిం తరువాతకూడా ఇంకా ఈ గొడవ ఎందుకే" అని ఆయన విసుక్కున్నాడు. సుభద్రమ్మ ఆలోచనలు చల్లబడ్డాయి.

# 5

ఆనాటి రాత్రి శ్రీనివాసరావు మెల్లిగా ఇనప్పెట్టె తెరచి అందులో ఉన్న వెయ్యిరూపాయలూ తీసుకుని అర్ధ రాత్రే వెళ్ళిపోయాడు.

గూట్లోనుంచి పక్షి, రెక్కలు రెప రెప లాడిస్తూ ఎగిరిపోయింది. ఎక్కడ వాలాలో తోచలేదు.

ఏదో లారీమీద ఉదయమే గుంటూరు చేరాడు. హోటల్లో కాఫీ తాగాక తన ఆలోచనలు ఒకదారికి వచ్చినయ్యి. చదువుకునే రోజుల్లోని కాలేజీ స్నేహితుడు రామనాథం ఇంటికి వెళ్ళాడు. రేడియోలో సూక్తి ముక్తావళి వింటున్నాడు రామనాథం. శ్రీనివాసరావు ఏ పరిస్థితిలో వచ్చాడో తెలీదుకనుక నవ్వుతూ ఆహ్వానించాడు.

"ఏరోయ్ కులాసా, ఎక్కడనుంచిరాక, ఏదన్నా ఉద్యోగం అఘోరిస్తున్నావా" అన్నాడు రామనాథం.

"ఇంకా ఏంలేదు, నీ ఉద్యోగం ఎట్లాఉంది, పెళ్ళి చేసుకున్నావా, ఓ, పెళ్ళయితే నాకు శుభలేఖ వేసేవాడివే కదా. సారీ మర్చిపోయాను" సిగరెట్ తీసి వెలిగించ బోయాడు శ్రీనివాసరావు.

"నీకు పుణ్యం ఉంటుంది గాని, ఆ సిగరెట్టు ఇక్కడ తగలెయ్యకు. మావాళ్ళు చూశారంటే బావుండదు. నేనుకూడా ఇంట్లో ఎప్పుడూ కాల్చ నులే. ఏమీ అనుకోకు, ఆ, ఏమిట్రా విశేషాలు."

నవ్వుతూ చూశాడు శ్రీనివాసరావు.

"ఎందుకురా నవ్వుతున్నావ్". అన్నాడు రామనాథం.

"ఏంలేదు, కుక్కతోక ఆసరాగా గోదావరి ఈదబోతున్నానని ఇప్పుడే తెల్సుకున్నాను".

సిగరెట్ పెట్టె జేబులో వేసుకున్నాడు శ్రీనివాసరావు.

"చూడు బ్రదర్ ఉద్యోగం చేస్తున్నా, ఊళ్ళేలుతున్నా అమ్మా, నాన్న చాటున బ్రతుకుతున్న వాడిని, ఆపాటి గౌరవం వాళ్ళమీద ఉంచక పోతే ఎట్లారా. సరే దానికేంగాని, ఏం ఇంత పొద్దున్నే ఊడిపడ్డావ్, మీ ఊరునుంచేనా. నిన్ను చూస్తుంటే ఏదో పోట్లాడి వచ్చినట్లుంది".

"ఔనురా. పోట్లాడే వచ్చాను. బుగిలిపోయిన సాంప్రదాయాలకు పెట్టని కోట మా ఇల్లు. ఆ కోటకు అధిపతి మా తాతయ్య. ఆయనగారి మహామంత్రి మా నాన్న. ఆ కోటనుంచి బైటపడ్డాను. ఆ సాంప్రదా యాలను నేలమట్టం చేస్తేనేగాని నేను ఆయింట్లో అడుగు పెట్టను".

శ్రీనివాసరావు ఆంతర్యం రామనాథానికి అర్థంకాలేదు. అతని మాట ల్లోని కృతనిశ్చయాన్ని విస్మయంతో అర్థంచేసుకున్నాడు.

"ఏమిట్రా హిస్టారికల్ ప్లేలో డైలాగులువప్పగిస్తున్నావ్. ఏదైనా నాటకం వేస్తున్నావా". ఎగతాళిగా అడిగాడు.

"కాదు. జీవిత సత్యమే చెప్తున్నాను. సరే, నువ్వు అమ్మా, నాన్న చాటున బ్రతుకుతున్నవాడివి, పెళ్ళయితే పెళ్ళాంచాటున బ్రతికేవాడివి. నీతో కొంచెం మాట్లాడాలి అట్లా పోదాం రా".

ఇదేదో మహాప్రళయమే ననుకున్నాడు, రామనాథం. చొక్కా

వేసుకుని బయల్దేరాడు. ఇద్దరూ వీధిలో కొచ్చారు. రామనాథం భుజంమీద చెయ్యివేసి నడుస్తున్నాడు శ్రీనివాసరావు.

"నా మనస్తత్వం నీకు తెల్సు. జీర్ణించిన సాంప్రదాయాలను అంటి పెట్టుకొని జీవించడం నాకుచేతకాదురా. మా నాన్నతో మాట్లాడనని నీకు తెల్సు. ఈ విషయంలో నువ్వు నాకు ఎంతో నచ్చచెప్ప ప్రయత్నించావు. అది పాతకథ. ఆస్తిలో నా భాగం నాకు పంచ మన్నాను, కాదన్నారు. మా తాతయ్యా, నాన్నా బ్రతికున్నంతవరకూ ఆ స్తిలో భాగం పంచరు. ఇది బాగుందంటావా" అన్నాడు.

తరువాత ఏం జరిగిందో రామనాథం కొంత అర్థం చేసుకున్నాడు.

"మీ ఆస్తి తాతలనాటిది. బూజు పట్టిన సాంప్రదాయాలు, సిద్ధాంతాలూ కలవాళ్ళు దాన్ని సంపాదించారు. ఆ బుగిలిపోయిన సాంప్రదాయాల్ని కాలదన్నిన నీకు ఆపోలం మాత్రం ఎందుకురా? ఆ ఆస్తిని ఆసించావంటే నీకు తెలియకుండానే పాత సాంప్రదాయాన్ని మన్నిస్తున్నావన్న మాట. ఏ మంటావురా?"

రామనాథం వైపు నిశితంగా చూశాడు శ్రీనివాసరావు. అతనిలో ఏదో అనిర్వచనీయమైన క్రొత్తభావం కలిగింది.

"ఆస్తి పంచలేదనే కోపంతో పోట్లాడి వచ్చేశావు. కోపంలో ఏంచేస్తామో, ఆ పరిస్థితిలో ఉన్న వాళ్ళకూ్కడా అర్థంకాదు. ఇక యింటికి వెళ్ళనంటావు. అయితే తరువాత కథ" ఆ భావంతో అతనివైపు చూశాడు రామనాథం.

కాపీహోటల్లోకి దారితీశాడు రామనాథం. అనుసరించాడు శ్రీనివాసరావు. సర్వరుతో రెండు ప్లేట్ల ఇడ్లీ చెప్పాడు రామనాథం. రెండు పెసరట్లు, ఉప్మా కూడా చెప్పాడు. కారప్పొడి, నెయ్యి ఎగస్ట్రాగా తెమ్మన్నాడు. విడిగా సాంబారు తెమ్మన్నాడు. ఇదేమీ వినబడలేదు శ్రీనివాసరావుకి. 'బూజుపట్టిన సాంప్రదాయం కలవాళ్ళ ఆస్తి, తను ఆశించడంలో అర్థం ఉన్నదా ?' ఆలోచనలో పడ్డాడు.

సర్వర్ తెచ్చిన ఇడ్లీ, కారప్పొడి, సాంబారు తన ముందున్నవి చూశాడు, అప్పటికి అతనికి ఆలోచన తట్టింది. "రామనాథం మీ ఇంటికి

వచ్చేముందే కడుపునిండా తినివచ్చానురా. నాకు ఆకల్లేదు. నీవు తిను. నాకు కాఫీ చాలు; అదైనా వన్ బై టు చాలు". అన్నాడు శ్రీనివాసరావు.

నవ్వుముఖంతో అతనివైపు చూశాడు రామనాథం. "ఇవన్నీ చెప్పే టప్పుడు నువ్వు వినలేదన్నమాట. అవును నువ్వు ఈ లోకంలో ఉన్నా, నీ మనస్సు ఇక్కడలేదు. ఆస్తిమీద ఉన్నది. ఆస్తి నీ చేతికి చిక్కలేదని, ఆస్తికి దూరంగా వెళ్ళిపోతున్నావు. సర్లే తెచ్చినవి తిను. తరువాత కార్యక్రమం ఆలోచిద్దాం".

మాట్లాడకుండా అన్నీ తిన్నాడు. ఇద్దరూ కాఫీ తాగారు. బిల్లు రామనాథమే ఇచ్చాడు. వక్కపొడి వేసుకున్నారు.

"ఇప్పుడు సిగరెట్టు కాల్చు". అన్నాడు రామనాథం.

శ్రీనివాసరావు సిగరెట్టు వెలిగించాడు.

"ఇంటివద్దనుంచీ అంటే - ఆ తాతలనాటి పాతఇనుపమందసంలో నుంచి ఏ మాత్రం తెచ్చావేమిటి ? అవును, ఆ డబ్బుకు పాత భావాలు ఉండవులే" చిన్నబుచ్చుకున్నాడు శ్రీనివాసరావు. కాని పైకి పొక్కలేదు.

"ఒక వెయ్యి రూపాయలు తెచ్చాను. కొత్తజీవితం ప్రారంభించ టానికి, ఆ మాత్రం పాతడబ్బు అవసరమనుకున్నాను. అది తప్పో, రైటో నేను చెప్పదల్చలేదు" నిర్లిప్తతగా అన్నాడు శ్రీనివాసరావు.

"సరే తరువాత ఏం చేస్తావు?"

"ఇది సరికొత్త పాత ప్రశ్న జీవితాన్ని తరచిచూడాలి సంకుచిత మైన పాత భావాల స్థానంలో కొత్తభావాలకు పునాది వేసి - నిన్ను పిలుస్తాను. ఆ పునాదులమీద ఎటువంటి ఇల్లు, ఎన్ని అంతస్థులు కట్టాలో నువ్వు చెప్పగలవనే నా నమ్మకం". అన్నాడు శ్రీనివాసరావు.

రామనాథం మనస్సులోనే నవ్వుకున్నాడు.

"ఏ ఊరికి టిక్కెట్టు కొంటావో తెల్సుకోవచ్చా". అన్నాడు.

"హైద్రాబాదు. కాని ఒక్కమాట".

"ఏమిటది".

"నా ఉనికి ఎవరికీ, మా వాళ్ళకుకూడా తెలియనివ్వకు. కొత్త జీవితానికి నాంది ప్రస్తావన చేసే, ఈ సమయంలో నా కోరిక మన్నించు".

ఇద్దరూ ఇంటికి వచ్చారు. రామనాథం బలవంతంమీద శ్రీనివాసరావు ఆ పూట వాళ్ళింటోనే భోజనం చేశాడు. ఆ సాయంత్రమే హైదరాబాదు ప్రయాణమయ్యాడు. రైలు ఎక్కించాడు రామనాథం.

ఒక హోటల్లో గది తీసుకున్నాడు శ్రీనివాసరావు. చేతి సంచిలో రెండు జతల బట్టలు తప్ప, మరే సామానులేదు. ఆ గదిలో పరుపుమీద దుప్పటి తీసేసి, మరో ఇస్త్రీ దుప్పటి వేసి, కూజాలో నీళ్ళు పారబోసి మంచినీళ్ళు పట్టితెచ్చి, గాజుగ్లాసు శుభ్రంగా కడిగి, కూజా పక్కన ఉంచి వెళ్ళాడు హోటల్ కుర్రాడు. ఆ పరుపుమీద కూర్చుని- రెండు నిమిషాలు గదంతా చూశాడు శ్రీనివాసరావు.

ఈ గదిలో ఇదివరలో కొన్నివందల మంది ఉండి వెళ్ళిపోయారు. ఇప్పుడు నా వంతు వచ్చింది. ఎవరు ఏ పనిమీదవచ్చి వెళ్ళారో, ఎవరికీ తెలియదు. తెల్సుకోవలసిన అవుసరమూ లేదు. ఈ మంచానికి గనక, మాటాడే శక్తి ఉంటే - ప్రతి వార్నిగురించి కొన్ని విషయాలు చెప్పేది. అలాగే నా విషయమూ మరొకరితో చెప్పేది. తన ఆలోచనకు తనకే నవ్వు వచ్చి, ఒక్క సిగరెట్టు వెలిగించాడు. తరువాత స్నానంచేసి బట్టలు వేసుకున్నాడు. రూమ్ బోయ్‌ని పిల్చి టిఫిన్, కాఫీ తెమ్మన్నాడు. వాటితో కడుపు నింపుకున్నాడు. మనస్సునిండా ఆలోచనలు ముసురుకున్నయ్. ఆ ఆలోచనల్లో కొన్ని కందిరీగలు, కొన్ని జోరీగలు, కొన్ని దోమలు. అన్నీ బాధిస్తూనే ఉన్నయ్.

గదికి తాళంవేసి బయలుదేరాడు. ఇంటినుంచీ ప్రయాణం ఇక్కడికి. ఇక్కడనుంచీ గమ్యం ఎక్కడికి?

ఆ రోజంతా ప్రతి సిటీబస్సు ఎక్కి, ప్రతి గమ్యస్థానంలోనూ దిగి, అక్కడ ఇంకో సిటీబస్ ఎక్కి, ఇంకోచివరదిగి, మళ్ళీ ఇంకో సిటీబస్ ఎక్కి, ప్రయాణంచేసి, ఇలా అన్ని బస్‌రూట్లూ చుట్టి వచ్చాడు. ఏదో హోటల్లో భోజనం చేశాడు. ఎక్కడో హోటల్లో కాఫీ తాగాడు. సాయంత్రమూ అంతే. బస్సు ఛార్జీలు పదిరూపాయలు దాటాయి.

ఏ రూట్‌లో ఏ బస్సు ఎక్కినా, అంతా హడావుడిగా ప్రయాణంచేస్తూ, తమ గమ్యస్థానం చేరుకోవాలనే ఆదుర్దా కలవారే కనబడ్డారు ఆదుర్దా, గమ్యస్థానమూ లేనివాడు తనొక్కడేననుకున్నాడు. జంటనగరాల సర్వే అయిపోయింది. తన జీవితంలో సర్వే ప్రారంభమైంది. తన ప్రస్తుత గమ్యస్థానం ఆ హోటల్లో పదోనంబరు గది. రాత్రి పదిగంటలకు ఆ గది లోకి చేరాడు. హాయిగా నిద్రపోయాడు.

ఉదయమే నిద్రలేచాడు శ్రీనివాసరావు బి. కాం; మళ్ళీ ఆలోచనలూ నిద్రలేచినయ్యి.నిన్నటికలవరం కొంచెం తగ్గింది. హోటల్ మేనేజరు దగ్గరకు వెళ్ళి, టెలిఫోన్ డైరెక్టరీ తీసుకున్నాడు. ఓ పదికంపెనీల అడ్రసులు రాసుకున్నాడు. పదిగంటలకు భోజనానికి వెళ్ళివస్తూ రెడీమేడ్‌షాపులో నాలుగు జతల బట్టలు కొన్నాడు. మళ్ళీ గదికి చేరుకుని, ఓ జత కొత్త బట్టలు వేసుకున్నాడు. జీవితం కొత్తది, బట్టలు కొత్తవి, అదృష్టం కొత్తదా, పాతదా ? కర్మ సిద్ధాంతంయందు నమ్మకంలేదు. తనయందు తనకు విశ్వాసం ఉన్నది. తన ఆలోచనలయందు తనకు నమ్మకం వున్నది. సిద్ధాంతాలమీద నమ్మకంలేదు.

నీట్‌గా తయారయి ఓ కంపెనీకి వెళ్ళాడు. అదొక రెండంతస్థుల భవనం. మెటల్ వర్క్సు కంపెనీ. మేనేజరు గదిలోకి వెళ్ళాడు. విష్ చేసాడు.

"టేక్ యువర్‌సీట్" సిగరెట్‌పొగ రింగు రింగులుగా వదిలాడు మేనేజరు.

"నాపేరు శ్రీనివాసరావు బి. కాం పాసయాను". అన్నాడు.

"ఐసీ, వెరీగుడ్. డు యూ వాంట్ ఎనీ ఏజన్సీ ఫ రవర్ మెటల్ గుడ్స్". నవ్వుతూ సిగరెట్ ఆఫర్‌చేశాడు మేనేజరు.

"నో సర్. ఉద్యోగంకోసం వచ్చాను". సవినయంగా చెప్పాడు.

"ఓహ్, సారీ మిష్టర్, నో వేకెన్సీస్".

"శలవు. వస్తాను". మేనేజరు రూంలోనుంచి వచ్చేశాడు.

రెండస్థుల మెట్లూ దిగాడు. ఓసారి కంపెనీబోర్డువైపుచూచి,

సిగరెట్ వెలిగించి, జేబులోనుంచి అడ్రసుల కాగితంతీసి, ఇంకో కంపెనీ అడ్రస్ చదువుకుని టాక్సీలో బయల్దేరాడు.

అది ఏడంతస్థుల భవనం. ఆరో అంతస్థులో ఆ కంపెనీ ఉన్నది. తలెత్తి బోర్డుచూసి, టాక్సీవాడికి డబ్బులిచ్చి పంపేశాడు. ఉద్యోగాన్వేషణ లోనే, నా అంతస్థు ఎంత పెరిగింది అని మనస్సులో అనుకుని, నవ్వు కున్నాడు. ఎలక్ట్రిక్ లిఫ్ట్ కనిపించింది. దాంట్లో ఎక్కి ఆరో అంతస్తు చేరుకున్నాడు. లిఫ్ట్‌రూంకి పక్కనే పెద్దహాలు. దాంట్లో దాదాపుగా ఏభై మంది కూర్చుని తమ పనిలోనిమగ్నులై ఉన్నారు. అందరివైపు చూశాడు. అయిదారుగురు లేడీ టైపిస్టులు. ఆ కంపెనీకన్న ఈ కంపెనీ ఆఫీసు చాలా బావుందనుకున్నాడు.

ఏదో ఆలోచన తట్టింది. జవాన్ని పిలిచి "సుబ్బారావుగారున్నారా?" అన్నాడు.

"ఆ సాబ్, ఎకౌంటెంట్". అన్నాడు జవాను.

"అవును వారే".

"ఉన్నారు; సాబ్. చెప్తాను. కానీ ఇప్పుడు మాటాడకూడదు.లంచ్ టైమ్‌లో, ఒకటిన్నరకి" అన్నాడు జవాను. ఆఫీసు గడియారంలో ఒకటీ పది నిమిషాలయింది. ఇంకో ఇరవై నిమిషాలు.

"సరే" అన్నాడు. వరండాలో కుర్చీలో కూర్చున్నాడు. ఇరవై నిమిషాల్లో మూడు సిగరెట్లు కాల్చాడు.

ఒకటిన్నర అయింది. అంతా లంచికి లేచారు. కొందరు అక్కడే టిఫిన్ తింటున్నారు. కొందరు లిఫ్ట్‌ఎక్కి కిందికి వెళ్ళారు.

"వీరేసార్ ఎకౌంటెంట్ సుబ్బారావుగారు" అన్నాడు జవాను.

"నమస్కారం సార్, నాపేరు శ్రీనివాసరావు". ఇద్దరూ ఒకరి నొకరు చూచుకున్నారు. ఆయనకు ఏభై ఏళ్ళుంటాయి.

"క్షమించాలి. మీరెవరో నాకు తెలియదు" అన్నాడు ఎకౌంటెంట్.

"అవును, మీరునాకు ఇప్పుడే పరిచయమయ్యారు. మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు శ్రీనివాసరావు.

"ఎస్; చెప్పండి. కూర్చోండి" ఇద్దరూ కూర్చున్నారు,

'స్వవిషయం మాట్లాడాలి, ఇంటి దగ్గరయితే బావుంటుందేమో' అన్నాడు.

ఈ శ్రీనివాసరావెవరో ఎంత ఆలోచించినా - ఆయనకు అర్థం కాలేదు.

ఆఫీసునుంచి నాలుగున్నరకు బయల్దేరుతారుకదా, నేను వస్తాను, ఇద్దరం టాక్సీలో వెళదాం. ఇంటివద్ద వివరంగా మాట్లాడుకోవచ్చు".

అయిష్టంగానే ఆయన సరేనన్నాడు. శ్రీనివాసరావు వెళ్ళాడు. సాయంత్రం నాలుగున్నరకు టాక్సీలో వెళ్ళాడు శ్రీనివాసరావు. ఇద్దరూ సుబ్బారావుగారియింటికి చేరుకున్నారు. ఆ ఇల్లు అశోక్‌నగర్‌లో ఉన్నది.

అదొక చిన్న మేడ. ఆమేడలో సుబ్బారావుగారు అద్దెకు ఉంటున్నారు. వరండాలో కుర్చీలో కూర్చున్నారు ఇద్దరూ. "మీరెక్కడనుంచి వచ్చారు. నాతో పనేమిటి? ఇదివరలో మనకు పరిచయంలేదు" అన్నాడు సుబ్బారావు.

నవ్వుముఖంతో చూశాడు శ్రీనివాసరావు. "మీ కంపెనీలో ఖాళీలున్నయ్యని తెల్సింది. ఉద్యోగం ఇప్పిస్తారేమోననే ఆశతో వచ్చాను. నేను బి. కాం. ప్యాసయ్యాను. సెకండ్ క్లాసులో ప్యాసయ్యాను. రెండేళ్ళు దాటింది. ఉద్యోగంలేదు. నా కోరిక మన్నించాలి".

ఉద్యోగాలకోసం తన సహాయం ఇదివరలో చాలా మంది అర్థించారు. వారంతా తనకు తెల్సినవాళ్ళు. కాని ఇతను తనకు తెలియదు. ఏం సమాధానం చెప్పాలో ఆయనకూ తోచలేదు. ఒక్కసారిగా తనవల్ల కాదని చెప్పటానికీ ఆయనకు మనస్కరించలేదు. అసలు తనవద్దకు ఈ శ్రీనివాసరావుని ఎవరు పంపారు ?

"నన్ను కలుసుకోమని ఎవరు చెప్పారో చెప్తారా. ఎవరైనా ఉత్తరం ఇచ్చారా ?"

"లేదండీ. అలాంటి అవకాశమూ నాకు లేదు. మీ కంపెనీ అడ్రసు తెల్సుకుని ఆరో అంతస్తుకి వచ్చాను. ఎవరితో మాట్లాడాలో తెలియదు. ఇంతమంది స్టాపులో సుబ్బారావు అనే పేరుగల వ్యక్తి ఉండకపోతాడా అనిపించింది. ఆంధ్రదేశంలో సుబ్బారావులూ, వెంకటేశ్వర

రావులూ చాలామంది ఉన్నారు. ఎకౌంటెంటు సుబ్బారావుగా రున్నారని జవాను చెప్పాడు. అదీ సంగతి".

ఆశ్చర్యంతో నవ్వాడాయన. అంతవరకూ గది గుమ్మం అవతల నిల్చుని వాళ్ళ సంభాషణ వింటున్న ఆయనభార్య, రమామణి ఇవతలకు వచ్చింది.

"చిన్నవాడివైనా తెలివికలవాడివి బాబూ; జీవితంలో రాణించ గలవు" అన్న దావిడ. ఏదో అనిర్వచనీయమైన భావం ఆవిడ మనస్సులో కలిగింది. భార్యవైపు పరిశీలనగా చూశాడాయన ఒక్క క్షణం.

"ఆఫీసులో తెల్సుకుని చెప్తాను. రెండు రోజుల్లో మళ్ళీ కన్పిం చండి" అన్నాడాయన. శలవు తీసుకుని వెళ్ళాడు శ్రీనివాసరావు.

జీవితం గారడిలాంటి దనుకున్నాడు శ్రీనివాసరావు. కొన్ని పన్లు సునాయాసంగా చెయ్యవచ్చు. కొన్ని పన్లు మెళకువగా చెయ్యాలి. కొన్ని పన్లు చెయ్యాలంటే అనుభవం ఉండాలి ఈ గారడీలో తను ఎంతవరకూ నెగ్గుకు రాగలడో ? ఆలోచనలు ఒక దారికి రాలేదు. ఈ సుబ్బారావుగారు ఉద్యోగం ఇప్పిస్తాడా ?

జీవితానికి ఏదైనా వ్యాపకం, క్రమశిక్షణ నిస్తుంది. వ్యాపకంలేని జీవితం తెగిన గాలిపటం లాంటిది.

రెండు రోజులు ఆ హోటలు గదిలోనే గడిపాడు శ్రీనివాసరావు. అతనికి ఇల్లూ, వాకిలీ, తల్లీ, తండ్రి ఎవరూ గుర్తుకురాలేదు. కనుపించని దేవుడిని అతడు ఎన్నడూ తలవడు. అదృష్టాన్ని గురించి అతనికి ఏ భావమూ లేదు. మనిషి తెలివితేటలతోనే రాణిస్తాడు. అంతేగాని అదృష్టమూ, దేవుడూ, దయ్యమూకాదు. ఆశ మానవ సహజం అని మాత్రం ఒప్పుకుంటాడు. జీవితాన్ని గురించి స్థూలంగా ఇవే అతని అభి ప్రాయాలు.

మూడో రోజు సాయంత్రం అయిదు గంటలకు అశోక్‌నగర్ వెళ్లాడు శ్రీనివాసరావు. సుబ్బారావుగారు అప్పుడే కంపెనీనుంచి వచ్చాడు. భార్య, కూతురు, ఆయనా మాట్లాడుకుంటున్నారు.

"నమస్కారం సార్".

"రండి, రండి, కూర్చోండి'' కుర్చీ చూపించాడు. భార్య ఇంట్లోకి వెళ్ళింది. కూతురు అక్కడే కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతోంది.

"మేనేజింగ్ డైరెక్టర్‌తో మీ విషయం మాట్లాడాను. బి. కాం. సెకండు క్లాసులో పాసయ్యారని చెప్పాను. ప్రస్తుతం రెండు పోస్టులు ఖాళీగా ఉన్నాయి. అందులో ఒకటి మీకు రావచ్చు. జీతం నూటయాభై ఉంటుంది. రెండు రోజులు పోయాక, ఆఫీసుకు రండి. ఆర్డర్సు తీసుకుందురుగాని, విష్ యు గుడ్ లక్" అన్నాడు సుబ్బారావు.

"చాలా కృతజ్ఞుడిని. శ్రమ ఇచ్చాను మన్నించండి".

నవ్వు ముఖంతో కూతురువైపు చూశాడాయన. "పరాయి వాళ్ళకు నాన్నగారు అవలీలగా వాళ్ళ కంపెనీలో ఉద్యోగాలు ఇప్పిస్తారు. కన్న కూతురుకి ఆయన ఉద్యోగం ఇప్పించలేరు".అన్నదా అమ్మాయి.

"మా అమ్మాయి లీలావతి బి. ఏ. ప్యాసయింది. పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటులో యు. డి. సి గా పనిచేస్తున్నది. మా కంపెనీలో ఉద్యోగం ఇప్పించలేదని దానికి కోపం. మే మిద్దరం ఒక కంపెనీలో ఉద్యోగం చెయ్యటం నాకు ఇష్టంలేదు". అన్నాడాయన.

"మీ నాన్నగారు చెప్పింది నిజమే నండీ. అదిగాక మీరు ప్రభుత్వోద్యోగి, అంతకన్న కావలసిందేముంది".

"ఉద్యోగం ఇంకా రాందే మా నాన్నగారిని అంతపొగిడేస్తున్నారు. నిజంగా ఉద్యోగమొస్తే ఆయనకు రోజూ పాదపూజచేస్తారల్లే ఉన్నది". అన్నది లీలావతి.

నవ్వుతూ శ్రీనివాసరావువైపు చూశాడాయన. "పూజలూ పునస్కారాలంటేనాకు నమ్మకం లేదండీ. ఎదుటఉన్న వ్యక్తితో మనకష్టసుఖాలు చెప్పుకుని, వారి సహాయ సానుభూతులు అర్థించటం మానవసహజం. పాదపూజల లాంటి, వ్యక్తిఆరాధనయందు నాకు నమ్మకం లేదు, ఇష్టతా లేదు. అన్నాడు శ్రీనివాసరావు.

"వెరీగుడ్. జీవితంలో బాగా రాణిస్తారు" అమ్మాయి ఇంట్లోకి వెళ్ళింది. ఆయనవద్ద శలవు తీసుకొని శ్రీనివాసరావు వెళ్ళిపోయాడు.

# 6

శ్రీనివాసరావు వెళ్ళిన వారం రోజులవరకూ ఆ ఇంట్లో ఎవ్వరికీ నిద్రాహారాలు లేవు. తల్లి మాణిక్యమ్మ విచారానికి అంతులేదు.

"ఆస్తిపాస్తులు ఎవ్వరూ వెంటతీసుకు పోరు. ఏభైఏళ్ళు దాటిన మీకూ, డెభ్భైఏళ్ళొచ్చిన మావగారికి, ఇంకా ఆ పొలాల మీద మమకారం ఉంటే, జీవితంలో కాలుపెట్టేవాడికి ఎంత మమకారం ఉండాలి. మామగారి హయాంలో పదిహేను ఎకరాలు పైగా అమ్మినా, కిక్కురుమనని మీరు, న్యాయంగా వాడికి రావలసిన వాటా ఇవ్వటానికి ఎందుకు సందేహిస్తున్నారో అర్థంకావటంలేదు. ఇరవైమూడేళ్ళు పెంచి, చివరికివాడిని దేశాలపాలు చేశారు". ఏడవసాగిం దావిడ.

"ఏడవ్వేఏడు, ఇంకా బాగా ఏడు. నా కొడుకు దొంగగా తయారయాడని సిగ్గు పడాల్సింది పోయి, ఆస్తి ఇవ్వలేదని ఏడుస్తున్నావా? వాడికే కనక ఆస్తి పంచిఇస్తే మూడు రోజుల్లో తెగనమ్ముకు పోయి, నెల రోజుల్లో కర్పూరంహారతి అయింది దనిపించేవాడు.సిగ్గులేకపోతేసరి". అన్నా రాఘవరావు విసుక్కుంటూ....

తల్లిని ఓదార్చసాగింది సురేఖ.

"పెళ్ళయిన రెండేళ్ళల్లోనే పసుపుకుంకుమ పోగొట్టుకుని,నువ్వేమో ఇంటికి చేరావు. ఆ ఇద్దరు మగపిల్లలైనా ఉద్ధరిస్తారని ఆశపడ్డాను. పెద్ద కొడుకు నా నెత్తిన రాయికొట్టి వెళ్ళాడు. నా ఆశ నాకే ఎదిరి కొట్టింది" ఆవిడ ఈ రకమైన ధోరణికి అంతులేదు.

రామయ్యగారికీ మనస్సు బావుండలేదు. ఆస్తిపంచియిస్తే మనవడు ఇంటిపట్టున ఉంటాడనే నమ్మకం ఆయనకులేదు. ఆ ఆస్తి అమ్ముకుని, ధూపదీప నైవేద్యాలకు ఖర్చు పెడతాడని ఆయన గట్టి నమ్మకం. ఒక విధంగా ఇట్లా వెళ్ళటమే ఆయనదృష్టిలో యుక్తియుక్తంగా ఉంది. కష్ట సుఖాలు కాచి వడబొయ్యటానికి, తగిన వాతావరణం అతగాడే ఏర్పరుచుకున్నాడని ఆయన విశ్వాసం.

కాని, ఆయననమ్మకాలు ఆ ఇంట్లో ఎవ్వరికీ రుచించవు. ఒక్క రాఘవరావుకే తండ్రియందు విశ్వాసం ఉన్నది. రామయ్యగారు ఏమన్నా కాస్తచెవిని వేసుకునేది రాఘవరావు ఒక్కడే.

మాణిక్యమ్మకు హితోక్తులు చెప్పి, ఆవిడ మనస్సుకు ఊరట కలిగిద్దామని ఆయన ప్రయత్నించాడు.

"శ్రీనివాసరావు ఊళ్ళు పట్టుకుపోయినా, ఆస్తి పంచియిచ్చినా, వాడిధ్యేయం వాడిదేనమ్మా. కన్నతల్లివి కడుపుతీపిచేత నువ్వు ఎక్కువగా ఆలోచించలేకపోతున్నావు. వెయ్యిరూపాయలూ అయిపోయేలోగా, వాడేదో ఉద్యోగం కుదుర్చుకునే ఉంటాడు. వాడు ఆశావాది, చొరవ కలవాడు. ఎక్కడోక్కడ బ్రతకగలవాడు. అంతేకాదు నీ ప్రమేయం లేకుండానే, కోడల్నికూడా తీసుకురాగల ధీశాలి".

తాతయ్య బోసినోటి నవ్వును మనుమరాలు సురేఖ హర్షించింది. తన జీవితం చీకటి మయమైనా, ఇతరుల జీవితంలోని వెలుగునిచూచి సంతోషపడే మనస్తత్వం కలది. పాతభావాలయందూ, ఆచార వ్యవహారాలయందూ ఎంతనమ్మకమో, కొత్తభావాలయందు అంత మక్కువ. ఆ కొత్తభావాలయినా వంశప్రతిష్టమీద దెబ్బతీసేవైతే ఆమె కోపమూ, అసహ్యమూ తారాస్థాయికి పోతుంది.

"అమ్మకు తెలియకుండానే ఈ ఇంట్లో తన భార్యతో అడుగు పెడతాడంటావా తాతయ్యా" అన్నది సురేఖ.

"వాడు అటువంటిధీశాలి అన్నాను కదా ! వాడి మనస్తత్వం నీకూ తెలుసు. వాడు జీవితంతో రాజీపడలేదు సురేఖా. జీవితంలో రాజీపడిన వాళ్ళు అసమర్థులనే వాడి ఉద్దేశ్యం".

"అంటే" కొంచం ఆశ్చర్యపడింది సురేఖ.

"పాతను ఎన్నటికీ వాడు హర్షించడు. అంతేకాదు దేవుడిమీద వాడికి నమ్మకంలేదు. వాడి ఆత్మవిశ్వాసమే, అంటే అది ఇతరులకు నచ్చినా నచ్చకపోయినా, వాడిని ముందుకు తీసుకు పోతుందని వాడి నమ్మకం" అన్నాడాయన.

రాఘవరావు సంభాషణ వింటున్నాడు. కొడుకు తిరగబడి పోట్లాడి ఆస్తిని పంచుకుంటాడని అనుకున్నాడుగాని, దెబ్బతీసి వెళతాడని ఊహించ లేదు. శ్రీనివాసరావు తన తరువాత కరిణీకం వెలగబెడతాడని ఆయన ఎన్నడూ ఆశించలేదు. ఈ కారణంచేతనే కాలేజి చదువుకూడా చెప్పిం చాడు. పొలం పనుల్లోనూ శ్రీనివాసరావుకు ఆసక్తిలేదు. చిన్నవాడైనా ముకుంద మాధవరావుకు పొలం పన్లయందు అమిత శ్రద్ధ. అతనికి చదువు కూడా ఆశించినంతగా అబ్బలేదు. సురేఖ విషయంలో ఆయన పంచప్రాణాల్లో ఒక ప్రాణం అల్లుడితోనే పోయింది.

"మాటలతో నన్ను మభ్యపెట్టకండి మావగారూ. కడుపుతీపి మీరెరగనిదికాదు. కాని ఇటువంటి సంఘటన మీ జీవితంలో జరగలేదు. అంచేతనే ఈ రకమైన మనస్తాపం మీకు అర్థంకాదు. పత్రికల్లో వేయిం చండి, 'మీ అమ్మ మంచమెక్కిందనీ ఎక్కడున్నా తిరిగిరావలసిందనీ. ఆస్తి పంచుతామనీ" వాడు దుర్మార్గుడైనా నా కొడుకు. కళ్ళు తుడుచు కుందావిడ. రాఘవరావు కరిణీకం లెక్కలు కట్టిపెట్టి సావిట్లోకి వచ్చాడు.

"వాడు పది పన్నెండేళ్ళ కుర్రవాడు కాదు. ఇరవై మూడేళ్ళవాడు. పత్రికల్లోవేస్తే అపహాస్యం పాలవుతాంగాని ప్రయోజనం ఉండదు. సరేలే ఆలోచిద్దాం" అన్నాడాయన.

మాణిక్యమ్మ మరి మాట్లాడలేదు. ఎంత చిన్న విషయమైనా ఆ ఇంట్లో తన మాటకు విలువలేదని ఆమెకు తెలుసు. ఇంతవరకూ ఆమె జీవితం ఇట్లాగే గడుస్తున్నది. ఈ సంఘటనతో ఆమెలో నిద్రాణ మైఉన్న కొన్ని ఊహలు కొంతధైర్యమూ నిద్రలేచినయ్.

"మీ తండ్రీకొడుకులే వాడిని సర్వ నాశనంచేశారు. మీ కుళ్ళు ఉద్దేశ్యాలు వాడికి నచ్చకనే వెళ్ళిపోయాడు. మావగారికి ఉన్నది ఒక్క కూతురూ, ఒక్కకొడుకూ ఆ కొడుకైనమీరు కరిణీకంచదువులే చదివారు గాని పెద్దచదువులు చదవలేదు. ఒక్కకూతురు సుభద్రమ్మ. ఆవిడకూ చిన్నప్పుడే పెళ్ళిచేశారు. ఈ సంసారానికి మావగారు పదిహేను ఎకరాలు ఎందుకు అమ్మినట్లో నాకు తెలీటంలేదు. పెద్దవాళ్ళ బుద్ధులే ఇట్లాఉంటే ఈ కొలపు...." ఆమె చెంపమీద రాఘవరావు అయిదు వేళ్ళూ తేలినయ్యి.

"నోర్ముయ్, పిచ్చి తలకెక్కిందా" రాఘవరావుకు అంతటి కోపం ఎన్నడూ రాలేదు. సురేఖ వణికిపోయింది. రామయ్యగారు విభ్రాంతు డయ్యాడు. కొడుకు, కోడలిమీద చెయ్యి చేసుకోటం ఆయన ఎన్నడూ చూడలేదు. పరిస్థితులు వక్రించటమే కాకుండా, కల్లోలం చెలరేగి నందుకు ఆయన ముసలి ప్రాణం గిజ గిజ లాడింది.

"రాఘవా, పేపర్లో ప్రకటనఇవ్వు". రాఘవరావు ఆ మాటను వినిపించుకోలేదు, కోపంతో వెళ్ళాడు.

* * *

ఆ ఊళ్ళో మంచినీళ్ళ బావులు రెండే ఉన్నాయి. ఊరివారంతా త్రాగటానికి మంచినీళ్ళు ఆ బావినుంచే తెచ్చుకోవాలి. రోజూ సురేఖ సాయంత్రంపూట రెండు బిందెల మంచినీళ్ళు తెస్తుంది. ఉదయంపూట మాణిక్యమ్మ తెస్తుంది. ఆరోజు సాయంత్రం సురేఖ మంచినీళ్ళబావికి వెళ్ళుతూ దార్లో ఒక దృశ్యం చూసింది. ఎవరో ఒకతను ముకుంద మాధవరావుకు ఒకఉత్తరం ఇచ్చాడు. వాడా ఉత్తరం చదివి సంతోషంతో, "సరేనండీ, అరగంటలో తెచ్చియిస్తాను. ఇక్కడే ఉండండి మీరు" అన్నాడు. సురేఖ ఆ ఇద్దరివైపూ చూసీచూడనట్లు చూస్తూ వెళ్ళింది. త్వరగా మంచినీళ్ళు తోడుకుని యింటికి వెళ్ళింది. ముకుంద మాధవరావు ఏదో కవరు తీసుకుని వెళ్ళిపోయాడు. రెండో బిందె మంచినీళ్ళకు గబ గబా వెళ్ళింది సురేఖ. ఆ కవరు అతనికి ఇచ్చేవేళకు సురేఖ అక్కడకు వెళ్ళింది.

"ఎవర్రా మాధవా ఆయన, ఏమిటా కవరు" అంది సురేఖ. అతను చూశాడు. ఏదో చెప్పబోయాడు. ఏమీచెప్పకుండానే వెళ్ళిపోయాడు. సురేఖకు ఏమీ అర్ధంకాలేదు.

"ఇంటికి వెళ్ళాక చెప్తానులే అక్కా". ఏమీ అర్థం కాక వెళ్ళి పోయింది.

ఆ సాయంత్రం ఎవరూ వినకుండా ముకుంద మాధవరావు సురేఖతో ఏదో చెప్పాడు. ఆమె ఆనందానికి అవధులు లేవు.

"అమ్మతో చెప్పేద్దాం. ఎంతో సంతోషిస్తుంది" అన్నది.

"వద్దు. ప్రస్తుతానికి ఈ రహస్యం బైటపెట్టొద్దన్నాడాయన" అన్నాడు ముకుందమాధవరావు. సరేననుకున్నారు ఇద్దరూ.

వాగుదాటి ఎవరోవస్తున్నట్లుచూసింది సురేఖ.ఎవరో పోల్చుకుంది.

"అమ్మా, రఘునాధరావు మామయ్యొస్తున్నారు".

రాఘవరావు, రామయ్యగారూ కూడా పొలంవెళ్ళి అప్పుడే వస్తున్నారు. ముగ్గురూ దార్లో కలిశారు.

"ఏం మావగారూ, కులాసా. ఈ వయస్సులో కూడా ఇంకా పొలం వెళ్ళి వస్తున్నారా" అన్నాడు రామయ్యగారివైపు చూసి.

"ఏం బావా, ఏమిటీ గొడవ, శ్రీనివాసరావు ఎక్కడికో వెళ్ళి పోయాట్ట. సురేఖ ఉత్తరం రాసింది" రాఘవరావుతో అన్నాడు.

"ఏమిటోనోయ్, ఈ రోజుల్లో పెద్దవాళ్ళది చాదస్తపు మమకారం. అయితే చిన్నవాళ్ళది తాత్కాలికపు మమకారం. ఆస్తి పంచలేదని అలిగి వెళ్ళిపోయాడు" అన్నాడు రామయ్యగారు.

ముగ్గురూ ఇల్లు చేరారు. సురేఖ కాళ్ళుకడుక్కునేందుకు నీళ్ళు తెచ్చింది. రఘునాధరావు కాళ్ళుకడుక్కుని ఇంట్లోకి వెళ్ళాడు. ఎవరి ముఖాల్లోనూ ప్రశాంతత లేదు.

"అంతా విన్నాను మాణిక్యమ్మా. పిల్లలతోబాటు వాళ్ళ అదృష్టాలకూ మనం కర్తలం కాదుకదా. వాడేం చిన్నపిల్లవాడుకాదు మారుబడిపోడానికి. ఎక్కడోక్కడ వాడు కులాసాగానే ఉంటాడు. చెడ్డపేరు మీకొచ్చింది. దుర్బుద్ధి వాడిక్కలిగింది. అదృష్టం బావుంటే వాడే తిరిగివస్తాడు". అన్నాడు రాఘవరావు మాణిక్యమ్మతో. ఆవిడ కళ్ళు తుడుచుకుంది.

"పిల్లలంతా ఏం చదువుతున్నారు మావయ్యా!" అన్నది సురేఖ.

"ఏం చదువులో ఏమో. నళిని ఉద్యోగం చేస్తున్నది. దానికి నూట యాభై జీతం. రాజేశ్వరి పి.యు.సి. వెలగబెడుతోంది. వయసుకు మించిన పెంకితనం దాంది. జయలక్ష్మి థర్డుఫారం, అనుపమ ఫస్టుఫారం, రాధా రమణ మూడోక్లాసు, లక్ష్మణరావుని ఇంకా బడిలో వేయలేదు. వీళ్ళందరితో చచ్చిపోతున్నాను".

"నళిని కూడా ఉద్యోగం చేస్తున్నదిగా. ఏదో వేన్నీళ్ళకు చన్నీళ్ళు

కా స్త ఇబ్బంది తీరినట్లేగా". అన్నాడు రాఘవరావు, నీళ్ళు నమిలాడు రఘునాధరావు.

"లేదు బావా, ఎవరినీళ్ళు వాళ్ళవే. దాని ఖర్చులుపోను మిగతా జీతం బ్యాంకులో వేస్తున్నది".

"ఒకరకంగా అదీ మంచిదే" అన్నాడు రామయ్యగారు.

"మనవరాలు ఉద్యోగం చేస్తూ జీతం బ్యాంకులో వేసుకుని దాచు కొంటున్నదంటే తాతయ్యకు ఎంత సంతోషమో" అన్నది సురేఖ.

ఒక్క నిట్టూర్పు విడిచాడు రామయ్యగారు.

"అవునమ్మ" కూతురుబిడ్డ నళినినిచూ స్తే నాకు చాలా ఆనందంగానే ఉంటుంది. కొడుకు బిడ్డ నిన్నుచూ స్తే ఎప్పుడూ విచారంగానే ఉంటుంది. ఇద్దరూ నాకు వారిగించేదేమీలేదు. కారణం నీకూ తెల్సుకదా" అన్నా డాయన. సురేఖ తన పరిస్థితికి తానే జాలిపడింది.

ఆ రాత్రి ఉండి మర్నాడు వెళ్ళిపోయాడు రఘునాధరావు.

*　　　*　　　*

ఆ మర్నాడు శ్రీనివాసరావు సుబ్బారావుగారింటికి వెళితే ఆయన లేడు. అర్జంటుగా కంపెనీ పనిమీద వరంగల్ వెళ్ళారు. ఆ రోజున ఆఫీసుకు ఏదో శలవు కావటంతో లీలావతి ఇంట్లో ఉన్నది.

"నాన్నగారు ఉద్యోగం ఇప్పిస్తారనే నమ్మకంతోనే ఉన్నారా" పేపరు చదువుతూ అడిగింది లీలావతి.

"అలాంటి కోరిక అసహజం కాదుకదా. ఏదీ ఒక షీటు ఇట్లా ఇవ్వండి" అన్నాడు శ్రీనివాసరావు. పేపరు మడిచి టీపాయ్‌మీద పడే సింది లీలావతి.

"వాంటెడ్ కాలమ్సు చూస్తారా" బింకంగా చూస్తూ అడిగింది.

"చదువుకునే రోజుల్లో స్పోర్ట్సు కాలమ్సు చూసేవాడిని" కుడి అర చెయ్యి పరిశీలనగా చూసుకుంటూ అన్నాడు.

"పామిస్ట్రీవచ్చా. ఏదీ నా జాతకం చెప్పండి".

లీలావతి ముఖంలోకి ఒక్కసారి చూసి నవ్వాడు,

"మీ మనస్తత్వం తెల్సుకుందామని నా చెయ్యి చూసుకున్నాను. నా ఊహ తప్పిపోలేదు".

"ఓహో ! అదా సంగతి. ఇరవై ఏళ్ళొచ్చినా, నా మనస్తత్వం నాకే తెలియదే, మీ కెట్లా తెల్సింది. అబద్ధాలు మీకు మంచినీళ్ళ ప్రాయంలా ఉంది".

కంఠంలో కాఠిన్యం గోచరించింది. రెండడుగులు వెనక్కివేశాడు శ్రీనివాసరావు.

"మీరు బి. కాం. పాసయ్యా నన్నారు కదూ. సర్టిఫికెట్ తెచ్చారా" డీల్లపోయాడు శ్రీనివాసరావు.

"నేను బి. కాం. ప్యాసయినాననే నమ్మకం మీకు లేదా ?"

"నమ్మకాలమీద నాకు నమ్మకం లేదు. ఆ యదార్థాన్ని తెల్సుకోటానికి సర్టిఫికెట్ అవుసరం. అది మీవద్దలేదు. అవును. ఎట్లా ఉంటుంది. అసలు చదివితే కదూ" హేళనగా అన్నది. అవహేళనగా నవ్వింది. తూష్ణి భావంతో చూసింది.

"షేక్స్పియర్ మీకు బాగా పరిచయస్తుడల్లే ఉంది".

"నాకు తెలీదండీ. ఆయన ఎప్పుడో చనిపోయాడు. మీకుతెల్సా ?"

"నాకూ తెలీదు. మీ ముఖ కవళికలు అలా ఉంటేను".

అర్థం చేసుకున్నాడు శ్రీనివాసరావు.

"బి. కాం. సర్టిఫికెట్ మా ఊళ్ళో మరచిపోయి వచ్చాను. రెండు రోజుల్లో తెప్పిస్తాను".

అయితే మీకు ఉద్యోగం హుళక్కే. బి.కాం. హాయిగా ఉండండి". కుర్చీలోనుంచి లేచింది లీలావతి చిన్నబుచ్చుకుని వెళ్ళాడు శ్రీనివాసరావు.

ఆ రోజునే ఒక ఉత్తరం గుంటూరు స్నేహితుడు, రామనాధానికి వ్రాశాడు. దాని సారాంశం; రామనాధాన్ని తను ఊరువెళ్ళి పెద్దవాళ్ళకు తెలియకుండా ముకుందమాధవరావుని అడిగి తన బి. కాం. సర్టిఫికెట్, ఎస్. ఎస్. ఎల్. సి. రిజిష్టరు వగైరా తీసుకుని వెంటనే తన అడ్రసుకు హైదరాబాద్ పంపమనీ వ్రాశాడు.

ఆ ప్రకారమే రామనాధం వాళ్ళ ఊరు గోగులేశ్వరం వెళ్ళి

ముకుందమాధవరావుతో సంగతంతా చెప్పి, శ్రీనివాసరావు ఉనికి పెద్దవాళ్ళ వరకూ పోనివ్వవద్దని మాటతీసుకుని, సర్టిఫికెట్లు తెప్పించుకుని గుంటూరు వెళ్ళిపోయాడు ఆరోజే ఆ సర్టిఫికెట్లను పోస్టులో హైదరాబాదుకు పంపాడు.

సర్టిఫికెట్లు వచ్చిన మర్నాడు సుబ్బారావుగారింటికి వెళ్ళాడు శ్రీనివాసరావు. సాయంత్రం ఆరుగంటలైంది. తండ్రీ, కూతురూ ఆఫీసునుంచి వచ్చి కబుర్లు చెప్పుకుంటున్నారు.

"మా ఆఫీసులో పాలిటిక్సు ఎక్కువైనయ్యి డాడీ! ఎంతసేపటికీ బిల్లులూ, డబ్బూ, చెక్కులూ. వాడు సంపాయించుకొంటున్నాడని వీడి ఏడుపు, వీడు ఏడుస్తున్నాడని వాడిగోల. ఏం మనుష్యులో".

ఇద్దరూ శ్రీనివాసరావుని చూశారు. నవ్వుముఖంతో ఆహ్వానించారు.

"నా సర్టిఫికెట్లు తెచ్చాను. బి. కాం. పాసయిన సర్టిఫికెట్ ఉంది. స్కూలు ఫైనలు చదివినట్లు రికార్డు లేదు" సర్టిఫికెట్లు సుబ్బారావుగారికి ఇచ్చాడు శ్రీనివాసరావు. ఆయన సర్టిఫికెట్లు చూశాడు. శ్రీనివాసరావుకి ఇచ్చేశాడు.

"మా అమ్మాయి జరిగిందంతా చెప్పింది. మీ మీద ఒక అభిప్రాయంకూడా వెలిబుచ్చింది".

డీల్లపోయాడు శ్రీనివాసరావు.

"ఏమన్నారు లీలావతీ".

"మీరు మీ ఊరు నుంచి సరాసరి ఉద్యోగానికికని బయల్దేరలేదు. అట్లా అయితే సర్టిఫికెట్లు తెచ్చేవారేకదా. ఇంట్లో అమ్మా, నాన్నా మీద కోపంవచ్చి నాలుగు జతల బట్టలు పెట్లో పెట్టుకుని చెప్పకుండా రైలెక్కేశారు".

శ్రీనివాసరావు కొంచం తలవంచాడు.

"అంతేనా మిస్టర్ శ్రీనివాసరావ్?" అన్నాడు సుబ్బారావు.

"మై ప్రిజంషన్ ఈజ్ కరెక్ట్ డాడీ, సీ ది ఫేస్" అన్నది లీలావతి.

"ఇంకా చెప్పేదేమిటి డాడీ. ఆల్ కరెక్ట్".

సుబ్బారావుగారి ముఖంలో రంగులు మారాయి. ఈ పరిస్థితికి ఆయనకు కోపం వచ్చింది. అతని మీద దురభిప్రాయం కలిగింది.

"సరే. మిష్టర్ శ్రీనివాసరావు, తల్లిదండ్రులను గౌరవించనివాళ్ళకు ఈ ప్రపంచంలో చోటులేదు. అటువంటిది మా ఆఫీసులో మాత్రం చోటు ఎక్కడిది. యు కెన్ గో" ఖచ్చితంగా చెప్పాడాయన. చిన్నబుచ్చుకున్నాడు శ్రీనివాసరావు. పేపరు చాటుచేసుకొని నవ్వుతూ చూసింది లీలావతి. .

శ్రీనివాసరావు కుర్చీలోంచి లేచాడు. వెళ్ళబోయాడు.

"సోసీ, మీ ఫాదర్ వద్దనుంచీ మీరు ఉద్యోగం కోసమే హైదరాబాద్ వచ్చినట్లు ఒక ఉత్తరం పట్రండి. దటీజ్ ఇనఫ్. ఏం డాడీ" అన్నది లీలావతి.

"సరే" అన్నాడాయన. ఏం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు శ్రీనివాసరావు.

"ఘటికురాలివమ్మా. నాకు తట్టని ఆలోచనలు నీకు తట్టినయ్యి" అన్నాడాయన.

వారం రోజులు గడిచాయి. శ్రీనివాసరావుకు ఉద్యోగం దొరక లేదు. అక్కడే ఉద్యోగం సంపాదించాలని అతని ఆలోచన. ఒక ఆడపిల్లచేతిలో చిత్తయిపోయానే అనే కలక, అతనిమనస్సుని వేదిస్తోంది.

ఏమీ తోచక సాయంత్రం ఆరుగంటలకు నాంపల్లి స్టేషన్‌కు వెళ్ళాడు శ్రీనివాసరావు. ఫ్లాట్‌ఫారంమీద లీలావతి కనిపించింది. ఆమె పలకరించింది.

"ఏం ఇట్లా వచ్చారు ప్రయాణమా ?" అన్నది.

"లేదండీ, ప్రయాణీకుల్ని చూట్టానికొచ్చాను. మీ రేవూరు వెళుతున్నారు ?"

"నేనూ ప్రయాణీకుల్ని చూద్దామనే వచ్చాను. కాకపోతే కాస్త తేడా. మా ఆఫీసరు విజయవాడ ట్రాన్స్ఫరై వెళుతున్నారు, సెండాఫ్ ఇవ్వటానికి వచ్చాం. వారంతా మా ఆఫీసు స్టాఫ్" అన్నది లీలావతి.

"ఐసీ, మీ ఆఫీసులో మీ రొక్కరే ఆడకూతురల్లే ఉంది" అన్నాడు.

నవ్వుతూ చూసింది లీలావతి. "అవునండీ! తతిమ్మా వాళ్ళంతా మగకొడుకులు".

ఈసారి నవ్వులో తనూ శృతికల్పాడు.

"ఇక వెళతాం. కనిపిస్తారు కదూ!" అంటూనే వెళ్ళింది లీలావతి.

ఈ అమ్మాయిలో మూడుపాళ్ళు తెలివితేటలూ, ఒకపాలు అహంకారమూ ఉన్నయ్యనుకున్నాడు శ్రీనివాసరావు.

మర్నాడు సాయంత్రం బస్‌స్టాండ్‌లో కనిపించింది లీలావతి. ఆపీసునుంచి వస్తున్నది.

"గుడీవినింగ్, రండి మా ఇంటికి పోదాం" అన్నది.

"ఇంకా మా నాన్నగారు సర్టిఫికెట్ ఇవ్వలేదు" అన్నాడు.

"దటీజ్ ఫర్ జాబ్".

"ఐసీ, సరే పదండి. మీ డాడీ కోప్పడరుకదూ".

లీలావతి మాట్లాడలేదు. ఇద్దరూ వాళ్ళింటికి వెళ్ళారు. శ్రీనివాసరావును కూర్చోమని పదినిమిషాల్లో బట్టలు మార్చుకొని రెండుకప్పుల కాఫీతో వచ్చింది లీలావతి. ఒక కప్పు అతనికి ఇచ్చింది.

"కాఫీ ఇవ్వటానికి కాండక్టు సర్టిఫికెట్ అక్కర్లేదా" అన్నాడు కప్పుతీసుకుని.

"పిడుక్కూ, బియ్యానికీ ఒకటేమంత్రం జపించటం మీకు అలవాటల్లేఉంది!".

ఇద్దరూ కాఫీ తాగారు.

"ఏమిటీ కబుర్లు" అన్నది లీలావతి.

"మీరే చెప్పాలి, కాని నేనే చెప్తున్నాను. నేను ఇంట్లోనుంచి చెప్పకుండా వచ్చేసిన విషయం కరెక్ట్. అంతేకాదు, వెయ్యిరూపాయలు సంగ్రహించికూడా తెచ్చాను. అవి అయిపోయేలోగా జాబ్ దొరకాలి. ఇది నా కనీసపు కోరిక. ఇంకా కోరికలు చాలా చాలా ఉన్నాయనుకోండి".

ఒక్కసారి అతని ముఖంలోకి చూసింది. ఏదో దురభిప్రాయం మనస్సులో ప్రవేశించింది.

"ఆ డబ్బు ఎన్నాళ్ళు సరిపోతుంది ?"

"ఇంకొక నెల రోజులు పైగానే రావచ్చు".

"మీ నాన్నగారి అడ్రసు" తాపీగా అడిగింది.

"ఎందుకు ?"

"ఒక గజదొంగ మా ఇంటికి వచ్చి పోతున్నాడు. అతను మీకొడుకని సవినయంగా మనవి చేసుకుంటున్నాను. చదువున్నది. సంస్కారం లేదు. తెలివితేటలున్నయ్యి. కాని, వక్రబుద్ధి. మనిషి అందమైనవాడు. కాని అభిప్రాయాలు అందవిహీనమైనవి. ఇట్లాంటివాళ్ళు మీ సంతానంలో ఒక్కరేననుకుంటాను, ఇలాంటి సుపుత్రుణ్ణి కన్నందుకు మీ దంపతులు ధన్యులు. అని ఉత్తరం రాస్తాను". అన్నది.

ఒక్క నిమిషం ఆమెవైపు చూశాడు కన్నార్పకుండా.

"ఆ ఉత్తరంలో ఆఖర్న ఒక్క వాక్యం రాయండి. అటువంటివాడు నా దగ్గర ఎప్పుడూ అబద్ధం ఆడలేదు. అని రాస్తారుకదూ" శ్రీనివాసరావు వెళ్ళిపోయాడు.

# 7

రఘునాధరావు ఒక ఎరువుల ఫ్యాక్టరీ ఆఫీసులో ఎకౌంటెంట్. ఆయనకు జీతం మూడు వందలువస్తుంది. తండ్రి చనిపోయే టప్పటికి అయిదెకరాలకు వారసుడు, రఘునాధరావు. అదే ఆఫీసులో వంద రూపాయలు జీతం. ఆ అయిదెకరాలూ, ఈ వందరూపాయలు జీతం, చూసి రామయ్యగారు కళ్ళుమూసుకొని సుభద్రమ్మను ఇచ్చి పెళ్ళిచేశాడు. అయిదు రోజులు పెళ్ళి. సాంప్రదాయానుసారం పెళ్ళిజరిగింది. కట్నం, కనుకలూ, లాంఛనాలూ భారీగానే జరిపారు. ఆ పెళ్ళికి రామయ్యగారు మూడెకరాలు అమ్మాడు. అయితేనేం, ఆయన మనస్సుకు నచ్చిన అల్లుడు వచ్చాడు.

పెళ్ళయాకనే సుభద్రమ్మ మొదటిసారిగా రైలెక్కింది. ఆమె పదిహేనేళ్ళ జీవితం గోగులేశ్వరంలోనే గడిచింది. అంచేత ఆవిడ మనస్తత్వం పాతసాంప్రదాయలనే అంటిపెట్టుకుని ఉండేది. ఒక్క నళిని పురుడు మాత్రమే, గోగులేశ్వరంలో పోసుకుంది.

క్రమేపీ ఇరవై రెండేళ్ళు గడిచాయి. నలుగురు ఆడపిల్లలూ, ఇద్దరు మగపిల్లలూ, మూడొందలు జీతం. నాలుగు ఎకరాలు అమ్మకం. ఒక ఎకరం మిగులూ, రెండువేలు అప్పు. ఇవీ ఆయన స్థిరచరాస్థులు.

నళిని ఉద్యోగం చేస్తున్నా, ఆయనకు ఆర్థికంగా అండలేదు. రాజేశ్వరి పి. యు. సి. లో చేరింది. జయలక్ష్మి, అనుపమ హైస్కూల్లో చదువులు. రాధారమణ ఎలిమెంట్రీస్కూలు. అంతా ఎవరిదారిని వాళ్ళు పోతుంటే, లక్ష్మణరావు నాలుగేళ్ళవాడు ఒక్కడే తల్లితోపాటు ఇంట్లో ఉండేది.

ఆ రోజున రఘునాథరావు తన జీవిత సంఘటనలని నెమరు వేసుకుంటున్నాడు. తన ఆర్థిక పరిస్థితి ఇంతకు దిగజారిపోయిందంటే తనేమీ దుబారా ఖర్చులు చెయ్యలేదు. ఏ దుర్వ్యసనాలూ తనకులేవు. కుటుంబ ఖర్చులే పెరిగిపోయినయ్.

మర్నాడు ఆయనకు జీతం మూడొందలూ వచ్చింది. ఆ రోజునే రాజేశ్వరి కాలేజీలో టరమ్ ఫీజు కట్టాలనీ, యింకా పుస్తకాలు కొనుక్కోవాలని వందరూపాయలు అడిగింది.

"అక్కయ్యని అడక్కపోయావా ?"

"నా జీతం సంగతిని అక్కయ్యకు చెప్పమంటావా నాన్నా ?"

"అవునమ్మా ! ఇందులో తప్పేముంది. మన ఆర్థిక ఇబ్బంది అక్కయ్యకు తెల్సుకదా. నళినిని అడగటం తప్పంటావా రాజేశ్వరీ" ఆయన కంఠంలో ఆవేదన లీలగా గ్రహించింది రాజేశ్వరి.

"అక్కయ్య తన జీతం దాచుకుంటున్నది ఎందుకో నాకు అర్థం కాలేదు" అప్పుడే వచ్చిన నళినివైపుచూసి అన్నది.

"ఆరోజువస్తే నువ్వే అర్థంచేసుకుంటావు",

"అంతవరకూ మమ్మల్ని చచ్చినట్లుగా పడి ఉండమంటావు అంతే కదూ" కోపంతో అని వెళ్ళబోయింది రాజేశ్వరి. నవ్వుముఖంతో చూస్తూ చెయ్యి పుచ్చుకుంది నళిని.

"మనకు కావలసింది చావుబ్రతుకుల సమస్యకాదు జీవిత సమస్య. ఈ సమస్యను పరిష్కరించడానికి కొన్ని యిబ్బందులు పడక తప్పదు. సరే, నీ కాలేజీ ఫీజు కట్టేయ్. ఆ డబ్బు నేనే యిస్తాను". సంతోషంగా అన్నది నళిని. ఆనందంగా విన్నది రాజేశ్వరి. ఆమె మనస్సులో ఆలోచన పాలు జాస్తే. చిలవలకుపలవలు సృష్టించుకుని ఆ ప్రశ్నలకు జవాబులు తనే నిర్ణయించుకుంటూ ఆలోచిస్తుంది.

"ఈ జీతమంతా దాచి, కూడబెట్టిందంతా ఒక్కసారే మీ శ్రీవారి చేతుల్లో పోస్తావా!"

"ఈ శ్రీవారి ప్రస్తావన ఇదివరకు రెండుసార్లు తెచ్చావు. నీకు త్వరగా పెళ్ళిచేసుకోవాలని ఉందా రాజూ!"

'ఛా ఛా, నా కటువంటి కోరికలులేవు. ఒకవేళ ఉన్నా నీ తరువాతనే నేను. కాకపోయినా మన పెళ్ళిళ్ళు నాన్నకు పెద్ద సమస్య. అమ్మకు గుండెలమీద కుంపటి. మన ఆర్థిక స్తోమత ఇట్లా ఉంటే" ఇంక చెప్పలేక పోయింది రాజేశ్వరి.

నళిని మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఈ నాటికి రాజేశ్వరి తమ సంసార పరిస్థితి అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నది. అంటే రాజేశ్వరికి జ్ఞానోదయం కలుగుతున్నది.

"పి. యు. సి.లో, ఎ. ఇ. గ్రూపు తీసికోవటంతో ఆర్థిక సమస్య లేమిటో నీకు అర్థమౌతున్నదికదు రాజూ" అన్నది నళిని. రాజేశ్వరి నవ్వి ఊరుకున్నది.

ఆ మర్నాడే బ్యాంకునుంచి డబ్బుతెచ్చిరాజేశ్వరికి యిచ్చింది నళిని. టరమ్ ఫీజు కట్టడం కూడా జరిగింది. ఈ సంగతి తండ్రికి తెలియగానే ఆయన కళ్ళల్లో ఆర్ద్రత చూసింది నళిని. తల్లి మనస్సు ఇంకో రకంగా తల్లడిల్లిపోయింది. ఆమెవి దూరపుఆలోచనలు.

జయలక్ష్మి, అనుపమ, రాధారమణ ముగ్గురూ ఆరోజున సినిమాకు

వెళ్ళారు. ఏదో సినిమాకు కన్సెషన్ టికెట్లు ఇచ్చారు. పెద్ద కూతుళ్ళిద్దర్నీ కూర్చోపెట్టింది తల్లి. రఘునాధరావుకూడా ఈ తల్లీ కూతుళ్ళ సమావేశంలో పాల్గొన్నాడు.

"బడ్జెట్ సమావేశం జరిపిస్తున్నావా నాన్నా" అన్నది రాజేశ్వరి. ఆయనకూ నవ్వొచ్చింది.

"ఈ సమావేశంలో చర్చనీయాంశాలేమిటో నాకుతెలీదు. మీ అమ్మ హోం శాఖామంత్రిణి, ఆవిడే ఈ సమావేశం ఏర్పాటుచేసింది".

సుభద్రమ్మకు నవ్వురాలేదు. ఆమె ముఖంలో ఏదో దిగులు తొంగి చూస్తోంది.

"నళిని బి. కాం. ప్యాసయి ఉద్యోగం చేస్తోంది. దానికి వచ్చే వరుడికి చదువు సంధ్యలు కాస్త ఎక్కువే ఉండాలికదా, అలాంటి వరుడికి డిగ్రీతోపాటు కట్నం ఆశ కూడా ఎక్కువే ఉంటుంది. ఇవన్నీ మీరు ఎట్లా సమర్థిస్తారో నాకేం పాలుపోక మతి పోతున్నది" అన్నదావిడ.

నళినికి తారామండలాన కోపంవచ్చింది. కాని తమాయించుకుంది.

"అమ్మా! నీకు మతి ఇంకోరకంగా పోతే, నేను నిజంగా బాధపడతాను. కాని కూతుళ్ళ పెళ్ళి విషయంలో నీమతి పోగొట్టుకొంటే, అందుకు నేను బాధపడను. ఏ ఆలోచనకైనా కొంత అర్థం ఉండాలి. జీవిత సమస్యలతో రాజీపడే నేర్పు, ఓర్పుకూడాఉండాలి. నీకు ముఖం కడుక్కుంటున్నా, వంట చేస్తున్నా, బట్టలు ఉతుకుతున్నా, అంట్లుతోముతున్నా, గుళ్ళోకి వెళుతున్నా, మా పెళ్ళి ఆలోచనలతోనే సతమతమౌతుంటే తప్పక నీ మతిపోతుంది. కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదని మళ్ళీ నువ్వే అంటావుకదా, ఆ ఘడియ ఇంకా పదేళ్ళవరకూ రానేరాదనుకో, ఈ గొడవతో మా మనస్సుకి పంచరువెయ్యకు. నీకు ఎంతో పుణ్యం వుంటుంది" అన్నది నళిని, మాటల్లో కోపాన్ని వ్యక్తంచేస్తూ.

నళిని మనస్సు తెల్సిన సుభద్రమ్మ విస్తుపోలేదు. కాని కూతుళ్ళ మనస్సులు తన చెయ్యి దాటిపోతున్నాయనే భావం,ఆమె మనసులో పాతుకుపోయింది. ఇంక వీళ్ళ మనస్సులు తన ఆధీనం తప్పాయని పూర్తిగా గ్రహించింది.

నాలుగు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడలేదు. పెదాల వెనక నవ్వుని నింపుకుని తల్లివైపుచూసింది రాజేశ్వరి. రాజేశ్వరిని ఊరుకోమని కేక వేస్తున్నట్లుగా చూసింది నళిని. ఇద్దరూ అక్కడినుంచి లేచి వరండాలోకి వచ్చేశారు.

"వీళ్ళు మనమాట వినరు. మనకు చేటుతెచ్చేటట్లే ఉన్నారు. మీరూ బెల్లంకొట్టిన రాయిలా ఊరుకోండి" అన్నదావిడ, తన కోపాన్ని ఆయనమీద ప్రయోగిస్తూ.

"ఏ రాయి అయినా నా పళ్ళేకదా ఊడేది. వాళ్ళిద్దరూ నాపళ్ళు వూడగొడతారంటావా?" అన్నాడాయన నవ్వుతూ.

"ఈ కుటుంబగౌరవం....".

"మారీత్యామంటగలసి పోతుందనే అనుమానం నీకు అక్కర్లే దమ్మా. ఎవరిగౌరవమూ ఎవ్వరూ తీసెయ్యలేరు" అన్నది నళిని, మళ్ళీ తల్లిదగ్గరకువచ్చి.

ఆ చర్చ అంతటితో ఆగిపోయింది.

* * *

మరో వారం గడిచింది. రఘునాథరావు భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళబోతున్నాడు. నళిని ఆఫీసుకు వెళ్ళింది. కాలేజికి వెళ్ళింది రాజేశ్వరి. పిల్లలిద్దరూ హైస్కూలుకు వెళ్ళారు. పెళ్ళిళ్ళ ప్రస్తావన మళ్ళీ తెచ్చింది సుభద్రమ్మ. వాళ్ళిద్దర్నీ ఇట్లా వదిలిస్తే కట్టు తప్పిపోతారని ఆవిడ అభిప్రాయం వెలిబుచ్చింది. వాళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యడం మీకు ఇష్టంలేదల్లే ఉన్నది అంటూ తన ఆవేదన వెళ్ళబోసుకుంది. కుర్చీలో కూర్చొని భార్య చెప్పేవన్నీ వింటున్నాడాయన. దగ్గుతెరవచ్చింది గుండెల్లోనొప్పివచ్చింది. గుండెలు పిండినట్టయింది. కూతుళ్ళ పెళ్ళిళ్ళు చెయ్యకుండానే ఆయన శాశ్వతంగా కళ్ళుమూశాడు. ఆయన ప్రాణం ఆ కుర్చీలోనే పోయింది.

ఏడుస్తూ చుట్టు పక్కలవాళ్ళందర్నీ పిలిచింది సుభద్రమ్మ. అందరూ వచ్చారు. శవాన్ని క్రిందపెట్టారు. పిల్లలందరికీ కబుర్లు వెళ్ళినయ్యి. అంతా వచ్చారు. ఆ శవాన్ని కన్నీళ్ళతో కడిగారు. తమగోడు వినని ఆ శవానికి తమ ఆవేదన నంతా చెప్పుకున్నారు. సుభద్రమ్మ పసుపుకుంకుమ ఎగిర్చి

పోయింది. ఆమె హృదయం ముక్కలైంది. నళిని గుండెల్లో బండరాయి పడ్డది. విల విల్లాడిపోయింది రాజేశ్వరి పిల్లలంతా "నాన్నా మమ్మల్ని వదలి చచ్చిపోయావా" అంటూ నెత్తీనోరూ బాదుకుని ఏడుస్తున్నారు.

గోగులేశ్వరానికి పెలిగ్రాంకన్నా మనిషే ముందు వెళతాడు. పక్కింటాయన కొడుకు గోగులేశ్వరం వెళ్ళాడు.

ఏడ్చి ఏడ్చి సుభద్రమ్మ సొమ్మసిల్లి పడిపోయింది. ఆ సమయంలో చెప్పవలసిన అనునయ వాక్యాలు అందరూ చెప్పారు. ఎవరు ఏం చెప్పినా వినే స్థితిలోలేదు సుభద్రమ్మ. ఆమె పూర్తిగా శోక సముద్రంలో మునిగి పోయింది. చిన్నవాళ్ళు తల్లి దగ్గర చేరి అమ్మతో పాటు వాళ్ళూ ఏడుస్తున్నారు.

తన దుఃఖాన్ని లోపల్లోపలే మింగింది నళిని. రాత్రి పదిగంటల వరకూ అంతా అట్లాగే ఏడుస్తూ కూర్చున్నారు. ఎవరూ మంచినీళ్ళయినా ముట్టుకోలేదు. ఆఖరి పిల్లలిద్దరికీ పక్కింటావిడ అన్నంపెట్టింది. వాళ్ళకి మాత్రం ఏం సహిస్తుంది.

రాత్రి పదిగంటల దాటాక గోగులేశ్వరం నుంచి అంతావచ్చారు. ఏడుపుల ధ్వనితో ఆ ఇల్లంతా నిండిపోయింది. "ఈ పెద్దతనంలో నాకు ఈ కడుపుకోత కూడానా" అంటూ రామయ్యగారు వాపోయాడు.

తెల్లవారింది. ఏది ఆగినా శవదహనం ఆగదు. ప్రతి జంతువుచర్మం ఎందుకయినా ఉపయోగపడుతుంది. మానవుడి శరీరం ఆ కాస్త ప్రాణం పోయాక ఎందుకూ ఉపయోగపడదు. ఉన్నకొద్దీ వాసనవేస్తుంది. ఇంకా శవాన్ని తీసుకువెళ్లలేదేమా అని పక్కవాళ్ళు అనుకుంటూ ఉంటారు

చనిపోయింతరువాత ఆజీవుడు ఏమౌతాడు ? అసలు ప్రాణం ఎట్లా పోతుంది? ఏలోకానికిపోతుంది ? ఏ లోకాలు ఉన్నవి ? ఆ చనిపోయిన జీవికి తమ దారాపుత్రాదులమీద ప్రేమానురాగాలు ఉంటయ్యా? ఈప్రశ్నలు సర్వజ్ఞులే, తేల్చలేని సమస్యలైతే సామాన్యులకు ఏం తెలుస్తుంది ?

దహన క్రియలకు ఏర్పాట్లన్నీ రాఘవరావుచేశాడు. రామయ్యగారు చితికి నిప్పంటించాడు. ఆయన కన్నీరు ఆ జ్వాలకు తోడైంది.

దహనక్రియలు పూర్తయింతరువాత అంతా ఇంటికి చేరేసరికి

రెండు గంటలయింది. తిన్నవాళ్ళు తిన్నారు సుభద్రమ్మ ఏమీ ముట్టుకో లేదు.

తన పెళ్ళి, తను కాపురానికి రావటమూ, ఆ రోజుల్లోని ప్రేమానురాగాలూ, నళిని పుట్టినప్పట్నుంచీ తమ సంసారజీవితమూ, ఆర్థిక ఇబ్బందులూ, అన్నీ తల్చుకుని కుమిలిపోతున్నది సుభద్రమ్మ.

కర్మకాండలన్నీ యధావిధిగా జరిపించారు. పదమూడోరోజున బంధువులంతా వెళ్ళిపోయారు. బాధ్యత యెవరు తీసుకున్నా తీసుకోక పోయినా హితోక్తులు చెప్పేవారు ఆ సమయంలో తమ పెద్దరికాన్ని చాటుకుంటారు. రామయ్యగారు, కొడుకు రాఘవరావుతో సంప్రదించిన తరువాత తన నిర్ణయాన్ని నళినికీ, రాజేశ్వరికీ చెప్పారు.

"మీనాన్న పెద్ద సంపాదనాపరుడు కాకపోయినా, ఉన్న పొలంకాస్త అమ్మివేసినా, ఇంకా అప్పుచేసినా, తన సంసార బాధలేవో తనే పడ్డాడు కాని, మామీద ఎన్నడూ ఆధారపడి ఉండలేదు. తీగెకు కాయ బరువు కాదన్నట్లుగా ఆ తీగెనే ఆశ్రయించుకుని ఉన్న తన బిడ్డలకు ఆయన ఏలోటూ చెయ్యలేదు. అందువల్ల ఇంతవరకూ మీ ఆడపిల్లల పెళ్ళి విషయంగాని, పిల్లల చదువుల విషయంగాని, మేమెప్పుడూ మీ నాన్నతో సంప్రదించే అవసరం కలుగలేదు ఆయనా హెచ్చరించలేదు. సంపాదనకు ఆయన చిన్నతీగె అయినా, తన భార్యాపిల్లలకు ఆయన, చల్లని నీడనిచ్చే వటవృక్షంలాంటి వాడు. ఆ నీడక్రింద మీకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, చనువూ, ఆప్యాయతా అన్నీ ఉన్నాయి. ఈ నాడు ఆ వటవృక్షం కూలిపోయింది. మీకు చల్లనినీడలేదు. చనువు, ఆప్యాయతాలేదు. పుట్టెడు దిగులూ, విచారమూ ఆర్థిక యిబ్బందులూ మీ అందరి నెత్తినా ఉంచి వెళ్ళాడు. మీ పాలిట రవి అస్తమించాడు. మనస్సులో హృదయంలో నింపుకున్న దిగులుతో మీరు చీకట్లో తిరగవలసిందే" అన్నాడు రామయ్యగారు. డెభ్భైఏళ్ళ వృద్ధుడూ నూరేళ్ళ శతవృద్ధుడుగా మారిపోయాడాయన. నళిన్నీ, రాజేశ్వరినీ చెరో పక్కనా హార్చొపెట్టుకుని, విచారంతో నిండిన వాత్సల్యంతో ఆయన చెపుతుంటే, అందరి హృదయాలూ చెరువులే అయ్యాయి. చిన్న పిల్లలు నలుగురూ దిగాలుపడి, దిగులుపడిన తల్లి

పక్కన కూర్చున్నారు. ఒక్క సుభద్రమ్మ జీవితమేకాదు, ఆ కుటుంబం లోని అందరిజీవితమూ, అవతారం మారినట్లే అయింది.

రాఘవరావు కళ్ళు తుడ్చుకుని చెల్లెలు సుభద్రమ్మతో అన్నాడు.

"సుభద్రా, పచ్చగాఉండే సంసారాల భవితవ్యం ఆ ఇంటి ఇల్లాలి పసుపుకుంకుమ రీత్యానే తెలుస్తుంది. నాజీవితంలో సురేఖ రీత్యా ఈకడుపు కోతను అనుభవిస్తూనే ఉన్నాను. మొగ్గలోనే దాని జీవితం మాడిపోయింది. నడివయస్సులోనే నీ జీవితం ఇప్పుడు నాశనమైపోయింది. వెన్నెలపోయి చీకటి వచ్చింది. జరగవలసింది ఆలోచిద్దాం. నాకుతోచింది మీకు నచ్చక పోవచ్చు. కాని నా బాధ్యత నేను నెరవేర్చుకోవాలికదా" అన్నాడు.

నళిని నిర్ణయమేదో ఒక నిర్ధారణకు వచ్చింది. తన నిర్ణయాన్ని వెల్లడించేముందు మేనమామ అభిప్రాయం తెల్సుకోవాలికదా :

"అక్కడ గోగులేశ్వరంలో విద్యాసౌకర్యాలు లేవు. అంతా అక్కడకు చేరితే చదువులకు స్వస్తిచెప్పాల్సిందే. కాని ఇంకోమార్గం లేదు. పోనీ కొంతమంది అక్కడా, కొంతమంది ఇక్కడా ఉన్నా అదీ సబబుగా లేదు. మీ పెద్దపిల్లల ఇద్దరి పెళ్ళిళ్ళ విషయంలో ఏ నిర్ణయానికి రావటానికి ఇప్పుడు నిర్ణయించే తరుణం రాలేదు. అందుచేత కొంతకాలము అందరూ ఇక్కడే ఉంటేనే బావుంటుందేమో. కొంతకాలం నళిని ఉద్యోగంచేస్తుంది. ఈ పి. యు. సి. పూర్తిచేసి రాజేశ్వరి చదువు మానేస్తోంది. అంతవరకూ మీకుటుంబానికి కావలసిన సహాయం నేనేచేస్తాను. ఒక్కమాట. మీరిద్దరూ రెక్కలొచ్చిన పక్షులు, మీరు ఎగిరిపోయినా యీ చిన్నవాళ్ళని కూడా మీ అంతవాళ్ళనిచేసే బాధ్యత మీ మీదనే ఉంటుందనే యదార్థ విషయాన్ని ఏ పరిస్థితులోనూ విస్మరించవద్దు" అన్నాడు రాఘవరావు నళినివైపూ, రాజేశ్వరివైపూచూసి.

నళిని మనసు కొంతతేలిక పడ్డది. రాజేశ్వరి మనస్సులో కొత్త చీకట్లు ముసిరాయి. తన చదువు ఇంక సాగదు, పి. యు.సి.తో సరిపెట్టు కోవాలి.

సుభద్రమ్మ ఏటూ చెప్పలేక పోయింది. ఇప్పుడామె పరిస్థితి అందరి అభిప్రాయలకూ తలవంచవలసిందిగానే ఉన్నది.

"ఈ కర్తవ్యనిర్వహణలో నా శాయశక్తులా కృషిచేస్తాను మావయ్యా. ఇదివరకంతా నేను తండ్రిచాటుపిల్లను. ఇప్పుడీ అక్కయ్య చాటున ఒక తల్లీ, ముగ్గురు తోబుట్టువులూ, ఇద్దరుతమ్ముళ్ళు ఉన్నారు. నన్ను పరీక్షించటానికే మా కుటుంబపరిస్థితి ఇట్లా తలక్రిందులైంది. నా జీవితం తలక్రిందులుగాక పోయినంతవరకూ, ఈ ఇంటి పెద్దకొడుకుగా నా అవతారాన్ని మార్చుకుంటాను. నా జీవితమే తలక్రిందులైతే ? అప్పుడు గాలి వానవస్తే కధేఉండదుకదా" అన్నది నళిని. ఆమె గొంతు విచారంతో పూడిపోయినా, ఆమెభావాలు ఆమె నిశ్చయాన్ని స్పష్టం చేశాయి.

చచ్చిననాటి దుఃఖం మర్నాడు ఉండదు. మర్నాటి దుఃఖం మూడో నాటికి కాస్త తగ్గుతుంది. ఈ దుఃఖం తగ్గినకొద్దీ బ్రతికున్నవాళ్ళ బాధ్యతలు పెరుగుతయ్యి. బాధ్యత మనిషిని కృంగదీస్తుంది. పట్టుదలనిస్తుంది. భర్తను పోగొట్టుకున్న భార్య విచారం భరించరానిది. తండ్రిని పోగొట్టుకున్న పిల్లల విచారం బాధ్యతలను సంకెళ్ళగా మారుస్తుంది. ఆ బాధ్యతల సంకెళ్ళను ఆ పిల్లలు చేతులకు తగిలించుకుని - తమ జీవిత సమస్యలను పరిష్కరించుకోవాలి.

అలాంటి బాధ్యతల సంకెళ్ళను నళిని చేతులకు వేసుకుంది. నేనూ ఈ సంకెళ్ళను వేసుకోక తప్పదనుకుంది రాజేశ్వరి.

# 8

వారంరోజులు గడిచాక శ్రీనివాసరావు గట్టిప్రయత్నంమీద ఒక బ్యాంకులో ఉద్యోగం సంపాదించాడు. ఆ మర్నాడే ఆ వార్తను లీలావతికి చెప్పాలని బయల్దేరుతూ, తెలుగు దినపత్రిక కొన్నాడు. ఆ పత్రికలోనే రఘునాధరావు మరణవార్తను చదివాడు. అతని సంతోషమంతా కరిగి పోయింది. కాఫీహోటల్‌కు వెళ్ళి,ఒక మూల కూర్చుని కాఫీ తాగి,మనస్సు

బావుండక, ఏ నిశ్చయానికి రాలేక, సాయంత్రం ఆరున్నర తరువాత సుబ్బారావుగారింటికి వెళ్ళాడు. లీలావతి ఒక్కర్తే కూర్చుని తల్లితో మాట్లాడుతున్నది.

"గుడ్‌నైట్ లీలావతీ, నాన్నగారు లేరా", అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

"ఏం బాబూ కులాసానా" అన్నది లీలావతి తల్లి.

"ఆ కులాసానేనండీ, బాబుగారు లేరా" అన్నాడు.

"ఉన్నారు. వాళ్ళ కంపెనీడైరెక్టరుగారబ్బాయి పెళ్ళి. ఆ పెళ్ళికి వెళ్ళారు. వచ్చేసరికి పదిగంటలు దాటుతుందేమో" అందావిడ.

"అంతవరకూ కూర్చున్నా మా నాన్నగారు ససేమిరా మీకు ఉద్యోగం యిప్పించరు" అన్నది లీలావతి.

"పోనీలెండి ఉద్యోగం లేకపోతే ప్రాణం పోదుకదా".

"ఏం లేకపోతే ప్రాణం పోతుందో?"

"ప్రాణప్రదమైనవారి ఆదరాభిమానాలు లేకపోతే, ప్రాణం పోయి నట్లుగానే ఉంటుంది".

లీలావతి ముఖంలోని భావాలను వెతుక్కున్నాడు. ఆశించిన భావాలు ఏమాత్రం కనబడలేదు. ఇక అతను మాట్లాడలేదు. చూస్తూకూర్చున్నది లీలావతి.

"అందరి భావాలూ అట్లాగే ఉంటయ్యనుకోవడంలో అర్థంలేదేమో" అన్నది. అతని భావాల్లో మార్పువచ్చింది. అభిప్రాయాల్లో వెలితికనబడ్డది.

"ఇంక వెళతాను" వెళ్ళిపోయాడు. అతను చెప్పదల్చుకున్న విషయాలు చెప్పనేలేదు. తనకు ఉద్యోగం దొరికిందన్న విషయంకూడా చెప్పనేలేదు. లీలావతి పెంకెఘటం, అంతేకాదు అహంభావమూ జాస్తే నేమో అనుకున్నాడు.

ఉద్యోగంలో చేరిన రెండు రోజులకు హోటల్లో గదిఖాళీచేసి, నాంపల్లి స్టేషన్‌రోడ్డులో - ఒక ఇంట్లో ఒక గది అద్దెకు తీసుకున్నాడు. అద్దె నలభై రూపాయలు. బ్యాంకుకు దగ్గరగా ఉండటంచేత అక్కడ చేరాడు.

ఇప్పటికి శ్రీనివాసరావు మనస్సు గోగులేశ్వరంవైపుకు మళ్ళింది. అమ్మ, నాన్న, సురేఖ, ముకుందమాధవరావు, తాతయ్య అంతా గుర్తొచ్చారు. తను డబ్బుతీసుకుని చెప్పకుండా వెళ్ళిపోయినందుకు అంతా బాధ పడే ఉంటారు. అమ్మ మరీ విచారపడుతూ ఉంటుంది నాన్న ఆస్తి పంచి ఇవ్వలేదు. ఆ కోపమే తనని ఈ హైద్రాబాదు చేర్చింది. ఆస్తి పంచి ఇచ్చివుంటె - తన జీవితం ఏ మార్గాన పడేదో ? విధికృతం అంటుంది అమ్మ. ఖర్మ అంటాడు తాతయ్య. నా కడుపున చెడబుట్టాడు, అప్రాచ్యుడు అంటాడు నాన్న. అర్థంలేని మొండిపట్టు అంటుంది సురేఖ. తనమీద యింతమందికీ యిన్ని రకాల అభిప్రాయాలు, ఇన్నిరకాలభావాలు. ఈ పరిస్థితుల్లో రఘునాథరావు మావయ్య చచ్చిపోయాడు. సుభద్రమ్మ అత్తయ్యా, నళిని, రాజేశ్వరి, తతిమ్మా పిల్లలూ ఏమయ్యారో, ఎక్కడ ఉన్నారో. ఇప్పుడు నా సమస్యకన్నా వాళ్ళ సమస్యే నాన్నను, తాతయ్యనూ, ఎక్కువగా బాధిస్తూ ఉంటుంది. ఈ పెద్దతనంలో తాతయ్య కర్మకొద్దీ రఘునాథరావు మావయ్య పోయాడా, నాన్నకు బాధ్యతను పెంచడానికి పోయాడా, అత్తయ్యకు పసుపు కుంకుమలేకపోయాడా, పిల్లలు దురదృష్టవంతులు కావడంచేత పోయాడా, తనకు ఆయుర్దాయం తీరిపోయి - పోయాడా ? ఏది ఏ రకంగా అన్వయించుకోవాలి. ఇన్ని చిక్కుసమస్యల్లోనూ అమ్మ మాత్రం నన్ను మర్చిపోదు, సురేఖ జీవితం అట్లా తెల్లవారిపోవలసిందేనా ?

ఈ ఆలోచనలతో ఒక రోజంతా గడిపాడు. బ్యాంకుకువెళ్ళి ఉద్యోగం చేసుకుంటున్నాడు. ప్రస్తుతం ఆర్నెల్లు ట్రైనింగు.

పది రోజులు గడిచాయి. లీలావతిని మర్చిపోకపోయినా, ఇదివరకటిలా తల్చుకోవటంలేదు. ఆ రోజు ఆదివారం. హుస్సేన్‌సాగర్ టాంక్ బండమీద నడచి పోతున్నాడు శ్రీనివాసరావు.

"ప్లీజ్" పక్కకు తిరిగి చూశాడు. లీలావతి ఒక్కర్తె సిమెంటు బెంచీమీద కూర్చున్నది.

"హల్లో, మీరా",

"నా పేరు మీరాభాయికాదు, లీలావతి,రండి కూర్చోండి", పక్కకు జరిగింది. అతనూ కూర్చున్నాడు.

"ఒక్కరూ కూర్చుని చల్లగాలి మేస్తున్నారా?" అన్నాడు నవ్వు ముఖంతో చూస్తూ.

"నో ప్లీజ్, గాలిమేత మీరూ మెయ్యవచ్చు. ఏమిటివిశేషాలు, మళ్ళీ నాన్నగారికోసం రావడంమానేశారు, నాలుగు రోజులు చూశాం. మీరు రానేలేదు".

"ఉద్యోగపు ఆశ ఆ రోజునే పోయింది. ఇంక మిగిలింది మీరు. మీకోసంవస్తే అందరి భావాలూ అట్లాగే ఉంటాయనుకోవటంలో అర్థం లేదుకదా" ముభావంగా అన్నాడు. మనస్సులోనే నవ్వుకుంది లీలావతి.

"మీరు నాటకాలు వేసేవారా?"

"అలాంటి మంచి అలవాట్లులేవు".

"పాత డైలాగ్స్ కొత్తగా వల్లిస్తుంటేను".

"జీవితాలే నాటకాలయినప్పుడు, మనం మాట్లాడే మాటలన్నీ ఆ నాటకంలోని సంభాషణలే సరే దానికేంగాని, ఒక్కరే కూర్చున్నారేం"

"ఈ టాంక్ బండమీద ఎంతమంది ఉన్నారో చూడండి. ఉద్యోగం దొరికిందా?" ఆత్రంగా అడిగింది.

"ఉద్యోగాలు మంచినీళ్ళ చలివేంద్రాలైతే ఆ నీళ్ళ బానలన్నీ మీబోటివాళ్ళు ఎప్పుడో పగలకొట్టి పారేసేవాళ్ళు". ఎగతాళిగా అన్నాడు. లీలావతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆ రోజున తనుచేసిన ఎగతాళి అపార్థం చేసుకున్నాడని నిశ్చయించుకొన్నది. ఉద్యోగం దొరికిందో లేదోననే ఆదుర్దా ఎక్కువైనా - ఆ ప్రస్తావన తెచ్చే అర్హత పోగొట్టుకున్నానని గ్రహించుకున్నది లీలావతి.

"అయినా ఉద్యోగాలన్నీ ఆడవాళ్ళే చేసేస్తుంటే ఇంక మగవాళ్ళకు ఉద్యోగాలేం దొరుకుతయ్యి, ఇప్పుడు ఉద్యోగం స్త్రీ లక్షణం, పురుష లక్షణంకాదు" అన్నాడు.

"కాదు, ఉద్యోగం మానవ లక్షణం, ఒప్పుకుంటారా",

ఆమె మనస్సులో ఏవో భావాలు దోబూచులాడుతున్నాయి. కాని అతని మనస్సు ఎక్కడా ఉండటంలేదు.

"ఒక చిన్న ప్రశ్న". అన్నది లీలావతి.

"జవాబూ చిన్నదిగానే చెప్తాను". ఒక్కసారి చూసి చూపు మరల్చింది. పిలిస్తే పలికే హృదయమే ననుకున్నాడతను.

"జీతాన్ని జీవితానికి వినియోగించాలి. కాని జీతం కోసం జీవితాన్ని బలిచెయ్యకూడదు. అవునా?" పై పళ్ళతో క్రింది పెదవిని నొక్కిపెట్టి పక్కకు చూస్తూ కూర్చున్నది.

"యు ఆర్ పర్ఫెక్ట్లీ కరెక్టు". అన్నాడు.

"అయితే రేపట్నుంచే నెలా పదిహేనురోజులు శలవు పెట్టాను. నిన్ననే రిలీవ్ కూడా అయినాను".

ఆశ్చర్యపోయాడు శ్రీనివాసరావు. కన్నార్పకుండా ఆమె వైపు చూచాడు.

"అవును, నామీద ఎలిగేషన్స్ వచ్చినయ్యి, నేను లంచం పుచ్చుకుంటున్నానుట, బావుందా?" నవ్వింది.

అయిదు నిమిషాలవరకూ తేరుకోలేదు శ్రీనివాసరావు.

"ఆ కథ మరోసారిచెప్తాను. రేపట్నుంచీ ఎంతో తీరిక. మా ఇంటికి రండి. సరేపోతాను, బస్సు వస్తోంది" బస్సెక్కి వెళ్ళిపోయింది లీలావతి.

అట్లాగే మరో అరగంట కూర్చున్నాడు శ్రీనివాసరావు.

ఆ మర్నాడు ఉదయమే శ్రీనివాసరావు గది పక్కన ఉన్నవాటాలో అద్దెకున్న ఆయన శ్రీనివాసరావుని పలకరించాడు.

కుశలప్రశ్నలూ, ఎవరు ఏఏ ఉద్యోగం చేస్తూన్నదీ, ప్రస్తుత రాజకీయాలూ అన్నీ చర్చించుకున్నారు. ఆయన పి. డబ్లియు. డి. ఆఫీసులో మేనేజరు. ఆమాటా ఈమాటా చెప్పుకున్న తరువాత శ్రీనివాసరావు అన్నాడు.

"మీ ఉద్యోగాని కేమిటండీ; రాజాలాంటి ఉద్యోగం? జీతానికి మించిన రాబడి ఉంటుంది".

ఆయన ముప్పైరెండు పళ్ళూబైటపెట్టి నవ్వేడు, "అలా అనకండి

మరి. ఈ రాబళ్ళంటే మహా చెడ్డ చిరాకు. నమ్మండి మీరు నమ్మ్తారో నమ్మరోగాని, ఆడాళ్ళే ఈ రోజుల్లో లంచాలు పుచ్చుకుంటున్నారు. ఇంక మగాళ్ళ కెవరిస్తారండీ మీపిచ్చిగాని. మా ఆఫీసులో ఓ అమ్మాయి లంచాలు మరిగింది. తప్పదియ్యా పిటీషన్లు వెళ్లాయి పై వాళ్ళకి. వాళ్లు బదిలీచేసే లోపలే ఆ ఆడకూతురు సెలవుపెట్టేసింది. అయ్యా, ఇంక మగాళ్లకి లంచాలు ఇచ్చేవాడెవడండీ మీ పిచ్చిగాని" అన్నాడాయన.

శ్రీనివాసరావుకు పచ్చి వెలక్కాయ గొంతులోపడింది. ఇంక మాట్లాడలేదు. ఆయన ఆఫీసుకైము కావస్తోందని వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రే శ్రీనివాసరావు హోటల్లో భోజనంచేసి వచ్చి పలకరించాడు.

"భోజనం చేశారా మేనేజరుగారూ ?"

"ఆహా, అయిందండీ, రండి" ఇద్దరూ కూర్చున్నారు.

"ఈ రోజుల్లో లంచం లేకపోతే కంచం లేపదంటారు. కంచం లేనివాడికి మంచం ఎలా వస్తుంది చెప్పండి ? అంచేత లంచాలు పుచ్చుకోంది ఎవరు ? అంతా పుచ్చుకునేవారే. ఏమంటారు ?" అన్నాడు శ్రీనివాసరావు.

మేనేజరుగారు నవ్వేడు. ఆయన మనస్సు వురకలువేసి అరకలుదున్నింది. ఆయనకు లంచం హాబీ. ఆ హాబీని అలవాటుగా చేసుకున్నాడాయన.

"మాటొచ్చిందిగనక చెప్తున్నాను, మా ఆఫీసులో అమ్మాయి మహ గడుగ్గాయి. ఆడపిల్ల. చాలామంచిది ముచ్చటగా ఆసుఫీకు వస్తుంది. అంత వరకూ ఏ బాధాలేదుమరి. ఈ మాముళ్ల విషయంలో చూశారూ, ఒంటి పిల్లి. రాకాసిలాంటిభావాలు. అయ్యా, హానెస్ట్ అంటే నేనూ పడిచస్తానంటే నమ్మండి" అన్నాడాయన. నశ్యం ఒక పట్టుపట్టాడు సిగరెట్టు వెలిగించాడు శ్రీనివాసరావు.

"మీలాంటి హానెస్ట్ మేనేజరు దగ్గర, అమ్మాయి పబ్లిగ్గా లంచాలు పట్టేస్తుందంటారా, ఎంత ఘోరం. అలాంటి వాళ్లని కాల్చిపారెయ్యాలి ఏమంటారు?" అన్నాడు శ్రీనివాసరావు.

మేనేజరుగారికి మతిపోయింది. ఈ ప్లేటు ఫిరాయింపేమిటను కున్నాడు.

"లంచమనె ఈ పై సంపాదనఉంది చూశారూ, అసలది మగవాళ్ల హక్కండీ. ఆడవాళ్ళ హక్కు కాదుమరి. ఈ ఆడపిల్ల కంట్రాక్టర్ల దగ్గర బిల్లులు ప్యాసుచేసినందుకు పబ్లిగ్గా అడిగి పుచ్చుకుంటోంది. ఎన్నాళ్ళని వాళ్ళు మాత్రం ఊరుకుంటారు. ఆడకూతురు, ఎలా కాదంటారు. పైవాళ్ళకి రిపోర్టిచ్చేశారు. ఇంకేముంది; ఖడేరావ్ అయింది. ఆపళంగా శలవుపెట్టే సింది. ఎంత ఘోరమో చూడండి" అన్నాడాయన.

శ్రీనివాసరావుకు కొంత అర్థమైంది, ఆ ఒక్క అనుమానమూ తీరిపోతే బావుండును.

"ఎవరండీ అమ్మాయి !"

"అమ్మాయి హిరణ్యకశిపుని భార్య". పక పక నవ్వేశాడాయన.

"ఎంత జోక్‌గా చెప్పేరండీ, అమ్మాయిపేరు లీలావతి అని అర్థం చేసుకోమంటారు?" మనస్సు దహించుకుపోయింది. ఓ పట్టు పట్టాలను కున్నాడు శ్రీనివాసరావు.

ఆయనవద్ద శలవు తీసుకుని వచ్చేశాడు. మర్నాడు సాయంత్రం బ్యాంకునుంచి లీలావతి ఇంటికివెళ్ళాడు. సుబ్బారావుగారు లేరు.

"గుడీవివింగు".

"రండి. కూర్చోండి, ఏమిటి కబుర్లు".

"కబుర్లూ కాకరకాయలూ, నన్ను క్షమిస్తే ఓ సంగతి".

"తప్పయితే దండన తప్పదు. మంచి సంగతయితే క్షమించే ప్రసక్తే ఉండదు" అన్నది పేపరు బల్లమీద పడేస్తూ.

"నాకు బ్యాంకులో ఉద్యోగం దొరికింది, వారంరోజులయింది. త్రిల్లింగ్‌గా వుంటుందని కాస్తలేట్‌గా చెప్పాను, పోతే మీ శలవుకథ".

"హార్టీ కంగ్రాచ్యులేషన్స్ పార్టీ ఎప్పుడు".

"తమరు ఎప్పుడు శలవిస్తే అప్పుడు".

"నో నో నో, శలవు ప్రసక్తేలేదు. రేపు సాయంత్రం పార్టీ

యివ్వాలి. మా ఇంట్లో నేనే ఎరేంజ్ చేస్తాను డిన్నర్‌పార్టీ. మమ్మీ కమాన్ ఈరావుగారికి ఉద్యోగం దొరికేసిందట, రేపు మనం డిన్నరివ్వాలి."

లీలావతి తల్లి వచ్చింది. ఆవిడా మరో కుర్చీలో కూర్చుంది. ఆవిడ మనస్సులో ముసిరిన చీకట్లనుంచి ఏదో కాంతి కిరణం సన్నగా కనబడింది

"మీ తండ్రీ కూతుర్లూ అబ్బాయికి ఉద్యోగం ఇప్పించకపోయినా అదృష్టదేవత అతన్ని వెన్నుచరచింది, రేపు సాయంత్రం తప్పక రా బాబూ మా ఆతిధ్యం స్వీకరిద్దువుగాని" అని వెళ్ళిందావిడ.

"మీ కుటుంబానికి నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. ఆ ! మీ శెలవుకథ చెప్పరూ" నవ్వేముఖంతో చూశాడు మనస్సులో మేనేజరు మెదిలాడు. లీలావతి రెండు నిమిషాలు మౌనం వహించింది.

"లంచాలూ, మామూళ్ళు మనదేశంలో మామూలే. నా కథలో సారాంశం అదికాదు. ఈ దేశంలోనుంచి అది ఎన్నడూ తుడిచి పెట్టుకుపోలేదు. నేను వంటరిదాన్ని. అంటే సంసార తాపత్రయం లేనిదాన్ని. నాకు డబ్బు సంపాదించాలనీ, దాచుకోవాలనీ, అది కాబోయే భర్తకు కానుకగా ఇవ్వాలని ఇలాంటి కోరికలు లేవు. నాపెళ్ళి విషయమే నేను ఆలోచించను. నా జీతం నాన్నగారికి ఇవ్వక్కర్లేదు. నా ఖర్చులకు సరిపోతుంది. కోరిన చీర, కోరిన వస్తువు కొనుక్కుంటున్నాను. జీవితాన్ని సంతోషంగా గడుపుతున్నాను. ఆఫీసులో బిల్లులు ప్యాసుచేసి కంట్రాక్టర్ల వద్ద డబ్బు తీసుకోవాలనే కోరిక నాకు కల్లోనైనా లేదు. దీన్నిబట్టి మా మేనేజరుగారి ఉద్దేశ్యం ఏమిటో తెల్సుకుంటే మీకు డాక్టర్ ఆఫ్ నాన్ కరప్షన్ డిగ్రీ ఇస్తాను." చెక చెకా చెప్పేసింది. అంతా ఆకళింపుచేసుకున్నాడు శ్రీనివాసరావు.

"పురుష పుంగవులు ఈ మాత్రం చెప్పలేరూ" ఎగతాళిగా అన్నది. అతను ఆలోచిస్తున్నాడు.

"నాకు డాక్టరేట్ పుచ్చుకోవాలని లేదు" అన్నాడు నెమ్మదిగా. లీలావతి మనస్సు పకపక నవ్వింది.

"ఇంతేనా మీ తెలివితేటలు ?" ఎంతమాట అన్నాను అనుకుంది.

"కొంతకాలం వరకూ ఇంతే" అన్నాడు. గతుక్కుమందామె మనస్సు. మేధావంతుడే కాని సమయస్ఫూర్తి ఆలోచన లేదనుకుంది

"డియర్ సర్. నాకు డబ్బు అక్కర్లేదు కనుక సదరు కంట్రాక్టర్ల వద్ద నాకు రావలసిన పర్సెంటేజ్ తీసుకుని, అది తృణప్రాయంగా చూసి, మా మేనేజరుగారికి ఇవ్వాలిట. అదీ ఆయన హుకుం" కోపంతో అన్నది.

"చాలా బావుంది. అట్లా చెయ్యనంటే ఏం చేస్తాన్నాడు ?" ఉత్సాహంతో అడిగాడు. అతని మనస్సులో ఆయన అనేక తరహాలుగా కనపడుతున్నాడు.

"ఇలాంటివాళ్ళు ఏమైనా చేస్తారు. సా ర ం గ ధ ర లో చిత్రాంగి వేషం వేస్తారు" నవ్వుతూ అన్నది లీలావతి.

అతనికి అర్థంకాలేదు.

"చిత్రాంగి. అవును చిత్రాంగి" అర్థమైందతనికి.

"అయితే ఈ సారంగధరుడు శలవు పెట్టేశాడు కదూ. వెరీగుడ్. మీరే కంట్రాక్టర్లను డబ్బు అడుగుతున్నట్లుగా మీ పై అధికార్లకు ఫిర్యాదు చేశాడు. ఇక మీరు శలవు పెట్టక తప్పలేదు" అన్నాడు.

పూర్తిగా అర్థమైంది శ్రీనివాసరావుకు. కాస్త బుర్ర ఉన్నది అతనికి అనుకున్నది లీలావతి.

"మీ మేనేజరుగారి నామధేయం".

"ఎవరో సుబ్బారాయుడు. ఏ పేరైతేనేం. ఆయన పేరు జగన్నాథరావు" మాటల్లో కోపం ధ్వనించింది. ఇంక ఈ ప్రస్తావన చాలిద్దామనుకున్నాడతను.

"ఈ శలవు రోజుల్లో ఏం చేస్తారు. ఏదైనా ఊరు వెళతారా"వెళ్ళకుండా ఉంటేనే బావుండుననిపించిందతనికి.

"ఎక్కడికీ వెళ్ళను. హాయిగా విశ్రాంతి తీసుకుంటాను. మీకు తెలీదేమో".

"అవును విశ్రాంతి తీసుకుంటారని నాకు తెలియదు".

పక పక నవ్వింది లీలావతి. కారణం తెలియకపోయినా అతనూ ఆ నవ్వులో శృతి కలిపాడు

"నేను చిన్నసైజు రచయిత్రిని. ఈ శలవుకాలంలో ఏవో కొసిని కథలు రాస్తాను. అదొక హాబీ".

"మీ హాబీకి నా జోహార్లు. నామీద ఒక కథ రాసిపారెయ్యండి" ఎగతాళిగా అన్నాడు.

"రచయితలంటే మీకింత చిన్నచూపని నాకు తెలీదు. ఇంతవరకూ ఏ కథా రాసిపారేసే గ్రహచారం పట్టలేదు. ప్రతి కథా ఏదో ఒక పత్రికలో అచ్చవుతూనే ఉంది".

ఆమె మనస్సుకు కష్టం కలిగించాననుకున్నాడు శ్రీనివాసరావు.

"క్షమించండి. రచయితలమీద నాకు చిన్నచూపులేదు. ఆ రచనా వ్యాసంగంలో నాకూ అభిరుచిలేదు. అంచేత నాకు ఏ రచయితా, రచయిత్రి తెలియదు. ఏ పత్రికా సామాన్యంగా చదవను. ఇకనుంచి చదవాలి" నెమ్మదిగా, సౌమ్యంగా అన్నాడు. ఈ వ్యక్తిలో వ్యక్తిత్వం కుదురుగా ఉండదేమోననుకున్నది లీలావతి.

"అలవాటులేని ఔపాసన పట్టకండి. మూతిమీసాలు కాలుతాయి. కథలూ, నవలలూ చదవకండి పుణ్యం పురుషార్థంకాదుకదా".

ఈ మాటతో పూర్తిగా కుంచించుకుపోయాడు శ్రీనివాసరావు. తెలియని విషయంలో జోక్యం కలుగజేసికొని తేలికపడిపోయానని కించపడ్డాడు. అతని ముఖంలో ఈ భావాలే వ్యక్తం కావడంతో, లీలావతికూడా ఇంతమాట అన్నానే అని బాధపడింది.

"పుణ్యం పురుషార్థం సంగతి నాకు తెలీదండీ, వాటియందు నమ్మకమూ లేదు. ఇకనుంచీ తప్పకుండా మీ రచనలు చదువుతాను. మీ రచనలు ఏవయినా ఉంటే ఇవ్వండి" అన్నాడు అర్థించినట్లుగా.

"నా రచనలు నా కలంపేరుతో ఉంటాయి. నా కలంపేరు మీకు తెలీదు. ఇంక ఎట్లా తెల్సుకుంటారు".

"అట్లాగా" కాసేపు ఆలోచించాడు. మళ్ళీ అన్నాడు.

"మీ కలంపేరు నాకు చెప్పనక్కరలేదు. మీ మనస్తత్వం కొంత అర్థమైందనే నా భావన. పాతరచనలు కొన్ని చదివి, అంటే వారపత్రికల్లో మీ కథలు కొన్ని చదివి ఆ రచనలు మీవేనని చెప్పగల స్థాయికి రాగలననే నా నమ్మకం" అన్నాడు ఒక నిశ్చయానికి వచ్చినవాడిలా.

"బ్రేవో, బెస్ట్ యువర్ లక్" సంతోషంగా అన్నది లీలావతి.

కొంతసేపు కూర్చుని వెళ్ళిపోయాడు శ్రీనివాసరావు.

ఆ మర్నాడు సాయంత్రం వాళ్ళింటికి వెళ్లాడు శ్రీనివాసరావు. అతిధి మర్యాదలతో వారి ఆతిధ్యం స్వీకరించాడు. వారి కుటుంబంతో ఆనాటినుంచీ పరిచయం ద్విగుణీకృతమైంది.

ఆ రాత్రి లీలావతి తల్లిదండ్రులిద్దరూ ఒక నిర్ణయానికి రాకపోయినా శ్రీనివాసరావు గురించి ఇంకా వివరంగా తెలుసుకోవాలనే ఆకాంక్షను వ్యక్తపరిచారు.

# 9

రఘునాధరావు పోయి నెలదాటింది. సుభద్రమ్మ విచారంతో కుమిలిపోతూంది. నళిని కొన్నాళ్ళు శలవు పెట్టి, తల్లికీ తతిమ్మా పిల్లలకు వండి పెడుతూ తల్లికి కాస్త మనశ్శాంతి కలుగచేద్దామనుకుంది. శలవు పెడితే జీతం తగ్గుతుంది, జీతం రాకపోతే కుటుంబం ఎట్లా గడిచేటట్లు? నెలకు మూడువందల రూపాయల జీతం తెచ్చే తండ్రి పోయినప్పుడు తన నూట ఏభై రూపాయల జీతం ఆ కుటుంబానికి ఎట్లా సరిపోతుంది? తండ్రి బ్రతికున్న రోజుల్లో తన ఖర్చులకుపోను మిగిలిన జీతాన్ని ఒక సదుద్దేశ్యంతోనే బ్యాంకులో దాచేది. ఇప్పుడా సదుద్దేశ్యంతో కూడిన పథకమే నాశనమైంది. ఇంక సర్వఖర్చులకూ తన నూటఏభై రూపాయల జీతంలోనే సరిపుచ్చుకోవాలి. ముత్తైదువ సౌభాగ్యం భర్త చితిలో కలిసిపోయినట్లుగా, కుటుంబ యజమాని సంపాదించే రోజుల్లో ఉండే ఆర్థిక వనరులన్నీ ఆయనతోనే

మాయమైపోతాయి. కళకళలాడే గృహిణి ముఖం వైధవ్యంతో వెలవెల పోయినట్లే, సంపాదించే యజమాని పోతే ఆ ఇంటి ఆర్థిక వ్యవస్థ కూడా ఎంతో తలక్రిందులై పోతుంది.

ఇవన్నీ ఆలోచించుకున్న సుభద్రమ్మ తను పుట్టెడు దిగులుతో ఉన్నా, పిల్లలకు పట్టెడు మెతుకులు వండి పెట్టటానికే నిశ్చయించుకుంది.

నళిని ఆఫీసుకు వెళుతున్నది. పిల్లలంతా స్కూళ్ళకూ కాలేజీకి పోతున్నారు. అంతా ఎక్కడివారక్కడ వెళ్ళాక ఆఖరివాడు లక్ష్మణ రావును దగ్గరకు తీసుకుని కంటతడిపెట్టింది. ఆ నాలుగేళ్ళవాడికీ తండ్రి పోయాడనే తెల్పుగాని కుటుంబ పరిస్థితి తలక్రిందులైనట్లు వాడికి తెలియదు. రఘునాథరావు బ్రతికున్నరోజుల్లో రెండు మూడు రోజులకొకసారి వాడికి బిళ్ళల పొట్లామో, కారప్పూస పొట్లామో, బిస్కట్ల ప్యాకెట్టో తెచ్చి యిచ్చేవాడు. తండ్రిపోయింతరువాత వాడా పొట్లాలను చూడనేలేదు.

"అమ్మా, ఎప్పుడూ ఏలుత్తూ కూచోపోతే నాకు బిల్లలూ, కాల ప్పూసా తేకోల్దూ" అన్నాడు.

సుభద్రమ్మ గుండె తరుక్కుపోయింది.

"నాన్న లేరుకదూ, చచ్చిపోయారు. ఇంకా ఆ పొట్లాలు ఎవరు తెస్తారు చెప్పు. మనకు డబ్బు లెట్లా వస్తాయ్యి" అన్నదావిడ వాడిని మరిపించే ఉద్దేశ్యంతో.

"పెద్దక్కయ్య ఆపీచుకు పోతుందిగా, అక్కయ్య డబ్బు తెత్తుంది. దాంతో కొంకోవచ్చులే" అన్నాడు వాడు.

తండ్రిలేని పిల్లలకు తరగని ఆలోచనలు అనుకున్నదావిడ.

"సాయంత్రం ఆఫీసునుంచి వచ్చేటప్పుడు నళిని తెస్తుందిలే బాబూ" అన్నది.

వాకిట్లో రిక్షా ఆగింది. ఎవరయినా తనను పలకరించటానికి వస్తున్నారేమోనని అనుకుంది. సుభద్రమ్మ మూడోపిల్ల జయలక్ష్మి "అమ్మా" అని సిగ్గుతోచూసి వరండాలో ఓ మూల కూర్చుంది. కూతురువైపుచూసి అర్థంచేసుకుంది సుభద్రమ్మ.

"ఆమాటా ఇప్పుడే దక్కింది. జరిగే పరీక్షల్లో ఇదొక పరీక్ష" అన్నదావిడ.

కష్టాల్లోవచ్చిన శుభకార్యాలుకూడా ఆ పరిస్థితుల్లో ఇంకా కష్టంగానే కనుపిస్తయ్యిగాని సుఖాన్ని కోరేవిగా కనుపించవు. జయలక్ష్మి పెద్దపిల్ల కావటం ఆవిడ విచారానికి కొలికిపూస అయింది. ఆరోజుల్లో నళినికీ, రాజేశ్వరికీ ఎంతో ఘనంగా వేడుకలు జరిపించింది. ఆ వేడుకలు ఇప్పుడు సమాధిలోకి వెళ్ళిపోయాయి. ఈ పరిస్థితి ఆమెకు సంతోషాన్ని ఏమాత్రం కలిగించకపోగా విచారానికి ఇంకొక సమిధిగా తయారయింది.

సాయంత్రం నళిని ఆఫీసునుంచి వచ్చింది. రాజేశ్వరి కాలేజినుంచి వచ్చింది.

"మన దురదృష్టంకొద్దీ ఇది ఇప్పుడే సందర్భపడింది" అని వాపోయింది సుభద్రమ్మ.

"అదృష్టం తలుపుతట్టి ఇంట్లో ప్రవేశిస్తుంది. దురదృష్టం ఎవరికీ తెలీకుండా పెరటిదారినే వస్తుందమ్మా. నాన్న సమయా సమయాలు చూసిపోయాడా. జయలక్ష్మి విషయంలో ఇది సమయంకాదనుకోటానికి. ఈ పరిస్థితుల్లో ఏది చేసినా విడ్డూరంగానే ఉంటుందమ్మా. దాని అదృష్టం అంతే" అన్నది నళిని.

బుద్ధితెల్సినపిల్ల జయలక్ష్మి వెక్కి వెక్కి ఏడువసాగింది.

"ఈ పరిస్థితుల్లో నేనిది కోరుకున్నానా అమ్మా" అని బావురుమన్నది. సుభద్రమ్మ కడుపు తరుక్కుపోయింది.

ఆ మూడురోజులూ సుభద్రమ్మ ఏడుస్తూనే ఉన్నది. జయలక్ష్మి స్నానంచేసి ఇంట్లోకి వచ్చింది.

"మనందరి నెత్తినా నాన్న బండరాళ్ళు కొట్టిపోయారు. ఇంక వేడుక సంగతి మర్చిపో అమ్మా" అన్నది రాజేశ్వరి. జయలక్ష్మి కుమిలిపోయింది నళిని కళ్ళనీళ్ళు కళ్ళల్లోనే అంతరించినయ్యి. ఏదో ఒక రకమైన మొండి ధైర్యం నళిని హృదయంలో ప్రవేశించింది. నిరాశ, నిస్పృహ తననట్లా మార్చినయ్యేమోననుకుంది.

మరో మూడునెల్లు గడిచాయి. అందరి పరీక్షలు అయిపోయి, వేసంగి శెలవులు ఇచ్చారు.

ఈ శలవుల్లో పిల్లలను గోగులేశ్వరం పంపమని ఉత్తరంరాస్తే వచ్చి తీసుకుపోతానని రాఘవరావు చెల్లెలు సుభద్రమ్మకు కబురుచేశాడు. పిల్లలంతా మొదట్నుంచీ బస్తీలోనే ఉండడంనుంచీ గోగులేశ్వరం మరీ కుగ్రామం కావటంనుంచీ ఆ ఊరు వెళ్ళటానికి ఎవరూ ఇష్టపడేవారుకాదు. వేసవి శలవులకైనా ఆ ఊరు వెళ్ళేవారుకాదు. ఎప్పుడయినా రాఘవరావు గాని, రామయ్యగారుకాని పట్టుదల చూపితే, "ఈ బస్తీలో పుట్టి పెరిగిన వారు ఆ పల్లెటూళ్ళో ఏం చూడాలని బులబాటపడతారు. ఆ వాతావరణం వీళ్ళకు పడదు" అనేది సుభద్రమ్మ.

ఇప్పుడు తమ కుటుంబ జీవితమే మారిపోయింది. తమ ఇంటి రవి అస్తమించాడు. ఇంక ఉదయించే ప్రసక్తి లేదు. సుభద్రమ్మ, నళిని, ఆఖరు పిల్లవాడు లక్ష్మణరావు ఇక్కడే ఉండి మిగతా నలుగురి పిల్లల్నీ ఆ పల్లెటూరు పంపటానికి నిశ్చయించారు. రాజేశ్వరి కూడా మొదట్లో వెళ్ళనన్నా నళిని నచ్చచెప్పింది.

నలుగురు పిల్లల్నీ రాఘవరావు గోగులేశ్వరం తీసుకువెళ్ళాడు.

రెండు మూడు రోజులు ఊళ్లో కొంతమంది వచ్చి తండ్రిలేని ఆ పిల్లల్ని పలకరించి వెళ్ళారు ఆ వాతావరణమంతా పిల్లలకు చాలా కొత్తగా కనిపించింది. అనుపమకు, రాధారమణకు ఆ ఊరు బొత్తిగా నచ్చలేదు. సినిమాలూ, కార్లూ లేకపోయినా, ఆ ఊరంతా ఏదో పెద్ద జైల్లో ఉన్నట్లుగా ఉంది. అనుపమ వాళ్ళ అత్తయ్య మాణిక్యమ్మను అడిగింది.

"అత్తయ్యా యీ ఊరు ఇట్లా ఉందేం, ఏమీ సందడిలేదు, ఈ ఊళ్లోవాళ్ళంతా ఇట్లా ఏమిటోగా ఉంటారేం".

శ్రీనివాసరావు వెళ్ళిపోయింతరువాత మొదటిసారిగా మాణిక్యమ్మకు నవ్వొచ్చింది.

"అందుకనే ఇలాంటి ఊళ్ళని పల్లెటూళ్ళన్నారు. ఇక్కడివాళ్ళంతా వ్యవసాయంచేసి పంటలు పండిస్తారు. కష్టపడి పొలాల్లో పనులుచేస్తారు. మీ

బస్తీవాళ్లేమో ఆ వంటనంతా కొనుక్కొని సుష్టుగా భోజనంచేసి ఇస్త్రీ బట్టలు కట్టుకుని సినిమాలకు పోతారు" అన్నదావిడ.

"అయితే ఈ ఊళ్ళో ఇస్త్రీ చాకళ్ళు ఉండరా అత్తయ్యా. మా ఊళ్ళో ఎన్ని లాండ్రీలనుకున్నావ్ బోలెడు. ఎక్కడ చూసినా ఇస్త్రీ బట్టలే" అన్నాడు రాధారమణ కళ్ళింతవిచేసి.

సురేఖకు విపరీతంగా నవ్వొచ్చి వాడిని ముద్దు పెట్టుకుంది.

"మా ఊరిమీద ఇంకా నీ అభిప్రాయాలేమిటో చెప్పరా బాబూ, మాకు తెలవని విషయాలు ఎన్నో చెప్పేసేటట్లున్నావు" అన్నది సురేఖ.

"మీ ఊళ్ళో ఎక్కడ చూసినా గేదెలు, గడ్డి, పేడ అబ్బబ్బ కంపు కొట్టేస్తుంది. ఈ బాధంతా ఎందుకు చక్కగా పాలూ, పెరుగు కొనుక్కోకూడదూ" అన్నాడు.

ఈ మాటలకు అందరూ నవ్వేశారు. రాఘవరావుకూ రామయ్యగారికి కూడా నవ్వొచ్చింది.

"నిజమేరా రమణా, మీ ఊళ్ళో అయితే పంపులుంటయ్యా, నీళ్ళలో పాలు కలుపుతారా, మా ఊళ్ళో పంపులు లేవు. పాలల్లో నీళ్ళు కలపరు" అన్నాడు రామయ్యగారు.

"ఒరేయ్ అల్లుడూ, మా ఊరిమీద ఇన్ని అభాండాలు వేస్తున్నావ్. ఈ ఊళ్ళో పుట్టిన వాళ్ళంతా ఎంతో తెలివి కలవాళ్లోయ్" అన్నాడు రాఘవరావు.

"అవునురా, రమణా చాలా తెలివికలవాళ్ళు. ఈ ఊళ్ళోపుట్టిన ఆడపిల్లలు కూడా మీ ఊళ్ళో ఉద్యోగం చేస్తున్నారు" అన్నది సురేఖ.

"అట్లాగా, ఎవ్వరూ?" అన్నది జయలక్ష్మి.

"ఎవరేమిటి మీ నళిని అక్కయ్య. నళిని ఇక్కడే పుట్టింది. మీరంతా ఆ బస్తీలో పుట్టారు" అన్నది మాణిక్యమ్మ. ఒక్క రాజేశ్వరి మినహా అంతా విభ్రాంతితో చూశారు.

"అవున్రా, అమ్మ తొలిచూలు పురుడు ఈ ఊళ్లోనే పోసుకుంది. ఒక్క పురిటితోనే తాతయ్యకూ, మావయ్యకూ తలనొప్పి వచ్చింది. అంచేత పురిటికని అమ్మ మళ్ళీ ఈ ఊరు రాలేదు" అన్నది రాజేశ్వరి.

రాధా రమణకు అర్థం కాలేదు.

"అమ్మ పురిటికీ, తాతయ్య మావయ్యల తల నొప్పికీ సంబంధ మేమిటి" అన్నాడు వాడు.

అందరూ పొట్ట చెక్కలయ్యేట్టుగా నవ్వుతున్నారు.

ఇన్నాళ్ళకు మాణిక్యమ్మ నవ్వుతూ మాట్లాడుతున్నందుకు సంతోషించాడు రాఘవరావు.

రాధారమణ మాటలకు ఆ ఇంట్లోవాళ్ళందరికీ నవ్వొస్తూనే ఉండేది.

ఒకరోజున రామయ్యగారు అడిగారు మనవడిని "ఏంరా, ఈఊళ్లో ఏం తోచదు. ఊరు బావుండ లేదన్నావు. మరి ఇంట్లో భోజనం, పాలు, పెరుగూ బావున్నయ్యా!"

వాడు పుట్టింతరువాత పల్లెటూరు, పాడిపంటలు ఎన్నడూ చూడ లేదు. పెరుగు, వెన్నపూస, మీగడ వేసి రోజూ మూడు పూటలా ఆ దంపుడుబియ్యపు అన్నం పెట్టేది మాణిక్యమ్మ.

వాళ్ళ ఇంట్లో తిండికీ, ఈ తిండికీ వాడికి ఎంతో తేడా కని పించింది.

"ఇక్కడి భోజనమే బావుంది తాతయ్యా. అక్కడ వెన్నపూస, మీగడ వుండదు. అక్కడి పెరుగు పల్చగా ఉండి ఏమిటో వాసనేస్తుంది" అన్నాడు వాడు.

"ఇటువంటి వసతులుగల పల్లెటూరు మీ నాన్న బతికుండగా ఎన్నడూ రాలేదు కదూ. నేటి కాలానికి మీరంతా వచ్చారు. చాలా సంతోషంరా రమణా" అన్నారు రామయ్యగారు కళ్ళు తుడ్చుకుని. తను బ్రతికుండగానే ఈ పెద్ద వయస్సులో ఒక్కగానొక్క కూతురు వైధవ్యాన్ని తల్చుకునేసరికి ఆయన ఆవేదనకు అంతులేక పోయింది.

"నాన్న ఎప్పుడూ ఇక్కడికి పంపేవాడు కాదు. నాన్న చచ్చిపోవటమే బావుంది. చక్కగా మంచి పెరుగూ, వెన్న, మీగడా తింటున్నాను" సంతోషంతో అన్నాడు.

(12)

"ఛీ, వెధవా" అని నాలుగు బాదింది రాజేశ్వరి.

ఆ రోజంతా అందరి మనస్సులూ దిగులుగానే ఉన్నయ్యి.

నాలుగురోజులు గడిచాయి. సాయంత్రం నాలుగు గంటలైంది. పాలేరు తెచ్చిన తాటికాయలు కొడవలితో చివ్వి ఇస్తుంటే ఎవరికాకావల సిన ముంజలు వాళ్ళు తినేశారు. ఎండకూడా చల్లబడింది. మాణిక్యమ్మతో రాజేశ్వరి అన్నది.

"అత్తయ్యా! ఏమీ తోచటంలేదు. అట్లా మీ పొలాలవైపు వెళ్ళొస్తాము. వేసవికాలం పచ్చని చేలు లేకపోయినా, వెచ్చని వడగాడ్పులు లేవు. మేమంతా సురేఖని తీసుకుని అట్లా వెళ్లొస్తాం".

క్షణంసేపు ఆవిడ మాట్లాడలేదు. రాజేశ్వరి వైపూ సురేఖవైపూ చూసి ఊరుకున్నది.

"ముకుంద మాధవుడూ వస్తాడు. మాకేం భయంలేదు అత్తయ్యా" అన్నది జయలక్ష్మి.

"భయమని కాదమ్మా. తండ్రిపోయిన పిల్లలు మీరు. పసుపుకుంకుమకు నోచుకొని అభాగ్యురాలు సురేఖ. ఈ పరిస్థితుల్లో పొలాల వెంట షికారు వెళితే...." భర్త రాఘవరావుని చూసి అర్ధోక్తిలోనే ఆగింది మాణిక్యమ్మ.

"ఇల్లాంటి పరిస్థితులు కనుకనే కాస్త మనశ్శాంతికి అట్లా వెళ్ళటం చాలా మంచిదమ్మా. వెళ్ళి రండి. ఊరికే కూర్చుంటే అశాంతేగాని మన శ్శాంతి ఉండదు. నిర్భయంగా వెళ్ళిరండి" అన్నాడు రాఘవరావు. మాణిక్యమ్మ సరేననక తప్పలేదు.

వీళ్ళు నలుగురూ, సురేఖ ముకుంద మాధవరావు వాళ్ళ పొలాల వైపు వెళ్ళారు. దిబ్బల చేలో పాటి దిబ్బలమీద నాలుగు మామిడి చెట్లున్నయ్యి. బాగా గుబురుగా ఎదిగినయ్యి. వచ్చే ఏటికి కాపుకు రావచ్చు. ఆ చెట్ల క్రింద కూర్చున్నారు.

"పచ్చని చేలతో పాడి పంటలతో తులతూగే ఈ పల్లెటూళ్ళల్లో ఉంటానికి కూడా అదృష్టం ఉండాలి సురేఖా. యాంత్రికంగా జీవించే మా బస్తీ వాళ్ళకు ఆ అదృష్టం ఉండదు" అన్నది రాజేశ్వరి.

"పల్లెటూరి అదృష్టం తల్చుకుని బస్తీవాళ్ళు ఆనంద పడుతూ ఉంటే, బస్తీ సౌభాగ్యం చూసి పల్లెటూరి వాళ్ళు మురిసి పోతూ ఉంటారు. మనిషి మార్పుకోరటం సహజం. కొంత మంది ఏ మార్పూ సహించరు. కనీసం ఆస్తి పంపకంలో కూడా వాళ్ళ అభిప్రాయాలు వాళ్ళకే ఉంటయ్యి. అందుకనే అన్నయ్య వెళ్ళిపోయాడు. మనిషి వ్యక్తిత్వాన్ని బట్టి కోరికలు వివిధ రీతుల్లో ఉంటయ్యి" అన్నది సురేఖ.

సురేఖ ముఖంలోకి సూటిగా చూసింది రాజేశ్వరి. తలవంచుకుని మట్టి బెడ్డలు ఏరి పారేస్తూ కూర్చుంది సురేఖ.

"మాధవా వీళ్ళందర్నీ తీసుకెళ్ళి ఆ పొలాలూ తాటితోపులూ చూపించు ఈ పొలాలలో ఏమేం పండుతయ్యో అనుపమకూ, రాధారమణకు చెపితే పొలాలలో ఏమేం పండుతయ్యో వాళ్ళకు తెలుస్తుంది. వెళ్ళండి" అన్నది రాజేశ్వరి. వాళ్ళముగ్గుర్నీ తీసుకునివెళ్ళాడు ముకుందమాధవరావు.

"సురేఖా, బావ ఎక్కడున్నాడో తెలీదా."

గతుక్కుమన్నది సురేఖ.

"ఏం బావ గుర్తొచ్చాడా, తండ్రితో మాట్లాడని కొడుకు ఎక్కడుంటే ఏం" అన్నది సురేఖ.

"పోనీలే చెప్పక్కర్లేదు. ఒక్క విషయం అడుగుతాను ఏమీ అనుకోవు కదూ" ఏమిటో తెలియలేదు సురేఖకు.

"ఆ విషయాన్ని బట్టి అనుకోడం ఉంటుంది" రాజేశ్వరి వైపు చూస్తూ అన్నది సురేఖ.

"నీ జీవితం ఈ పుట్టింట్లో ఇట్లా గడవ్వలసిందేనా సురేఖా" విభ్రాంతురాలైంది సురేఖ. రాజేశ్వరి ఆంతర్యం అర్థం కాలేదు.

"అత్తింట్లో ఒక సంవత్సరం గడిచింది. మిగిలిన జీవితం పుట్టింట్లోనే గడిచిపోతుందని నా నమ్మకం"

"స్త్రీకి వైధవ్యం ఎప్పుడయినా ఒకటికాదు సురేఖా. మా అమ్మకు వైధవ్యం ప్రాప్తించినా సగం జీవిత కాలం పూర్తయింది. ఈ రోజులలో నీ వయస్సు వాళ్ళకు చాలా మందికి జీవితమే ప్రారంభం కాలేదు"

సురేఖలో కోపం తల ఎత్తింది. కాని పైకి పొక్కనివ్వలేదు.

"మళ్ళీ పెళ్ళి చేసుకోమంటావా" అన్నది సురేఖ.

రాజేశ్వరి నవ్వింది. ఒకరి భావాలు మరొకరికి పూర్తిగా అర్థం కావటం లేదు.

"అందులో తప్పేమీలేదు. అంతకన్నా ముఖ్యం చదువు, నీ కన్నా వయస్సులో చిన్నదాన్ని. అనుభవాలలోనూ అంతే. ఈ కారణం చేతనే నా సలహా కొట్టిపారెయ్యకు. మా ఊరొస్తే అంతా కలిసి చదువుకో వచ్చు"

సురేఖ మనస్సులో ఆలోచనలు ఒక రూపాన్ని సంతరించుకో లేదు. బియ్యంకడిగి పొయ్యిమీద పెట్టింది రాజేశ్వరి. ఎట్లా ఉడుకుతుందో చూడాలి.

"మా నాన్న బ్రతుకున్న రోజులలో మా జీవిత విధానమూ, ఆలో చనలూ ఒకే తీరుగా, మాకు సంబంధించేవిగానే వుండేవి. ఇప్పుడు మా జీవితచక్రం తిరగబడింది మామయ్య సలహా సంప్రదింపులూ, కొంత ఆర్థికసహాయమూ మా కుటుంబానికి ఎంతో అవసరం. ఈ పరిస్థితులలో నువ్వు మా ఇంట్లో ఉండి చదువుకోటంలో అభ్యంతరం ఏమీ ఉండదు. ఇకపోతే అసలు చదువు ఎందుకంటావా?" ప్రశ్నార్థకంగా చూసింది రాజేశ్వరి. అర్థంచేసుకున్నట్లుగా చూసింది సురేఖ.

"నీపేరు సురేఖ. కాని భగవంతుడు నీ నుదుటి రేఖలు తీర్చిదిద్ద లేదు. తల్లిదండ్రులు ప్రతివారూ తమ పిల్లల పురోభివృద్ధిని కోరుతూ పెద్దతనంలో వాళ్ళ చేతులమీదుగా దాటిపోవాలనుకుంటారు. అది ఎంతో సహజమైన కోరిక. ఆ పరిస్థితులలో నీ జీవితం ఎట్లా వెళ్ళబుచ్చుకోవాలో ఆలోచించు సురేఖా" అన్నది రాజేశ్వరి.

సురేఖ కళ్ళు చమర్చాయి. అన్నం ఉడికింది.

"నేను మీఊళ్ళో చదువుకుంటాను రాజూ" అంటూ కళ్ళు తుడ్చు కుంది సురేఖ.

# 10

గోగులేశ్వరంలో అయిదోక్లాసు ప్యాసయి ఇంకా ఆ ఊళ్ళో చదువు లేక మానేసిన సురేఖ వివాహమయ్యాక గృహిణిగా అత్తింట అడుగు పెట్టింది. అత్తవారివూరూ పల్లెటూరే కావటంతో వయసుతోపాటు ఆమె మనసు పెరగలేదు. భర్తకూడా హైస్కూలు చదువుతో ఆపేసి, ఉన్న పాతికెకరాల పొలమూ వ్యవసాయం చేస్తూ ఉండేవాడు. కాపురానికివెళ్ళిన ఆరుమాసాలలోనే అత్తగారు స్వర్గస్తురాలైంది. కోడలు గృహప్రవేశం, అత్తగారు గంగప్రవేశం అన్నారు ఊళ్ళోవాళ్ళంతా. నేనేం చేశాను, భగవంతుడు చావుని గురించి ఒక్కసారే రాస్తాడు అనుకుంది సురేఖ. మరో ఆరుమాసాలలో రెండు రోజులు జ్వరంతగిలి భర్త స్వర్గస్తుడయ్యాడు. సురేఖ మనస్సు బీటలువారింది: అందరూ ఆడిపోసుకున్నారు. తను చెయ్యగలిగిందేమీలేదు. బీటలువారిన మనస్సులోని ఆలోచనలు స్థిరత్వాన్ని సంతరించుకోలేదు. అన్ని ఆలోచనలూ హరించిపోయి పుట్టిల్లు చేరిన సురేఖకు ఆ ఇంటి వాతావరణమే అలవాటయి ఆ ఇంటి పెద్దల భావాలే మనస్సులో నిలిచిపోయాయి.

అటువంటి సురేఖ నాలుగురోజులు తండ్రితో, తల్లితో, తాతగారితో వాగ్వివాదం జరిపి వాళ్ళను వప్పించి చదువుకోటానికే నిశ్చయించి రాజేశ్వరితో కూడా ఇక్కడికి వచ్చేసింది.

సురేఖ రాకతో ఏవైనా కొత్త సమస్యలు తలఎత్తుతయ్యేమోననుకుంది సుభద్రమ్మ. ఉన్న సమస్యలలో ఇదొకటి అనుకున్నది నళిని.

అందరి పరీక్ష ఫలితాలు తెలిశాయి. అంతా ప్యాసయినారు. రాజేశ్వరి పి.యు.సి ఫస్టుక్లాసులో ప్యాసయింది. స్కూళ్ళు తెరిచారు.

తతిమ్మాపిల్లలు పై క్లాసులలో చేరారు, సురేఖ జూనియర్ మెట్రిక్‌లో చేరింది. రాజేశ్వరి వారంరోజులు ఏడ్చి, మారాంచేసి, మళ్ళీ పరిస్థితులన్నీ అర్థంచేసుకుని, విచారాన్ని దిగమింగి చదువుకు స్వస్తిచెప్పింది.

అంతా స్కూలుకువెళ్ళి, నళిని ఆఫీసుకు వెళితే రాజేశ్వరి ఒక్కదానికీ ఏమీ తోచేదికాదు.

"ఊరికే కూర్చుంటే జరిగిపోయిన సంఘటనలని చర్విత చరణం చేసుకోటంగానే ఉంటుంది. నేనూ ఏదయినా ఉద్యోగం దొరికితే చెయ్యనా అమ్మా" అన్నది రాజేశ్వరి.

సుభద్రమ్మ మనస్సు చివుక్కుమనలేదు. నళిని ఉద్యోగం విషయం అడిగినప్పుడు సుభద్రమ్మ మనస్సు వివాహంవైపే దారితీసిందిగాని ఉద్యోగంవైపు మొగ్గు చూపలేదు. తన ఇష్టానుసారం జరక్కపోయినా నెత్తిమీద గొడుగువున్న రోజులలో ఆ నీడలో ఆమె సేద తీర్చుకునేది. ఇప్పుడా గొడుగు ఎగిరిపోగానే ఆమె అభిప్రాయాలూ మారిపోయాయి.

"నీ ఇష్టం రాజేశ్వరీ. నా అభిప్రాయాలన్నీ ఆ రోజునే ఆ చితిలోనే దహనమయ్యాయి, ఇప్పుడు నేను మీకోసం బ్రతుకుతున్నాగాని, నా కోసం కాదు. ఇప్పుడు మీ అందరి ఇష్టమే నా ఇష్టం" అన్నదావిడ.

రాజేశ్వరి మరి మాట్లాడలేదు.

మరో పదిరోజులు గడిచాయి. పల్లెటూళ్ళోపుట్టి, పల్లెటూళ్ళో పెరిగి, పల్లెటూళ్ళో కాపురంచేసి విధి వక్రించగా ఈ రీత్యా బస్తీచేరిన సురేఖకు తన జీవితమంతా కొత్తగానే కనుపించింది. స్కూలుకుపోతున్నా వస్తున్నా, స్కూల్లో చదువుకొంటున్నా నా జీవితం ఇట్లా మారిపోయిందేమా అనుకునేది. తన క్లాసులో అంతా తనకన్న చిన్నవాళ్ళు ఓణీలుకూడా వేసుకోని పసివారు. అన్ని అనుభవాలూ తీరిన విద్యార్థిని తనొక్కతే ఆ క్లాసులో ఉన్నది ఆ పిల్లలంతా ఇంత పెద్దావిడ జూనియర్ మెట్రిక్ ఏమిటా అని నవ్వుకున్నారు. తరువాత వారందరికీ కొంత అర్థమైంది. అక్కయ్యా అని పిలిచేవారు. ఆ పిల్లలలో సరళ అనే అమ్మాయి సురేఖకు బాగా పరిచయం అయింది.

"ముఖాన బొట్టులేదు, నువ్వు....అవునా అక్కయ్యా" అన్నది సరళ.

"అవునమ్మా నేను అదే. నువ్వనుకునేదే" అన్నది సురేఖ.

"ఈ పరిస్థితికి వచ్చి ఎన్నాళ్ళయింది"

"రెండేళ్ళు దాటింది"

"అప్పట్నుంచీ చదువు మొదలుపెడితే ఈపాటికి మెట్రిక్‌లో ఉండేదానివి"

"అవును సరళా, ఆ రోజులలో నాకు చదువుకోవాలని అనిపించ లేదు, ఈ రోజున చదువుకుందామనేసరికి మీతోపాటు ఒకటోక్లాసులో చేరాల్సొచ్చింది, ఇదొక అనుభవం. నేను చదువులో మొద్దునని మీరంతా అనుకున్నారుకదూ"

చిన్నబుచ్చుకున్నట్లుగా చూసింది సరళ.

"అక్కయ్యా, చదువు పూర్తయ్యాక ఏం చేస్తావు"

"ఇప్పుడే చెప్పలేనమ్మా. అసలు తప్పకుండా నేను మెట్రిక్ ప్యాస వుతా నంటావా" సరళ వీపు నిమురుతూ అడిగింది సురేఖ.

"ఫస్టుగా ప్యాసవుతావు, మాకన్న లోకజ్ఞానం నీకే ఎక్కువ అక్కయ్యా, మా అమ్మకూడా చిన్నప్పుడు ఇట్లాగే చదువుకున్నదిట".

"అంటే" ఆశ్చర్యంగా అడిగింది సురేఖ.

"మా అమ్మకూడా....ఏంలేదు, వెళతాఅక్కయ్యా" సరళ వెళ్ళి పోయింది. సురేఖ చూస్తూ నిల్చుంది.

వాళ్ళమ్మకూడా నా మాదిరి వితంతువు కామాలు అనుకున్నది సురేఖ. ఈనాటి సంఘటన ఎందుకో సురేఖ మనస్సులో బాగా నాటుకు పోయింది. తను ఈ స్థితిలో చదువుకోడం విడ్డూరమేమీ కాదనుకుంది.

ఆలోచనలతో సతమతమైపోతున్న రాజేశ్వరి, నవ్వుకుంటూ వస్తూన్న సురేఖనుచూసి తన ఆలోచనలకు మూతవేసింది.

"బాగా చదువుతున్నావా సురేఖా" అన్నది రాజేశ్వరి.

"ఆ అనుమానం నీకు లేకపోవటంచేతనే నన్ను చదువులో ప్రవేశ పెట్టావ్‌కదా, నా బాధ్యత నాకు తెలీదంటావా రాజేశ్వరీ" అన్నది సురేఖ.

"బస్తీ వాతావరణాన్ని అలవాటు చేసుకోవటంలోనే రోజులు గడిచిపోతున్నయ్యేమోనని అడిగాను, కోపం వచ్చిందా" గడ్డంపుచ్చుకొని అడిగింది రాజేశ్వరి. సురేఖ కళ్ళు చెమర్చినయ్యి.

"లేదు రాజూ, వాతావరణం దానంతట అదే అలవాటయిపోతుంది. ఒక చిన్న విషయాన్ని ఈ రోజున తెల్సుకున్నాను".

"ఏమిటది ?"

సరళతో జరిగిన సంభాషణంతా చెప్పింది సురేఖ. పక పక నవ్వింది రాజేశ్వరి.

"నువ్వు ఊహించిందేమిటి సురేఖా ?"

"సరళ తల్లికూడా వితంతువే కావటంతో నామాదిరిగా పెద్దయ్యాకనే చదువుకున్నదేమో, అట్లా చదువుకుని ఉద్యోగంకూడా చేస్తున్నదేమో ? వితంతువు చదువుకుని ఉద్యోగం చేసుకోకపోతే జీవితం ఎట్లా గడుస్తుంది రాజూ"

దూరం ఆలోచించిన రాజేశ్వరి తన ఊహలను దగ్గరకే తెచ్చుకుంది.

"అవును. చదువురాని వితంతువు చదువుకుని ఉద్యోగమే చేసుకోవాలి. ఆ ఉద్యోగమే జీవితాన్ని తీర్చిదిద్దనూవచ్చు". ఆ మాటల్లోని ఆంతర్యం సురేఖకు అర్థంకాలేదు.

వీధిలో రిక్షా ఆగింది. రాఘవరావును ఇద్దరూ చూశారు. రెండో రిక్షాలోనుంచీ ముకుందమాధవరావు దిగారు. తండ్రి కొడుకులు వస్తూ గోగులేశ్వరంనుంచీ అరబస్తా బియ్యం, పదిమానెకల కందిపప్పూ, పెసర పప్పూ, మానెడు నెయ్యీ తెచ్చారు.

కుశలప్రశ్నల అనంతరం కూతురు చదువుసంగతి అడిగాడు రాఘవరావు. ఆయనకు ఈ విషయంలో సుభద్రమ్మ అభిప్రాయం అక్కర్లేదు. రాజేశ్వరి ప్రోద్బలంనుంచే సురేఖ చదువులోచేరింది కనుక రాజేశ్వరిని ఆయన ఏమీ అడగదల్చుకోలేదు. నళిని అభిప్రాయమే ఆయనకు కావలసింది.

"మా నాన్న చావుతో మన రెండుకుటుంబాలు ఏకమైనయ్యి. మావయ్యా నాన్న బ్రతికుంటే సురేఖ జీవితం అట్లాగే ఉండేదేమో" అన్నది నళిని. ఈమాటకు సుభద్రమ్మ మనస్సు చివుక్కుమన్నది. కాని ఏమీ అనలేకపోయింది.

"బ్రతికున్నవాళ్ళు పడే బాధలు చూడలేక కొంతమంది అర్ధాయుస్సుగానే పోతారు. మీ పెళ్ళిళ్ళు ఎట్లా అవుతయ్యా అనే దిగులుతోనే మీ నాన్న పోయారు" అన్నది సుభద్రమ్మ.

"పిల్లల పెళ్ళిళ్ళకూ పెద్దవాళ్ళచావుకూ సంబంధమేమిటి సుభద్రా, అందరి జీవితాలూ ఎప్పుడో ఒకప్పుడు రాలిపోయేవే. నువ్వే అట్లా అనుకుంటే సురేఖ జీవితాన్ని తల్చుకుని నేను రెండేళ్ళనాడే పోవలసింది" అన్నాడు రాఘవరావు.

"అట్లాగే జరిగివుంటే మాకు ఆలనా, పాలనా ఎవరు మావయ్యా. జీవితాలు మనం చెప్పినట్లుగా అనుకున్నట్లుగా వెళ్ళిపోవు" అన్నది రాజేశ్వరి.

"అదీ నిజమే సురేఖ బాగా చదువుతున్నదా నళినీ" అన్నాడు రాఘవరావు.

"అదేంప్రశ్న మావయ్యా. చదువుయందు ఇష్టమే లేకపోతే ఇంతవరకూ వచ్చేదేకాదుగా" అన్నది నళిని.

"అవుననుకో, అడిగి తెల్సుకోవటం నా బాధ్యతకదా, అవును సురేఖా, ఈ దుర్బుద్ధి నీకు ఎందుకు కలిగిందో ఈనాటికీనాకు అర్థం కావడం లేదు"

అంతా విభ్రాంతితో ఆయనవైపు చూశారు. ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు.

"అన్నయ్య హైద్రాబాదులో ఉన్నాట్టగా, నువ్వూ తమ్ముడూ కలసి వాడి స్నేహితుడిద్వారా సర్టిఫికెట్లుకూడా పంపారుట. నాకు చెప్పనేలేదేం" అన్నారు రాఘవరావు.

సురేఖ తలవంచుకుంది. అంతా ఆశ్చర్యపోయారు.

"తప్పును తప్పుగా అర్థంచేసుకోకు నాన్నా. అన్నయ్యకు నీకూ అప్పటికి సంవత్సరంపైగా మాటలు లేవు. వాడు ఏ పరిస్థితులలో వెళ్ళాడో అందరికీతెల్సు. ఇంట్లో ఉండి ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా ఎలాంటి

వాతావరణంలో మీరిద్దరూ మధనపడ్డారో మీకు తెలుసు. మంచికో చెడ్డకో వాడువెళ్ళిపోయాడు. ఈ సంగతి ఎవ్వరికీ చెప్పవద్దని ఆ స్నేహితుడిద్వారా పంపిన ఉత్తరంలో అన్నయ్య రాశాడు. ఈ సంగతి తమ్ముడికి తెలుసు. తన తప్పుని తెల్సుకుని ఏనాటికయినా అన్నయ్య మీకు ఉత్తరం రాస్తాడనే నమ్మకం నాకున్నది. అన్నయ్య భీరువుగా వెళ్ళిపోలేదు. వాడికి అంతఃకరణవుంది. అపేక్షవేరు. అందుచేతనే వాడి ఉత్తరంసంగతే చెప్పలేదు. ఈ విషయంలో నేనేమీ పొరబడలేదనే నా నమ్మకం" అన్నది సురేఖ.

ఈ మాటలు అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసినయ్యి. వయస్సు చిన్నదయినా మనసులో ఎంత ఆలోచన ఉన్నదో అంచనా వేసింది నళిని.

"అవును. తండ్రితో విరోధం పెంచుకున్నవాడు ఎక్కడున్నా ఒకటే" అన్నాడు రాఘవరావు.

ఆ మర్నాడే వెళ్ళిపోయారు రాఘవరావు, ముకుందమాధవరావు. వెళ్ళేముందు రహస్యంగా తమ్ముణ్ణి అడిగింది సురేఖ.

"అమ్మకు అన్నయ్య సంగతి చెప్పావుకదా, అమ్మ ఏమన్నది".

"ఇటువంటి విషయాన్ని చెప్పకుండా దాచినందుకు నీ గుండె నిబ్బరాన్నీ, నా అటకాయితనాన్నీ తల్చుకుని మనిద్దర్నీ చివాట్లు పెట్టింది" అన్నాడు ముకుందమాధవరావు.

"పోనీలే, కన్నతల్లికి అందరిమీదా ప్రేమ ఒక్కటే, ఇప్పుడు దిగులుపడకుండా ఉందికదూ".

"అహా".

మరో నెల గడిచింది. ఒక వారపత్రికలో సీరియల్ చదువుతున్నది రాజేశ్వరి. నళినికి కథలంటేనూ, నవలలంటేనూ అంత ఇష్టత లేదు. రాజేశ్వరికి పంచప్రాణాలలోనూ ఒక ప్రాణం ఈ పుస్తకాలు, చదువుకూడా మానేయటంతో ఈ పత్రికలూ, నవలలూ బాగా తోడయినయ్యి. నళిని లేనప్పుడుచూసి సురేఖకూడా పత్రికలు చదువుతుంది. నళిని

చూస్తే చివాట్లు వేస్తుందని సురేఖకుతెల్సు. ఆ వారంతో ఒక సీరియల్ ముగిసింది. సురేఖ, రాజేశ్వరి పూర్తిగా చదివారు.

"కథలలోనూ, నవలలలోనూ కొన్ని కొన్ని పాత్రలు మన జీవితాల లోకి తొంగిచూస్తున్నట్లే ఉంటుంది. మనల్ని గురించే వ్రాశారా అని పిస్తుంద్తికదూ సురేఖా !" అన్నది రాజేశ్వరి.

సురేఖకు ఆ పాత్రలేవో అంతుపట్టలేదు.

"నువ్వు చదివినన్ని పుస్తకాలు నేను చదవలేదు రాజూ ! పుస్త కాలలో మాదిరే మనుష్యుల జీవితాలూ ఉంటే, ఎవరి ఆత్మకథను వాళ్ళు తమ ఇష్టప్రకారమే రాసుకోవచ్చు. కాని రాసుకున్నట్లు జరుగుతయ్యా ? అట్లా జరిగితే నుదుటి వ్రాతనుగురించి ఎవ్వరూ ఆలోచించరేమో ?" అన్నది సురేఖ.

పెదవులు కదిపింది రాజేశ్వరి. మాట్లాడకుండా ఊరుకుంది.

"ఏమంటావు రాజూ ?"

"ఏమీ అనను, కొందరిజీవితాలు పాత్రోచితంగా ఉంటే, జీవితాలు అట్లా లేకపోయినా కొందరి భావాలు అట్లాఉంటయ్యి, వప్పుకుంటావా ?"

సురేఖకు నవ్వొచ్చింది. నవ్వలేదు, నవ్వితే రాజేశ్వరికి కోపం రావచ్చు.

"జీవితాలు గడపటానికి అనుకూల వాతావరణమూ, అంగబలమూ, అర్థబలమూ ఉండాలి రాజూ. ఆలోచనలకూ, భావోద్రేకానికే ఏమీ అక్క ర్లేదు, మెదడు ఉంటే చాలు".

రాజేశ్వరికి ఈ మాటలు ఎంతో సంతోషాన్ని కలిగించాయి.

"పుట్టినన్నాళ్ళకు పురుషుడు యజ్ఞంచేశాడన్నట్టుగా, నా జీవితంలో ఇప్పటికి నేనూ ఒక చెప్పుకోతగిన ఘనకార్యమే చేశాను. నన్ను చూసి నేనే సగర్వంగా నవ్వుకుంటున్నాను సురేఖా" అన్నది రాజేశ్వరి.

ఒక్క-క్షణం చూసింది సురేఖ. తనకన్న రెండు మూడేళ్ళు చిన్నది రాజేశ్వరి. వయస్సులో చిన్నదయినా, మనస్సులో తనకన్న పెద్దదనే తెల్సు. తన జీవితాన్ని ఈ చదువుకు తిప్పటంతో రాజేశ్వరి పట్టుదలా,

సలహా లేనిదే ఈనాడు తను ఈ బస్తీకి వచ్చేదేకాదు. అంచేతనే రాజేశ్వరంటే చనువుతో కూడిన ఆప్యాయత ఉన్నది. మనస్సు విప్పి చెప్పుకోగల ధైర్యం ఉన్నది. నళిని అంటే భయంతో కూడిన గౌరవం ఉన్నది. అక్కాచెల్లెళ్ళిద్దరియందూ తనకుగల ఆత్మీయతను బేరీజువేసుకుని ఆనందంతో కళ్ళు చెమ్మగిలగా, కళ్ళు తుడుచుకుని రాజేశ్వరి గడ్డం పుచ్చుకుని,

"ఎవరినయినా ప్రేమించావా రాజూ, నాతో అన్ని విషయాలూ చెప్పొచ్చు" అన్నది.

విభ్రాంతితో చూసింది రాజేశ్వరి. కొద్దిక్షణాలు తేరుకోలేక పోయింది.

"ప్రేమించానని చెప్పానా ? లేదే అసలీ ఊహ నీ కెట్లా కలిగింది సురేఖా ?" అన్నది రాజేశ్వరి.

ఈసారి ఆశ్చర్యపోవడం సురేఖ వంతయింది. ఈ అర్థంలేని ఆలోచన తనకు ఎందుకు కలిగిందో తనకే అర్థంకాలేదు. ఇట్లా అర్థం చేసుకున్నానేమిటా అని తనకుతాను నిందించుకున్నది.

"పత్రికలు చదువుతూ అందులోగల కథల్లోని పాత్రల్ని గురించి చర్చిస్తూ ఉంటే నీ మాటల్నిబట్టి నాకా ఊహవోయింది రాజూ. అర్థంలేని మాట అనేశాను ఏమీ అనుకోకు. ఇంతకీ ఆ ఘనకార్యం ఏమిటో ?" అన్నది సురేఖ.

"పిచ్చి సురేఖా, నువ్వు వేసింది చచ్చు ప్రశ్నకాదు. జీవితాల్ని తరచి చూసేది. సరే, పోనియ్యి. ప్రేమించటం మానవ సహజం. నేను ఎందుకు గర్వపడుతున్నానో చెపుతున్నాను. ఆలోచనా, అంతఃకరణా, జీవితాన్ని తీర్చిదిద్దుకోగలనేర్పూ, ఓర్పూ ఉన్నా, ఆ పల్లెటూళ్ళో దేవుడు లేని గుళ్ళో కూర్చుని దణ్ణంపెట్టుకునే నిన్ను, ఈ మందిరానికి చేర్చాను. నా జీవితానికి ఇది నిజంగా ఘనకార్యమే కదూ" అన్నది రాజేశ్వరి.

సురేఖ మనస్సులో మథనపడింది. ఆలోచనలు ఏ మార్గంలోనూ స్పష్టంగా ఒక రూపాన్ని సంతరించుకోలేదు. ఏం మాట్లాడాలో తోచనే

లేదు. తన మనస్సులో రాజేశ్వరి వేసింది రాయా, రంపపుకోతా, గతిం చిన జీవితానికి వాత పెట్టటమా ? ఏమీ అర్థంకాలేదు.

ఇంతలో ఆఫీసునుంచి నళిని రావటంతో ఆ సంచలన జీవితపు పుటలు మూసివేసి ఆ పుస్తకాన్ని అవతల దాచారు.

ఆఫీసునుంచి వచ్చిన నళిని కాసేపు కుర్చీలో కూర్చుంది. సురేఖ మంచినీళ్ళుతెచ్చి ఇచ్చింది. మంచినీళ్ళుతాగి అలాగే అరగంట కూర్చుంది నళిని. పిల్లలంతా బళ్ళల్లోనుంచి వచ్చారు. సుభద్రమ్మ వంటపనిలోకి వెళ్ళ బోతూ నళినివైపు చూసింది.

"అట్లా ఉన్నావేమే, వంట్లో బాగుండలేదా ?" అన్నదావిడ.

"బాగానే ఉందమ్మా. ఊరికినే కూర్చున్నాను. కాస్త తలనొప్పి వచ్చింది అంతే" అన్నది నళిని.

"ఏదైనా మాత్ర వేసుకో, కాఫీచేసి తెస్తాను. అయితే అన్నంలోకి ఏం చెయ్యమంటావు. ఏదైనా కూర వేయించనా ? రెండు ములక్కాడ లున్నాయి పప్పుపులుసు పెట్టనా...." అన్నదావిడ.

తల్లి మాటలకు నవ్వొచ్చింది నళినికి.

"కూర్చో అమ్మా మాత్ర అక్కరలేదు, కాఫీ అక్కరలేదు; కాసిని పంచదార నీళ్ళివ్వు చాలు".

పంచదార నీళ్ళు తెచ్చి ఇచ్చింది రాజేశ్వరి.

"ఉద్యోగంచేసి జీతం తెస్తున్నదని కాస్త తలనొప్పి వచ్చినా సకలోపచారాలూ నళినికి చేస్తారు. మాకు జ్వరం వచ్చినా మందుకూడా ఇప్పించదు అమ్మ" ఎగతాళిగా అన్నది రాజేశ్వరి.

"అవును. అదే ఉద్యోగం చెయ్యకపోతే మనమంతా ఏమైపోయే వాళ్ళమో" అన్నది సుభద్రమ్మ.

మకిలిపట్టిన అద్దాన్ని గుడ్డతో తుడిచి శుభ్రంచేసినట్టుందామె మనస్సు. భర్త నీడన ఆయన సంపాదనతో బ్రతుకుతున్నప్పుడు ఆ జీవితం, లోకరివాజుగానే ఉన్నదిగాని భిన్నంగాలేదు. నళిని ఉద్యోగపు ఛాయలలో ఆవిడ జీవితం వెళ్ళబుచ్చుకుంటుంటే ఆవిడ మనస్సు చివుక్కు

మంటూనే ఉన్నది.. అందుచేతనే నళిని అంటే కన్నకూతురైనా ఒక విధమైన గౌరవభావం ఆమె మనస్సులో ఏర్పడిపోయింది.

"జీవితాన్ని జీతంతో జతచేసి చూస్తే ఆ అనుబంధం బొమ్మ, బొరుసులానే ఉంటుంది. నీకూ అలాంటి అవకాశాన్ని కల్పించాలని అనుకుంటున్నాను రాజూ" అన్నది నళిని.

అంతా ఆశ్చర్యపోయి చూడసాగారు.

"ఆ ఉద్యోగం తాత్కాలికమే అయినా, ఉద్యోగాధ్యాయానికి అది ఒక మెట్టుకావచ్చు. నువ్వు సరేనంటే చెప్తాను".

రాజేశ్వరి సంతోషం ఉరకలు వేసింది.

"ఏమిటా ఉద్యోగం, ఏ ఆఫీసు ?"

"ఆఫీసుకాదు, ఉద్యోగంకాదు, పదిరోజుల్లో మన ఊళ్ళో ఎగ్జిబిషన్ వస్తున్నది. దాంట్లో ఒక కాస్మెటిక్స్ కంపెనీవారు ఒక స్టాల్ ఏర్పాటు చెయ్యబోతున్నారు. అందులో సేల్సు ఎంప్లాయిగా ఉండాలి. ఎగ్జిబిషన్ నెలరోజులుంటుంది. ఈ నెలకు వంద రూపాయలు జీతం యిస్తారు.

నీ పనితనాన్నిబట్టి వాళ్ళకు ఇష్టమైతే తరువాత ఆ కంపెనీలోకి తీసుకోవచ్చు. ఎగ్జిబిషన్ సాయంత్రము మూడుగంటల్నుంచీ రాత్రి పదిగంటలవరకూ. మా కంపెనీ ప్రొప్రైటరు హరగోపాల్‌గారికి ఆ కంపెనీ ప్రొప్రైటరుగారు స్నేహితులు. మన కుటుంబ పరిస్థితి తెల్పిన హరగోపాల్‌గారు ఈ సూచన చేశారు. నీకు ఇష్టమైతే వారితో చెప్తాను. రేపు నీ నిర్ణయం చెబితేచాలు" అన్నది నళిని.

సుభద్రమ్మకు పచ్చివెలక్కాయ గొంతున పడినట్లయింది. కుటుంబ పరిస్థితులు తారుమారైన ఆ పరిస్థితుల్లో ఆవిడ ఏమీ చెప్పలేకపోయింది. నా ఆడపిల్లలంతా మగపిల్లలై పోతున్నారు అనుకుంది మనస్సులో. రాజేశ్వరి మనస్సులో అనేక ఆలోచనలు సుళ్ళుతిరుగుతున్నాయి. సురేఖ మనస్సులో ఏ ఆలోచన కలుగలేదు.

# 11

ఎగ్జిబిషన్‌లో ఆ కాస్మొటిక్స్ కంపెనీవారు ఒక స్టాల్ ఏర్పాటు చేశారు, పౌడర్లు, స్నోలు, క్రీములు, హెయిరాయిల్సు, సబ్బులు మొదలైనవన్నీ ఆ స్టాల్లో ఉన్నయ్యి. ఎంతో అందంగా ఆ స్టాల్‌ను తీర్చి దిద్దారు. సేల్సు గరల్సుగా ముగ్గురు ఆడపిల్లల్ని నియమించారు. అందులో రాజేశ్వరి కూడా ఉన్నది. ఎంతో ఆలోచించి ఆ ఉద్యోగంలో చేరింది రాజేశ్వరి. మిగతా ఇద్దరు ఆడపిల్లలూ గత సంవత్సరం ఎగ్జిబిషన్‌లో పని చేశారు. అంచేత వాళ్ళకుకూడా ఈ వాతావరణం అలవాటైంది. రాజేశ్వరికి కొత్త.

సాయంత్రం ఆరుగంటలు దాటింది. ఎగ్జిబిషన్ స్టాల్స్ అన్నీ చూట్టానికి వచ్చిన వాళ్ళతో నిండిపోయి సందడిగా ఉన్నాయి. చాలామంది ఈ స్టాలుకూ వచ్చారు. ప్రతివారూ కావలసిన వాటిధరలను రాజేశ్వరిని అడిగారు. కాని చాలమందికి సమాధానాలు మిగిలిన ఇద్దరూ చెప్పారు.

"ఈ స్నోబాటిల్, పౌడరు డబ్బా, వేనిషింగ్‌క్రీమ్ కొన్నవాళ్ళకి ఒక అద్దం. దువ్వెన ఫ్రీగా ఇస్తామండీ, చాలా బావుంటయ్యి చూడండి" అన్నది రాజేశ్వరి.

ఒకరితో—

"చాలా బావుండేది అద్దం, దువ్వెనా, మీ ప్రోడక్ట్సు" అన్నారొకరు. కొంచం చిన్నబుచ్చుకుంది రాజేశ్వరి.

"ప్రోడక్ట్స్, అద్దం, దువ్వెనా అన్నీ బాగానే ఉంటయ్యండీ ఇవ్వమంటారా" అన్నది ఇంకో అమ్మాయి.

"మీరంతా ఇవ్వే వాడుతారా" అన్నాడొక కొంటె కాలేజి స్టూడెంటు.

"మేం వాడినా, వాడకపోయినా ఇటీజ్ అవర్ డ్యూటీ టు టెల్ టు ది పబ్లిక్ ఎ బౌట్ అవర్ ప్రోడక్ట్స్" అన్నది మరో అమ్మాయి.

"ఎస్ మేడమ్. అన్నీ ప్యాక్‌చేసి ఇవ్వండి" అన్నాడాకాయన. రాజేశ్వరి ప్యాక్‌చేసి, బిల్లురాసి ఇచ్చింది. బిల్లుచూసి అతను నవ్వు కున్నాడు. రాజేశ్వరి కంగారుపడ్డది.

"మేడమ్, బిల్లు అంకెల్లో నాలుగు రూపాయల ఇరవై అయిదు పైసలూ కరెక్టుగానే వేశారు. కాని అక్షరాలలో ఇరవై అయిదు రూపాయల నాలుగు పైసలని రాశారు. కాస్త బిల్లులు జాగ్రత్తగా వ్రాయండి" అని నాలుగు రూపాయల పావలా ఇచ్చివెళ్లాడు. రాజేశ్వరి ముఖం వెల వెలబోయింది. అప్పుడే వచ్చిన ప్రొప్రైటరు ఇది విని బిల్లుపుస్తకం చూశాడు.

"ఖంగారుపడకండి. మరేం ఫరవాలేదు. బిల్లు కరెక్టు చెయ్యండి. ఇకనుంచి కాస్త జాగ్రత్తగా వ్రాయండి" అన్నాడు.

"నేను వ్రాసిన మొదటిబిల్లు తప్పుగా వ్రాశాను. అంచేత బాధగా ఉంది" అన్నది రాజేశ్వరి.

మిగిలిన ఇద్దరమ్మాయిలూ నవ్వుకున్నారు. వాళ్ళు మొదట్లో ఇంకా తప్పులుగా బిల్లులువ్రాశారు. ఇప్పటికి కొంచెం రాటుతేలారు.

ఇట్లాంటి చిన్న చిన్న పొరబాట్లతో ఖంగారుపడుతూనే ఆ నెలా గడిపింది రాజేశ్వరి. ఈ నెలరోజుల్లో అనేక సంఘటనలనూ, అనుభూతులనూ అర్థంచేసుకున్నది. మాటల్లో చొరవా, ధైర్యంగా మాట్లాడం సమయస్ఫూర్తిగా జవాబు చెప్పడం, నవ్వుముఖంతో మాట్లాడ్డం నేర్చుకున్నది. జీవితంలో అడుగు పెట్టబోయేముందు ఈ ఎగ్జిబిషన్ స్టాలులో సేల్సు గరల్‌గా పనిచెయ్యటం తల్చుకుంటే, సముద్రంలో వదిలే నౌకకు అన్ని హంగులూ తీర్చిదిద్దినట్లుగా ఉన్నది.

ఈ నెలరోజుల్లోనూ ఎగ్జిబిషన్‌కు నళిని, సురేఖ మిగతా వాళ్ళంద రినీ తీసుకుని నాలుగుసార్లు వెళ్ళారు. ప్రత్యేకించి సురేఖ, నళిని అయిదారు సార్లు వెళ్ళారు రాజేశ్వరి ఉన్న స్టాలువద్ద పావుగంట పైగానే ఉండే వారు.

ఎగ్జిబిషన్ పూర్తయి స్టాల్సు ఎత్తివేశాక కాస్మెటిక్స్ కంపెనీ ప్రొప్రైటర్ ఒక పెద్ద హోటల్లో ఎగ్జిబిషన్‌స్టాల్‌లో పనిచేసిన తమ

స్టాఫ్‌కు విందుచేశాడు. మొత్తము నలుగురు మగవాళ్ళు, ముగ్గురూ ఆడ వాళ్ళు.

"మొదట్నుంచీ చూస్తూనే ఉన్నాను. రాజేశ్వరికి సిగ్గు, అభిమానమూ జాస్తి. సేల్సుగరల్‌గా తన కర్తవ్యాన్ని నిర్వహించినా, ఆంతర్యంలో ఆమెలోనుంచి కొన్ని భావాలు తొలగిపోలేదు. కాని ఆ భావాలే ఆమె జీవితాన్ని తీర్చిదిద్దగలవనే నా ఉద్దేశ్యం" అన్నాడాయన. ఆ ప్రొప్రైటరు పేరు హరిసర్వోత్తమరావు. వయస్సులో ఏభై దాటినా మనస్సుమాత్రం చిన్నతనానికి పోటీపడుతూ ఉంటుంది. జీవితంలో అనేక అనుభవాలను చవిచూచి ఇప్పుడింత పెద్దసంస్థకు అధిపతి అయ్యాడు.

"అన్ని ఉద్యోగాలకీ, ఈ ఎగ్జిబిషన్ స్టాలు ఉద్యోగానికీ చాలాతేడా ఉందంటే, ఆఫీసుల్లో ఉద్యోగాలు జీవితాన్ని ఒకే దృక్పథంలో నడిపిస్తయ్యి. ఈ ఉద్యోగం ప్రతినిత్యమూ ఏదో కొత్తదనాన్ని కల్పిస్తూనే ఉంటుంది. కొత్తనుకొంతవరకూ ఆదరించినా పాత భావాలనూ, సాంప్రదాయాలనూ విస్మరించకూడదనే నా ఉద్దేశ్యం. ఏమంటావు కమలా" అని ప్రక్కనున్న అమ్మాయితో అన్నది. అమ్మాయిలిద్దరూ నవ్వి ఊరుకున్నారు. హరి సర్వోత్తమరావు మనస్సు ఆనందంతో నిండిపోయింది.

"మీకు వీలయినప్పుడు మా ఇంటికి రండి. మాకు ఆడపిల్లలులేరు. మీరు వస్తే మా ఆవిడ చాలా సంతోషిస్తుంది" అన్నాడాయన ముగ్గురు ఆడపిల్లలవైపు చూస్తూ.

"తప్పకుండా వస్తామండీ. మాలో ఎవర్ని పెంచుకున్నా మాకు అభ్యంతరంలేదు" అన్నది రాజేశ్వరి.

అంతా నవ్వుకున్నారు.

మొదటి నెలజీతం వందరూపాయలూ తెచ్చి తల్లిచేతిలో ఉంచి నమస్కరించింది రాజేశ్వరి నళిని మనస్సు సంతోషంతో ఉక్కిరిబిక్కిరై పోయి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. సుభద్రమ్మ మనస్సు విచారంతో పూడిపోయినా, ఆమెలోని పాతభావాలు తొంగిచూసినా, ఇదమిద్ధమైన ఏ అభి

ప్రాయమూ ఆమె వెలిబుచ్చలేకపోయింది. ఈ ఆడపిల్లల ఉద్యోగాలు వాళ్ళను ఏవిధంగా తీర్చిదిద్దుతయ్యో ఆమె ఊహించలేకపోయింది.

"ఆ జీతం నీవద్దనే ఉంచి నువ్వు వాడుకో రాజా, కుటుంబఖర్చులకు వాడకు. నీకు కావలసిన బట్టలు కొనుక్కో. నీ అభిప్రాయం ఏమిటి నళినీ" అన్నదావిడ. కళ్ళు తుడుచుకుంది నళిని. వాత్సల్యంతో చెల్లెలి ముంగురులు సరిచేస్తూ.

"రాజా, అమ్మ చెప్పినట్లుగానే ఆ డబ్బుతో నీక్కావలసిన బట్టలు కొనుక్కో ఉద్యోగాధ్యాయానికి ఇది నాందీప్రస్తావనే కనుక, ఈ విషయంలో ఇంక ఏ ఆలోచనా అక్కర్లేదు" అన్నది నళిని.

వందరూపాయలూ తీసుకువెళ్ళింది రాజేశ్వరి.

మరో నాలుగురోజులు గడిచాయి. రాజేశ్వరి తను కొనుక్కున్న కొత్తచీరె, జాకెట్టు వేసుకుని హరిసర్వోత్తమరావుగారింటికి బయల్దేరింది.

రిక్షా దిగగానే ఆ ఇంటిగేటుకి ఉన్న చిన్నబోర్డు చూసింది. "కుక్కలున్నవి జాగ్రత్త" అన్నబోర్డు ఉంటే ఆ ఇంటివారి హుందాతనం వెల్లడవుతుంది కావాలనుకుంది రాజేశ్వరి

గేటులోనుంచీ లోపలికి వెళుతుంటే చీకటిలోనుంచీ వెలుగులోకి వెళుతున్నట్లున్నదామెమనస్సు. ప్రతి మానవునికీ ఒక ఉన్నతమైన జీవితాశయం అవసరమైనట్లే ప్రతి పనికీ ఒక ధ్యేయం ఎంతో అవసరం.

వరండాలో ఎవ్వరూలేరు. ఎవరిని పిలవాలో తెలీలేదు వరండాలోనుంచీ ముందు హాల్లోకి వెళ్ళింది. ఆ హాలు తీర్చిదిద్దినట్లుగా ఉన్నది. అక్కడా ఎవ్వరూలేరు. గేటుకి కట్టబడిన బోర్డుమీద వ్రాసినట్లుగా కుక్కలుకూడా కనుపించలేదు,

నేరుగా లోపలికి వెళ్ళింది. నాలుగ్గదులూ దాటాక దొడ్డివైపు వరండాలో పక్కగదిలో ఒకావిడ పూజచేస్తూ కనిపించింది.

"హమ్మయ్య, ఈ ఇంట్లో మనుష్యులు ఉన్నారు" అనుకుంది మనస్సులో రాజేశ్వరి.

ఆవిడ పూజలో నిమగ్నురాలై ఉన్నది. పలకరించకూడదని అటూ ఇటూ చూస్తూ అక్కడే నిల్చున్నది.

పది నిమిషాలు గడిచాయి. ఆవిడ పూజ పూర్తయింది. రాజేశ్వరిని చూసి ఒక్క క్షణంసేపు ఆగి,

"సిగ్గులేక ఇంటికూడా వచ్చావా. నడుబైటకి" అన్నదావిడ నిలు వెల్లా కోపంతో వణికిపోతున్నది. రాజేశ్వరి ప్రాణాలు పైనే పోయి నయ్యి. నిరుత్తరాలై అట్లాగే నిల్చున్నది. కళ్ళజోడు సర్దుకుని కళ్ళార్ప కుండా చూసిందావిడ.

"ఎవరమ్మా నువ్వు. ఎవరైనాకానీ, నేననుకున్న అమ్మాయివి కాదులే పొరబాటుపడ్డాను. క్షమించు"ఖిన్నురాలై చూసిందావిడ. తుఫానులో చిక్కుకున్న నావ, తుఫాను వెలిసి తీరానికి చేరుకున్నట్లుగా ఉన్నది రాజే శ్వరిమనస్సు.

"కాస్మెటిక్స్ కంపెనీ ప్రొప్రైటర్ హరి సర్వోత్తమరావుగారిల్లు ఇదేకదండి. వారులేరా".

తను పూర్తిగా పొరపాటు పడ్డాననుకున్నదావిడ, తన తొందర పాటుకు తననుతానే నిండించుకున్నది.

"అవునమ్మా వారిల్లు ఇదే, వారు పనిమీద బొంబాయి వెళ్ళారు. రెండు మూడు రోజుల్లో వస్తారు. రామ్మా కూర్చో" అంటూ ఆవిడే అక్కడున్న కుర్చీలో కూర్చోపెట్టింది. వంటగదిలోకి వెళ్ళి కాఫీతెచ్చి రాజేశ్వరికి ఇచ్చింది. వద్దన్నా వినలేదు. బలవంతాన కాఫీ తాగింది రాజే శ్వరి.

"ఎవరమ్మా నువ్వు. నీ పేరేమిటి, ఏంపనిమీద వచ్చావు" ఆప్యా యంగా అడిగిందావిడ.

ప్రశ్నలకు జవాబు చెప్పింది రాజేశ్వరి.

"మావారు తప్పకుండా నీకు ఉద్యోగం ఇస్తారు. ఒకవేళ ఖాళీ లేదన్నా నేను ఊరుకోను. ఆడపిల్లలు ఉద్యోగాలు చేస్తుంటే ఆ ఇల్లూ, ఆ ఆడపిల్లల మనస్సూ ఎంతో శోభాయమానంగానే ఉంటుంది. ఈ రోజుల్లో

ఉద్యోగం పురుషలక్షణం కాదమ్మా. మానవలక్షణం. ఉద్యోగాలతోపాటు ప్రేమించి పెళ్ళిళ్ళుకూడా చేసుకుంటే ఆ తల్లిదండ్రులకుకూడా కట్నాల బెడదా తప్పించినవారవుతారు" అన్నదావిడ.

ఈ ధోరణి ఏమిటో రాజేశ్వరికి అర్థంకాలేదు. ఆవిడ మొదట్లో అనుకున్న అమ్మాయి ఎవరో అంతకన్నా అర్థంకాలేదు.

"సరేనండి, శలవు. హరి సర్వోత్తమరావుగారు వచ్చాక వస్తానండీ, ఉద్యోగం విషయమై అడుగుదామని వచ్చాను" కుర్చీలోనుంచి లేచి ఆవిడకు నమస్కరించి వెళ్ళబోయింది రాజేశ్వరి

క్షణంసేపుచూసి కళ్ళు తుడ్చుకుంది ఆవిడ.

"నువ్వింక ఈ ఇంటికి రావుతల్లీ నాకు తెలుసు. మొదట్లోనే నా మాటలద్వారా ఒక గుట్టు తెలిసిపోయింది" అన్నదావిడ ఎంతో అభిమాన పడుతూ.

"ఎవరో మరొక స్త్రీ మీవారికోసం వచ్చిఉంటారు. నేనే ఆ స్త్రీ అనుకుని పొరపాటుపడ్డారు మీరు. పొరబాటు మానవసహజం. సర్లెండి వస్తాను"

వెనక్కితిరిగి చూడకుండా వెళ్ళింది రాజేశ్వరి. "హరి సరోత్తమ రావుగారు స్త్రీలోలుడు కామాలు" అనుకుంది మనస్సులో.

ఇంటికి చేరుకుని "బ్రతికానురా భగవంతుడా" అనుకున్నది.

నాలుగురోజులు గడిచాయి. వాకిట్లో కారాగిన చప్పుడు విని నళిని వచ్చింది. హరి సర్వోత్తమరావుగారూ, ఆయన భార్య. ఆశ్చర్యపోయింది నళిని. ఆ సమయంలో రాజేశ్వరి ఇంట్లోలేదు. స్నేహితురాలింటికి వెళ్ళింది.

సాదరంగా ఆహ్వానించింది నళిని.

"నమస్కారమండీ. పెద్దలు మీరిట్లా మా ఇంటికి వచ్చారు. ఎగ్జిబిషన్ స్టాలులో రాజేశ్వరి ఏమైనా లెక్కలు తప్పుగా రాసిందా" అన్నది నళిని.

ముగ్గురూ కూర్చున్నారు. ఎంత ఆలోచించినా వాళ్ళెందుకువచ్చారో నళినికి అర్థంకాలేదు.

"మా రాక మీకు ఆశ్చర్యం కలిగించినా, ఆ సందర్భంగా రాలేదని ఒకరకంగా క్షమాపణకోరుకుందామని వచ్చానమ్మా నళినీ, రాజేశ్వరి లేదా" అన్నదావిడ

నవ్వేముఖంతో నళినివైపు చూశాడాయన. ఎవరో మాట్లాతున్నారని సుభద్రమ్మ వచ్చింది. వాళ్ళు ఎవరో ఆమెకు తెలియదు. తల్లీ కూతుళ్ళ ముఖంలోని ఆశ్చర్యం చూస్తుంటే ఆ దంపతులిద్దరికీ అదొక వేదనగా ఉన్నది.

ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని ఎవ్వరూ ఆమోదించలేకపోయారు.

"నాపేరు హరి సర్వోత్తమరావండి. కాస్మెటిక్స్ కంపెనీ మాదే. మొన్న ఎగ్జిబిషన్‌లో మా స్టాలులో మీ అమ్మాయి రాజేశ్వరి పనిచేసింది. వందరూపాయలు జీతం ఇచ్చాను. అంతవరకూ మీకు తెల్సుననుకుంటాను" అన్నాడాయన చేతికర్రను తిప్పుతూ. సుభద్రమ్మ ఆదుర్దా కొంత తగ్గింది. నళిని ఆదుర్దా ఎక్కువైంది.

"నాలుగురోజులక్రితం మా ఇంటికి మీ రాజేశ్వరి ఉద్యోగంకోసం వచ్చింది. మావారు బొంబాయి వెళ్ళారు. అంతకుక్రితం రాజేశ్వరిని నేను చూడలేదు. నేను పొరబాటుగా ఎవరో అనుకుని సిగ్గులేక ఇంటిక్కూడా వచ్చావా నడు బైటికి, అన్నాను. నోరుజారింది. కన్నతల్లి సమక్షంలో నా పొరబాటు వప్పుకుని మన్నించమని వేడుకొందామని వచ్చాను. ఇప్పటికి నా మనస్సు కుదుటపడింది" అన్నదావిడ.

సుభద్రమ్మకు ఏమీ అర్థంకాలేదు నళిని ఆలోచిస్తున్నది. ఇంతలోనే పిల్లలంతా బడినుంచి వచ్చారు. ట్యుటోరియల్ కాలేజినుండి సురేఖకూడా వచ్చింది. ఎవరికివారు వింతగా ఆ దంపతుల్ని చూడసాగారు.

"మా కంపెనీలో రాజేశ్వరికి ఉద్యోగంకూడా ఇస్తున్నాను. రెండు రోజుల్లో చేరమనండి" అన్నాడాయన. అందరివద్దా శలవు తీసుకుని వారిద్దరూ వెళ్ళిపోయారు.

ఏమిటన్నట్లుగా సురేఖ చూసింది. జరిగినదంతా నళిని చెప్పింది. సాకల్యంగా విన్నది సురేఖ.

"కంపెనీ ప్రొప్రైటరు ఇంటికొచ్చి ఉద్యోగం యిస్తానని చెప్పటంలో ఏదో మోసం ఉన్నది నళినీ. ఈ సమయంలో రాజేశ్వరి ఉంటే ఎంతో బావుండేది" అన్నది సురేఖ.

"అవునమ్మా. నాకూ అనుమానంగానే ఉన్నది" అన్నది సుభద్రమ్మ. నళిని మాట్లాడలేదు.

మరో అరగంటలో రాజేశ్వరి వచ్చింది. జరిగినదంతా చెప్పింది నళిని.

"ఉద్యోగం ఇస్తానని ఇంటికొచ్చి ఎవరన్నా చెపుతారా, మోసం కదూ" అన్నది సురేఖ.

రాజేశ్వరి ఆలోచన ఒకదారికి వచ్చింది. వానకురిసి వెలిసి సూర్యరశ్మివచ్చినా, కొమ్మలు కదల్చగానే ఆకులమీదినుండి వాననీళ్ళు నెత్తిమీద పడ్డట్లుగా ఉన్నది నళిని మనస్సు.

"నేనూ మోసమనే అనుకున్నాను. కాని ఏ స్త్రీ అయినా తన భర్త కూడ, పరస్త్రీలోలుడని తెలిసినా కొత్తస్త్రీలతో పరిచయాన్నితానుగా కల్పించదేమో" అన్నది రాజేశ్వరి.

సురేఖ మనస్సు విదిల్చింది. ఏవో భావాలు ఎండుటాకులుగా రాలిపోయాయి. నళిని మనస్సు కొత్త ఆలోచనలను వెతుక్కుంటోంది.

"నేను ఉద్యోగంలో చేరదల్చుకున్నాను నళినీ. రేపే కంపెనీకి వెళ్తాను" తన నిర్ణయం తిరుగులేనట్లుగానే చెప్పింది. ఏం చెప్పడానికీ ఎవ్వరికీ నోరు రాలేదు.

మర్నాడు ఉదయం తొమ్మిదిగంటలకు రాజేశ్వరి కాస్మెటిక్స్ కంపెనీకి వెళ్ళింది. హరిసర్వోత్తమరావుగారు సాదరంగా ఆహ్వానించారు.

"మా యింటికి వెళ్ళు రాజేశ్వరి. నీ మనస్సులోని అనుమానాలన్నీ మా ఆవిడ నివృత్తి చేస్తుంది. వెళ్ళరా" అన్నాడాయన. రాజేశ్వరి ఆశ్చర్యపోలేదు.

వాళ్ళింటికి వెళ్ళింది రాజేశ్వరి.

"రామ్మా రాజేశ్వరీ. నువ్వు వస్తావని నాకు తెలుసు" అన్నది రాజేశ్వరి తల ఆప్యాయంగా నిమురుతూ.

"ఉద్యోగంకోసం మీ కంపెనీకివెళ్ళాను. ఇంటికివెళ్ళి మీకు కని పించమన్నారు" అన్నది నిర్లిప్తతగా.

"అవునమ్మా నీ ఉద్యోగం ఇక్కడే. నాకు పర్సనల్ సెక్రటరీ కావాలి. కంపెనీకి యజమానివారు, ఇంటి యజమానురాలిని నేను. నాకు సెక్రటరీ అవసరం లేదంటావా" నవ్వుతూ అన్నాదావిడ.

"అందుకు వయస్సులోఉన్న పెళ్ళికాని ఆడపిల్లనే కావాలంటారా" అంది రాజేశ్వరి. మాటలో తొట్రుపాటు లేకపోయినా, మనస్సులోని కంగా రను ఆవిడ అర్థంచేసుకుంది. పగలల్లా ఎగిరి తిరిగి సాయంత్రం కాగానే పిల్లలకు మేతతెచ్చి గూటికి చేరిన పక్షిలాగా ఉన్నదామె మనస్సు.

"అవునమ్మా—ఏభై య్యో పడిలోపడ్డ నేను నా పర్శనల్ శెక్రటరీగా చిన్నవాళ్ళనే ఎంచుకోవాలిగాని నా వయస్సు వాళ్ళను ఎందుకమ్మా ఎంచు కోవడం, ఇద్దరంకలిసి పురాణాలు చదువుకోటానికా".

అప్రయత్నంగా ఫక్కున నవ్వింది రాజేశ్వరీ. ఆ నవ్వులో మునిగి తేలిందావిడ.

"కార్యదర్శి ఉద్యోగానికి ఒప్పుకున్నాను. జీతం ఎంత. ఆఫీసుకు ఎప్పుడు రావాలి, ఎప్పుడు వెళ్ళాలి" ఈ అర్థంలేని కొత్త ఉద్యోగాన్ని వదులుకోకూడదనుకున్నది రాజేశ్వరి.

"నెలకు రెండువందల జీతం. ఉదయం ఎనిమిదిగంటలనుంచీ సాయంత్రం ఆరుగంటలవరకూ పని. ఇష్టమైతే ఇక్కడే భోజనం చెయ్య వచ్చు. లేకపోతే ఆకలివేసినపుడు ఇంటికివెళ్ళి భోజనంచేసి రావచ్చు. ఇష్టమేనా" అధికార యుక్తంగానే అన్నదావిడ. నమ్రతగానే తన అంగీ కారాన్ని తెల్పింది రాజేశ్వరీ.

"రేపటినుంచి రమ్మంటారా"

"అట్లాగే" వింత ఉద్యోగాన్ని వివిధరీతుల్లో ఆలోచించుకుంటూ వెళ్ళింది రాజేశ్వరి.

మర్నాడు ఉదయం ఎనిమిదిగంటలకు వాళ్ళ ఇంటికి వెళ్ళింది రాజేశ్వరి. ఆవిడ స్నానంచేసి పూజచేసుకోబోతున్నది.

"గుడ్‌మార్నింగ్ మేడమ్"

"వెరీగుడ్‌మార్నింగ్, రామ్మారా. నీ కోసమే చూస్తున్నాను".

"మీరు పూజామందిరంలోకి వెళ్ళబోతున్నారు. నా ఆఫీసుగది ఏదీ, ఏంచెయ్యాలో చెపితే ఆ కాగితాలు చూసుకుంటాను. క్షమించాలి. నాకు టైపు బాగారాదు" అన్నది వినయపూర్వకంగా రాజేశ్వరి.

నా మనస్సే నీ ఆఫీసు గది. నాకు సహాయంగా ఉండటమే నువ్వు చెయ్యవలసిన పని. నా మనస్సుకు ఆహ్లాదం కలిగించటమే నువ్వు చూడవలసిన ఫైల్సు నా పేరు గాంధారి. అసలు చిన్నప్పటిపేరు సరోజిని. కాని గాంధారి పేరే నాకు బావుంది. నన్ను ఎట్లా పిల్చినా పలుకుతాను" అన్నదావిడ.

అప్పటికే పనిమనిషి గదులన్నీ ఊడ్చి, అంట్లుతోమి అన్నీ తెచ్చి పెట్టింది. నౌకరు కూరలు తెచ్చి వంటింటి గుమ్మంలో ఉంచి, మొక్కలకు నీళ్ళు పోస్తున్నాడు. ఇంతకన్న ఆ ఇంట్లో మరెవ్వరూ కనబడలేదు రాజేశ్వరికి. మేడమీదకూడా నాలుగు గదులున్నయ్యి. ముందుగది తాళంవేసి ఉన్నది.

ఉద్యోగానికి వచ్చిన రాజేశ్వరికి, ఏ ఆలోచనా ఒక రూపాన్ని ఇవ్వటంలేదు. వేచి చూట్టంకన్న చెయ్యగలిగిందీ కనపడలేదు.

"సరేనండీ. ఇప్పుడేం చెయ్యమంటారు, పోనీ కూరలు తరగనా".

"అక్కర్లేదు. ఈ ఇల్లంతా తిరిగి చూడు కొత్తగా ఉద్యోగంలో చేరినవాళ్ళు మొదటిరోజున ఏం చెయ్యగలుగుతారూ. సరే, నేను పూజ చేసుకుంటాను" ఏమీ తోచక ఆ పూజా గృహం గుమ్మంముందరే కూర్చుంది రాజేశ్వరి. ఏదో ఆలోచన తరుముకుంటూ వచ్చింది.

"హరిసర్వోత్తమరావుగారు భోజనానికి ఎన్నిగంటలకు వస్తారు"

"ఒంటిగంటకు" అన్నదావిడ.

"అంతవరకూ నేను ఉండాలంటారా".

"నువ్వు నా పర్సనల్ సెక్రటరీవి, వారికికాదు. అయినా తండ్రి లాంటివారితో మాట్లాడ్డానికి భయమెందుకమ్మా"

ఆవిడ దీపారాధన చేసిన తరువాత ఆచమనంచేసి "ఓం కేశవాయ స్వాహా, నారాయణ స్వాహా, మాధవయ స్వాహా...." అంటోంది.

మందిరంలోని దేవుళ్ళను చూస్తూ కూర్చుంది రాజేశ్వరి. అందరు దేవుళ్ళు తనను ఆశీర్వదిస్తున్నట్లుగానే భావించింది.

# 12

పోస్ట్‌మేన్ తెచ్చిఇచ్చిన కవరు అందుకుని అందులోని ఉత్తరం చూశాడు రాఘవరావు. ఆశ్చర్యపడకపోయినా ఆదుర్దాగా చదువుకున్నాడు.

హైద్రాబాద్

నాన్నగార్కి నమస్కారములు,

పిల్లల జీవితాలు తల్లిదండ్రులు తీర్చిదిద్ది ఒక ఇంటివారిగా చెయ్యడంలో విశేషంలేదు. సురేఖ జీవితాన్ని మీ ఇష్టంవచ్చినట్లుగానే తీర్చిదిద్దారు. ఫలితం? సురేఖ పుట్టిల్లు చేరింది.

ఇక నా విషయంలో గత చరిత్ర చెప్పడం అవసరం. నా వ్యక్తిత్వానికే నేను గౌరవం ఇస్తాను కాని, ఎవ్వరికీ తలవంచని విషయం మీ రెరిగినదేకదా! ఫలితం, నేను హైదరాబాద్ చేరుకొని ఉద్యోగం సంపాదించుకున్నాను మీతో మాటలు పెంచుకుని కూర్చుంటే నా జీవితం సముద్రపువడ్డున వ్యవసాయం చేసినట్లుగానే ఉంటుంది. అందుకే వచ్చేశాను.

ఇక్కడికి నా జీవితం ఒక మలుపుతిరిగింది. నా జీవితాన్నిగురించి నేను ఎన్ని మలుపులుతిరిగినా నా మనస్సులో ఏదో ఒకమూల కాస్తచోటు

చేసుకున్నది అమ్మమాత్రమే. పరిస్థితుల ప్రాబల్యంవల్ల అమ్మకూ చెప్ప కుండా వచ్చేశాను. అందుకు అమ్మ బాధపట్టంలో తప్పులేదు నన్నుగురిం చిన దిగులే అమ్మను కృంగదీయవచ్చు.

ఈ పరిస్థితిలో నా జీవితాన్ని ఇంకో మలుపుకూ తిప్పుకున్నాను. నేను గృహస్థుడినీ అయ్యాను. మీ కోడలిపేరు లీలావతి. మా పెళ్ళి మీ రెవ్వరూ లేకుండా జరిగినందుకు నేను సంతోషపడుతున్నాను కారణం ? కట్నంలేకుండా మీరు పెళ్ళికి వప్పుకుంటారని నేను అనుకోను

కొడుకూ, కోడలిని చూడాలని అమ్మ తప్పకుండా పట్టుబడుతుంది. కంటతడి పెడుతుంది కనుక అమ్మనుతీసుకుని మీరు హైదరాబాదు వస్తే చాలా బావుంటుందని మా దంపతుల ఉద్దేశ్యం. అడ్రసు వ్రాస్తున్నాను. తప్పక వస్తారుఃదూ !

మీ.

శ్రీనివాసరావు.

ఉత్తరం చదివి తండ్రికి ఇచ్చాడు రాఘవరావు. ఆయన కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. రామయ్యాగారు ఉత్తరం చదువుకుని కోడల్ని పిలిచారు.

"నీ కొడుకు ఉత్తరంరాశాడమ్మా. హైద్రాబాదులో ఉద్యోగమూ అయింది, పెళ్ళి అయింది, కోడలిపేరు లీలావతి కొడుకూ, కోడలూ మిమ్మల్ని రమ్మంటున్నారు" అన్నాడాయన. ఈ పెద్దతనంలో ఇవ్వన్నీ చూస్తూ నే నెందుకు బ్రతికిఉన్నానా అని తనసుతాను నిందించుకున్నా డాయన

"ఏమిటి పెళ్ళికూడా చేసుకున్నాడా. ఏ వర్ణాంతర వివాహమో అయివుంటుంది ఛీ! ఛీ! సిగ్గులేకపోతేసరి" అన్నది మాణిక్యమ్మ. దుఃఖం పెల్లుబికివచ్చి ఆమె కళ్ళు చెరువులే అయ్యాయి.

"సిగ్గూ, మానాభిమానాలూ వాడికి ఎట్లాగూలేవు. మానకన్నా ఉన్న య్యని నువ్వు వప్పుకుంటే అంతేచాలు" అన్నాడు రాఘవరావు.

"అంతా నన్నే అనండి. ఇప్పుడు నేనేంచేశాను" అన్నదావిడ కళ్ళు తుడ్చుకుంటూ.

"ఏమీ చెయ్యక్కర్లేదు. వాడు పెళ్ళిచేసుకున్న సంగతి ఎవ్వరికీ చెప్పకండి. నేను హైద్రాబాదు వెళ్ళి అన్నీ తెల్సుకుని వస్తాను. అంత వరకూ ఎవ్వరూ నోరెత్తకండి" అన్నాడు నెమ్మదిగా రాఘవరావు ఆ మర్నాడే ప్రయాణమయ్యాడు.

ఇంటికి వచ్చిన రాఘవరావును చూడగానే లీలావతి ఆయన ఎవరో గ్రహించింది.

"నమస్కారం మామగారూ, కూర్చోండి. నాన్నగారు ఆఫీసుకు వెళ్ళారు మీ కొడుకూ బ్యాంకుకు వెళ్ళారు. ఇద్దరూ ఇంకో గంటలోగా రావచ్చు. అత్తయ్యగార్ని తీసుకురాలేదేం, వారూవస్తే బావుండేది".

ఆ మాటలో నమ్రతతోపాటు కొంత అహంకారమూ లేకపోలేదు. కోడల్ని చూడగానే ఆయనభావాలు ఆయన్నే బాధపెట్టసాగాయి.

"నీ పేరేమిటమ్మా" అంతకన్నా కోడల్ని ఎట్లా పలకరించాలో మనకు అర్థంకాలేదు.

"లీలావతి, మీకు వ్రాసిన ఉత్తరంలో నా పేరు వ్రాశారను కొంటాను" పేరు తెలిసికూడా అడగడం ఎందుకూ అన్నట్లుగా చూసింది.

"మీ అమ్మగారున్నారా".

"ఆ. పిలుస్తాను" లోపలికివెళ్ళి తల్లిని తీసుకువచ్చింది లీలావతి. వియ్యంకుని ఎదుటకు ఆమె రాలేకపోయింది. జరిగినది తప్పని ఆమెకు తెల్సినా ఆ తప్పును తప్పుగానే వప్పుకోటానికి ఆమె మనస్సు అంగీకరించలేదు.

"జరిగిందేదో జరిగిపోయింది, పెద్దవాళ్ళం ఏంచేసినా పిల్లల భవితవ్యంగురించే కదా పాటుపడేది. వాళ్ళ పురోభివృద్ధికోసం, వాళ్ళ కోరికల్ని అనుసరించి కొన్ని తప్పులు చెయ్యకతప్పదు. కోడల్ని ఆశీర్వదించండి" అన్నదావిడ.

తల్లి మాటలకు లీలావతికి వళ్ళు మండిపోయింది.

"ఏమిటమ్మా ఆ మాటలు. ఏంతప్పు జరిగింది. శ్రీనివాసరావుని నేను పెళ్ళిచేసుకున్నాను గాని, అక్రమసంబంధమేమీ ఏర్పాటు చేసుకో

లేదు. నాకు ఎవరి సానుభూతీ ఆశీర్వచనమూ అక్కర్లేదు" అన్నది కోపంతో. రాఘవరావుకు తల తిరిగిపోయింది. కోడలి మనస్తత్వం నిమిషంలోనే అర్థమైంది. ఇంక ఎక్కువగా మాట్లాటం అనవసరమే నను కున్నాడాయన.

"నిజమేనమ్మా. మీరిద్దరూ సుఖంగాఉంటమే నాకూ కావాల్సింది. నేను వెళ్ళొస్తాను. నేను వచ్చి వెళ్ళానని శ్రీనివాసరావుకి వీలయితే చెప్ప వచ్చు. లేకపోతే లేదు. మీ ఇష్టం" ఒక్కక్షణంకూడా కూర్చోకుండా వెళ్ళాడాయన. తల్లి నిశ్చేష్టురాలైంది. కూతురు నవ్వుతూ చూసింది.

సంచీ చేత్తో పుచ్చుకుని రాఘవరావు స్టేషనువైపు నడుస్తున్నాడు. నాంపల్లిస్టేషను అక్కడికి నాలుగుమైళ్ళు పైగానేఉంది. వచ్చేటప్పుడు కొడుకుని చూడాలనే ఆదుర్దాతో టాక్సీలో వచ్చాడు. కోడల్ని చూడగానే, ఆమె మాటలు వినగానే ఆ ఆదుర్దా అంతా జావగారిపోయి, నిరాశ, నిస్పృహ చెరో ప్రక్కన చేరాయి. వాటి ఆసరాతో ఆయన నడిచే వెళు తున్నాడు స్టేషనుకి.

"నాన్నగారూ" తలఎత్తి చూశాడు.

"ఎప్పుడొచ్చావు నాన్నా. ఇటెక్కడికి ఇంటికెళదాం పద. ఏయ్ టాక్సీ" ఆయనకళ్ళు చెమర్చలేదు, కన్నార్పకుండా కొడుకువైపుచూశాడు. తండ్రి, కొడుకూ మాట్లాడుకోటం మానేసి దాదాపు మూడేళ్ళయింది. మళ్లా యిదే వాళ్ళిద్దరూ మాట్లాడుకోవడం.

"కులాసానా. అమ్మ కులాసాగా ఉన్నదా, తాతయ్య ఆరోగ్యంఎట్లా ఉన్నది ? సురేఖా, తమ్ముడూ ఎట్లా ఉన్నారు ? ఇంటికి వెళదాం. ఇదిగో టాక్సీ ఎక్కు" అన్నాడు శ్రీనివాసరావు.

"అక్కర్లేదురా, టాక్సీని పంపించెయ్యి. ఇట్లా నడిస్తేనే బావుం టుంది." టాక్సీ వెళ్ళిపోయింది.

"హైద్రాబాదువచ్చి ఉద్యోగం సంపాదించుకున్నావు గృహస్థుడి వయ్యావు. చాలా సంతోషం. ఇంటికి వెళ్ళేవస్తున్నాను. కోడల్ని చూశాను. ఆప్యాయంగా మాట్లాడింది. ప్రేమించి చేసుకున్న పిల్ల, ఛాతా తెలి

వైనదే" నడుస్తూనే అన్నాడాయన శ్రీనివాసరావు పుట్టినప్పట్నుంచీ అతన్ని ఎట్లా పెంచిందీ, నాలుగేళ్ళుగా అతను ఎట్లా ఎదురుతిరిగిందీ ఆయన మనస్సులో ఆ సంఘటనలన్నీ కలగాపులగంగా కనుపించ సాగాయి.

"అయితే ఉండకుండా వచ్చేస్తున్నావేం ? అమ్మను తీసుకువస్తా వనుకున్నాను".

"అవును అదేవస్తే బాగుండేది. కోడల్ని చూసేది. సరే, నేను ఈ రాత్రికి వెళ్ళిపోవాలి. నువ్వు వెళ్ళిరా. చాలాదూరం నడుస్తున్నావు"ఆయన మాటలో ఆర్ద్రితలేదు. మక్కువైనా, గాజుపెంకుల్తో చెలగాటం ఆడితే గుచ్చుకుంటాయని ఆయనకు తెలుసు.

"లీలావతి సరిగా మాట్లాడలేదా నాన్నా. కొంచెం భయపడి ఉంటుంది".

అభావంగానే తనలో తను నవ్వుకున్నాడాయన.

"నేను వెళ్ళగలనురా, నువ్వు ఇంటికివెళ్ళు. అమ్మాయి నీ కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. ఆ పిల్లకు ఎన్నడూ కోపం తెప్పించకు. ఇంక ఆగిపో" అన్నారాయన. ఆ మాటల్లోని ఆవేదనను లీలగా గ్రహించాడు శ్రీనివాసరావు. జీవితంలో నాన్నను ఓడించాననే భావం హఠాత్తుగా కలగ టంతోనే తండ్రి ఆవేదన తెల్సినా అతడేమి పట్టించుకోలేదు.

"సరే వెళ్ళిరా నాన్నా. ఒక్కమాట, అమ్మకూడా వచ్చి కోడల్ని చూస్తే బావుంటుందని నా అభిప్రాయం. తరువాత మీ ఇష్టం" అన్నాడు శ్రీనివాసరావు.

"అల్లాగే"—ఇంకా ఆయనకు మాట పెగిలిరాలేదు. గబగబా నడిచి స్టేషనుకు వెళ్ళిపోయాడు. వెనక్కితిరిగాడు శ్రీనివాసరావు.

ఇంటికి వెళ్ళగానే లీలావతి అన్నది.

"మీనాన్న వచ్చి వెళ్ళారు"

"ఉండమ్మనక పోయావా"

"ఏమో, అనాలనిపించలేదు. తమకు తెలీకుండా కొడుకు పెళ్ళి చేసుకున్నాడని ఆయనకు చాలా కోపంగాఉంది".

"అది సహజమేకదా"

"ప్రేమించి పెళ్ళిచేసుకోవడం సహజమే"

"కాదని ఎవరన్నారు ?"

"నువ్వేదో మీ నాన్నను వెనకేసుకొస్తుంటేను" ముఖంలో కోపం తొణికిసలాడింది.

"అక్కడే పొరబడ్డావు. ఎంత ఉద్యోగంచేస్తున్నా ఆడది ఆడదే".

"పొరబాటు, ఈ రోజుల్లో ఆ మార్పులూ వస్తున్నయ్యి. మీ నాన్న గారు దార్లోనే కన్పించారు. నువ్వు అక్కడే మాట్లాడి అట్లాగే పంపించావు".

"అవును నీకెట్లా తెలుసు"

"అందుకనే మగవాడికి ఆడదాని ఆంతర్యం అర్థంకాదు".

"బదులుకు బదులు చెప్పావు లీలా. వెరీగుడ్."

ఆ రాత్రి శ్రీనివాసరావుకు నిద్రపట్టలేదు. మనస్సులో ఏమిటో ఆందోళన, ఆవేదన కళ్ళు మూసుకుని పడుకున్నాడేగాని నిద్రపట్టలేదు. ఆ రీతిగా అతనుంటే హాయిగా నిద్రపోయింది లీలావతి. తెల్లవారింది.

"మీ నాన్నగారి గొడవలో అసలుసంగతి చెప్పడం మర్చిపోయాను. మా ఆఫీసు వాళ్ళందరం ఈరోజునే పిక్‌నిక్‌కు వెళుతున్నాం. నిన్నుకూడా ఆహ్వానించారు వస్తావా. శలవేకదూ"

"నే నెందుకూ, నువ్వు వెళ్ళరా లీలా"

"నిన్ను అందరికీ పరిచయం చేస్తాను. ఆ మా ఆఫీసు మేనేజరు ఆయనకూడా వస్తాడు, మీ ఇద్దరికీ మంచి పరిచయమేకదూ"

"అట్లాగా, అయితే తప్పక వస్తాను ఆయన్ని చూసి చాలా రోజులైంది".

ఉదయం తొమ్మిదిగంటలకల్లా అంతా గోల్కొండకోట చేరుకున్నారు. క్యారేజీల్లో పళ్ళు ఫలహారాలూ, కాఫీ వగైరా సరంజామా

అంతా ఉన్నది. మొత్తం పన్నెండుమంది ఉన్నారు. లీలావతి మినహా అంతా మగవాళ్ళే. అంతా కోటపైకి ఎక్కి అనాటి సౌభాగ్యాన్ని, భోగ భాగ్యాల్ని చెప్పుకుని ఆనందిస్తున్నారు.

"ఈ గోల్కొండకోట ఇదివరకు ఎప్పుడైనా చూశావా శ్రీనీ" అన్నది లీలావతి. విన్నవాళ్ళంతా కొంచం ఆశ్చర్యపోయారు.

"లేదు లీలా, ఇదే రావటం. ఇక్కడ రామదాసు జైలుకూడా ఉంది కదూ"

"ఉన్నదన్నవాళ్లూ-లేదన్నవాళ్ళు వున్నారు. ఆనాడు చూసినవాళ్ళు ఈరోజున ఎవ్వరూలేరు. ఎవరి జీవితాలు వాళ్ళు చూసుకోటానికే తీరక సతమతమయ్యే ఈరోజుల్లో ఈ తర్క వితర్కాలు అనవసరం. నేత్రానందంగా చూట్టమే కర్తవ్యం"

"లీలావతిగారికి ప్రాచీన గాథలన్నా, చరిత్రలన్నా నమ్మకంలేదు. శ్రీనివాసరావుగారూ, తన కళ్ళతో చూసేదే నిజమంటారు. చూడనిది లేదంటారు. ఆఫీసులోనూ అంతే ఫైలు చూడకుండా ఏడిస్పోజలూ రాయ లేరు" అన్నారు ఆఫీసులో మరో యు. డి. సి.

"ఆఫీసు విషయాలు ఇక్కడ మాట్లాడవద్దు. చక్కగా కబుర్లు చెప్పు కోవాలిగాని ఆఫీసు విషయాలు చర్చించటానికి ఇది తగిన స్థలంకాదు" అన్నాడు మేనేజరు.

"కరెక్టు శ్రీనీ, అవన్నీ ఇక్కడ ఏకరవుపెడితే ఇక్కడివాళ్ళల్లో ఉన్న ఒకరు ఈ కోటమీదనుంచి దూకి ఆత్మహత్య చేసుకోవాల్సొస్తుంది. ఆ వాతావరణాన్ని మర్చిపోటానికే ఈ పార్టీని ఏర్పాటుచేశారు. కొన్ని నిజాలు చేదుగా ఉంటయ్యి శ్రీనీ. మీ బ్యాంకులో ఇలాంటి సంఘటనలు జరగటానికి వీలుకాదేమో" మేనేజరువైపు ఒక్కసారి చూసి కొంచెం కిందికి చూడసాగింది.

"చూశారా మిస్టర్ ఆవిడ ఎత్తిపొడుపు మాటలు, పెళ్ళయినా లీలావతి మారలేదు" అన్నారు మేనేజరు.

ఎవ్వరూ మాట్లాడలేదు. అంతా కోట పై భాగానికి వెళ్ళి అక్కడ కూర్చున్నారు. జట్లుజట్లుగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

"వెరీస్మార్ట్ లేడీ. యు ఆర్ వెరీ లకీ మిస్టర్ శ్రీనివాసరావ్" అన్నాడు మేనేజరు.

నవ్వి ఊరుకున్నాడు శ్రీనివాసరావు.

"లీలావతిగారూ. మాదొక చిన్న కోరిక" అన్నాడొకతను.

"పాటపాడాలా" ఎగతాళిగా అన్నది లీలావతి.

"ఏమీలేదు, మీరు చాలా కథలు రాశారు, అందులో స్త్రీ పాత్రలు కొన్ని భర్తకు లొంగిపోయేవి, కొన్ని ఎదిరించి నిలిచేవి, కొన్ని పర పురుషుడికి లొంగిపోయేవి, కొన్ని ఎదిరించి వాళ్ళ అంతం చూసేవి, కొన్ని స్త్రీ పాత్రలు విపరీతమైన సానుభూతితో పాఠకుల మనస్సుల్లో నిల్చిపోయేవి. కొన్ని స్త్రీ పాత్రల్ని చూస్తుంటే ఇంత తెగించిపోయారేమా అనిపిస్తుంది. నవరసాలూ చిందించి, చిత్రించిన ఆ స్త్రీ పాత్రల్లో ఏది మీ స్వభావానికి దగ్గరగా ఉంటుందో చెప్పగలరా" అన్నాడతను.

"సంఘంలో రచయిత పాత్ర కుటుంబంలో తల్లిదండ్రులలాంటిది. ఒక తల్లికి పదిమంది పిల్లలుంటే వాళ్ళ మనస్తత్వాలూ, గుణగణాలూ, చదువులు వేరయినా వాళ్ళందర్నీ సమానమైన ఆదరాభిమానాలతోనే, ప్రేమానురాగాలతోనే పెంచి పెద్దచేస్తుంది. కాని స్త్రీగా ఆవిడ మనస్తత్వానికీ తల్లిగా ఆ పిల్లలను పెంచి పోషించటంలో ఆమె చూపించే ప్రేమానురాగాలకీ కొంత తేడా ఉంటుంది. అదే తేడా రచయిత మనస్తత్వానికీ, రచయిత తాను సృష్టించిన పాత్రలమీద అతను చూపించే ఆదరాభిమానాలకీ ఉంటుంది. విభిన్న ప్రకృతులుగల పిల్లల గుణగణాల్నిబట్టి ఆ తల్లి మనస్తత్వాన్ని అంచనా వెయ్యటంలో ఎంత పొరపాటు ఉన్నదో, రచయిత సృష్టించిన పాత్రల గుణగణాల్నిబట్టి ఆ రచయిత మనస్తత్వాన్ని అంచనా కట్టడంలో అంత పొరపాటు ఉన్నది" అన్నది లీలావతి. ఈ సమాధానం కొంతమందికి తృప్తి కలిగించలేదు.

"ఈ ప్రశ్న ఎందుకు అడిగారు" అన్నది లీలావతి.

"ముందే క్షమాపణ కోరుతున్నాను. భర్తను పేరుపెట్టి పిలవడం లోనూ 'నువ్వు' అని సంబోధించడంలోనూ ఎంతవరకూ ఔచిత్యం ఉన్నదో చెప్పగలరా" అన్నాడతను.

ఈ ప్రశ్నకు శ్రీనివాసరావు నివ్వెరపోయాడు. అంతా ఆసక్తిగానే విన్నారు. లీలావతి తొణకలేదు. నవ్వు ముఖంతోనే అతనివైపు చూసింది.

"భరించేవారు భర్త. భరింపబడేది భార్య అనే పూర్వోక్తిని మీరు నమ్ముతారు కదూ" అన్నది లీలావతి

"అవును, అదే లోకసహజం" అన్నాడతను.

"నేను అన్నది మీరు సరిగ్గా అర్థంచేసుకోలేదు".

"అంటే"

"పూర్వోక్తి అన్నాను, ఆ మాట మరిచారు"

"అవును. అయితే ఆ సాంఘిక న్యాయసూత్రం ఇప్పుడు వర్తిస్తుందంటారా ?"

"లేదు"

ఆశ్చర్యపోయాడతను. శ్రీనివాసరావు సిగరెట్టు కాలుస్తూ నిర్లిప్తతగా చూస్తున్నాడు.

"భార్యని జీవిత భాగస్వామినిగా అర్థంచేసుకుని ఆదరించే భార్యాభర్తల్లో ఆ పూర్వకాలపు పట్టింపులూ ఉండవు. అట్లాకాకుండా ఒక స్థాయి నుంచి తక్కువ రకంగా, చూస్తే భార్యాభర్తను 'మీరు' అనే సంబోధించవలసి ఉంటుంది. మా విషయంలో ఆ పట్టింపులేమిలేదు" శ్రీనివాసరావువైపు నవ్వుతూ చూసింది. అతనూ నవ్వి ఊరుకున్నాడు.

"ఆఫీసులోనే అనుకున్నాను, జీవితంలోనూ పెంకిఘటమే" అన్నాడు మేనేజరు.

అంతా నవ్వేశారు. ఒక రకంగా లీలావతిని పరాభవించామనుకున్నారు.

"మేనేజరుగారు అబద్ధం చెప్పరు" అన్నాడొక యు. డి. సి.

"లీలావతిగారు చాలా నిర్మొహమాటంగా మాట్లాడతారు. అది పెంకితనమని అనుకుంటారు అందరూ" అన్నాడింకొక స్టాఫ్ మెంబర్.

రెండు నిమిషాలు గడిచాయి

"మిగతావాళ్ళుకూడా నిర్భయంగా వాళ్ళ అభిప్రాయాలు వెల్లడించవచ్చు" అన్నాడు శ్రీనివాసరావు నవ్వుతూ అందరివైపూ చూసి. వ్యవహారం బెడిసేలా ఉందనుకన్నారు కొందరు. ఎవరూ ఏమీ మాట్లాడలేకపోయారు. తన భార్యను గురించి యిట్లా మాట్లాడుతుంటే శ్రీనివాసరావుకు కోపం వచ్చిందేమో ననుకున్నారు.

"మీరంతా నన్నుగురించి ఏదోగా ఆలోచిస్తూ మీ మనస్సుల్ని నింపుకువచ్చారు. కొంతమంది వాంతి చేసుకున్నారు. కొంతమంది వాంతి రాకుండా 'మనకెందుకులే' అనే మాత్రను వేసుకున్నారు. మీ రంగుటద్దాల్లోనుంచీ చూస్తే నేను టెక్నికలర్‌లో కనుపించాను. మగవాళ్ళ అహంభావం ఆడవాళ్ళను అణిచివెయ్యటానికే ఉపయోగిస్తే అతను పశువుతో సమానం" అన్నది లీలావతి "వెల్ సెడ్" అన్నాడు శ్రీనివాసరావు.

అందరి ముఖాలూ జేవురించాయి. అందర్నీ కూర్చోమని పళ్ళూ, ఫలహారాలూ తనే యిచ్చింది లీలావతి. పేరు పేరునా పిల్చి కాఫీ యిచ్చింది. జరిగిన సంభాషణకు ఎవరికి వారే మనస్సులో సతమతమైపోతుంటే లీలావతి, శ్రీనివాసరావు అదేమీ పట్టించుకోనట్లే ఉన్నారు. పిక్నిక్ పూర్తయి అంతా కోటమీదినుంచీ దిగి వచ్చి బస్సులో కోఠీ చేరుకున్నారు. అక్కడినుంచీ ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళుతూ యువదంపతులిద్దరికీ నమస్కరించి మనస్సు తేలికపడినట్లుగా భావించారు.

# 13

వారంలో మూడురోజులు గడిచాయి. రెండువందలు జీతం తీసుకుంటూ ఆ ఇంట్లో రాజేశ్వరి చెయ్యవలసిన పనేమీ కనుపించలేదు అసలు కాగితంమీద కలం పెట్టలేదు. ఈ వింత ఉద్యోగం ఏమిటో ఏమీ అర్థం

కాలేదు. యజమానురాలితో కబుర్లు చెపుతూ ఆవిడకు తోడుగా ఉండటం తప్ప వేరే ఏమీ పని కనిపించలేదు.

"నా జీతం నెలకు రెండువందలన్నారుకదూ" అన్నది రాజేశ్వరి.

"చాలదంటావా ?" అన్నది గాంధారి.

"ఈ జీతంతో నలుగురు పనివాళ్ళు వచ్చేవారు కదా, మీతో కబుర్లు చెపుతున్నందుకు రెండువందలు జీతమా, దీనికి సెక్రటరీ అనే పేరా, ఏమిటండీ యిదంతా".

మనస్సులోనే నవ్వుకుందావిడ. ఆప్యాయంగా రాజేశ్వరి ముఖం లోకి చూస్తూ కళ్ళు తుడ్చుకుందావిడ.

"ఒక నెలన్నా గడవందే ఈ ఉద్యోగం సంగతి అప్పుడే ఏం తెల్సింది రాజేశ్వరీ, మనస్సు అనుభూతుల్ని వెతుక్కుంటుంది. అనుభవం ఆత్మకు జ్యోతిలాంటిది" అన్నది.

రాజేశ్వరి మనస్సు తికమకపడింది.

"మీ యిష్టం, లేమి కలిమిని యాచిస్తుంది. కలిమి లేమిని హీనంగా చూస్తుంది. అది సహజం. మీ నీడలో నేను తలదాచుకుంటున్నాను" నవ్వుతూ అన్నది రాజేశ్వరి.

"అట్లాగేనమ్మా. నా పూజలూ అందుకోసమే" అన్నదావిడ.

సాయంత్రం ఇంటికి వెళ్ళింది రాజేశ్వరి. నళిని ఉద్యోగం ఎట్లా ఉన్నదీ అడిగింది.

"ఉద్యోగం బాగానే ఉంది నళినీ, ఒక నెలన్నా గడిస్తేనేకాని ఏమీ చెప్పలేను. ఆఫీసులో నా సీటుకు పని కొంచం తక్కువే. అయినా బాధ్యతతో మెలగాలికదా. జీతానికీ, జీవితానికీ ఒక వంతెన లాంటిదే ఉద్యోగం. కొన్ని వంతెనలు రైలు వంతెనలైతే కొన్ని చెక్కకూర్పువి. వాటిమీద బళ్ళుకూడా పోకూడదు. బాటసారిగా కాలినడకను నడిచి పోవాల్సిందే" అన్నది రాజేశ్వరి

నళిని ముఖం వెలవెలపోయింది. ఆ మాటల్లో ఏదో ఆంతర్యం ఉన్నదనుకున్నది. నాలుగురోజుల ఉద్యోగానికే రాజేశ్వరి ఇట్లా ఎందుకు మాట్లాడుతున్నదో నళినికి అర్థంకాలేదు.

"ఆడపిల్లల మనస్సు పెళ్ళయితే ఎదగటమేగాక కొంత మారి పోతుందంటారు నీ మనస్సు ఉద్యోగంలో చేరిన మూడు రోజులకే మారిపోయింది రాజా" అన్నది నళిని.

"ఉద్యోగం తేడాల్నిబట్టే మనస్సు మార్పు ఉంటుంది. గుమాస్తా ఉద్యోగానికీ, ఆఫీసరు ఉద్యోగానికీ తేడాలేదూ".

"అవునవును" అన్నది నళిని.

మర్నాడు ఉదయం ఉద్యోగంలోకి వెళ్ళింది రాజేశ్వరి. అప్పటికే గాంధారి పూజ చేసుకుంటున్నది. హరిసర్వోత్తమరావుగారు కంపెనీకి వెళ్ళుతున్నారు.

"గుడ్ మార్నింగ్ సార్"

"వెరీ గుడ్ మార్నింగ్ రాజేశ్వరీ, మీ బాస్ పూజలో ఉన్నది. పూజ అయ్యేంతవరకూ అక్కడే కూర్చో. నేను కంపెనీకి వెళ్ళుతున్నాను" కారు స్టార్ట్ చేశాడాయన కారు వెళ్ళంగానే ఇంట్లోకి వెళ్ళింది. గాంధారి పూజచేస్తుంటే పూజామందిరందగ్గరే కూర్చుంది రాజేశ్వరి.

పూజ పూర్తయింది. దైవానికీ, యజమానురాలికీ నమస్కరించింది రాజేశ్వరి. "సెక్రటరీకి యివ్వాళనుంచీ కొత్త బాధ్యతలు. మనస్ఫూర్తిగా కొత్త బాధ్యతల్ని స్వీకరిస్తావు కదూ" అన్నదావిడ. ప్రసాదాన్ని యిచ్చింది. పూజా పుష్పాన్ని తల్లో పెట్టుకుంది రాజేశ్వరి. ఒకసారి మందిరంలోని దేవుళ్ళవైపు, మరోసారి రాజేశ్వరి ముఖంలోకి చూసిందావిడ.

ఈ పరీక్షలో రాజేశ్వరి నెగ్గుతుందని ఆవిడకు తెల్సు. మొదటి రోజునే ఆ నమ్మకం ఆవిడకి కలిగింది. కాని తన అభిప్రాయాలూ, ఆలోచనలూ రాజేశ్వరికి ఏమాత్రం యిష్టం కాకపోవచ్చు. ఇష్టపడని రాజేశ్వరి తనను ఎన్నిమాటలన్నా స్వీకరించటానికి తనూ సిద్ధపడే ఉన్నది. పిల్లికి గంట కట్టాలి. ఆ ఎలుక ఇప్పుడు దొరికింది.

"మేడమీద ఒక సింహం ఉన్నది. దాన్ని మచ్చిక చెయ్యాలి. అదే నీ ఉద్యోగం. ఆ సింహం దార్లోకి రావటానికి నీ జీవితాన్ని బలి

యివ్వనక్కరలేదు. ఆ సింహం నిన్ను కబళించబోతే దాన్ని కాల్చి పారెయ్యి. భయపడుతున్నావా రాజేశ్వరీ" అన్నదావిడ.

రాజేశ్వరి గుండె ఝల్లుమన్నది. మనస్సు ఒక్కక్షణం ఆగి పోయింది. ఏ ఆలోచనా కలుగలేదు. రెండు నిమిషాలకు తెప్పరిల్లింది.

"సింహం అనగానే భయపడుతున్నావా ?"

"మానవసింహమైతే నాకు భయంలేదు. అసలు సింహం ఇళ్ళల్లో ఉండదుకదా".

ఒకసారి రాజేశ్వరిని కౌగలించుకుని చిన్నపిల్లలా ఆమె బుగ్గలు ముద్దుపెట్టుకున్నది. హర్ష పులకాంకితురాలై ఆనందబాష్పాలు కళ్ళల్లో తేలియాడగా రాజేశ్వరి తలమీద అశ్రుబిందువులు పడ్డయ్యి. "మేడమీదికి వెళతావా రాజేశ్వరీ"

"వెళతాను. నేను బలికాను, సింహాన్ని చంపను, మీ ఆశీర్వచనం వృధాపోదు మీ పూజలు తప్పక ఫలిస్తాయి"

నెమ్మదిగా మెట్లెక్కి మేడమీదికి వెళ్ళింది రాజేశ్వరి. గడియారం తొమ్మిదిగంటలుకొట్టింది. ముందుగదిలో కుర్చీలు, ఒక పెద్ద డ్రాయరు, దాని మీద ఏవో పత్రికలూ, పుస్తకాలూ, చిందరవందరగా పడిఉన్నయ్యి. ఆ గది దాటి రెండోగదిలోకి వెళ్ళింది. సీసాలూ, గ్లాసులూ ఒకబల్లమీద ఉన్నయ్యి. ఒక్క కుర్చీమాత్రమే ఉన్నది. మూడోగదిలోకి వెళ్ళింది. కుర్చీలులేవు. టీపాయ్‌మీద ఒకసీసా, ఒకగ్లాసు ఉన్నయ్యి. పందిరిమంచం, దోమతెర ఆ దోమతెరలో ఒక వ్యక్తి నిద్రపోతున్నాడు. గోడకు ఒక్కఫొటో మాత్రమే తగిలించిఉన్నది. అందులో హరిసర్వోత్తమరావుగారు,గాంధారి ఇంకొక యువకుడూ ఉన్నారు. గదినిండా సిగరెట్ పీకలు. ఒకపక్కన రెండు ఇనుపబీరువాలున్నయ్యి. స్టాండ్‌మీద అయిదారు జతల బట్టలు ఉన్నయ్యి. చప్పుడు చెయ్యకుండా కిటికీ తలుపులు తీసింది రాజేశ్వరి. బాగా వెలుతురూ, ఎండ పొడ కిటికీలోంచీ వచ్చాయి. దోమతెరలో వ్యక్తి కదిలాడు. సింహానికి మెళుకువ వచ్చింది అనుకున్నది రాజేశ్వరి. పక్క మీదనే లేచి కూర్చున్నాడు. నిద్రలేవగానే తల్లీ, తండ్రీ, తమ్మా ఉన్న ఆ

ఫొటో చూట్టం అలవాటతనికి. రాజేశ్వరి అడ్డం నిల్చోడంతో ఆ ఫొటో కనుపించలేదు. ఒక్కసారి కళ్ళు తుడ్చుకొని మంచందిగి రాజేశ్వరివైపు విభ్రాంతితో చూశాడు. మనస్సులో కంగారుపడ్డా పైకి ధైర్యంగానేఉన్నది రాజేశ్వరి.

"ఎవరు నువ్వు?"

"నా పేరు రాజేశ్వరి, గాంధారిగారి శెక్రటరీని"

"మా అమ్మగారికి శెక్రటరీవా, అమ్మకు శెక్రటరీ ఏమిటి?" ఆశ్చర్యంగా చూసి సిగరెట్ వెలిగించి తలపైకెత్తి పొగ వదిలాడు.

"ఎన్నాళ్ళయింది ఉద్యోగంలో చేరి".

"అయిదారు రోజులైంది".

"జీతంకూడా ఉన్నదా?"

"నెలకు రెండువందలు".

"రెండువందలు" కిటికీ దగ్గరకువెళ్ళి కిందికి చూస్తూ రెండు నిమిషాల్లో సిగరెట్ పూర్తిగా తాగి ముక్కను మూలపారేసి రాజేశ్వరివైపు చూశాడు.

"శెక్రటరీగారి పనేమిటో"

"గాంధారీగారు చెప్పిందానినిబట్టి, నా ఇష్టా ఇష్టాలనుబట్టి పని చెయ్యాలి" తొణక్కుండా సమాధానం చెప్పింది.

"ఓ అట్లాగా, మేడమీదకు వెళ్ళమని అమ్మచెప్పిందా".

"అవును. మేడమీద ఒక సింహం ఉన్నది. దాన్ని మచ్చిక చెయ్యాలి. అని చెప్పిపంపారు".

"ఆ సింహాన్ని చూశావా ?"

"ఆఁ, మీరే"

ఓడిపోయిన రేసు గుఱ్ఱంలా ఉన్నదాతనిమనస్సు. కోపం అగ్ని పర్వతమే అయింది కళ్ళు అసలే ఎఱ్ఱగా ఉన్నయ్యి. ఇప్పుడు ఊదిన నిప్పుకణికల్లా ఉన్నయ్యి.

"సింహం. హూఁ, ఈ సింహం నిన్ను చంపి తినేస్తే ఏం చేస్తావు".

"ఆ సింహం నిన్ను కబళించబోతే కాల్చిపారెయ్యమని అమ్మగారే చెప్పారు".

అగ్నిపర్వతం బ్రద్దలైంది.

"గెటౌట్" గది దద్దరిల్లింది భయంతో కంపించిపోయింది రాజేశ్వరి. గబగబా మేడమెట్లు దిగింది మెట్లవద్దనే ఉన్నది గాంధారి.

"ఇవాళిటికి నా ఉద్యోగం అయిపోయింది. రేపు శలవుపెడతాను. వెళ్ళుతున్నాను".

గాంధారి చెప్పబోయేది వినకుండానే వెళ్ళింది రాజేశ్వరి. ఆమె నిర్విణ్ణురాలై చూసింది. గేటుదాటి రాజేశ్వరి వెళ్ళిపోతుంటే మేడమీద కిటికిలోనుంచి చూస్తూ నిల్చున్నాడు హరిప్రసాద్.

సిగరెట్ చేతిలోనే ఉన్నది. రెండు నిమిషాలు గడిచాయి. చెయ్యి కాలింది. చెయ్యివిదిల్చాడు మనస్సూ విదిల్చాడు. వెనక్కి తిరిగి చూశాడు.

"ఇన్నాళ్ళకు నువ్వు నాకు నచ్చావమ్మా. చాలా సంతోషం"

"అమ్మాయితో చాలా కఠినంగా మాట్లాడావని నాకుతెల్సు".

"అమ్మా, ఇన్నాళ్ళకు నాకు ఎందుకు నచ్చావో చెప్పనా".

"..........................."

"కొడుకు గూట్లోకి చిలకను పంపావమ్మా. అది చిలకని తెల్సుకోగానే ఎగిరిపోయింది. మళ్ళీ రేపు వస్తుందికదూ"

గాంధారి ఆశ్చర్యపోలేదు. కొడుకు మత్తువదలనందుకు ఆమె మనస్సులోని విచారం యింకా ద్విగుణీకృతమైంది.

"చిలక కాదురా, సుగుణాలరాశి. నా సెక్రటరీ"

కొడుకుని గురించి మానసిక ఆవేదన దీర్ఘరోగంలా ఆమెను విడిచిపెట్టలేదు.

"ఓహో, చాలా బావుందమ్మా, అవును పగలు నీకు సెక్రటరీ, నిజం చెప్పావమ్మా. ఇంతకాలానికి ఒక చక్కని చుక్కని పోర్టు ఫోలియోలేని

మంత్రిలా, నీ పర్సనల్ శెక్రటరీగా వేసుకున్నావంటే అందులోని ఆంతర్యం ఈ మట్టిబుర్రకు అర్థంకాలేదు. తల్లిప్రేమ ఎంత గొప్పదో ఇవ్వాళ ఈ రీతిగా........"

తల్లిచెయ్యి కొడుకు చెంపను ఛెళ్ళుమనిపించింది.

"నీ బుద్ధి మారుతుందని ఆశించాను, కాని నాకు బుద్ధిలేదని నువ్వు ఈ రీతిగా ఎదురుతిరిగావు. నీ ముఖం నాకు చూపించకు"

కళ్ళు తుడ్చుకుని పూజామందిరంవైపు వెళ్ళిందావిడ. తాగుతూ మందిరంలోకి వెళ్ళాడు కొడుకు. తల్లి ఆంతర్యం కొడుకుని బాగుచేదామని. కొడుకుకి ఆంతర్యంలేదు. అతనికి కావలసింది రకరకాల అనుభవాలు.

ఆ మర్నాడు రాజేశ్వరి వెళ్ళలేదు. కొద్దిగా జ్వరం తగలటంతో నళిని ఆఫీసుకి శెలవుపెట్టింది.

"శెక్రటరీగారు యివ్వాళ ఆఫీసుకు వెళ్ళలేదేం?"నవ్వుతూ అన్నది నళిని. రాజేశ్వరి జీతం నెలకు రెండువందలవడంతో ఏదో తెలియని ఆధిక్యత రాజేశ్వరిలో చూసింది నళిని.

"శెక్రటరీ ఉద్యోగాలు ఆఫీసులో గుమాస్తా ఉద్యోగాల్లా ఉండవు. వాటి బాధ్యతలు వేరు, బాధ్యతనుబట్టి ఎప్పుడైనా వెళ్ళవచ్చు".

"చిత్రం"

"చిత్రంఅంటే వెనకాల పెద్ద గొయ్యి తవ్వుతున్నావని అర్థం. ఇలాంటివి శెక్రటరీ ఉద్యోగానికి సరిపడవు. అన్సర్ టు ది పాయింట్".

"చిత్రం, సారీ, క్షమించండి. శెక్రటరీగారు శెలవుపెట్టారా, లేక మీ బాస్ ఊళ్ళోలేరా"

నళిని మనస్సులో సంతోషం పొంగిపోతుంటే, రాజేశ్వరి మనస్సులో చీకట్లు చిందులువేస్తున్నయ్యి.

"అక్కయ్యా! ఒక్కమాట".

"ఏమిటే రాజూ," దగ్గరగా వచ్చికూర్చుంది నళిని.

"నాకు ఆఫీసులేదు. నేను సెక్రటరీని కాను. ఏమీ చెయ్యటంలేదు".

రాజేశ్వరి ముఖంలోని గంభీరతకు చకితురాలైంది నళిని.

"మరి ఏంచేస్తున్నావు. ఎక్కడికి వెళ్ళుతున్నావు. జీతం ఇవ్వరా, అసలు మీ ఆఫీసు ఎక్కడ"

పేలవంగా నవ్వింది రాజేశ్వరి.

"ఆఫీసు అడవిలోకాదు ఇంట్లోనే. నేను ఏ కాగితాలూ చూడనక్కర్లేదు. ఊరికినే ఆ ఇంట్లో తిరగటమే జీతం నెలకొంది ఇవ్వరుకదా" గోళ్ళు కొరుక్కొని, చిగురు అంటకుండా నెమ్మదిగాతీసి, అరచేతిలో వేసుకొని కిటికీలోనుంచి అవతల పారేసింది రాజేశ్వరి. చెల్లెలి ముఖంలోకి పరిశీలనగా చూసింది నళిని. ఏ భావమూ గోచరించలేదు.

"గోళ్ళు తీసుకోవటమే నీ ఉద్యోగమా ?"

"కావచ్చు"

"ఏమిటే ఏ అర్థంలేని సమాధానం"

"ప్రశ్ననుబట్టేకదా సమాధానం. ఒక్కమాట, ఈ ఉద్యోగం ఏమిటో నాకూ అర్థంకావటంలేదు, ఈ నెలచేసి మానేస్తాను".

"అసలు నువ్వు చేసే ఉద్యోగం ఏమిటే ?"

"అదే నాకూ తెలియటంలేదు".

విసిగిపోయింది నళిని

"నీకు పిచ్చిపట్టింది".

"కాదు దయ్యం." అన్నది రాజేశ్వరి.

"దయ్యం ఏమిటే" అంటూ తల్లి.

అమ్మతో ఏమీ చెప్పవద్దన్నట్లుగా చూసింది రాజేశ్వరి.

"ఏమీలేదమ్మా. పత్రికలో దెయ్యం అనే కథ చదివాను. ఆ కథను గురించి మాట్లాడుకుంటున్నాం" అన్నది నళిని.

"అంతేకద. ఇవ్వాళ నువ్వు ఆఫీసుకు వెళ్ళలేదేం రాజూ".

"ఇవ్వాళ ప్రొప్రైటరుగారు ఊరికి వెళ్ళారు. రేపు వెళతాను".

"ఏం ఆఫీసులో మాయదారి ఆఫీసులు"

తల్లి వెళ్ళాక ఒక్క నిట్టూర్పు విడిచింది రాజేశ్వరి. నళిని నవ్వింది.

"ఎందుకే నవ్వుతావ్ ?"

"జీవితాలు నవ్వులపాలు కాకముందే నవ్వటంమంచిది. తరువాత ఆ అదృష్టం కలక్కపోవచ్చు" రాజేశ్వరి మనస్సు చివుక్కుమన్నది.

"నేను హరిసర్వోత్తమరావుగారి భార్య గాంధారిగారి సెక్రటరీని,మా బాస్ మగవారు కాదు" కంఠస్వరంలోని తొట్రుపాటును గమనించింది నళిని.

"బాస్ ఎవరయినా, బాధ్యతను గుర్తుంచుకోవాలిరాజూ. అక్కయ్యగా పెద్దరికాన్ని అడ్డుపెట్టుకొని చెప్పటంలేదు. నీవు ఉద్యోగం మానవద్దు, కుటుంబగౌరవానికి హాని తేవద్దు, నీ వ్యక్తిత్వాన్ని నిలుపుకో, నిన్ను నువ్వే కించపర్చుకోవద్దు". రాజేశ్వరి కళ్ళుతుడిచింది నళిని.

మర్నాడు జ్వరంతగ్గి నళిని ఆఫీసుకి వెళ్ళింది. రాజేశ్వరికూడా తన ఉద్యోగానికి వెళ్ళింది. రోజూ సంతోషంగా వెళ్ళేది, ఆరోజున అయిష్టతగానే ఆ ఇంట్లో అడుగుపెట్టింది. రాజేశ్వరి రాదనే అనుకున్నది గాంధారి. ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని రాజేశ్వరితల నిమిరింది ఆ రోజున హరిసర్వోత్తమరావుగారు ఇంకా కంపెనీకి వెళ్ళలేదు.

"నువ్వు రావేమోనని అనుకున్నానమ్మా. భగవంతుడు నాయందు ఉన్నాడు" అన్నదావిడ.

"మంచి మనస్సుతో మనం ఏపనిచేసినా భగవంతుడు హర్షిస్తాడు. హత్యలూ, వ్యభిచారాలూ చేసేవారుకూడా భగవంతుడు తమయందు ఉన్నాడనే అనుకుంటారు అంటే మానవులంతా భగవంతుని అనేక సమయాల్లో వారికి నచ్చినరీతిగా పన్లు జరిగినప్పుడు స్మరిస్తారు" అన్నది రాజేశ్వరి.

గాంధారి విస్తుపోయింది. హరిసర్వోత్తమరావుగారు అప్రయత్నంగానే రాజేశ్వరి చెయ్యిపట్టుకుని,

"క్షమించు రాజేశ్వరి సంపదా, హోదా, అధికారమూ ఏవీకూడా మానవత్వాన్ని అర్థంచేసుకుని తమ గౌరవప్రతిష్టల్ని నిలబెట్టుకోలేవమ్మా.

మా కుటుంబ గౌరవం కొంతవరకూ ఇదివరకే నశించింది. మొన్నటి సంఘటనతో పూర్తిగా నశిస్తుందనే అనుకున్నాను. కాని నీ రాకతో మాకు కొంత ధైర్యం చిక్కింది" అన్నాడాయన. రాజేశ్వరి చెయ్యివదిలి వింతగా వారిద్దరివైపూ చూసింది.

"నిన్ను మా యింటి మహాలక్ష్మిగా చేసుకుందామని నిశ్చయించుకున్నాం రాజేశ్వరీ. సప్తవ్యసనాలకూ గురియైన మావాడు నీ సహచర్యంతో దారికి రాగలడనే నమ్మకంతో ఒక నిశ్చయానికి వచ్చాం. సెక్రటరీ ఉద్యోగం అందుకు ప్రాతిపదిక. కాని ఆ సింహం త్వరలో దారికి రాకపోవచ్చు. సర్వాధికారాలతో వాడి బాధ్యతను నీకు వప్పగించాలనేదే మా కోరిక" అన్నది గాంధారి.

"అవునమ్మా అంతే" అన్నారాయన.

రాజేశ్వరి తలతిరిగిపోయింది. మనస్సు, గుండె ఒక్కసారిగా ఆగిపోయినట్లనిపించింది. రెండు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడలేదు.

"కోడలికోసం కుట్రచేసి, ఇంత నాటకంఆడి, వలపన్నారు. ఆ వలలో నేను పడ్డాను. ఈ వలతాళ్ళు పుటుక్కున తెంచి వెళ్ళిపోతున్నాను" వెనక్కి తిరిగి చూడకుండా గబగబా వెళ్ళిపోయింది రాజేశ్వరి.

# 14

వారంరోజులు గడిచాయి. రాజేశ్వరి ఉద్యోగం ఎందుకు మానేసిందో ఎవరికీ చెప్పలేదు. నళినికూడా ఎక్కువగా అడగలేదు. తల్లి మాత్రం అడుగుతూనే ఉన్నది. ఉద్యోగం పోయిన దిగులే కాకుండా చేసినన్నాళ్ళకూ జీతమైనా తెచ్చుకోలేదని రాజేశ్వరిని కేకలువేసిందావిడ. సురేఖ ఇక్కడ చదువు ప్రారంభించాక నళినికన్నా సురేఖతోనే ఎక్కువగా చనువుతో మాట్లాడినా ఈ విషయాలేమీ సురేఖతోనూ చెప్పలేదు రాజేశ్వరి.

రెండురోజులు శలవులు వచ్చాయి. అమరావతి వెళ్ళవద్దామన్నది నళిని. సురేఖ ఇష్టపడ్డది, రాజేశ్వరికి నవ్వువచ్చింది.

"నవ్వెందుకు రాజూ" అన్నది నళిని.

"నా ఉద్యోగం ఎందుకు పోయిందో ఆ పరమశివుడు తను చెప్తానని కల్లో చెప్పాడు" అన్నది రాజేశ్వరి.

"నీ తెలివి ఇంతేనన్నమాట. పరమశివుడు కల్లో కనిపిస్తే నీ ఉద్యోగం సంగతి అడగాలా. నాకు జన్మ రాహిత్యం కావాలని ప్రార్థిస్తాను. ఈ మానవజీవితం నాకు అక్కర్లేదని మనస్ఫూర్తిగా విన్నవించుకుంటాను".

రాజేశ్వరి ముఖం జేవురించింది. అక్కయ్య మనస్సు తనకు తెల్సినా ఈ రీతిగా మాట్లాడుతుందని అనుకోలేదు.

మధ్యాహ్నం భోజనంకాగానే ముగ్గురూ కలసి బస్సులో అమరావతి వెళ్ళారు. స్వామి దర్శనం చేసుకుని కృష్ణఒడ్డున కూర్చున్నారు. ఈ ప్రయాణానికి ఏదో ఆంతర్యం ఉన్నదని సురేఖకు తెలుసు కాని అదేమిటో ఆలోచనకు తట్టలేదు. "ప్రతి జీవికీ జీవిత సాఫల్యం ఉండాలి. ఒక్కొక్క కుటుంబంలోని వారికి ఆ జీవితసాఫల్యం అనేది ఒక్కొక్క రీతిగా ఉంటుంది. మన కుటుంబంలో మనిద్దరం ఆడపిల్లలమైనా మనపైన ఉన్న బాధ్యతలు ఏ పెదకొడుకుకూ ఉండవేమో, మన కుటుంబాన్ని ఎవరూ వేలెత్తి చూపకుండా పోషించటమే మన జీవితకర్తవ్యం. ఏమంటావు రాజూ" అన్నది నళిని

రాజేశ్వరి వీపుమీద చరిచినట్లయింది. అక్కయ్య మనస్సు తనకు తెల్సినా ఏదో హితబోధ కోసమే ఈ అమరావతి ప్రయాణం ఏర్పాటు చేసిందని ఊహించుకోలేకపోయింది. తన ఊహకు అందని లోపమేదో తనలో ఉన్నదని అక్కయ్య అనుమానపడటంనుంచే యింతగా చెప్తున్నదని పూర్తిగా గ్రహించింది.

"నువ్వసలు ఉద్యోగం చేశావా రాజూ, చెయ్యలేదని నేను అనుకోటంలో పొరబాటు లేదుకదూ" అన్నది నళిని.

"కొంతవరకూ నీ ఊహ సరైనదేకాని పూర్తిగాకాదు కాని నేను చేసిన ఉద్యోగానికి సెక్రటరీ అనే పేరు పెట్టి నిర్ధారణ చేశారు. పారి

సర్వోత్తమరావుగారి భార్య గాంధారికి పర్సనల్ సెక్రటరీని, ఉద్యోగంచేసి నంతకాలం నా కర్తవ్యాన్ని సరిగ్గానే నిర్వహించాను. కాని నేనే ఉద్యోగం మానేశాను. డ్యూటీలో ఉన్న రోజులకు వాళ్ళు జీతం యివ్వలేదు. నీ అనుమానం ఏమిటో నాకు తెల్సు నళినీ. కానిపన్లు చెయ్యలేదని సగర్వంగా నీకు చెపుతున్నాను, అంతేకాదు హామీ యిస్తాను. సరేనా ?" అన్నది రాజేశ్వరి. ముఖంలో గంభీరతనుచూసి సురేఖ భయపడ్డది. ఇంక మనస్సు కష్టపడేటట్లుగా ఈ సంభాషణ సాగకుండా ఉంటే బావుండునను కున్నది.

"నాన్నగారి మరణంతో అమ్మమనస్సు పూర్తిగా దెబ్బతిన్నది. ఇంక అమ్మ ఏ అఘాతానికి తట్టుకోలేదు. అందుకే నీతో కొంచం సావకాశంగా మాట్లాటానికే ఇక్కడకు వచ్చాము. నాకన్నా నువ్వు తెలివికల దానివి. ఆలోచనాశక్తి నీలోనే ఎక్కువగా ఉన్నది. దానికి ప్రత్యక్ష నిదర్శనం సురేఖని చదువులో చేర్పించటమే. అప్పచెల్లెళ్ళ బాధ్యతలు రక్త సంబంధంతో పెనవేసుకుని ఉన్నా, ఆలోచనలకూ, భావోద్రేకాలకూ రక్త సంబంధంతో నిమిత్తంలేదు. నువ్వు ఏంచేసినా, ఏ ఉద్యోగం చేసినా నీ వెనుక ఇంకా నలుగురు పిల్లలున్నారనిమాత్రం గుర్తుంచుకో. సర్లే ఇక వెళదామా" అన్నది నళిని.

"సురేఖా, నువ్వేమీ మాట్లాడం లేదేం?" సురేఖవైపు చూస్తూ అన్నది రాజేశ్వరి. సురేఖకు ఏమీ తోచలేదు. నదీప్రవాహంవైపు చూస్తూ కూర్చున్నది

"మాట్లాడవేమి సురేఖా. మళ్ళా ఇటువంటి సమయమూ అవకాశమూ రాకపోవచ్చు. నా ఉద్యోగం గురించి నీ వ్యాఖ్యానం ఏమిటి" అన్నది మళ్ళీ.

"నా భర్త మరణంతో నా జీవితపు కళ్ళు రెండూ పోయాయి. కాని ఇప్పుడు మీ కళ్ళతో నేను జీవిస్తున్నాను. కుడికన్నుకీ, ఎడమకన్నుకీ నేను తేడా చూపలేను" అన్నది సురేఖ.

"సరే వెళ్ళిపోదాం" అన్నది రాజేశ్వరి.

గుంటూరు బస్సుస్టాండులో బస్సు దిగారు ముగ్గురూ.

"శెక్రటరీగార్కి నమస్కారాలు" అన్నాడు హరిప్రసాద్.

"ఓ, మీరా" ఖ్రాన్పడిపోయింది రాజేశ్వరి.

"అవును నేనే. జీతమైనా తీసుకు వెళ్ళలేదని మా అమ్మ బాధపడు తున్నది. ఇంటికివచ్చి జీతం తీసుకువెళ్ళండి" అని ఒక్కసారి ముగ్గురి వైపూ చూసి నవ్వి వెళ్ళిపోయాడు హరిప్రసాద్.

ముగ్గురి భావాలూ మూడు రకాలుగా వాళ్ళ మనస్సుల్ని కలవర పెట్టినయ్యి. ఎవరూ ఏమీ మాట్లాడుకోకుండా ఇంటికి వెళ్ళారు. రెండు రోజులు గడిచాయి. రాజేశ్వరితో నళిని ఈ ప్రస్తావన తేలేదు. తను కప్పి పుచ్చుదామనుకున్న యదార్థ విషయం క్రమంగా బయటపడబోతున్నదని గ్రహించింది రాజేశ్వరి.

ఆలోచనలూ, అమరావతిలోని నళిని మాటలూ కందిరీగల్లా కుట్ట సాగాయి. మనస్సు గంభీరతను అడ్డుపెట్టుకున్నా అంతర్యంలో జరిగిన సంఘటనలను అద్దంలా చూపుతునే ఉన్నది. రాత్రి పన్నెండు దాటినా రాజేశ్వరికి నిద్రపట్టనేలేదు. మెల్లిగా వెళ్ళి నళినిని భుజం తట్టింది. కళ్ళు తెరిచిన నళినికి కళ్ళనీళ్ళు పెట్టుకున్న రాజేశ్వరి కనుపించింది. రాజేశ్వరి కళ్ళుతుడుస్తూ, "నువ్వేదో చెప్పాలని వచ్చావని నాకు తెలుసు రాజూ, ఇప్పు డేమీ చెప్పవక్కర్లేదు. రేపు సాయంత్రం నాలుగు గంటలకు నువ్వూ, సురేఖా కలసి మా ఆఫీసువైపురండి. ముగ్గురం కలసి గాంధారిగారింటికి వెళదాం. ఆవిడే అన్నీ చెపుతుంది. నీమీద నాకే దురభిప్రాయంలేదు. వెళ్ళి నిద్రపో" అన్నది నళిని. రాజేశ్వరి హాట్లాడకుండానే వెళ్ళింది.

మర్నాడు మధ్యాహ్నం సురేఖ ట్యుటోరియల్ కాలేజీకి వెళ్ళలేదు. శలవుపెట్టింది. నాలుగ్గంటలకల్లా ఇద్దరూ నళిని ఆఫీసుకు వెళ్ళారు. ముగ్గురూ కలసి హరిసర్వోత్తమరావుగారింటికి వెళ్ళారు.

ఆ ముగ్గుర్నీ చూసి గాంధారి ఆశ్చర్యపడలేదు. రాజేశ్వరిని చూడ గానే ఆమె సంతోషానికి అవధులు లేవు.

"నువ్వొస్తావని నాకు తెలుసు రాజేశ్వరి, మీ అక్కయ్యని చూశాను. ఈ రెండో అమ్మాయి ఎవరు ?" సురేఖవైపు కొంచం ఆశ్చర్యంగా చూసింది. పరిస్థితి అర్థమైనట్లుంది.

"మా మేనమామ కూతురు సురేఖ. ఇక్కడ చదువుకుంటోంది" ముక్తసరిగా సమాధానం చెప్పింది రాజేశ్వరి. మిగతా విషయాలు ఏం మాట్లాడాలో నళినికే వదిలేసింది.

చక్కని తివాసీమీద ముగ్గుర్నీ కూర్చోబెట్టింది గాంధారి. తనూ వాళ్ళ ప్రక్కనే కూర్చున్నది. నౌకర్ని పంపి కాఫీ తెమ్మన్నది. నళిని కళ్ళు ఎవరినో వెతుకుతున్నయ్యి. మరెవ్వరూ ఆ ఇంట్లో కనబడలేదు. గాంధారి నవ్వుముఖంతో నళినివైపు చూసి, "ఏమిటమ్మా కబుర్లు, నామీద కోపంతో వచ్చారు కదూ".

"పేదవాళ్ళ కోపాలు పెదవికికాదు వారి జీవితాలకే చేటు. మా చెల్లెలు రాజేశ్వరి ఉద్యోగం మానేశానంటేనూ కారణం అర్థంకాక ఏమిటో తెల్సుకుందామని వచ్చాను. నెలకు రెండువందలు జీతం, శెక్రటరీ ఉద్యోగం ఎవరిస్తారు చెప్పండి. ఉద్యోగ విధులను సరిగ్గా నిర్వహించ లేదుకదూ" అన్నది నళిని. రాజేశ్వరి ఆశ్చర్యం మనస్సులోనే ఇమిడి పోయింది.

"ఆఫీసు డబ్బేమయినా శెక్రటరీననే గర్వంతో వాడుకున్నదా గాంధారిగారూ" అన్నది నళిని.

ఈమాటతో రాజేశ్వరికి మతిపోయినంతపనైంది.

"జీతం సరిగ్గా ఇవ్వరేమోనని అనుమానపడింది. ఉద్యోగపు ఆర్డరు ఇవ్వలేదట కదూ" అన్నది సురేఖ.

గాంధారి మనస్సు అగాధంలో మునిగిపోయింది. ఇలాంటి కూతుళ్ళను కన్న ఆ తల్లి ధన్యురాలు అనుకుంది. ఆస్తిపాస్తులూ, డబ్బూ, వ్యాపారమూ తమ వంతయితే, తెలివితేటలతో, అందచందాలూ, మర్యాద మన్ననలూ ఆ కుటుంబంవారి వంతు కామాలనుకుంది. ఈ పిల్లలు సరస్వతీ పుత్రికలు. అందమూ అణకువా వారిని సర్వదా కాపాడ్తమేగాక

తీర్చిదిద్దుతున్నాయి. కాని తామో ? తమ జీవితానికి సాలెగూడు అల్లుకున్నది. ఆస్తికి విలువలేదు. మనస్తత్వాలకు మానవతా దృక్పథంలేదు.

నళిని చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుంది గాంధారి.

"రాజేశ్వరిని నేను ప్రేమించాను. ప్రేమకానుకగా మా ఇంట్లో సెక్రటరీ ఉద్యోగం ఇచ్చాను. ఉద్యోగవిధులంటూ ప్రత్యేకం ఏమీలేవు. నాకు తోడుగాఉంటూ నాతో ఈ ఇంట్లో తిరుగుతూ, ప్రసన్న వదనంతో కబుర్లుచెప్పటమే. రాజేశ్వరికి అంతవరకూ బాగానేఉన్నది. కాని ఈ ఇంట్లో ఒక సింహం ఉన్నది మచ్చిక చేసుకోగలదనే అనుకున్నాను. కాని వలత్రాళ్ళు కొరికి ఈ చిట్టెలుక పారిపోయింది అంతేనా రాజేశ్వరీ" అన్నది గాంధారి.

సురేఖకు ఏమీ అర్థంకాలేదు. నళిని అంచనా కొంత తారుమారయింది.

"ఆ అబ్బాయి మీ కొడుకుకదూ" బస్సుస్టాండులో కనిపించి రాజేశ్వరితో మాట్లాడిన ఆ యువకుని దృష్టిలో పెట్టుకుని అన్నది నళిని. ఈ సారి సురేఖకూ అర్థమైంది.

"అవును ఆ సింహపుపిల్ల ఈ మేక కడుపున పుట్టిందే. నిన్న బస్సుస్టాండులో మీరు ముగ్గురూ కనిపించారని చెప్పాడు ఇటీవల వాడు చెప్పిన నిజమూ, మనస్ఫూర్తిగా నవ్వుముఖంతో చెప్పిన మాటా ఇదొక్కటే. ఎంత దుర్మార్గుడైనా తల్లికి పిల్లలు సన్మార్గులుగానే కన్పిస్తారు" అంది గాంధారి ఆమె హృదయం కొంత తేలికపడ్డది. పెద్ద బరువు దించినట్లయింది. మనస్సులో ఏదో తెలియని ఆనందం చిన్నపిల్లలా మారాం చేసి గారాబా లొలికిస్తున్నది

"అంతా అర్థమైందా ?" అన్నది నళినివైపు నవ్వుతూచూసి. నళిని ఆలోచనలు ఇదివరకు ఎక్కడికక్కడ చిందరవందరగా చెదిరిపోయినవన్నీ మళ్ళీ గూటికి చేరిన పక్షిలా రెక్కలుకట్టుకుని ఎగురుతూ వస్తున్నయ్యి తన అనుమానం తారుమారు కాకపోయినా పక్కదారిని పోవడం

లేదు. సురేఖ అనుకుంది "ఈవిడగారికి రాజేశ్వరిని కోడలిగా చేసుకోవాలని ఉన్నది కాబోలు. కోటలో పాగావేసిన రాజేశ్వరి తోటంతా ధ్వంసం చేసినతీరుగా ఈ రాద్ధాంతం ఎందుకు చేస్తున్నట్లు?" ఆలోచనలను అదుపులోనే ఉంచుకున్నది సురేఖ.

"రాజేశ్వరీ ! అంతా ఇక్కడేఉన్నాం, ఉద్యోగం చెయ్యటానికి నీ అభ్యంతరం ఏమిటో నిర్ధారణగా చెప్పెయ్యి. నచ్చకపోతే ఇంకోచోట చేరవచ్చు" అన్నది గాంధారి.

"ఏం రాజూ" నళినీ, సురేఖా ఇద్దరూ ఒక్కసారే అన్నారు.

"వీరబ్బాయి హరిప్రసాద్ స్త్రీలోలుడు, త్రాగుబోతు. అతన్ని దారిలోకి తీసుకువచ్చి నన్ను తన కోడలుగా చేసుకోవాలని ఈవిడగారు ఈ సెక్రటరీ ఉద్యోగం ఏర్పాటుచేసింది. ఇదొకపెద్దఎత్తు.ఈఇంట్లో ఆడపిల్లలకు విలువలేదు. సెక్రటరీ అంటే హరిప్రసాద్‌కు ఆటవస్తువు. అదే ఆ ఉద్యోగపు విలువ. నాకే ఉద్యోగం అక్కర్లేదు. నేను హరిప్రసాద్‌ను ప్రేమించలేదు. ఏమీ పోగొట్టుకోకుండానే బయటపడ్డాను. కొంతమందికి ఆ పరాభవమూ జరిగిఉంటుంది. ఇంక వెళదామా నళినీ, పద సురేఖా" అన్నది రాజేశ్వరి.

ఈ మాటతో గాంధారి నిలువునా సజీవదహనమే అయింది. మనస్సూ, హృదయమూ, ఆలోచనలూ అన్నీ అగ్నిపాలైనయ్యి.

వారు ముగ్గురూ వెళ్ళిపోతూంటే భ్రమాన్పడిపోయి చూస్తూ కూర్చుంది. ఆమె కళ్ళకు చీకట్లు కమ్మాయి. ఏమీ కనబడలేదు.

ముగ్గురూ వచ్చేస్తోంటే గేటుదగ్గిరే హరిప్రసాద్ కారుదిగి లోపలికి వస్తున్నాడు.

"సెక్రటరీగారు ఉద్యోగంలో చేరారా?" అన్నాడు.

"షటప్ ఇడియట్" అన్నది రాజేశ్వరి.

హరిప్రసాదరావు తల పగిలిపోయినట్లే అయింది.

* * *

రాజేశ్వరి నాలుగురోజులు ఎవ్వరితోనూ మాట్లాడలేదు. ఆమె మన స్సుకు జ్వరం వచ్చింది. యాదృచ్ఛికంగా ఆ ఇంట్లో తిరుగుతున్నదే కాని స్థిరమైన ఆలోచన ఏదీ చెయ్యలేకపోతున్నది.

రాజేశ్వరి పరిస్థితి సుభద్రమ్మకు ఏమీ అర్థంకావటంలేదు. నళిని కూడా యేమీ చెప్పలేదు. కూతురు ఉద్యోగం మానేసిందని ఒకబాధ. చేసిన ఉద్యోగానికయినా ఆ కంపెనీవాళ్ళు జీతం యివ్వలేదని మనోవేదన. సురేఖ కూడా ఏమీ చెప్పలేకపోయేసరికి ఆమెకు పిచ్చిఎత్తినంతపనైంది. నీళ్ళ దొడ్లో స్నానంచేస్తున్న సురేఖవద్దకు వెళ్ళింది. ఇంట్లో అయితే అందరూ వింటారని అట్లావెళ్ళింది.

"నామీద ఏమాత్రం అభిమానండున్నా నిజంచెప్పు సురేఖా. రాజేశ్వరి ఉద్యోగం ఎందుకు మానుకుంది. జీతం ఎందుకు తెచ్చుకోలేదు".

"ప్రొప్రైటరు ప్రవర్తన బావుండలేదుట. ఏ అఘాయిత్యమూ జరక్కముందే అతన్నే అవమానపర్చి వచ్చేసింది. వయస్సులో ఉన్న ఆడపిల్లలు ఉద్యోగం చేస్తున్నా నూటికి ఒకరైనా ఇట్లాంటి అవమానం పాలు కావలసివస్తుంది. ఆ ఒక్కరూ మన రాజేశ్వరి కావటం మన దురదృష్టం" అన్నది సురేఖ సుభద్రమ్మకు ఈ మాటలు నిజమేననిపించాయి. వెధవ ఉద్యోగం పోతేపోయింది అనుకున్నది. ఈ విషయంలో నళిని ఆఫీసే ఎంతో నయమనుకున్నది.

నళిని ఆఫీసుకు వెళ్ళినా అంతవరకూ ఎన్నడూ అనుమానపడని సుభద్రమ్మ ఆ మర్నాడు నళినితో అన్నది.

"నళినీ ! ఉద్యోగంచేసి సంపాదించి ఈ సంసారాన్ని పోషించటంలో పెద్దకొడుకులా ఉన్నా, నువ్వు మగవాడివి కాదమ్మా. ఆడపిల్లవు. జీతం ప్రధానమైనా—పరువు ప్రతిష్ఠలు ఎంతో విలువైనవి"

ఇంతకన్నా ఎట్లా చెప్పాలో ఆమెకు తెలీలేదు.

నళిని నవ్వింది.

"బాధ్యతకన్నా అనుభవం చాలా విలువైనదమ్మా. నీ బాధ్యత ప్రకారం నీవు చెపుతున్నావు. మా జీవితానుభవాల్ని గురించి మేం ఇంకా బాధ్యతగా గౌరవంగా ప్రవర్తించాల్సి ఉంటుంది" అన్నది.

"కన్నతల్లిని, పెద్దదాన్ని, నాకుతోచింది చెప్పాను. చెట్టంత కూతు ళ్ళకు నేను చెప్పవలసిందీ లేదు. అంతా నా కర్మ" అన్నదావిడ.

"చెట్లు పెరుగుతుంది కూతురు ఎదుగుతుంది చెట్టు పరువుతక్కువ పన్లు చెయ్యదు మామిడిచెట్టుకు చింతకాయలు కాయటం అసహజమేకదా. కూతురు చెట్టంతదయినా కుదురుకు మోసం తీసుకురాదు. ఇంకా కర్మ సిద్ధాంతాన్ని గురించి చెప్పేందుకు మనం దేవుళ్ళంకాదుకదా. నువ్వు నిశ్చింతిగా ఉండటమే మాకు నువ్వు ప్రసాదించే ఆశీర్వచనం. ఇంక ఆఫీసుకు వెళ్ళొస్తానమ్మా" అని వెళ్ళింది నళిని. సుభద్రమ్మ కళ్ళు తుడ్చుకుంది.

నళిని ఆఫీసుకి వెళ్ళేసరికి ఒక కవరు ఆమె బల్లమీద ఉన్నది. తనకు ఉత్తరం ఎవరు వ్రాస్తారు ? మామయ్య ఉత్తరం ఇంటికే వస్తుంది. ఎవరబ్బా ఈ ఉత్తరం రాసింది ? అని ఆశ్చర్యపడుతూనే కవరు చించి ఉత్తరం చూసింది. చదువుకుంది.

నళినీ !

ఆశ్చర్యపోకండి. నేను స్త్రీలోలుడను. త్రాగుబోతుని. నిజమే. కొంతమంది మాదిరి నాకు నిజం చేదుగా ఉండదు. నిజాన్ని చేదుగా భావించేవాళ్ళ మనస్సుకు వాళ్ళ అంతరాత్మ శత్రువన్నమాట. నా అంతరాత్మ నా కట్టుబాటుల్లోనే ఉంటుంది. నా మనస్సుకు నేను ద్రోహం చేసుకోలేదు. నేను మంచిగా బ్రతికినా చెడుగా తిరిగినా చాటుగా ఏమీ చెయ్యటంలేదు. అందుకే అన్నీ మా అమ్మకూ, నాన్నగారికీ తెలుసు. వాళ్ళు నన్ను ఏ విషయంలోనూ కాదనలేరు. అంతే వాళ్ళ కడుపుతీపి నేను చేసే ప్రతిపనినీ ఆమోదించుతుందన్నది యదార్థం. నా జీవితాన్ని పాడుచేసుకుంటున్నానని నేను అనుకోటంలేదు. నాకు కావలసినవి అనుభవిస్తున్నాననే నా విశ్వాసం. కాని ఇతరులు, ముఖ్యంగా అమ్మా నాన్న నేను చెడిపోతున్నాననీ, నన్ను శాసించి మంచిత్రోవకు తెచ్చే సామర్థ్యంకల కోడలు కావాలనే వారి ఆకాంక్ష. పర్యవసానం రాజేశ్వరికి సెక్రటరీ ఉద్యోగం. తరువాత విషయం మీకూ తెల్సినదే.

ఇకపోతే, నాలోని పురుషత్వానికి ప్రాధాన్యతఇచ్చి సీసాలనూ, స్త్రీలనూ కొనుక్కొన్నాను కాని స్త్రీల మనస్తత్వాలను గురించి ఎన్నడూ

ఆలోచించలేదు. అసలు నాకు ఆ ఆలోచనే రాలేదు. ప్రేమంటే ఏమిటో నాకు తెలియదు. అలాంటి భావాలు ఎట్లా కలుగుతయ్యో నాకు తెలియదు. కారణం డబ్బుకు స్త్రీలను కొనుక్కొన్నాను.

ఇప్పుడు నాకు అయిదోఏడు వచ్చింది. అమ్మ అక్షరాభ్యాసం చేసింది. ప్రేమ అనే పలక పుచ్చుకుని, ఇంగితమనే బలపం తీసుకుని, స్త్రీ హృదయం అనే బళ్ళోకి వెళ్ళి అక్షరాలు నేర్చుకోమంటున్నది మాఅమ్మ.

ఆ బళ్ళో మేష్టర్లు ఎవరు నళినా, రాజేశ్వరా ?

స్త్రీలోలుడు,
హరిప్రసాదరావు.

ఉత్తరం పూర్తిగా చదివింది. ఆ క్షణంలో హరిప్రసాద్ ఉంటే ?

"అయ్యగారు పిలుస్తున్నారు" అంటూ ఆఫీస్ బోయ్ వచ్చాడు నళిని సీటుదగ్గరకు ఉత్తరాన్ని కవరులో ఉంచి డ్రాయరు సొరుగులో పడేసి ప్రొప్రైటరు హరగోపాల్ దగ్గరకు వెళ్ళింది. ఎదురు కుర్చీలో హరిప్రసాద్ ఉన్నాడు. తల పగలగొడదామనిపించింది. కాని ప్రయోజనం? తనను తానే సంబాళించుకున్నది.

"మీ చెల్లెలు రాజేశ్వరికి ఉద్యోగం రావటంలో నా సలహాకూడా కొంత ఉన్నదని మర్చిపోయారా నళినీ".

"లేదండీ, అన్నీ నాకు తెలుసు. కృతఘ్నురాల్ని నేనుకాదు".

"అంటే".

"నేనూ మా చెల్లెలు రాజేశ్వరి పెళ్ళికావలసిన ఆడపిల్లలం" ఏం మాట్లాడాలో తోచక ఏమిటో అనేసింది. హరగోపాల్ చిరునవ్వునవ్వాడు. హరిప్రసాద్ ఫక్కున నవ్వాడు.

"నేను పెళ్ళి సంబంధాలను గురించి మాట్లాడ్డంలేదు. రాజేశ్వరి ఉద్యోగం మానేసిందని వీరు చెబుతున్నారు వీరెవరో తెలుసా ? హరి సర్వోత్తమరావుగారి కొడుకు. అంత ఆస్తికీ వారసుడు హరిప్రసాద్".

"కావచ్చు".

"రాజేశ్వరి ఉద్యోగం చెయ్యడం, జీతం రెండువందలు ఇస్తున్న మాట".

"రెండు లక్షలు ఇచ్చినా ఉద్యోగం చెయ్యదు. క్షమించండి. ఈ విషయంలో మీకున్న గౌరవాన్ని మలినపర్చుకోవద్దు" నళిని వెళ్ళి తన సీట్లో కూర్చుంది ఆరోజు ఆమె ఏ పనీ చెయ్యనేలేదు. మేనేజరు శాస్త్రి గారు ఆమె ముఖంలోని భావాలేమిటో అర్థంకాక ఆ సాయత్రం వెళ్ళే ముందు హరగోపాల్‌తో చెప్పాడు. నళిని ఈ రోజున ఏ ఒక్క ఫైలూ చూడలేదనీ, గోళ్ళు గిల్లుకుంటూ, కళ్ళు తుడ్చుకుంటూ కూర్చున్నదనీ. ఈ రోజున జీతం నష్టంచెయ్యమనీ. అప్పటికి నళిని వెళ్ళిపోయింది.

హరగోపాల్ అంతావిని,

"మీ భార్య చాలా అదృష్టవంతురాలు" అన్నాడు.

"అదేమిటండీ రెండేళ్ళయినా కాపురం చెయ్యకుండా చచ్చిపోవటం అదృష్టమంటారా" అన్నారు మేనేజరు శాస్త్రిగారు.

"ఇంత అనుమానపు భర్తతో కాపురంచేసి రోజూ చచ్చేకంటే ఒక్కసారి శాశ్వతంగా పోవటం ఎంత అదృష్టం" అన్నాడు.

మేనేజరు శాస్త్రిగారికి చచ్చినంత పనై చావకుండా ఇంటికి వెళ్ళాడు.

మర్నాడు ఆదివారం. నళిని హరిగోపాల్ ఇంటికి వెళ్ళింది. యామిని సాదరంగానే స్నేహితురాల్ని ఆహ్వానించింది.

"చాలా రోజులయింది నళినీ మాఇంటికివచ్చి. కులాసానా, ఏమిటి విశేషాలు ?" అన్నది.

"కులాసాకు కులాసాగాలేదు. జ్వరంకాదు" అన్నది ముభావంగా చూస్తూ.

"అంటే ఉద్యోగంతోపాటు జోక్స్‌కూడా వచ్చినయ్యి. అదీ అదృష్టమే కదూ"

"అదృష్టానికి దురదృష్టంవచ్చింది, అంతేనా నళినీ ?" అన్నాడు హరగోపాల్.

"యజమానురాలితో ఒక సంగతి మనవి చేసుకుందామని వచ్చాను" నమస్కరిస్తూ అన్నది నళిని.

"ఆ ముసుగుతీసి బీరువాలో దాచాను. స్నేహితురాలనే నేతచీరె కట్టుకున్నాను. సామాన్య గృహిణిని, నిరభ్యంతరంగా నీ కష్టసుఖాలు వింటాను".

"ఈ ఉత్తరం చదివి శ్రీవారికి అందజెయ్యి. ఆ ఉత్తరం ముందు వెనకలు విన్నవిస్తాను" అని ఆ ఉత్తరం యామినికి ఇచ్చింది నళిని.

యామిని ఉత్తరం చదివి హరగోపాల్‌కు ఇచ్చింది. అతనూ చదివాడు. భార్యాభర్తలిద్దరూ నళినివైపు చూశారు.

ఎగ్జిబిషన్‌స్టాల్లో రాజేశ్వరి ఉద్యోగానికి చేరింది మొదలు విన్నటి వరకూ జరిగిన సంఘటనలన్నీ చెప్పింది నళిని.

"హరిప్రసాద్ సంగతి నాకూ తెలుసు నళినీ. వాడి దృష్టి మీమీద పడ్డదని తెలియదు" అన్నాడు హరగోపాల్.

"ఈ పరిస్థితిలో . మేం ఏంచెయ్యాలో మీరే చెప్పండి" అన్నది నళిని.

"ఈసారి ఇట్లాంటి ఉత్తరం రాస్తే పోలీసులకు రిపోర్టివ్వు" అన్నది యామిని.

"ఇంకేం రెండులక్షల కాపీలు అమ్ముడయ్యే దినపత్రికలో వేయించినంత పబ్లిసిటీ వస్తుంది" అన్నాడు హరగోపాల్.

"మరేం చెయ్యమంటారు" ఎదురుప్రశ్న వేసింది యామిని.

"మనస్సుకు ఏమీ అలసట కలక్కుండా ఉంటే అన్నిపరిస్థితులూ అవే దారికొస్తయ్యి. నేనూ కొంత బాధ్యత తీసుకుంటాను" అన్నాడు.

నళిని మనస్సు కుదుటపడింది. "ఒక్కమాట, ఏ ఉత్తరా కీ జవాబు వ్రాయకండి" అన్నాడు.

ఆ దంపతులకు నమస్కరించి, పెద్దబరువు తీరినట్లుగా నిట్టూర్చి వెళ్ళింది నళిని.

"నళిని ప్రాజ్ఞురాలు, ఆ కుటుంబానికి వెన్నెముక" అన్నాడు హరగోపాల్.

# 15

ప్రేమించి పెళ్ళిచేసుకున్న దంపతుల్లో నవచైతన్యం తొణికిసలాడుతుంది. కొత్త సంబంధాలదంపతుల మాదిరి, మానవత్వాలు అర్థంచేసుకోటానికి కొత్తకాపురంలో కొన్నాళ్ళు ప్రొబేషనర్సుగా ఉండనక్కర్లేదు. వివాహం కాగానే పర్మనెంట్ ఉద్యోగంలో వేసినట్టులగానే ఆ దంపతులు భావించటంలో ఆశ్చర్యంలేదు. అంతేకాదు వారి దాంపత్యశోభ అర్ధ నారీశ్వరుడులానే ఉంటుంది మనస్సు కలుపుకోవటం, హృదయాలు ఇచ్చి పుచ్చుకోవటం, ఒకరినొకరు ఆరాధించటం వివాహానికి ముందే విఘ్నేశ్వర పూజగానే ముగుస్తూంది. కనుక ఆ రకమైన భావాలకు తావుండదు. పెళ్ళయ్యాక ఇద్దరం ఒక్కటే అనే హృదయస్పందనా లయవిన్యాసం చేస్తుంది. జీవిత భాగస్వామి ఎన్నిక పూర్తయి సంసారమనే అసెంబ్లీ హాల్లో ప్రవేశించి గృహసామ్రాజ్యాన్ని నిండైనమనస్సుతో ఆలోచించి ఏలుకుందామనే దృఢ సంకల్పం వెంటనే కలుగుతుంది. కనుక కాసేపు ఇద్దరూ శాసనసభ్యులుగా ఉంటారు. కాసేపు మంత్రులవుతారు అంతేకాని ఒకరు మంత్రి ఒకరు శాసనసభ్యుడు....ఒకరు స్పీకరు ఒకరు ప్రతిపక్ష సభ్యుడు కారు, ప్రేమ వివాహాలకు ఇలాంటి పట్టింపులుండవు.

కాని శ్రీనివాసరావు లీలావతిల దాంపత్య జీవితం ఇందుకు వ్యతిరేకమే అయింది. మంత్రిని, స్పీకరునీ, సభానాయకుడినీ అన్నీ నేనే అంటుంది లీలావతి. నువ్వు ప్రతిపక్ష సభ్యుడివి అసలేకాదు. అధికార పార్టీ తాలూకు సామాన్య శాసన సభ్యుడివి. ఇష్టపడినా, ఇష్టపడకపోయినా నేను ప్రతిపాదించిన ప్రతి బిల్లునూ పార్టీ నియమానికి కట్టుబడి నువ్వు చెయ్యి ఎత్తవలసిందే అంటుంది శ్రీనివాసరావు విషయంలో లీలావతి.

అసలు వాళ్ళ వివాహమే రెండు పార్టీలు ఎన్నికల ఒప్పందంలా జరిగింది. ఆ షరతులను శ్రీనివాసరావు నోటిమాటద్వారా ఆమోదించాడు. ఎక్కడా సంతకం చెయ్యలేదు.

ఆ షరతుల ప్రకారం,

తన ఇష్టంవచ్చినన్నాళ్లూ లీలావతి ఉద్యోగం చెయ్యవచ్చు. కుటుంబ వ్యయం విషయంలో నిత్యజీవితం విషయంలో లీలావతి హోం, ఆర్థిక శాఖలమీద సంపూర్ణ ఆధిపత్యం వహిస్తుంది.

హైదరాబాదులో ఉద్యోగం ఇద్దరూ చేసినన్నాళ్లూ తన తండ్రి గారింట్లోనే ఉండాలి. అంటే శ్రీనివాసరావు ఇల్లరికపు అల్లుని బాధ్యత్వసీక రించవలసి ఉంటుంది.

ఒకరి అభిప్రాయాలూ, ఆదర్శాలూ, భావోద్రేకాలూ ఇచ్చిపుచ్చు కునే ధోరణిలో ఉండాలి. కాని అంతిమ తీర్పు విషయంలో లీలావతికి సంపూర్ణమైన హక్కు ఉన్నది.

నీతి నియమాలనేవీ, సాంకేతిక విలువలనేవీ, న్యాయసూత్రా లనేవీ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలనేవీ ఇద్దరికీ ఒక్క తీరునే అమలు జరగాలి. ఒకరి స్వేచ్ఛకు మరొకరు అడ్డురాకూడదు.

ప్రయాణ విషయాల్లోనూ, మిత్రులతో పార్టీలకు వెళ్ళే విషయా ల్లోనూ, వినోద, విహార విలాస యాత్రలకు వెళ్లే విషయంలోనూ ఒకరు మరొకరికి అడ్డుచెప్పకూడదు

ఈ షరతులకు లోబడి ఇద్దరూ పరస్పరం తమ అంగీకారాన్ని ఆమోదించిన తరువాతనే వివాహం జరిగింది తన వాళ్ళెవరూ లేకుండానే ఈ పెళ్ళికి వప్పుకున్నానే అనే ఆందోళన ఒకమూల ఎక్కడో పైసా అంత ఉన్నా, తండ్రికి ఈ పెళ్ళి ఒక సవాలు వంటిదనే భావంతో ఒప్పు కున్నాడు శ్రీనివాసరావు. అమ్మాయి కోరికలనూ, భావాలనూ నూటికి రెండొందలపాళ్ళు అమలుజరిపే లీలావతి తల్లిదండ్రులకు ఈ పెళ్ళి ఇట్లా వియ్యాలవారు ఎవ్వరూ లేకుండా చేస్తున్నామేమిటా అని అనిపించలేదు. అమ్మాయి పెళ్లి, ఇల్లరికపు అల్లుడు ఇవే లీలావతి తల్లిదండ్రుల మన స్సును పూర్తిగా ఆకట్టుకున్నాయ్యి.

ఆ రోజున గోల్కొండ పిక్‌నిక్‌కు వెళ్ళొచ్చిం తరవాత లీలావతి వాంతి చేసుకుంది. తల్లి సంతోషించింది. లీలావతి కోపం పురివిప్పిన నెమలిలానే నాట్యం చెయ్యసాగింది. ఆ రాత్రి యధోచితంగానే ఉన్నది. లీలావతి. శ్రీనివాసరావు అటు మనిషిని ఇటు తిప్పుకున్నాడు.

"లీలా, వాంతి మనశ్శాంతిని కలిగించిందికదూ"

"నాకాదు. మా అమ్మకి"

షాక్ తిన్నవాడిలా చూశాడు శ్రీనివాసరావు.

"అదేమిటి నెలతప్పింది నీకా్కదూ"

"అవును. నీకు మతి చలించటంతో నాకు నెల తప్పింది. డోంట్ బి సిల్లీ ఇదొక ఘనకార్యంకాదు"

"అట్లాగా ! మనం అన్ని విషయాలూ ఆలోచించాంగాని కుటుంబ నియంత్రణను ఆలోచించలేదు".

"శ్రీనీ, నేను గర్భవతిని కావటం నీకు జోక్‌గా ఉందికదూ" మాటలో కటుత్వం గోచరించింది.

"అదేమిటి లీలా, సంతోషపడుతున్నాను జోక్ కాదు".

"అట్లాగా. మీ అమ్మకు ఉత్తరం రాయకపోయావా. నువ్వు తండ్రివి కాబోతున్నావని".

"నీ ఇష్టం అట్లాగే, రేపే ఉత్తరం రాస్తాను"

లీలావతికి వళ్ళు మండిపోయింది !

"శ్రీనీ, నావయస్సు ఇరవై రెండు సంవత్సరాలు, జీవితానికి లోబడి నేనెప్పుడు ఉండను, ఉండలేను. నాకులోబడి, నేను చెప్పినట్లుగా నా జీవితం నడవాలి ఈ వయస్సులోనే తల్లిని కావాలని నే నెప్పుడూ అనుకోలేదు. నేను పసికందును కాకపోయినా మా అమ్మకు నేను చిన్న పిల్లగానే ఉండాలి. వివాహితను కనుక వయస్సునుబట్టి నేను గర్భవతిని కావచ్చు. కాని నా మనస్సునుబట్టి నాకా కోరికలేదు. నాకోరిక ఎన్నడూ నా చెయ్యిజారిపోలేదు" ఒక నిశ్చయానికి వచ్చినదానిలా అన్నది లీలావతి.

తనకు తెలియకుండానే ఆశ్చర్యపోయాడు శ్రీనివాసరావు, "నీ భావాలు చాలా వింతగా ఉన్నయ్యి లీలా, ఈ విషయంలోనూ నీ అభిప్రాయాలు నీవేనని ఇప్పుడు తెల్సుకున్నాను".

"శ్రీనీ, భావాలకూ భావోద్రేకానికీ సంబంధంలేదు. ఈ రెండూ నీ దృష్టిలో ఒకటైతే నా దృష్టిలో వేరు. నా అభిప్రాయానికి స్వేచ్ఛ

కావాలి, నా జీవితానికి స్వేచ్ఛకావాలి. నాకు సంబంధించిన ప్రతి విషయానికీ నాకు తగిన స్వేచ్ఛ కావాలి. ఈ షరతులు గుర్తున్నయ్యికదూ ?"

"అవును"

"అయితే ఇంక ఈ విషయంలో నీ జోక్యం అనవసరం" అన్నది నవ్వుతూ లీలావతి.

స్త్రీ పురుష వాంఛ శరీర గతమైనది. వాంఛాయుతమైన మనస్సు ఉద్రేకపు వత్తిడికి లోబడుతుందేగాని మనస్సును మనస్సులో కలుపుకోలేదు. కొంతమంది శారీరకంగానే కాక మానసికంగా కూడా ఏకోన్ముఖులై ఇద్దరూ ఒకటే అవుతారు. ఒకరి మనస్సును మరొకరు ఆక్రమించి వారి ఆనందానికి మెరుగులు దిద్దుకుంటారు. ఆ మెరుగులు వారి శారీరక వాంఛను సమ్మోహితులుగా చేస్తాయి.

ఈ పరిస్థితుల్లో ఉన్న దంపతులు ఒకరికొకరు ఎంతమాత్రం దూరంగా ఉండలేరు వళ్ళంతా కళ్ళుచేసుకుని ఒకరికోసం మరొకరు నిరీక్షిస్తూ ఉంటారు.

ఇలాంటి జీవితం శ్రీనివాసరావుకు కావాలి. తన సంసారజీవితం మూడు పువ్వులూ ఆరు కాయలూ కావాలని అతని ఆకాంక్ష. లీలావతికూడా అలాంటి సహకారాన్ని తమ సంసారజీవితానికి తప్పకుండా ఇస్తుందని ఆశించాడు. కాని ఆశ వేరు, ఆశను అమలుజరపటం వేరు అయిం.ది

మరో వారం గడిచింది. ఆరోజు ఆదివారం. "శ్రీనీ, నా ఆలోచనను అనుభవంలోకి తెచ్చుకున్నాను. అంతా మనచేతుల్లోనే ఉన్నది" నవ్వుతూ చెప్పింది. ఆ సంతోషంలో ఎంతో ధీమా కనిపించింది, గర్వం తొణికిసలాడింది.

"ఏమిటది" చదివే పేపరు అవతల పడేసి ఆమె రెండుచెంపలూ పొదివి పట్టుకొని కళ్ళల్లోకి సూటిగాచూస్తూ అడిగాడు.

"జీవితాన్ని సుఖమయం చేసుకోవచ్చు కాని కొందరి ఆలోచనలు సూటిగా ఉండవు. మనిషిని సుఖంగా బ్రతికించవు, నా ఆలోచనలను నేను జయించాను" అన్నది అతని చెంపమీద చిటికేసి.

"ఏమిటి అది లీలా" దగ్గరకు లాక్కొని ముద్దుపెట్టుకోబోయాడు. చెవిలో రహస్యంచెప్పి పట్టువిడిపించుకున్నది లీలావతి.

"ఎంతపనిచేశావు లీలా. ఇంత బుద్ధిలేనిపని చేస్తావని ఎన్నడూ అనుకోలేదు".

నిశితంగా చూసి కుర్చీలో కూర్చుంది లీలావతి.

"నాకు బుద్ధిలేదంటావా శ్రీనీ. నిజమే లేదు. స్త్రీబుద్ధి ప్రళయానికి దారితీస్తుందనే పాతకాలపు సామెత ఉన్నదికదూ, అంతే అనుకో" నిర్లిప్తంగా అన్నది లీలావతి. శ్రీనివాసరావు తనమీద ఆధిక్యత చూపటానికి ప్రయత్నిస్తున్నాడనే అనుమానం కాస్త కలిగింది.

"లీలా, ఏదో ఘనకార్యం చేసినట్లుగా విర్రవీగిపోకు. నీకు చదువూ సంస్కారమూ ఉన్నయ్యి. కాని నీ ఆలోచనలు తెగిన గాలిపటంలా ఉన్నయ్యి. వివాహమైన స్త్రీ మాతృత్వాన్ని కోరుతుంది. గొడ్రాలుగా ఉండాలని ఎవ్వరూ కోరుకోరు. అంతేకాదు ప్రధమ గర్భిణి ఏ వివాహిత స్త్రీ పోగొట్టుకోదు" అతనిలో కోపం అంచులుతట్టింది. మాటల్లో కాఠిన్యం కరుడుగట్టింది. తనూ అవతల కుర్చీలో కూర్చున్నాడు. ఆఫీసు మేనేజరు కూతురు పెళ్ళికి లీలావతి తల్లిదండ్రు లిద్దరూ వెళ్ళారు. ఇంట్లో ఈ చిన్న వాళ్ళిద్దరూ ఉన్నారు.

"శ్రీనీ, నీ కోపానికి నా భావాలు సరిపోవు. నీ కాఠిన్యపు మాటలకు నా స్వేచ్ఛ లొంగిపోదు. తాళిగట్టిన భార్య తలవంచి నీ పాదదాసిగా మారిపోవాలని కోరుకోకు. నా అభిప్రాయలు ఏమైనాసరే మన్నించాలని మన పెళ్ళికిముందే చెప్పాను" తనూ నిర్లక్ష్యంగానే అన్నది లీలావతి.

"లీలా, స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు, అభిప్రాయాలూ, ఏవైనాసరే నాకునచ్చి నేను మెచ్చితేనే నువ్వు అమలుపర్చుకోగలిగేది. తల్లి దండ్రులకు దూరమై నిన్ను పెళ్ళిచేసుకున్నానంటే నేను పిచ్చివాడిననుకున్నావేమో. సాటిమానవునిగా నిన్ను గౌరవిస్తాను. అర్ధాంగిగా ఆదరించి నీ అభిప్రాయాలను మన్నిస్తాను. దాంపత్య జీవితంలో ఏ మాట పట్టింపూ

లేకుండా ఉండాలనే నా కోరిక. కాని నీ మంకుపట్టుకీ, తూష్ణీభావానికీ నేను హర్షించను. నిన్ను పెళ్ళిచేసుకున్నది సుఖమయ జీవితం గడపటానికి. చదువుకున్న భార్యగా నీ మేధస్సును అర్థంచేసుకుని సంస్కారాన్ని ప్రతిబింబించే నీ భావాల్ని గౌరవించటానికేగాని, నీ రెటమత వాదనల్ని ఆమోదించటానికికాదు. రోజంతా ఆలోచించినా నువ్వుచేసింది తప్పేనని మనస్ఫూర్తిగా చెప్తున్నాను. పిడివాదానికైనా కొన్నిహద్దులున్నాయి" అన్నాడు శ్రీనివాసరావు. విస్తుపోయింది లీలావతి.

పదినిమిషాలు ఎవ్వరూ మాట్లాడలేదు. ఒకరి ముఖంలోకి మరొకరు పరిశీలనగా చూస్తూ కూర్చున్నారు. శ్రీనివాసరావు ఈ పదినిమిషాల్లో మూడు సిగరెట్లు కాల్చాడు.

"శ్రీనీ, ఇంత చిన్నవయస్సులోనే నీకు తండ్రివి కావాలనే కోరిక ఉన్నదా" అనునయంగా అన్నది లీలావతి.

"కోరికలేదు. అనుభవానికి ఈరీతిగా అడ్డుకట్టవేయటాన్ని నేను సహించను."

"ఒకవేళ ఈ గర్భం నిలిచి కొడుకుపుట్టి వాడికి నీ బుద్ధులూ, గుణాలూ అబ్బి నీతో పోట్లాడి వెళ్ళిపోతాడే అనుకో. అప్పటికి నీ వయస్సు నలభై అయిదేళ్ళు ఉంటయ్యి. అంత చిన్న వయస్సులో కొడుకుతో తగాదా పెట్టుకుంటే మానసికంగా నలభై అయిదేళ్ళకే కృంగిపోతావేమో" నవ్వుతూ ఎగతాళి రంగులు పులిమింది అహంకారం ఆ రంగులకు మెరుగులుదిద్దింది.

"ఇలాంటి భార్యకన్నా, అటువంటి కొడుకే నయమేమో".

లీలావతి వీపుమీద ఛళ్ళున చరిచినట్లైంది. ఆలోచనలు చెల్లాచెదురై మనస్సు స్థాణువులా అయింది. కుర్చీలోంచి లేచివెళ్ళి వరండాలో నిలబడింది. శ్రీనివాసరావు బట్టలు వేసుకుని వెళ్ళిపోయాడు. చూస్తూ నిల్చున్నది. కాని లీలావతి మాట్లాడలేదు.

మధ్యాహ్నం పన్నెండున్నర దాటాక శ్రీనివాసరావు వచ్చాడు. ముఖంలో కోపం ఛాయలు ఇంకా తగ్గలేదు. బట్టలు మార్చుకుని సిగిరెట్ కాల్చుకుంటూ కుర్చీలో కూర్చుని కిటికీలోనుంచి వీధిలోకి చూస్తున్నాడు.

"భోజనానికి లే శ్రీనీ"

"అక్కర్లేదు, నువ్వు భోజనంచెయ్యి"

"ఇద్దరికీ కారేజి తెప్పించాను"

"నువ్వు వంటచెయ్యవని నాకుతెల్సు. హోటలుభోజనం ఇంట్లో తినక్కర్లేదు"

"ఎత్తిపొడుపు మాటలతో కడుపునిండదు. ఇద్దరం భోజనంచేద్దాం"

"పాపం, ఈ పతివ్రతా తిలకం హోటలునుంచి క్యారేజి తెప్పించి భర్తకోసం కనిపెట్టుక్కూర్చుంది. ఎంతలో ఎంత మార్పు" సిగరెట్ వేలికి అంటుకుంది. కిటికీలోనుంచి పారేశాడు.

"చేతిలో ఉన్న సిగరెట్ని అదుపులో వుంచలేని మగవాళ్ళు పాతివ్రత్యాన్ని గురించి అసందర్భంగా మాట్లాడుతారు. పెద్దమాటలు కట్టిపెట్టి భోజనానికిలే. ఒంటిగంట కావస్తున్నది" చెయ్యిపట్టుకుని లేవ తియ్యబోయింది. చెయ్యి విడిపించుకున్నాడు శ్రీనివాసరావు.

"నా భోజనం హోటల్లో అయింది. నువ్వు భోజనం చెయ్యి".

"అట్లాగా" క్షణంసేపు చూస్తూ నిల్చుని వంటింట్లోకి వెళ్ళింది లీలావతి.

వారంరోజులు గడిచినా ఇద్దరి భావాల్లో మార్పురాలేదు. తన తప్పు వప్పుకోలేదు లీలావతి. అత్తగారు, మామగారుకూడా కూతురునే సమర్థించడంతో తన ఆంతర్యాన్ని అర్థం చేసుకునేవాళ్ళు ఆ ఇంట్లో లేరని మొట్టమొదటిసారిగా గ్రహించాడు శ్రీనివాసరావు.

"అభం శుభం తెలియని చిన్నపిల్ల, అన్నంతిని దానిచెయ్యి అదే కడుక్కోవడం సరిగా చేతకాదు, ఏనాడూ దానికంచం అది ఎత్తుకుని కడుక్కోలేదు. ఆ పసిదానికి యిప్పట్నుంచీ పిల్లలెందుకు నాయనా" అన్నది లీలావతి తల్లి రమామణి.

"అవునోయ్. ఆఫీసుకు టిఫిన్‌బాక్స్ తీసుకువెళ్ళటానికే మా లీల బద్ధకిస్తుంది. చంటిపిల్లల్ని ఎట్లా ఎత్తుకోవాలో దానికి తెలీదు. అదీకాక

నెలలు పిల్లలంటే దానికి ఎంతో చిరాకు. ఈ పిల్లల బాధ అది పడలేదోయ్. అందుకనే ఇంజక్షన్లు, మాత్రలతో ఆ బాధ తప్పింది" అన్నాడు మావగారు.

శ్రీనివాసరావు కోపం మనస్సు అంచులు దాటింది.

"ఇరవై రెండేళ్ళ పసిదానికి పెళ్ళెందుకు చేశారు. మావగారూ, ఎన్నడైనా కాపురం చేసిన అనుభవం లేదని నలభై ఏళ్ళవరకూ పెళ్ళి చెయ్యకుండా ఉంటే బావుండేది. పాలు తాగుతూ తల్లి వళ్ళోనే ఉండేది కదా. పెళ్ళిచేయటంనుంచీ అనుభవంలేని అనుభవాలను పాపం మీ అమ్మాయి అనుభవిస్తున్నది, ప్చ్" అన్నాడు శ్రీనివాసరావు.

ఆ దంపతులు ఒకరిముఖం మరొకరు చూసుకుని బాధపడ్డారు.

ఈ మాటలన్నీ విన్నది లీలావతి. కోపం తారస్థాయికి వెళ్ళినా, మాటలకు మొదటిసారిగా సంకెళ్ళు వేసింది.

రెండు మూడు రోజులు మాటల్లేకుండానే గడిపారు.

ఆ మర్నాడు రాత్రి లీలావతి ఇంటికి రాలేదు. మనస్సులో ఆదుర్దా ఎక్కువైంది. కాని అత్తగారినీ, మామగారినీ అడగలేకపోయాడు. వాళ్ళూ చెప్పలేదు. మర్నాడు ఉదయం పదిగంటలకు వచ్చింది. అప్పటికే బ్యాంకుకు వెళ్ళాడు శ్రీనివాసరావు. ఆ రాత్రి అడిగాడు.

"రాత్రి ఇంటికిరాలేదేం, ఎక్కడికి వెంచేశావు" మాటలో అధికృత కనుపించింది మనస్సులో అనుమానం క్షణంసేపు కదలాడి మాయమైంది.

"జీవితాలు ముడి పడినంత మాత్రాన ప్రతి చిన్నవిషయానికీ అధికృతను చూపటంలో అర్థంలేదేమో" వక్కపలుకు నములుతూ పేపరుచూస్తూ అన్నది లీలావతి.

"ఆడదానికి అంత నిర్లక్ష్యం పనికిరాదు. రాత్రి ఎక్కడికి వెళ్ళావో చెప్పవేం" గద్దించి అడిగాడు.

"అదే నేనూ అంటున్నాను, ఆడదానిమీద మగవాడికి అంత నిర్లక్ష్యం పనికిరాదు, గౌరవం యివ్వటం, గౌరవింపబడడం భార్యాభర్తలిద్దరికీ కావలసిందే"

"ఎక్కడికి వెళ్ళావో చెప్పకుండా ఆ డొంకతిరుగుడు వాగు డెందుకూ, చెప్పవే, ఎక్కడికి వెళ్ళావ్" భుజాలు పట్టుకు ఊపుతూ అడిగాడు కళ్ళు ఎర్రబడ్డయ్యి. కోపంతో ముఖం జేవురించింది.

"స్నేహితురాలి యింటికి వెళ్ళాను".

"రాత్రి అక్కడే ఎందుకు ఉండవలసి వచ్చింది".

"లగ్నం అయ్యాక వద్దామనుకుంటే అది ఉండమని బలవంతం చేసింది" మునిపళ్ళతో కింది పెదవి కొరుక్కుంటూ చూసింది.

"ఏమిటా లగ్నం".

"పెళ్ళి, పునస్సంధానం కాదు".

"కథ బాగానే అల్లావ్, ఛీ" చెయ్యి ఎత్తాడు. దెబ్బ మీదపడకుండా అతని చెయ్యి పట్టుకుంది. తోకత్రొక్కిన త్రాచే అయింది లీలావతి. నాగ స్వరం పటలేని పాములవాడయ్యాడు శ్రీనివాసరావు. పాము కాటువేసింది. నోటితో విషం పీల్చి ఉమ్మేసి ఆ విషంనుంచీ తనను తాను కాపాడు కున్నాడు. తాచుపాము పడగ ముడుచుకోలేదు.

"ఆడదానిమీద చెయ్యి చేసుకునేటంత ధీశాలివైనావా శ్రీనీ. భేష్ చాలా బావుంది. భార్యమీద చెయ్యి చేసుకోవడం మగధీరుని లక్షణమను కున్నావు కదూ. నీ ఆశయాల్లో అదీ ఒకటని యిప్పుడు తెల్సుకున్నాను. భర్త చేతుల్లో దెబ్బలుతినడం అర్ధాంగి ఆదర్శాలలో ఒకటని ఎవరైనా చెప్పారా శ్రీనీ. కానీ ఆగావేం, ఇవిగో నా చెంపలు, వాయించు. రెండు చెంపలమీదా నీ అయిదువేళ్ళనీ నాట్యం చేయించి ఆ విన్యాసం చిహ్నాల్ని వాతలు పడేటట్లుగా చూపించు. ఊ, కానివ్వు" అని అతని ఎదురుగా నిల్చు న్నది లీలావతి. తుపాకిగుండుకు గుండెలు ఎదురొడ్డినట్లుగా ఉన్నది.

నిరుత్తరుడైనాడు శ్రీనివాసరావు. కోపాన్ని కోపంగానే దిగ మింగాడు. కుడి అరిచేత్తో నుదురు రుద్దుకుంటూ ఒక్క నిట్టూర్పు విడిచి కుర్చీలో కూర్చున్నాడు. గదిలో వెలిగే ట్యూబ్ లైట్ కాంతిలో అంతా చీకటిగానే కనిపిస్తున్నది. చీకటిని చీల్చుకుని భార్య ముఖంలోకి చూడలేక పోయాడు.

"శరీరానికి దెబ్బతాకకపోయినా, మనస్సుకు దెబ్బతగిలిందిలే శ్రీనీ, నీ కోపం వృధాపోలేదు" కుర్చీ దూరంగా లాక్కుని కూర్చుంది లీలావతి.

వైషమ్యమే ఆరోజు వారికి భోజనమైంది.

ఆ మర్నాడు కూడా ఎవరికివారు మాట్లాడకుండానే ఆఫీసుకి వెళ్ళారు. కన్నకూతురు స్వభావం తెల్సిన తల్లీ, తండ్రీ లీలావతిని ఏమీ అనలేకపోయారు.

యాంత్రికంగా లీలావతి ఆఫీసు పనిచేస్తున్నది. రెండుబిల్లులు ప్యాస్ చేసి మేనేజరుకు పంపింది. మరో అరగంటలో మేనేజరు పిల్చాడు.

"ఈ బిల్లులు సరిగ్గా ఎగ్రిమెంట్‌తో చెక్ చేశారా లీలావతీ"

"ఆ, చూశాను" మేనేజరు దగ్గరకు వచ్చింది.

"బిల్లులో ఈ ఐటమ్‌కి రేటు ఎంతుందో ఎగ్రిమెంటులో చూడండి. యూనిట్‌కు ఎనభై ఆరు రూపాయల ఇరవై పైసలుంటే మీరు తొంభై ఆర్రూపాయల ఇరవై పైసలు చొప్పున యూనిట్ రేటు వేశారు. దాంతో మొత్తంమీద వెయ్యి రూపాయలు పైగా పెంచేసి ప్యాసార్డరు వేసిపారేశారు. పైగా ఇది ఫైనలుబిల్లు. ఆఫలంగా ఈ కంట్రాక్టరు చెక్కుపుచ్చేసుకుని ఉడాయిస్తే మన పని ఏంగాను. చెప్పండి మీరేం. మీరు బాగానే ఉంటారు. రేపు ఆడిట్‌లో నా పీకుచ్చుకుంటారు. ఎలా తల్లీ ఇల్లా బిల్లులు పాస్‌చేస్తుంటే మన ఉద్యోగాలు నిలవాలంటారా ఆహా, అన్నానని బాధపడకండి" అన్నాడు మేనేజరు.

"కాస్త పొరబాటు జరిగింది. ఇంక జాగ్రత్తగాచూస్తాను. ఏమిటో మనస్సు బాగాలేదు" తన సీట్లోకి వచ్చి కూర్చుంది లీలావతి. క్షణంసేపు ఆమెవైపు చూశాడు మేనేజరు "పిచ్చిపిల్ల, వేలకువేలు బిల్లులు ప్యాస్ చేస్తుంది ఏంలాభం. తను బాగుపడదు. ఇతర్లను బాగుపడనియ్యదు. వలుగురు పిల్లలుపుడితే అప్పుడు తెలుస్తుంది" అనుకున్నాడు మనస్సులో.

ఫైల్సు చూస్తున్నా, డిస్పోజలు రాస్తున్నా రోజూమాదిరి లేదు. మనిషి ఇక్కడ, మనస్సు ఎక్కడో అన్నట్లుగానేఉంది. పెన్ పుచ్చుకుని ఫైల్సు చూస్తున్నదేకాని ఏమీ రాయటంలేదు. చేతి రుమాలుతో కళ్ళు తుడ్చుకున్నది.

"అట్లా ఉన్నారేం లీలావతీ తలెత్తిచూసింది".

"బాగానే వున్నాను, ఈ ఆడిట్ రిపోర్టుకి ఏం జవాబు రాయాలో తోచటంలేదు. రెండు రిమైండర్లుకూడా వచ్చాయి" అన్నది

"ఈరోజు మీరు మామూలుగాలేరు. ఆడపిల్లలు పెళ్ళయితే అరింత లౌతారు, అనుభవాలు మనస్సుని రాపాడుతూ ఉంటయ్యి" అన్నాడు మేనే జరు.

"వ్యక్తిగత విషయాలు ఆఫీసులో మాట్లాడటం అనవసరమను కుంటాను. మనస్సు సంకుచితమైనకొద్దీ ఎదుటివారిని ఏదో అనాలనిపిస్తుంది" అన్నది మేనేజరు ఏమీ అనలేదు. నవ్వుకుంటూ వెళ్ళి తనసీట్లో కూర్చు న్నాడు. వీళ్ళ సంభాషణ కొంతమంది విన్నారు. కొంతమంది వినలేదు.

సాయంత్రం ఇంటికి వెళ్ళింది. ఏడు గంటలైనా శ్రీనివాసరావు ఇంటికిరాలేదు. రోజూ ఇద్దరూ అరగంట వ్యత్యాసంతో వచ్చేవారు.

రాత్రి పదిగంటలైంది భోజనాలైనయ్యి. అతను రాకపోవటంతో ఎవరికివారు మధనపడుతూనే ఉన్నారు.

"లీలా"

"ఏం నాన్నా"

"ఆడపిల్లల జీవితం పెళ్ళితో మరో మలుపు తిరుగుతుందమ్మా ఆ వ్యత్యాసం నువ్వు కొంచం గ్రహించాలి" అన్నాడు తండ్రి.

"వివాహరీత్యా నా జీవితంలో మార్పువచ్చినా నా భావాలకు సంకెళ్ళు వేసుకోలేను నాన్నా. అన్నివిషయాలూ పెళ్ళికి ముందే అతనికి చెప్పాను. కాని తనమాటను తానే నిలబెట్టుకోలేకపోయాడు. స్నేహితురాలి పెళ్ళికి వెళ్ళి ఒక్కరాత్రి ఇంటికి రాకపోతే ఎంత రాద్ధాంతం జరిగిందో చూశారు

కదా, మనిషి ఎంతో మంచివాడు, ఆడదానియందు ఆయనకు గౌరవభావం లేదు".

"గౌరవమనేది మనం యిచ్చిపుచ్చుకోటంలో ఉంటుంది. బంతిని గోడకేసి ఎంత విసురుగాకొడితే అంత విసురుగాను అది ఎదురు వస్తుంది. నీకు నేను చెప్పవలసిందాన్నికాదు" అన్నది తల్లి.

తల్లీ, తండ్రికూడా తనను పూర్తిగా సమర్థించకపోవటంతో లీలావతిలో ఆశ్చర్యం చోటుచేసుకుంది. ఎంత ఆలోచించినా తన తప్పేమిటో అర్థంకాలేదు.

రాత్రి రెండుగంటలకు నిద్రపోయింది. మర్నాడు సాయంత్రం శ్రీనివాసరావు వచ్చాడు. బట్టలు మార్చుకుని సిగరెట్టు వెలిగించాడు.

"రాత్రి ఇంటికిరాలేదేం శ్రీనీ. నువ్వా పెళ్ళికి వెళ్ళావా ?" ముభావంగానే అడిగింది లీలావతి.

"ఏం ఆమాత్రం నాకు స్వాతంత్ర్యం లేదా. నువ్వు చెప్పివెళ్ళావా. నేను చెప్పటానికి, నాఇష్టమైతే వస్తాను లేకపోతే రాను. నా రాకపోకలతో నీకు నిమిత్తంలేదు".

"అట్లాగా, సరే, ఇంక అడగను. ఒక్కసారిగా ఇలా మారిపోతావనుకోలేదు. సాంఘిక నీతినియమాలకీ, కట్టుబాట్లకూ ఆడది ఎలా కట్టుబడి వుండాలో మగవాడూ అంతే. ఆరోజు రాత్రి నేను రాకపోతే నువ్వు నన్ను శంకించావు. కాని నీ విషయంలో నేను ఆ దృష్టితో ఆలోచించలేదు. నువ్వు నామీద చెయ్యిచేసుకోబోయావు నా మనస్సులో కోపం కోపంగానే ఉండిపోయింది. నీ మనసులో కోపం అదుపుతప్పి పశుప్రవృత్తిగా మారింది. నీ పాదాలు పుచ్చుకుని బ్రతిమాలి, నువ్వు కొట్టే దెబ్బలకు జంతువులా ఊరుకుంటే నీకు సంతృప్తిగా ఉండి, నీ కోపం శాంతించిఉండేది. నువ్వుఆశించిందే జరగలేదు. ఇకముందు జరగదుకూడా" అన్నది లీలావతి

"లీలా మాటలు పెంచకు. రేపట్నుంచీ ఈ ఇంట్లో నేను ఉండను. వేరే ఇల్లుతీసుకున్నాను. నీకు అమ్మా, నాన్నా కావాలో, భర్తకావాలో

ఆలోచించుకో. రేపు సాయంత్రలోగా తేల్చుకో". నిష్కర్షగానే చెప్పాడు శ్రీనివాసరావు.

లీలావతి ఆశ్చర్యపోయింది.

# 16

రఘునాధరావు పోయి సంవత్సరమైంది. సంవత్సరీకాలకు అందరూ గోగులేశ్వరం వెళ్ళారు. నళిని వారంరోజులు శలవు పెట్టింది. పిల్లలుకూడా స్కూలుకు శలవురాసి పంపారు.

తన సంసారజీవితం బాగున్నరోజుల్లో ఆరేళ్ళక్రితం సుభద్రమ్మ గోగులేశ్వరం వచ్చింది. మళ్ళీ ఈ పరిస్థితిలో తనకు ఈ గతి పట్టిం తర్వాత యిదే రావడం.

మొదటి రెండురోజులూ ఊళ్ళోవాళ్ళ పరామర్శలతో మళ్ళీ భర్త చచ్చిపోయిననాటి దుఃఖమేవచ్చింది సుభద్రమ్మకు. ఆడబిడ్డను పలకరించ టానికి వచ్చినవాళ్ళు శ్రీనివాసరావు ఎక్కడ ఎట్లాఉన్నాడో ఏమైనా తెలి సిందా అంటూ మాణిక్యమ్మనికూడా ఆ వచ్చినవాళ్ళు పలకరించడంతో తనూ మనస్సులో బాధపడి కళ్ళుతుడ్చుకునేది మాణిక్యమ్మ. ఈ వృద్ధా ప్యంలో యిన్నికష్టాలు చూస్తూ నేనెందుకు బ్రతికిఉన్నానా అని రామయ్యగారూ వాపోయేవాడు.

యధావిధిగా సంవత్సరికాలు జరిపారు. ఆ మూడురోజులూ పెళ్ళి అయినప్పట్నుంచి సుభద్రమ్మ జీవితంలోని కొన్ని సంఘటనల్ని రామయ్య గారు పిల్లలందర్నీ కూర్చోబెట్టి చెప్పారు.

"నాన్న ఏ లోకంలో ఉన్నా మా కుటుంబాన్ని కనిపెట్టేవుంటాడు తాతయ్యా. బిడ్డలుమంచివాళ్ళుకారని తల్లిదండ్రులయినా కొన్ని సందర్భాల్లో చెప్పుకుంటారుగాని. మా తల్లిదండ్రులు మంచివాళ్ళుకారని ఏ బిడ్డలూ చెప్పరేమో" అన్నది సుభద్రమ్మ మూడోకూతురు జయలక్ష్మి.

"అందరుబిడ్డలూ మంచివాళ్ళుకారు. అందరు తల్లిదండ్రులూ మంచి వాళ్ళుకారు. దానికి ప్రబలసాక్ష్యం మా కుటుంబమే" అన్నాడు రాఘవ రావు.

"అది పిల్లల్నిబట్టే ఉండదు, తల్లిదండ్రుల్నిబట్టే ఉండదు వాళ్ళ పురాకృత సుకృతంనుంచే వాళ్ళకు అలాంటి బుద్ధులు పుడుతూ ఉంటయ్యి మనం నిమిత్తమాత్రులం మాత్రమే" అన్నది మాణిక్యమ్మ.

"అదేనిజమని నువ్వు నమ్మినప్పుడు శ్రీనివాసరావు బావ ఇంట్లో నుంచి చెప్పకుండా వెళ్ళిపోయాడని దిగులుపడి కూర్చోవటం ఎందుకు. అత్తయ్యా బావ పురాకృత సుకృతం అట్లావుందని మనస్సు సరిపెట్టుకుంటే బావుండేదేమో" అన్నది జయలక్ష్మి మళ్ళీ.

"ఇంట్లో సూదిపోతే వెతుక్కుంటాం. పైస కనపడకపోతే నువ్వు తీశావా, నువ్వు తీశావానని ఇంట్లోఉన్న అందర్నీ అడుగుతాం. నిన్నటికి నిన్న నీ జడ రిబ్బను కనపడకపోతే అరగంటసేపు వెతికి హడావుడి చేశావ్. అచేతనమైన ఎక్కువ విలువలేని వస్తువులు సమయానికి కన పడకపోతేనే పదిసార్లు వెతుక్కుంటామే, పాతికేళ్ళు పెంచిన కొడుకు చెప్పాచెయ్యకుండా ఇంట్లోనుంచీ వెళ్ళిపోతే కన్నతల్లి మనస్సు తల్లడిల్లి పోవడంలో ఆశ్చర్యంలేదు జయలక్ష్మీ" అన్నాడు రామయ్య.

ఏం సమాధానం చెప్పాలో జయలక్ష్మికి తోచలేదు.

"కర్మ సిద్ధాంతం కనపడనిది. ముందుగా ఏ వ్యక్తికీ తెలియనిది. నిప్పుమీద చెయ్యి పెడితే కాల్తుందని తెలుసు, కాని నన్ను ముట్టుకుంటే దహించివేస్తానని నిప్పు తనంతట తానుగా చెప్పదు. ముట్టుకుంటేనే కాల్తుంది. కర్మసిద్ధాంతమూ అంతే. వేదాంతులు అందుకనే చెప్తారు 'చచ్చిన వాళ్ళకోసం చావబోయేవాళ్ళు ఏడుస్తున్నారని' చచ్చిపోయిన నాన్న వచ్చినారారు, గోలచేసినారారు. కాని ఏడవడం మన విధి. ఆ సంఘటనకు కుమిలిపోవడం మనస్సుకీ, హృదయానికీ సంబంధించిన పరివర్తన. విచార పడటమనేది శరీరానికి సంబంధించిన పరివర్తనకాదు. అదే నిజమైతే అమ్మకూడా నాన్నతోపాటుగా చనిపోవలసిందే, ఒకరు మరొకరికి ప్రాణ

ప్రదమైనవారే కాని ప్రాణం మాత్రం కాదు. అందుచేత బావ వెళ్ళిపోయాడని అత్తయ్య కుమిలిపోవటం విధాయకం" అన్నది నళిని.

"భేష్ రామయ్యగారి మనవరాలివనిపించావే నళినీ. ఇంత నిశితంగా ఆలోచిస్తావని అనుకోలేదు. నిబ్బరమైన నీ సమాధానానికి నాకు చాలా ఆనందంగా వున్నది" అన్నాడు రాఘవరావు.

"నిబ్బరానికి మనస్సు ప్రధానం మామయ్యా. మనస్సు నిబ్బరంగా వుంటే ఆ కర్మసిద్ధాంతం కూడా అంతగా రాద్ధాంతం చెయ్యదేమో, సిద్ధాంతానికి కట్టుబడి నువ్వు వుండటంచేతనే బావ వాటా పంచలేకపోయావు. రాద్ధాంతాన్ని నమ్ముకున్న బావ అందర్ని వదలి వెళ్ళిపోయాడు. అప్పటికి నీ మనస్సు ఒక స్థిరత్వానికి వచ్చింది. అంచేతనే సురేఖను చదువులో చేర్పించావు" అన్నది రాజేశ్వరి.

"సుభద్రా నీ బిడ్డలు అఖండమైన తెలివికలవాళ్ళే" అన్నాడు రామయ్యగారు.

"ఆ మాట నిజమే తాతయ్యా గంపెడు తెలివితేటలుకన్నా చిటికెడు అదృష్టం నయం. నీ మనవలకీ, మనవరాళ్ళకీ తెలివితేటలు ఉన్నయ్యికాని, అదృష్టంలేదు" అన్నది సురేఖ.

ఈ మాటకు అందరూ నవ్వేశారు. "నిజమే సురేఖా, నాకు మనవులూ, మనవరాళ్ళు కావటంనుంచీ అదృష్టం లేకపోయినా తెలివితేటలయినా ఉన్నయ్యి. ఇంకో వెంకట్రామయ్య మీ తాతయ్య అయితే అదృష్టమూ, తెలివితేటలూ కూడా మిమ్మల్ని చూసి పారిపోయేవేమో" చలోక్తిగా అన్నాడాయన.

లోకాభిరామాయణానికి మొదలూ చివరా ఉండదు. ఇడ్లీలు వండటంనుంచీ చంద్రలోక యాత్రవరకూ చర్చనీయాంశాలే. అన్ని విషయాల్ని అందరూ పరామర్శించారు. మళ్ళీ తమ జీవితాల్లోకే వచ్చారు.

"అన్నయ్య సంగతు లేమైనా తెలుస్తున్నాయ్యా నాన్నా. వదినను నువ్వు చూశావుట కదూ" అన్నది సురేఖ. సుభద్రమ్మ, పిల్లలూ ఆశ్చర్య

పోయారు. రాఘవరావు, రామయ్య, మాణిక్యమ్మల ముఖాలు వెల వెల బోయాయి.

"అదేమిటి మావయ్యా శ్రీనివాసరావుబావ పెళ్ళిచేసుకున్నాడా? ఎవరికీ తెలీదే, ఎవరా అమ్మాయి. ఏ ఊరు" ఆశ్చర్యంతో ప్రశ్నించింది నళిని.

"మాకు మాత్రం ఏం తెలుసు. పెళ్ళయాకనే వాడూ ఉత్తరం రాశాడు. హైదరాబాద్ వెళ్ళి అమ్మాయిని చూశాను. పిల్లబాగానేఉంది. మన వాళ్ళే ననుకుంటాను. అమ్మాయి మాటలు కొద్దిగానే విన్నాను. చాలా తెలివైంది" ముభావంగా అన్నాడు రాఘవరావు.

"అమ్మాయి పేరేమిటి? ఏం చదువుకున్నది?" ఉత్సాహంగా అడిగింది రాజేశ్వరి. మాణిక్యమ్మవైపు చూసింది సుభద్రమ్మ. ఆమె మౌనాన్నిచూసి విస్తుపోయింది.

"అమ్మాయిపేరు లీలావతి అని వాడే ఉత్తరంలో రాశాడు. ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఏదైనా ఉద్యోగంకూడా చేస్తున్నదేమోనని నా ఊహ ఏదైనా వాడి జీవితంతో నాకు నిమిత్తం లేకుండానే సంచరిస్తున్నాడు" అన్నాడు రాఘవరావు.

ఈ సమస్యను గురించి ఎవరి దృక్పథములో వాళ్ళు కాసేపు ఆలోచించారు.

"గుప్పెట్లో ఉన్న వస్తువును అది ఎంత విలువలేనిదైనా గుప్పెడు మూసినంతవరకూ దాని విశిష్టత తగ్గిపోదు. ఆ గుప్పెట్లో ఉన్న వస్తువు యందు ఆసక్తితోపాటు గౌరవమూ ఉంటుంది, గుప్పెడు తెరచి చూపించగనే "ఓస్ ఇదేనా" అని పెదవి విరుస్తాం. ఆ విధంగానే ఆడపిల్లల జీవితాలుకూడా అంతే" అన్నాడు రామయ్యగారు.

పెద్దవాళ్ళు ఏమీ అనుకోలేదు. ఆడపిల్లలు నలుగురూ ఒకరి ముఖాలొకరు చూసుకుని నవ్వుకున్నారు.

"యుక్తవయస్సు రాగానే ఇంట్లో ఉండవలసిన ఆడపిల్లలు బైటకి వచ్చి చదువులయందు మోజుపడి పికాకోక చిలుకల్లా బజార్లవెంట తిరు

గుతూ ఉంటే, ప్రేమ వివాహాలు జరగటంలో ఆశ్చర్యమేముంది. ఆ రోజులలో పెళ్ళిముందు, ప్రేమ తరువాత. ఈ రోజులలో ప్రేమ ముందు పెళ్ళి తరువాత. ఇంకా పురోగాములైతే కాలేజీకి వెళ్ళేముందు ఉన్నహృదయం కాలేజీ నుంచి వచ్చేటప్పుడే ఎవరికో ఇచ్చి వస్తారు. ఏమన్నా అంటేమేం హృదయాలు ఇచ్చి పుచ్చుకుని వారం రోజులయింది అంటారు. కాలం మారలేదు ఋతువులు క్రమం తప్పలేదు. కాని బుద్ధులే ఆలోచించటానికి వీల్లేకుండా మారిపోయాయి" అన్నాడాయన.

"ఈ మార్పనేది ఒక్క ఆడ పిల్లల్లోనూ, మగ పిల్లల్లోనూ రాలేదు తాతయ్యా. పెద్ద వాళ్ళల్లోనే ఈ మార్పు వచ్చింది. దానికి కారణం ఆర్థిక వ్యవస్థ మారి పోవటమే. 'ఆర్థిక వ్యవస్థను మార్చింది పెద్దవాళ్ళు' పిల్లలు కారు. మీ పెళ్ళికి మీకు ఎనభై ఎకరాల పొలం ఉన్నదని చెప్పావు. ఎప్పుడో మాటల సందర్భంలో. అప్పుడు నీకు కట్నం నూట పదహార్లు ఇచ్చారని కూడా నువ్వే చెప్పావు. ఎనభై ఎకరాలున్న పెళ్ళి కొడుక్కి నూటపదహార్లు కట్నమంటే ఈ రోజుల్లో వాళ్ళకు నవ్వు వస్తుంది. ఈ రోజులలో అయితే కనీసం ఏభై వేలయినా కట్నం పుచ్చుకునేవారు. వివాహం విధి నిర్వహణ, అటువంటి విధి నిర్వహణలో ఎవరూ కూడా తమ కర్తవ్యాన్ని నిర్వహించకుండా డబ్బు విలువకు ముడిపెట్టారు. పెద్ద వాళ్ళ ధన ప్రలోభానికి వివాహవ్యవస్థ బలిఅయింది. అంటే డబ్బు ముందు వివాహ వ్యవస్థకు విలువ లేకుండా పోయింది.

"ఈ కారణం చేతనే ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావటం లేదు అంటే ధనప్రలోభానికి లోబడని పెళ్ళిళ్ళు ఏవైనా జరిగాయంటే అది ప్రేమ వివాహమని నిస్సందేహంగా చెప్పవచ్చు. బావ పెళ్ళి మీరేగనక చేసి నట్లయితే కనీసం ఎనిమిదివేలు కట్నం పుచ్చుకునేవారే. అంతేనా మావయ్యా" అన్నది నళిని.

"అభిప్రాయాలు ఎన్నయినా చెప్పవచ్చు. ఆదరణ యోగ్యమైనవి ఎవరికి వారుగానే అంగడలో సరుకులు మాదిరి ఎంచుకుని పొట్లాలు కట్టు

కుంటారు. తమ అవసరాల్ని బట్టి ఆ సరకుల్ని వాడుకుంటారు. ఈ నేర్పు ఈ రోజులలో చిన్న వాళ్ళకే ఎక్కువగా ఉన్నది. పెద్దవాళ్ళు నిమిత్త మాత్రులే అయ్యారు" అన్నాడు రాఘవరావు.

"అంతేకాని నా కొడుక్కి కట్న లేకుండా పెళ్ళి చేస్తానని మాట వరుస కూడా మావయ్యా అనలేదు" అని నవ్వింది రాజేశ్వరి.

"కాదు మావయ్యా ఆడపిల్లల మనోభావాల్ని పెద్దలందరూ సరైన దృక్పథంతో చూసినట్లయితే తమ మనస్సుల్ని మార్చుకుని వరకట్న నిషేధాన్ని అక్షరాలా అమలు జరిపేవారు. కోడల్ని తెచ్చుకోవటంలోనే తమ కోరికల్ని పెంచుకుని కొడుకుల జీవితాన్ని వ్యాపార సరళిగా మార్చి వేస్తుంటే, దానికి విరుగుడు ప్రేమ వివాహాలని కాలమే నిర్ణయిస్తున్నది. మావయ్యా. ఆ కాలంలోని కట్నాల రేటు ఈ కాలంలో వెయ్యి రెట్లు పెరిగింది ఏ విషయం చర్చకు వచ్చినా ఆ కాలంలో ఇట్లా ఉన్నదా. మా రోజులలో ఇవేమీ ఎరగం అంటూ ఈ మాదిరిగా చెప్పటమనేది పైసఖర్చు లేకుండా అభిప్రాయాల్ని ఊహించటమే అవుతుంది. ఆ చెప్పేవారు ఆ రోజులలో బస్తా ధాన్యం మూడు రూపాయలలోపే అమ్మేవారుగాని ఏభై రూపాయలకు అమ్మలేదుకదా. ఆ రోజులలో అంత ఖరీదు ఉన్నదా, ఈ రోజులలో ఇంతరేటు నిర్ణయించటానికని ఎవరూ ఆ రోజులలో రేటుకే ధాన్యాన్ని అమ్మరేం. కట్నాల రేటు తగ్గించరేం. అది జరిగిన నాడు ఆడ పిల్లలు ఇళ్ళలోనే ఉండి పెద్దలు నిర్ణయించిన సంబంధాన్నే చేసుకుంటారు. పంటకళ్లాలలో ముప్పై రూపాయల బస్తా ధాన్యం పాతర్లో పోసి దాచి కార్తీకమాసంలో ఏభై రూపాయలకి అమ్మటం ఎందుకూ? ఆ కాలంలో ఇల్లాగే చేశారా? కాబట్టి కాలాన్ని పెద్దలే మార్చారుకాని పిల్లలు మార్చ లేరు. పెద్దవాళ్ళు మార్చిన కాలానికి పిల్లలు మెరుగులు దిద్దుతున్నారు" అన్నది నళిని.

"ఓసి భడవా, ఎంత లెక్చరిచ్చావే, అయితే నువ్వు ఎవర్నయినా ప్రేమించావేమిటి?" అన్నారు రామయ్యగారు.

అందరూ నవ్వేశారు.

"నీ దయవల్ల ఆ బుద్ధి ఇంకా పుట్టలేదు తాతయ్యా. ఇప్పుడిప్పుడే నన్ను నేను ప్రేమించుకోటం అలవాటు చేసుకున్నాను" నవ్వుతూ అన్నది నళిని.

"చాలా బావుంది సుభద్రా, నీ కూతుళ్ళు ఇంత రాటు తేలారేమే. ఇంటా వంటాలేని తెలివితేటలు పుట్టినయి. ప్రేమించి పెళ్ళి చేసుకున్న ఆ మొగుడుని మూడు చెరువుల నీళ్ళు తాగించేటట్లున్నారు" అన్నారు రాఘవరావు.

"తప్పుతుందా మావయ్యా. మూడు చెరువుల నీళ్ళు తాగటమంటే బదిలీలరీత్యా చాలా ఊళ్ళు చూస్తారని అర్థం" అన్నది రాజేశ్వరి.

ఈ చర్చ ఆ రోజున అంతటితో ముగిసింది.

ఆ మర్నాడు రాఘవరావు పొలం వెళ్ళాడు. రామయ్యగారు నిద్ర పోతున్నాడు. మెల్లిగా తండ్రి డ్రాయరు సొరుగులోని ఉత్తరాలన్నీ వెతికి ఆ రోజున శ్రీనివాసరావు వ్రాసిన ఉత్తరం తీసి సురేఖకు ఇచ్చాడు. ముకుంద మాధవరావు, సురేఖ, నళిని, రాజేశ్వరి ఆ ఉత్తరాన్ని చదువుకున్నారు.

ముగ్గురూ సంప్రదించుకుని ఒక ఉత్తరం శ్రీనివాసరావుకూ, మరో ఉత్తరం లీలావతికీ వ్రాసి రెండు ఉత్తరాలూ ఒకకవరులో ఉంచి శ్రీనివాసరావు ఉత్తరంలో వ్రాసిన అడ్రసుకు పోస్టు చేశారు.

నళిని, రాజేశ్వరీ మాణిక్యమ్మను అడిగారు.

"అత్తయ్యా. లీలావతి అంటే నీకు ఇష్టమేనా"

"ఎవరా లీలావతి" ఈ సంభాషణ ఏమిటో ఆవిడకు అర్థంకాలేదు.

"నీ కోడలు"

"ఏడిసినట్టే వుంది. మావగారికి మంచినీళ్ళు కూడా ఇవ్వలేదుట. ఏమిటో ఈసడింపుగా మాట్లాడిందట. వాడి సౌఖ్యమే వాడు చూసుకున్నాడు గాని మా మర్యాదను వాడేమీ కాపాడలేదు" అన్నదావిడ.

"కొంత తప్పు మామయ్యలోనూ ఉంది. ఆయన ధోరణి ఆయనది. ఇట్లా ఉందా అని నెత్తిన మేకు కొట్టి వెళ్ళాడు బావ" అన్నది రాజేశ్వరి.

"చూడమ్మా. పూజ కొద్దీ పురుషుడు. దానం కొద్దీ బిడ్డలు మనిషి ఒకటే. కాని మేం చేసుకున్న పాపానికి వాడు కొడుకుగా పుట్టి, మా మనస్సుల్లో చిచ్చు రగిల్చాడు. ఆ లీలావతి పుణ్యం చేసుకున్నది. కోరుకున్న భర్త దొరికాడు. తండితో విరోధం పెంచుకున్న శ్రీనివాసరావే భార్యను పువ్వుల్లో పెట్టి పూజిస్తూ ఉంటాడు" అన్న దావిడ కళ్ళు తుడ్చుకుంటూ.

"అవును" అన్నది నళిని

"చూడండమ్మా, వాడుమగవాడు అట్లాచేసినా చెల్లుబాటయింది. కాసేపు బాధపడి ఊరుకున్నాం. సురేఖపరిస్థితి అట్లాకాదు అధీనం తప్పిన ఆడపిల్ల. దాని మంచి చెడ్డలు మీరే కాపాడాలి. చదువు చెప్పించటమే ఒక రకంగా తప్పుగా భావిస్తున్నాను. అప్రదిష్ట వస్తే నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకోవలసిందే" అన్నదావిడ సురేఖ వైపు చూస్తూ.

"నీకా భయం అక్కర్లేదు అత్తయ్యా. కాలానికి ఎదురీద లేకపోయినా, కాల ప్రవాహంలోనైనా అందరూ కొట్టుకు పోవలసిందే." అన్నది రాజేశ్వరి

ఆ మర్నాడే అందరూ గుంటూరు వెళ్ళారు. రాఘవరావు అందర్నీ తీసుకు వెళ్ళి దిగడ్పి వచ్చాడు—

# 17

శ్రీనివాసరావు చిక్కడపల్లిలో ఒక మేడమీద గది అద్దెకు తీసుకొని ఉంటున్నాడు. మామగారి ఇంట్లోనుంచి వచ్చేసి వారం రోజులయింది. అత్తమామలు వెళ్ళవద్దని బ్రతిమాలారు.

"శ్రీనీ, వెళతానంటావా" అన్నది లీలావతి. శ్రీనివాసరావు ఏమీ బదులుచెప్పకుండానే టాక్సీలో వెళ్ళిపోయాడు. హతుడు? ల్లి ప్తతకు తల్లి దండ్రులు మనస్సులో బాధపడ్డారేకాని గట్టిగా చెప్పలేకపోయారు.

"భర్తతో జీవితం ఎప్పుడైతే ముడిపడ్డదో భావాలు అప్పట్నుంచే అంకితమైపోయినట్లే లీలా. జీవితం వేరు, భావాలు వేరు అని మంకుపట్టు పట్టికూర్చుంటే అసలు జీవితమే తలక్రిందులైపోతుంది" అన్నది తల్లి.

"ఆ నిర్ణయానికి నేను రాలేనమ్మా. తన వ్యక్తిత్వానికి విలువ యివ్వనప్పుడు ఆ భర్త ఆ భార్యను కీలుబొమ్మగానే ఆడిస్తాడు. ఇద్దరి భావాలూ అనుగుణ్యంగా ఉండకపోవచ్చు. ఆలోచించుకొని సర్దిపుచ్చుకో వచ్చు. కాని అధికృత చూపి భార్య మనోభావాలను భర్త అణచివేస్తే, ఇంక ఆ ఆడదాని వ్యక్తిత్వం ఏముంటుంది. ఇక ఆ భర్త భార్యను కొను క్కున్నట్లే అవుతుందికాని, జీవితభాగస్వామి కాజాలదేమో" అన్నది లీలా వతి. ఇంక తల్లి తర్కించలేదు.

ఒకరోజున లీలావతి బస్సుకోసం బస్‌స్టాప్‌లో నిల్చున్నది. పక్కనే ఇంకోమ్మాయికూడా బస్‌కోసం వచ్చి నిలబడింది. ఒకరినొకరు చూసుకున్నారు. ఇద్దరూ ఎప్పుడో చూసినట్లుగానే గుర్తుకు తెచ్చుకున్నారు.

"మిమ్మల్ని ఎక్కడో చూశాను మీ పేరు అనూరాధకదూ" అన్నది లీలావతి.

"అవును. మీపేరు లీలావతి అనుకుంటాను, యామైకరెక్ట్" అన్నది అనూరాధ.

"అవును, మనం రోజారమణి పెళ్ళిలో కల్సుకున్నాం. ఇప్పుడు గుర్తొచ్చింది" అన్నది లీలావతి.

"అవును. మీరు శ్రీమతిగా మారినట్లున్నారు. వెరీగుడ్. కంగ్రాచ్యు లేషన్స్ విష్‌యుహ్యాపీ మేరీడ్‌లైఫ్" అన్నది అనూరాధ. లీలావతి నవ్వు మనస్సులోనుంచీ బయటికిరాలేదు. ఎదురుగా చూసింది లీలావతి. శ్రీనివాస రావు 'బార్'లోనుంచీ వస్తున్నాడు అతను చూడలేదు.

"మీ శ్రీవారు ఏంచేస్తున్నారు" అన్నది అనూరాధ.

'బారులో త్రాగి వస్తున్నారు' మనస్సులో అనుకున్నది.

"ఓహో ఉద్యోగం చెయ్యటంలేదా" మళ్ళీ అడిగింది.

"వేస్తున్నారు". బస్సువచ్చింది. అనూరాధ వెళ్ళిపోయింది. లీలావతి ఎక్కవలసిన బస్సురాలేదు. కొంతసేపటికి బస్సువచ్చింది. ఇంటికివెళ్ళింది.

తను చూచిన విషయం తల్లికి చెప్పటమా మానటమా ? చెపితే తల్లిమనస్సు ఇంకా వేదనపడుతుంది. ఫలితం ? శ్రీనివాసరావుకు దాసోహమని చెప్పి కూరలో పురుగుమాదిరి అతను విదిలించి పారేసినా, కొట్టినా, తిట్టినా సహనాన్ని అలవాటుచేసుకుని బానిస జీవితాన్ని గడపమని అమ్మ హితబోధచేస్తుంది. పెళ్ళిచేసుకుని సంసారంచేసే ఆడవాళ్ళంతా వాళ్ళ ఆదర్శాల్ని, అభిరుచుల్ని అగ్నిహోత్రంలో కలిపి బూడిదచేసి ఇంక భర్తలకు దాసాను దాసులై పోతారేమో ? అంతేకాదు తల్లులుగా మరి పిల్లలకు పాలిస్తూ, వాళ్ళ ఉచ్చగుడ్డలూ, పీతిగుడ్డలూ, ఉతుక్కుంటూ భుజానవేసుకుని జోకొడుతూ, ఎత్తుకొని తిప్పుతూ భూదేవిలా ఓర్పువహించి వాళ్ళను పెంచుతూ, దుమ్ములో, ధూళిల్లో, వంటఇంటి పొగలో సతమతమైపోతూ ఇంటెడు చాకిరి చేసుకొని, సాయంత్రానికిఇంత పౌడరు పట్టించి ఇన్నిపూలు తల్లో తురుముకుని ఆ భర్తకోసం ఎదురుచూసి తాము సుఖపడుతున్నామనే మిషతో ఆ భర్తల కౌగిళ్ళలో కరిగిపోయి వాళ్ళకు తృప్తినిచ్చి తాము తృప్తిపడ్డామని భావించి ఆత్మవంచన చేసుకోవటంలోనే గృహిణి జీవితం ఉన్నదా ? అదే స్త్రీత్వానికి గీటురాయా ? పుట్టి పెరిగి, చదువుకుని విజ్ఞానాన్ని సంపాదించి అభిరుచులనూ, ఆదర్శాలనూ మనస్సులో హృదయంలో నిలుపుకుని తగిన వయస్సువచ్చాక జీవితభాగస్వామిని ఎన్నుకుని వివాహం చేసుకుంటే ఆ జీవితభాగస్వామి చండశాసనుడైతే ఆ స్త్రీ జీవితం భూలోక నరకమౌతుందేమో ? ఆశలూ, కోరికలూ తెల్లనివి. అవి నిజాన్ని అంత దూరంలో చూపిస్తాయి. తీరా దగ్గరకు వెళ్ళితే అంతా నల్లగాఉండి గాఢాంధకారంలోంచి మన జీవితాన్ని ముంచేస్తయ్యి. నేనేంచెయ్యాలి ? ఎట్లా సమాధానపడాలి ? ఈ ప్రశ్ననే పదిసార్లు వేసుకుని సమాధానం దొరక్క రాత్రి పన్నెండుదాటాక నిద్రపోయింది లీలావతి.

మామూలుగానే తెల్లవారింది. పుట్టెడు ఆలోచనలతో ఆ తల బరువెక్కి బద్ధకంగా తెల్లవారి ఎనిమిది గంటలకు నిద్రలేచింది లీలావతి.

భోజనం ముగించి ఆఫీసుకు బయల్దేరింది కాని వెళ్ళబుద్ధి పుట్ట లేదు. సబిత గుర్తొచ్చ ది. ఆ రోజున పెళ్ళికి వెళ్ళి ఆరాత్రి ఇంటికి రాకుండా తను ఉండిపోయింది ఆ స్నేహితురాలు పెళ్ళిసందర్భంలోనే. రిక్షాలో సబితఇంటికి వెళ్ళింది. అప్పటికి పదిన్నరైంది. రిక్షాదిగిన స్నేహితురాల్ని చూసి ఆశ్చర్యపోయింది సబిత.

"రాణీగారు ఆఫీసుకు వెళ్ళరా ఇవ్వాళ! ఆఫీసుకు శలవా" అన్నది.

"ఆఫీసు ఉన్నది—నేనే శలవు పెడదామనుకున్నాను. ఇవ్వాళ మీ ఇంటికివచ్చి చూసి నువ్వుఉంటే ఇక్కడినుంచే ఫోన్ చేద్దామనివచ్చాను. నీ పెళ్ళయ్యాక మళ్ళా నీకు కనబడలేదు" అన్నది లీలావతి సోఫాలో కూర్చుంటూ.

"ఓ. నిక్షేపంగా మాట్లాడుకుందాం. నిరభ్యంతరంగా మీ ఆఫీసుకు ఫోన్ చెయ్యి" అన్నది సబిత. మేడమీదికి వెళ్ళి ఆఫీసు మేనేజరుకు ఫోన్ చేసింది లీలావతి. ఈరోజు కొంచం తొందరపనిఉండి, ఆఫీసుకు రాలేక పోయాననీ, క్యాజువల్ లీవ్ అప్లికేషన్ రేపు ఆఫీసుకురాగానే ఇస్తానని చెప్పింది.

"పెళ్ళయ్యాక కాస్త చిక్కినట్లున్నావేం లీలా, వంట్లో బాగుండ లేదా, నేనెట్లా ఉన్నాను. కాస్త లావయ్యానని ఆయనే అన్నారు" అన్నది సబిత నవ్వుతూ.

"నీ శరీరం లావుని కోరుకున్నది, నా శరీరం ఏం కోరుకున్నదో నాకే తెలీటంలేదు" అన్నది లీలావతి.

"పెళ్ళయ్యాకకూడా అదేస్థితిలో వున్నావంటే చాలా ఆశ్చర్యంగానే ఉన్నది" మేడమీదనుంచీ సబితా అని పిలుపు వినిపించింది.

"వన్ మినిట్ లీలా, ఆయన్ని ఆఫీసుకుపంపాలి. క్షణంలో వచ్చే స్తాను" సబిత మేడమీదికి వెళ్ళింది టేబిల్ మీద ఉన్న వారపత్రిక తీసి చూస్తున్నది లీలావతి. మేడమీదనుంచీ ఇద్దరూ దిగి వచ్చారు.

"నా స్నేహితురాలు మిసెస్ లీలావతి. ఆ రోజు రాత్రి మనపెళ్ళికి వచ్చింది" భర్తకు పరిచయంచేసింది సబిత.

"వెరీగ్లాడ్ టుసీయూ, ఇంకేం ఈ రోజున సబితకు పెద్దపండుగ. హాయిగా, కబుర్లుచెప్పుకోండి. భర్తలను ఆఫీసులకు పంపించి ఆడవాళ్ళు చేసేది అదేగా" అన్నాడు ఆయన.

"బోల్తాకొట్టారు. లీలకూడా ఉద్యోగం చేస్తున్నది.భర్తను ఆఫీసుకు పంపి కబుర్లు చెప్తూ కాలక్షేపం చేసేందుకు సబితకాదు" అన్నది.

"ఐసీ, మళ్ళీ కలుద్దాం" అని వెళ్ళిపోయాడతను.

"అమ్మయ్యా. ఆయన్ని పంపటం ఒక చిన్న యాగం చేసినంతపని. గేటువరకూ సాగనంపితేకాని వెళ్ళరు. చిన్న పిల్లాడిని బళ్ళోకి పంపినంత తంతుచెయ్యాలి. లేకపోతే మారాం చేస్తారు"

"అంత గారాబం ఎందుకుచేశావ్, భర్తనుగారాబం చేస్తుంటే వాళ్ళు నెత్తినెక్కి దిగరు" అన్నది లీలావతి.

"ఓహో. నువ్వేదో కొత్త టెక్నిక్ కనిపెట్టావల్లేవున్నదే. అవును కథలు రాసి జీవితాన్ని మలుపుతిప్పి పాత్రల్ని పావులుచేసి ఆడించేదానివి. నిజజీవితంలోనూ అలాగే ఉన్నావంటే నీకు పద్మశ్రీ ఇవ్వచ్చు".

"ఊ, నీ కొత్తకాపురం ఎట్లా ఉన్నది. మీ శ్రీవారు ఏమంటున్నారు. అభిప్రాయాలూ, అభిరుచులూ ఒకటేనా వివాహజీవితం ఎట్లావున్నది. కధాకమామీషు చెప్పెయ్యి" అన్నది లీలావతి. మనస్సులో ఆలోచనలు ఆవిరిగామారి మాయమైపోకముసుపే ఈ ప్రశ్నలు వేసింది.

"కొత్త కథకేమయినా ప్లాటుకావాలా, అయినా చెయ్యి తిరిగిన కథకురాలివికదా, నీ కథలు చదివి నీ మనస్సు తెల్సుకున్న రాకుమారుడినే పెళ్ళాడావుకదా. ఇంక నీ బుర్రకు కావలసినంత పని. ఎన్నికథలన్నా సృష్టిస్తావు. నేను బి. ఏ. ప్యాసయినా బియ్యంకడిగి పొయ్యిమీద పెటిం తరువాత ఏంచెయ్యాలో తెలీని పెద్దమ్మను" అన్నది సబిత.

"చూడు సబితా, పెళ్ళికానప్పుడు కాలేజీలో చదువుకునే రోజుల్లో ఇద్దరి కబుర్లూ ఒకటే. ఈ కొత్త వాతావరణంలో ఎవరి జీవితాలు ఎట్లావున్నయ్యో తెల్సుకోటంలో తప్పులేదుకద" మాటలో గంభీరతని చూపింది సబిత. ముఖంలోనూ ప్రశాంతత కనబడలేదు.

"జీవితం కొత్తగా ఉన్నదా సబితా" అన్నది లీలావతి.

"జీవితం మరొక మలుపులోకి తిరిగితే కొత్తగానే ఉంటుంది, మనుషులు పాతవారయినా, మమతలు అనుభవాలూ కొత్తవే కదా" అన్నది సబిత.

"మాటల సందర్భంలో మరిచాను, భోజనం అయిందా, భోజనం కానీ" అన్నది లీలావతి.

"ఇద్దరి భోజనాలూ ఒక్కసారే అవుతయ్యి. భర్త భోజనం అయ్యాకనే భార్య భోజనం చెయ్యాలనే విషయం మాకు లేదు. ఇద్దరం కూర్చుంటేనే తృప్తి. జీవితంలో స్థిరపడిం తరువాత భావాల్ని కూడా సరిదిద్దుకుని స్థిరపర్చుకోవాలి. నేను పక్కన కూర్చోందే ఆయన భోజనం చెయ్యరు" సబిత ముఖంలో ఆనందాన్ని పోల్చుకున్నది లీలావతి

"నీకూ ఈ పద్ధతే నచ్చిందా, ఆయన పక్కన కూర్చోకపోతే భోజనం చెయ్యలేవా".

"చెయ్యలేమనికాదు. అన్నందగ్గర అభిప్రాయాలు చెప్పుకోవటంలో ఆనందం ఉన్నది. ఏం, మీరిద్దరూ ఒక్కసారే కూర్చోరా. మరి యిద్దరూ ఆఫీసుకు వెళ్ళాలికదా".

"ఎందుక్కూచోము. ఆ సమయంలో తీరిగ్గా కబుర్లు చెప్పు కొందుకు ఆఫీసుటైము అడ్డువస్తుందికదా ?"

"అవును ఉద్యోగస్తులు కద. అయినా లీలా ఒక్కటడుగుతాను, కోప్పడకుండావుంటే, మీ వాళ్ళకు నువ్వొక్కర్తివే, మగపిల్లలాలేరు. మీ శ్రీవారు ఉద్యోగము చేస్తున్నారుకదా. ఆర్థిక పరిస్థితి అడ్డురానప్పుడు నువ్వు ఉద్యోగం చెయ్యటం అనవసరమేమో".

"ఆర్థిక పరిస్థితి అడ్డురాకపోయినా, ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటుంది. లేకపోతే అన్నింటికీ ఆ భర్తమీదనే ఆధారపడవలసి ఉంటుందికద".

"అంటే అట్లా ఆధారపట్టం తప్పంటావా"

"కొంతవరకూ తప్పే ననుకుంటాను".

ఆశ్చర్యపోయింది సబిత. "మనస్సులు కలవనప్పుడు ఉద్యోగం చేసే భార్యకైనా ఆర్థిక స్వాతంత్ర్యంమీద ఆంక్షలుంటయ్యి. అప్పుడే మంటావు".

"ఆంక్ష అంటే" తన అభిప్రాయాలను చెప్పటానికి ఈ సంభాషణ ఎంతవరకూ దారితీస్తుందో లీలావతికి అర్థంకావడంలేదు.

"భార్యాభర్తల విషయంలో ఆంక్ష అంటే మనస్సులు కలవక పోవటమే".

లీలావతి మనస్సులో ఏదో మథనపడుతోంది. దానిలో మునుపటి భావాలు ఉన్నట్లులేవు. ఈ రకంగానైనా తెల్సుకుంటాను, అనుకున్నది సబిత.

"నాకన్న నువ్వు సంవత్సరం పెద్ద, అంటే ఇరవై మూడేళ్ళు. నీ అభిప్రాయాలను నువ్వుగా ఏర్పర్చుకుని పోషించుకున్నావు. నీ జీవితమూ ఏ వొడుదుడుకులూ లేకుండా స్వేచ్ఛగానే వెళ్ళిపోయింది. ఇప్పుడు కాప రానికి వచ్చాక కూడా నీ అభిప్రాయాల్లో మార్పేమీ రాలేదా".

"ఆడదాని జీవితానికి ఆయువుపట్టు ఏదంటావు".

"మగవారి జీవితానికైనా ఆడవారి జీవితానికైనా వారి వారి అభిప్రాయాలూ, ఆదర్శాలే వారి జీవితానికి ఆయువుపట్టు. ఆత్మవంచన చేసుకోకుండా జీవితాన్ని సాఫీగా గడపటమే మానవుడి ఆయువుపట్టు, ఇందుకు స్త్రీ పురుష భేదంలేదు ఇద్దరూ సమానులే".

లీలావతి మనస్తత్వం ఈనాడు సబితకు కొత్తగా ఉన్నది. అంతర్యంలో అగ్నిపర్వతం ఉన్నదా, జీవితంలో దెబ్బతిన్నదా. ఏమీ తోచ లేదు సబితకు.

"ఇప్పుడే వస్తాను" మేడమీదికి వెళ్ళింది సబిత. పత్రిక చదువు తోంది లీలావతి. ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్నది సబిత. మాటలు వినిపించలేదు, నవ్వు వినిపించింది లీలావతికి అయిదునిమిషాల్లో రెండు కప్పుల్లో 'టీ' తెచ్చింది సబిత.

"అప్పుడే టీ తెచ్చావేం" అన్నది లీలావతి

"ఇదో అలవాటు, సాయంత్రం టిఫిన్‌చేసే లోపల ఒకసారి కాస్త టీ తాగుతాను".

ఇద్దరూ 'టీ' తాగారు.

"ఫోన్లో మాట్లాడావా".

"అవును శ్రీవారితో, వారికి అదొకసరదా" కనుకొలుకల్లోనుంచీ చూస్తూ నవ్వింది సవిత.

"ఆఫీసులో కూడా నువ్వే గుర్తొస్తూ ఉంటావేం"

"అవును, ఇదివరలో నువ్వొక కథ రాశావు గుర్తుందా, కలం పాళీ పాయింటులో కూడా ఆ కథానాయికుడికి నాయికి కనిపిస్తున్నదనీ, ఆఫీసు డిస్పోజల్సు కూడా ఆ ప్రియురాలే రాస్తున్నదనీ రాశావు గుర్తుందా".

"రాశాను, గుర్తున్నది, కాని అవ్వి కథలు. పాత్ర చిత్రీకరణ వాస్తవానికి దగ్గరగా ఉంటుందని అట్లా వ్రాశాను. కాని అది కొందరి జీవితాల్లో వాస్తవంకాదు".

"డొంకతిరుగుడు మాటలు మానేసి అసలు విషయానికి దగ్గరగా రా లీలా" బ్రతిమాలుతున్నట్లుగా అడిగింది సవిత. లీలావతి తలెత్తి సవితవైపుచూసి నవ్వుతూ తలవంచింది. ఆ నవ్వులో అవ్యక్తవ్యథ కొడి కట్టిన దీపంలా ఉంది.

"ఎవరి జీవితానికైన అయువుపట్టు పెళ్ళి, సంసార సుఖమూ, సంసార బంధమూను. ఈ బాధ్యతలను నిర్వహించటంలోనే అభిప్రాయాలకూ, ఆదర్శాలకు విలువ ఉంది. ఈ భావ బంధాల్ని తెంచుకోవటమనేది సామాన్యమైన విషయంకాదు".

ఈ భావం లీలావతికి నచ్చలేదు.

"ప్రేమానుబంధమూ, మమత, కోరికలు శరీర సౌభాగ్యాన్ని ఆశించి దానికోసం ప్రాకులాడేవి. అభిప్రాయాలకూ, మానసిక స్వేచ్ఛకూ,

భావ స్వాతంత్ర్యానికీ శారీరక సౌభాగ్యానికీ సంబంధంలేదు ఆ శారీరక వాంఛకోసం మనస్సుని చంపుకోకూడదు" అన్నది లీలావతి.

"నువ్వు ఉద్యోగంచేస్తున్నావు, నీ వ్యక్తిగత విషయాలకీ, అభిప్రాయాలకీ, నువ్వుచేసే ఆఫీసుపనికి సంబంధంలేదు. నువ్వుకోరే స్వేచ్ఛను, ఆఫీసు నీకు ఇవ్వదు. ఆఫీసుకు నువ్వు ఇవ్వాళ వెళ్ళలేదు, అంటే శలవుపెట్టావు. ఆ శలవు కాగితం పంపలేదు కనుక రేపువచ్చి ఇస్తానని ఫోన్‌చేశావు. అంటే ఆఫీసుకు వెళ్ళటమనేదీ, వెళ్ళకపోవటమనేదీ నీ మానసిక పరివర్తననుబట్టిలేదు. అదే నీ యిష్టమైందని ఆఫీసుకు శలవుపెట్టకుండా ఎగ్గొట్టగలవా. ఎగ్గొట్టలేవు. అంటే నీ భావ స్వాతంత్ర్యానికి కూడా ఒక చట్టం ఉన్నది. ఆ చట్టప్రకారమే నువ్వు ఊహించాలి. అప్పుడు నీ ఆదర్శం, అభిప్రాయం, నీ మనస్సులోనుంచీ జారిపోయినట్లేకదా. అట్లాగే జీవితానికి ప్రాతిపదిక జీవిత భాగస్వామి, సంసార జీవితాన్ని గడపాలంటే అలాంటి జీవితానికి ఈ భార్యాభర్తలిద్దరూ భాగస్వాములౌతారు పాలకు గిన్నె ఆధారమా, గిన్నెకు పాలు ఆధారమా అని గిన్నెను వంచితే పాలుపోతయ్యి కాని గిన్నెపోదు. వైవాహిక జీవితమూ అంతే" అన్నది సబిత.

డ్రాయరుమీద మోచేతిని ఆనించి గడ్డం క్రింద అరచెయ్యి ఉంచి ఆలోచిస్తూ కూర్చుంది లీలావతి. అయిదు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడ లేదు.

"నేను వెళతాను సబితా" సోఫాలో నుంచి లేచి నిల్చుంది లీలావతి.

"చర్చ పూర్తికాకుండానే వెళ్ళిపోతావా. పోనీలే నీ మనస్సుకు నచ్చే రీతిగానే మాట్లాడతాను కూర్చో" అన్నది సబిత.

"కాదులే, వచ్చే ఆదివారం వస్తాను, ఇప్పుడు ఆఫీసుకు వెళతాను"

"అదేమిటి? శలవు పెడతానని మేనేజరుకు ఫోన్ చేశావుకదా"

"ఏమిటో మనస్సు బాగాలేదు".

సబిత ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుంది. లీలావతి రిక్షాఎక్కి ఆఫీసుకు వెళ్ళింది. అప్పటికి మధ్యాహ్నం రెండు గంటలైంది.

"క్యాజుయల్ లీవు పెడతానన్నారుగా, ఆఫీసుకు వచ్చేరేం" అన్నారు మేనేజరు.

"పని అయిపోయింది. వచ్చేశాను" తన సీట్లో కూర్చుంది లీలావతి. బీరువా తీసి ఫైలు టేబిల్ మీద పెట్టింది. కాగితంమీద కలం నడవటంలేదు.

ఆ పూట గడిచింది. ఆ మర్నాటికి శలవు కాగితంరాసి మేనేజరుకు ఇచ్చింది

"రేపుకూడా పని ఉన్నదా"

"అవునండీ"

"ఆడిట్ రిపోర్ట్ ఫైలు అన్నిరోజులు ఉంచితే ఎలా? పై ఆఫీసు నుంచీ రిమైండర్లు వస్తున్నయ్యి".

"ఎల్లుండి తప్పక చూస్తాను".

"ఎల్లుండి ఆదివారం. ఆఫీసుకు శలవు"

"అయితే సోమవారం తప్పకుండా ఎటెండవుతాను"

మరి మాట్లాడకుండానే వెళ్ళింది లీలావతి. కూతురు పట్టుదల తల్లికీ, తండ్రికీ బాగా అనుభవమే, అందుచేతనే వియ్యాలవారి ప్రమేయం లేకుండానే పెళ్ళి జరిపించారు. గృహిణిగా లీలావతి మనస్సు మారుతుందేమో అనుకొన్నారు. అడుగులోనే హంసపాదు అన్నట్లుగా అల్లుడితో అమ్మాయి పేచీ పడింది. తమ మనస్సుల్లో బాధపట్టంకన్న కూతురుకు నచ్చచెప్పలేకపోయారు ఆ పెద్దవాళ్ళు.

రాత్రి పదకొండు గంటలైంది. లీలావతికి నిద్ర పట్టలేదు. ఆనాటి రాత్రి సంఘటనలు గుర్తొచ్చాయి.

"ఈ గదిలోకి పంపి బయట గొళ్ళెం వేయటమన్నది పూర్వాచార పద్ధతి శ్రీని. దంపతులు పారిపోతారేమో నని పెద్దవాళ్ళ ముందు జాగ్రత్త. అంతేకదూ" అన్నది తను.

"హృదయాలు అర్థం చేసుకున్నప్పుడు పారిపోవటమనే ప్రసక్తే ఉండదు. అంత పారిపోదల్చుకున్న వాళ్ళకి తలుపు గొళ్ళాలు ఒక లెక్కాంటావా లీలా" అన్నాడతను.

"నాతో అవసరం తీరగానే వెళ్ళిపోవుకదు శ్రీనీ, శరీర సౌఖ్యం కొంత సమయం వరకే కద. మనస్సు అర్థం చేసుకుంటే అలాంటి పరిస్థితి రాదేమో" అన్నది తను.

"నేను చెప్పేదీ అదే. ఒకరినొకరు అర్థం చేసుకుని జీవించటంలోనే అనురాగమూ, ఆప్యాయతా యిమిడి ఉన్నాయి. నిన్ను నేను అర్థం చేసుకున్నాను కనకనే నన్ను శ్రీని అని పిల్చినా పలుకుతున్నాను" అన్నాడతను.

"శ్రీనీ అని పిలవటంతోనే నేను తృప్తి పడతాను. మీరు అని పిలవాలనిపించదు. అట్లా పిలవటంలో కొంత ఆధిక్యతని ఇచ్చినట్లే అవుతూంది. భార్యాభర్తలలో ఆధిక్యతకు తావుండకూడదు ఇద్దరూ సమానమే ఒకరి ఆనందాన్ని మరొకరికి పంచి యిచ్చినప్పుడు లేక ఒకరి తృప్తి మరొకరికి సంతృప్తిని కలిగించినపుడు ఆ నాలుగు గోడల మధ్యాలేని ఆధిక్యత, గదిలోనుంచీ బయటకు రాగానే భర్తకు యివ్వవలసిన ఆధిక్యత ఏముంది? మనస్సు, హృదయమూ, మమత పెనవేసుకున్నప్పుడు భార్య, పరాయి వాళ్ళ మాదిరిగా భర్తను 'మీరు' అని సంబోధించటంలో అర్థం లేదేమో? మనసూ, శరీరాలూ కలసినపుడు ఆధిక్యతను ఏ పరిస్థితిలోనూ భర్త కూడా భార్యమీద చూపించకూడదు. ప్రేమానురాగాలు గౌరవాన్ని గౌరవిస్తే మమతలు దూరం కావటానికి వీలును కలిగించినట్లే అవుతుంది. పిల్లలకు తల్లిదండ్రు లిద్దరూ ఒకటే. కాని 'అమ్మా' అని పిలుస్తారుగాని 'అమ్మగారూ' అని పిలవరు. కాని తండ్రిని 'నాన్నగారూ' అని పిలుస్తారు దానికి కారణం? భార్య భర్తను 'ఏమండీ' అని 'మీరు' అనీ పిలవటం చేతనే. భార్య దగ్గర భర్త గౌరవాన్ని ఎప్పుడైతే పుచ్చుకున్నాడో, అటునుంచి చూస్తే భర్త భార్యను తన అదుపులోకి తీసుకొని ఆమెమీద ఆధిక్యతనూ, అధికారాన్ని చెలాయించటానికి వీలవుతుంది. అందుచేత శ్రీనీ అనే పిలుస్తాను. నువ్వా అంటాను. బాధపడవద్దు" అన్నది తను. అతను నవ్వుతూ తన ఆమోదాన్ని తెలియచేశాడు.

అలాటి శ్రీనివాసరావు దూరంగా వెళ్ళిపోయాడు. భర్తగా తన అధికారాన్ని చూపించటానికి అతను మనస్సు మార్చుకున్నాడు. ఆ అధికార

వాంఛలో శారీరక వాంఛను కూడా దూరం చేసుకుని అతను వెళ్ళిపోయాడు. భార్యాభర్తల మధ్య ఉండవలసిన అన్ని రకాల అనుభూతులనూ అతను విస్మరించాడు. ప్రజలకు ఏమీ చెయ్యలేక పోయినా, తమ అధికారాన్నీ, పదవినీ, నిలబెట్టుకునేందుకు రాజకీయ నాయకులు ఎన్నో పన్నాగాలు పన్నుతారు. ఎన్నికలముందు యిచ్చిన ఏ వాగ్దానాన్నీ నిలబెట్టుకోరు. వాళ్ళకు కావలసినది పదవీ వ్యామోహం. శ్రీనివాసరావూ ఇట్లాగే తయారయాడు. పెళ్ళికాక మునుపు తనకోసం ఎంతో తహతహలాడాడు. తపించిపోయాడు. కన్నవారికి తెలియకుండానే పెళ్ళి చేసుకున్నాడు. కాని తన మెళ్ళో మూడుముళ్ళూ వేశాక మంత్రి పదవి వచ్చినట్లే అయింది. మొదటి ముడితో తన శరీరాన్ని అనుభవయోగ్యం చేసుకున్నాడు. రెండవ ముడితో తన మనస్సుని హృదయాన్నీ స్వాధీనం చేసుకున్నాడు.

మూడవ ముడితో తన సర్వస్వాన్నీ స్వాహా చేశాడు. అంటే ఇంక తనకు స్వతహాగా ఆలోచించే శక్తిగానీ, స్వతంత్రించి ఏపనైనా చేసే అధికారంగానీ, స్వాభిమానంతో జీవించగల అవకాశంకానీ లేవు. అన్నింటికీ తిలోదకాలిచ్చి భర్తమనస్సుతో తనుఆలోచించాలి. భర్తఆదర్శాలే తన ఆదర్శంగా భావించాలి, భర్త కళ్ళతో తను చూడాలి. భర్త అనుభవం కోసం తను ఎదురు చూడాలి. ఇంతేనా తన జీవితం. అందరు స్త్రీలూ ఇట్లాగే బ్రతుకుతున్నారా? అయితే ఆవివాహిత స్త్రీలకు ఆత్మలేదు. తమలో తమకు విశ్వాసం లేదు. తమను తాము గౌరవించుకోటానికి వీల్లేదు. కనీసంతలుపు తాళం వేసి చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళటానికైనావీల్లేదు. ఇదీ ఒక బ్రతుకేనా? ఈ ఆడవాళ్ళంతా ఇందుకే, ఇట్లాగే బ్రతుకుతున్నారా? అయితే ఎందుకు బ్రతుకుతున్నారు? స్త్రీగా బ్రతకటానికి, స్త్రీత్వంలోని వాంఛలను తీర్చుకోవటానికి, మనస్సుని చంపుకుని శరీరంలోని కోరికలను పెంచుకోటానికి, ఆ పెంచుకున్న కోరికలను భర్తలకు అంకితం చేసుకుని తాము ధన్యులమైనామని మురిసి పోవటానికి. అంతే. అందుకే ఈ స్త్రీలు ఉపయోగపడుతున్నారు. అలాంటి స్త్రీ జీవితం నాకు వద్దు. అలాంటి కోరికలు వద్దు. అలాంటి మమతల్ని నేను పెంచు

కోసం. నా మనస్సు నేనుగానే ఆలోచించేటట్లుగా ఉండాలి. నా మనస్సు మీద భర్త అధికారముద్ర ఉండకూడదు. సమానత్వమే నా కోరిక.

ఆలోచనలు తెగలేదు. ఒక దారికి రాలేదు. అట్లాగే నిద్ర పోయింది లీలావతి.

# 18

పూర్ణాడు ఆఫీసుకు ఎందుకు శలవు పెట్టిందో, ఇంట్లో ఉండి ఏం చెయ్యాలో లీలావతికి తోచలేదు. ఈ రోజు శనివారం. సవితఇంటికి ఆదివారం నాడు వస్తానన్నది. ఉదయం పది గంటలైంది. తండ్రి. ఆఫీసుకు వెళ్లాడు. తన భోజనం అయింది. తల్లి భోజనం చేస్తున్నది.

పోస్టు జవాను ఉత్తరం యిచ్చి వెళ్ళాడు. అది కవరు ఆదుర్దాగా కవరు చించి ఉత్తరాలు చూసింది. రెండు ఉత్తరాలు. ఒకటి తనకు, ఒకటి శ్రీనివాసరావుకు. తన ఉత్తరం ముందుగా చదివింది.

గోగులేశ్వరం.

వదినా!

ఈ సురేఖ నీ ఆడబిడ్డ. నీకు అర్ధభర్తను కాదు. చిన్నప్పుడే భర్తను పోగొట్టుకుని పుట్టింటికి చేరిన అభాగ్యురాలిని. మనస్సులు కలసి, హృదయాలు విప్పి చెప్పుకుని, అభిరుచులను అర్ధం చేసుకుని, దానికి ప్రేమ అనే ముద్రవేసి తల్లిదండ్రులకైనా తెలియనీయకుండా గాంభీర్యంగా మా అన్నయ్యను చేపట్టావు. చాలా సంతోషం.

కోడల్ని చూసిపోదామని మీ యింటికి వచ్చిన మామగారికి శృంగ భంగమే అయింది. కోడల్ని చూడకపోయినా అమ్మాయి మా ఇంటిని తీర్చి దిద్దగల కులమింటి పడుచు అనుకుని అంతర్యంలోనే అంచనాలు వేసుకుంటోంది మీ అత్తగారు. మా వదినె అభిరుచులూ, అనురాగాలూ, ఆత్మీయత అర్ధంచేసుకోవాలనే ఆకాంక్షతో నీ రాకకై నేను ఎదురు చూస్తున్నాను. సమవయస్కులమైన మనిద్దరం ఒక ఇంట్లో ఉన్నప్పుడు ఉన్నత

స్థాయిలో ఉన్న నీకు ఈ అభాగ్యురాలి మీద ఉదారమైన సానుభూతి ఎంత వరకూ ఉంటుందో చూడాలనే కోరిక నన్ను వేధిస్తూనే ఉన్నది. నీ కొాక మరిది కూడా ఉన్నాడు. చదువు కొంచెం అయినా బంగారు పంటలను పండించటంలో వాడి వయస్సుకు మించిన నేర్పు, ఓర్పు వాడిలోఉన్నయ్యి. ఈ ఇంటికి వాడు వ్యవసాయదారుని వెన్నెముక. ఈ పరిస్థితుల నన్నింటినీ చూస్తూ, ఆ పాత కాలపు భావాలకు, ఈ కొత్త భావాలూ, కొత్త పరిస్థితులనూ మేళవింప చేసి ఈ ఇంటి పెద్దగా మరీ అందరి ఆదరాభిమానాలనూ చూరగొంటున్నాడు మా తాతయ్య.

ఇదీ ఈ ఇంటి పరిస్థితి కాదు; నీ ఇంటి వాతావరణం.

గుంటూరులో మా మేనత్తగారి భర్త పోయి సంవత్సరమైంది. సంవత్సరికాలు ఇక్కడే జరిగాయి. నేను గుంటూరులో వారింటిలో వుండి చదువు కుంటున్నాను.

మా మేనత్తగారి అమ్మాయిలు నళిని, రాజేశ్వరి నీకు శుభాకాంక్షలు అందచేస్తున్నారు.

ఎల్లప్పుడూ నీ శుభాన్ని, సంతోషాన్ని వాంఛించే—

అభాగ్యురాలు,

సురేఖ.

ఉత్తరాన్ని చదివి ఒక్క నిట్టూర్పువిడిచింది. లీలావతి రెండునిమిషాలు ఆలోచించి శ్రీనివాసరావుకు వ్రాసిన ఉత్తరాన్ని చదివింది.

గోగులేశ్వరం.

అన్నయ్యా !

ఇంట్లోనుంచే వెళ్ళిపోయావు. అందరం బాధపడ్డాం. ప్రేమించి పెళ్ళి చేసుకున్నావు. చాలా సంతోషం. కన్న తల్లిదండ్రులకైనా పెళ్ళివిషయం ఒక్క ఉత్తరం ద్వారానైనా తెలియపర్చలేదు. కారణాలు వెతకటం అనవసరమే అవుతుందేమో ? పెళ్ళయ్యాక నువ్వు వ్రాసిన ఉత్తరంచూసి నాన్న రెక్కలుకట్టుకుని అక్కడవాలారు. కాని నీ క్షేమాన్ని కాంక్షించిన నాన్న ఒక్కక్షణం ఉండలేక తిరుగుబండిలో వచ్చేశారు. దిగులుపడ్డ

అమ్మ గుండె రాయిచేసుకుంది. అవమానాన్ని పొందిన నాన్న హాలా హలంలా మింగి జీర్ణించుకున్నాడు.

రఘునాథరావు మామయ్య పోయాడు. సంవత్సరికాలు ఇక్కడే పూర్తయినవి. ఈచిన్న విషయాలు నీకుఅనవసరమే అయినా రక్తసంబంధం చేత మనస్సు నిలవక ఈ ఉత్తరం రాస్తున్నాను.

నేను గుంటూరులో అత్తయ్యగారింట్లో ఉండి ట్యుటోరియల్ కాలేజీలో చదువుకుంటున్నాను. నళిని, రాజేశ్వరి మీ దంపతులకు శుభాకాంక్షలు అందచేయమన్నారు.

వదినెను తీసుకుని ఒకసారి మనవూరు వస్తే బావుంటుందేమో?

సురేఖ.

రెండు ఉత్తరాలూరెండేసిసార్లు చదివింది లీలావతి. తనకొక చెల్లె లున్నదనీ, ఆమెకు భర్తపోయాడనీ శ్రీనివాసరావు చెప్పాడే కాని ఆ రోజుల్లో తను ఆ విషయాలేవీ పట్టించుకోలేదు. జీవితంలో ఒక ముఖ్య మైన ఆదర్శాన్ని సిద్ధంచేసుకున్నాననే గర్వంతోకూడిన సంతోషంతో తను ఏ సంప్రదాయాలనూ లెక్కచెయ్యలేదు. ఇప్పుడు అవన్నీ వెంట తరుము తున్నయ్యి, కాదు మనస్సులో జొరవడినయ్యి.

ఆ ఉత్తరాలు రెండూ తల్లికి చూపించింది. ఆవిడ ఏమీ అనలేదు.

సాయంత్రం మూడు గంటలవరకూ ఇంట్లోనే ఉండి తరువాత ఏదో ఒక అభిప్రాయానికి వచ్చి రెండు బస్సులు మారి శ్రీనివాసరావు పనిచేసే బ్యాంకుకు వెళ్ళింది. అప్పటికి నాలుగు దాటింది. మరో అరగంటలో బ్యాంకు టైమవుతుంది. దగ్గరఉన్న హోటల్లో కాఫీతాగి బ్యాంకు ఎదురుగా ఉన్న బస్‌స్టాప్‌లోనే ఒక చివర బెంచీమీద కూర్చున్నది. నాలుగూ నలభై నిమిషాలైంది. బ్యాంకు ఉద్యోగులు ఒక్కొక్కరే వస్తున్నారు. బస్సులో వెళ్ళేవారు బస్‌స్టాప్‌లో 'క్యూ'లో నిల్చున్నారు. శ్రీనివాసరావూ వచ్చాడు. 'క్యూ'లో నిల్చున్నాడు తనను చూడలేదు. బస్సు వచ్చింది. అందరూ ఎక్కారు. తనూ బస్సులో ఎక్కికూర్చుంది. అతను ఎక్కడికి టికెట్ తీసు కుంటాడో తెలియదు. తను బస్ టెర్మినస్‌కు టికెట్ తీసుకుంది.

చిక్కడపల్లిలో అతను దిగాడు. దాదాపు బస్సులో సగంమంది అక్కడే దిగారు. తనూ దిగింది. అతను ఎక్కడికి వెళతాడో చూసింది. వందగజాలదూరంలో ఉన్న మేడమీదికి వెళ్ళాడు. అతను గదితలుపు తాళం తీయటం మేడమీద వరండాలోనుంచీ కనుపించింది.

మనస్సు కుదిపింది. కాళ్ళు కదల్లేదు. అతను భర్త. తను భార్య. కాని భావాలూ ? ఎవరికివారే ? మరో బస్సు వచ్చింది. ఆ బస్సులో వెళ్ళి పోయింది.

ఆ రాత్రి తండ్రితో చెప్పింది.

"శ్రీనివాసరావు చిక్కడపల్లిలో ఒక మేడమీద గదిలో ఉంటున్నాడు. ఇవాళ చూశాను"

"తరువాత"

"అతను నన్ను చూడలేదు, నేనే అతన్ని చూశాను".

"పలకరించావా"

"లేదు"

"ఎందుకని"

"ఏమో"

"సరే"

కూతురు తత్వం తెలిసిన తండ్రి తానుగా ఏ సలహా చెప్పదల్చుకో లేదు.

తన ఉత్తరాన్ని తను తీసుకుని శ్రీనివాసరావుకు సురేఖ వ్రాసిన ఉత్తరాన్ని బ్యాంకు అడ్రసుకు పోస్టుచేసింది.

మర్నాడు ఆదివారం. సవితతో.చెప్పినట్లుగానే వాళ్ళింటికి వెళ్ళింది. మధ్యాహ్నం రెండుగంటలయింది.

"నువ్వు వస్తావని నీకోసం ఎదురుచూస్తున్నాను లీలా. మాట తప్పకుండా వచ్చావు సంతోషం. కాఫీ తాగి కబుర్లు చెప్పుకుందామా" అన్నది సవిత.

"నీ యిష్టం".

సబిత కాఫీ తెచ్చింది. ఇద్దరూ తాగారు.

"మీవారు లేరా సబితా".

"ఉన్నారు. ఉన్నాపరవాలేదు. ఏమీ అనుకోరు. ఆయనగారి ఫ్రెండ్సువస్తే నేనేమీ అనుకోను, వారూ అంతే".

"మీది అనుకూల దాంపత్యమేనన్నమాట".

"అని అందరితోపాటు నువ్వూ అంటున్నావు. చాలా సంతోషం".

లీలావతి ముఖంలోని భావాలను వెతుక్కుంటోంది సబిత. స్నేహితురాలి ముఖంలోని విషాదరేఖలు కొద్దిగా పోల్చుకుంది.

"సబితా, నువ్వు ప్రేమించి పెళ్ళిచేసుకోలేదుకదా. ఆయన తత్వం నీకెట్లాతెల్సింది. నీ అభిప్రాయాలకు విలువనిచ్చి గౌరవిస్తారా ఆయన. ఎవరి మాటలకు ఎక్కువ విలువ ఉంటుంది".

దారిలోకి వస్తున్నదని ఊహించింది సబిత.

"ముందుగా ప్రేమించినా, పెళ్ళయ్యాక ప్రేమించినా పరువం పరువళ్ళు తొక్కుతూ మనస్సు ఉరకలువేస్తుంటే భార్యాభర్తల ఇద్దరి తత్వాలూ ఆనందానుభూతులనే వాంఛిస్తాయి. కాని ఎవరు ఎక్కువ అనే ఆలోచనలే రావు. ఒకవేళ వచ్చినా పాలపొంగులా ఆ కోపతాపాలు చల్లారిపోవాలిగాని ఆ మంటను ఎవ్వరూ ఎగనెట్టకూడదు. అంతర్యంలో భేదభావం లేనప్పుడు ఒకరి అభిప్రాయాన్ని మరొకరు మన్నిస్తూనే ఉంటారు".

"వారికి చెప్పకుండా ఎక్కడికైనా వెళ్ళగల స్వాతంత్ర్యం నీకు ఉన్నదా, అట్లా వెళ్ళివస్తే ఊరుకుంటారా. అనుమానపడతారా"

సోఫాలోనుంచి లేచి లీలావతి పక్కనేకూర్చుని ఆమెచేతిని తన చేతుల్లోకి తీసుకుంది సబిత.

"లీలా, సిగరెట్లు కాలుస్తావా. గుండెలమీద ఏ ఆచ్ఛాదనా లేకుండా ఉంటే బనీను విప్పుకున్న మగవాడిలా వీధిలోకి రాగలవా"

కొంచం నిర్ఘాంతపోయింది లీలావతి.

"నువ్వు చెప్పింది మగవారికి మాత్రమే పరిమితమైంది. ఆడవారికి కాదు" నెమ్మదిగా అన్నది లీలావతి. చిరునవ్వుతో చూసింది సబిత.

"అంటే స్త్రీ పురుషులు సమానమే అనే వాదన అభిప్రాయమూ ఉన్నా ఇట్లాంటివి ఎన్నో విషయాల్లో పురుషునికి ఉన్న స్వేచ్ఛ, వాతావరణమూ స్త్రీలకు లేదు. ఉద్యోగాలు చెయ్యవచ్చు. ఊళ్ళు ఏలవచ్చు. కాని ఎన్నోవిషయాల్లో చాలా తేడాలూ, స్త్రీలవిషయంలో అన్వయించనివీ అనేకం వున్నయ్యి. అట్లాగే స్త్రీ పురుష స్వేచ్ఛలోనూ తారతమ్యాలున్నయ్యి. పెళ్ళికాని కన్నెపిల్లకు తల్లి చుక్కాని. వివాహిత స్త్రీకి భర్త చుక్కాని. భర్తకు చెప్పి వెళ్ళవలసిన అవుసరం స్త్రీకి ఎంతోవున్నది. చెప్పి వెళ్ళే దాంట్లో అర్థమూ, ఆనందమూ వున్నది. చెప్పకుండా వెళితే ఆనందం హరించిపోయి అనుమానం పెల్లుబుకుతుంది" అన్నది సబిత.

"వారు చెప్పకుండావెళ్ళి ఆ రోజు రాత్రికి రాక మర్నాడు వస్తారనుకో. అప్పుడు నీ మనస్సు ఎట్లాఉంటుంది ?"

"ఆఫీసు పనిమీదనో, వ్యాపారం విషయంలోనో ఊరికి వెళ్ళారనుకుంటాను. తిరిగి వచ్చాక వారే చెప్తారుకదా, ఆ అనుమానం ఆడదానికెందుకు ?"

"నిన్నెప్పుడూ వారు కొట్టలేదా, కోప్పడలేదా, కోపంతో తిట్టలేదా ?" లీలావతి మనస్సులోని భావాలు పరుగెత్తి బయటపడుతున్నయ్యి.

"అలాంటి వాతావరణం నే నెప్పుడూ కల్పించలేదు. ఒకవేళ కొడతారంటావా, అందుకు తగిన వాతావరణం భార్య సృష్టిస్తేనే భర్తచేతిలో దెబ్బలుతినేది. కారణం లేకుండా ఎవ్వరూ ఎవ్వరిమీదా చెయ్యిచేసుకోరు"

"ఒకవేళ అకారణంగానే కొడితే ?"

"గాలివాన వస్తే కథేలేదు".

"ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా దాటేస్తున్నావు" గంభీరంగా చూస్తూ అన్నది లీలావతి.

"అలాంటి స్త్రీ నా జీవితంలో ఎప్పుడూ తారసపడలేదు. భార్యాభర్తల జీవితాలు కోరికలపుట్ట. కోరికల్ని కోరుతున్నట్లుగా తీర్చుకోవాలనే అను

కుంటారుగాని, కొట్టుకుని తగాదాలు పెంచుకోరు. అట్లాంటివాళ్ళు నూటికి కోటికి ఎవరైనా ఉంటే వాళ్ళలో అనురాగం పశుత్వంగా మారి అనుభవం మృగ్యమే అవుతుంది. ఆ భార్యాభర్తల సంసారానికీ, ఇంగిత జ్ఞానంలేని పశు సంస్కారానికీ తేడాలేదు. అలాంటివార్ని మనం కల్లోనైనా తల్చుకో కూడదు".

"అలాంటి వారంటే నీకు సానుభూతిలేదా"

"లేదు" కొంచం గతుక్కుమన్నది లీలావతి.

"ఎందుకని"

"భర్త కౌగిలిలో కరిగిపోయి అమరత్వపు అనుభూతుల్ని శారీరకంగా, మానసికంగా, హృదయానుగతంగా అనుభవించవలసిన భార్య, భర్తతో తగాదా పెట్టుకుని సంసారాన్ని రుద్రభూమిగా మార్చిందంటే ఆ స్త్రీని ఏంచెయ్యాలంటావు లీలా" అన్నది సబిత.

"ఏంచేస్తే బావుంటుంది" ఎదురుప్రశ్న వేసింది లీలావతి.

"ఆ స్త్రీ స్త్రీకాదు, ఆమెలో స్త్రీత్వంకన్న అహం నూటికి వెయ్యి రెట్లు, జాస్తిగా ఉన్నట్లుగానే అర్థంచేసుకోవాలి" అన్నది సబిత.

"సంసార వాంఛలోపడి శారీరక సుఖంకోసం ఈ రోజుల్లో స్త్రీ లందరూ తమ మనస్సుని తామే ఆత్మహత్య చేసుకుంటున్నారు. ఎవర్ని కదిలించినా ఇదే అభిప్రాయంతో ఉన్నారు. సరే, శలవు. వెళ్ళొస్తాను సబితా" అన్నది లీలావతి.

లీలావతి వెళ్ళినవైపే చూస్తూ నిల్చుంది సబిత. అయిదు నిమిషాలకుగాని తేరుకోలేదు.

రాత్రి ఎనిమిదిగంటలైంది. శ్రీనివాసరావుకు ఆరోజే ఉత్తరం చేరింది. బ్యాంకులో ఒకసారి చదువుకున్నాడు మళ్ళీ రెండోసారి రూముకు వచ్చి చదువుకున్నాడు. అప్పుడే హోటల్లో భోజనంచేసి వచ్చాడు. ఉత్తరం చదివి అందులోని ఒక్క విషయానికి ఎంతో సంతోషించాడు. సురేఖ

చదువుకుంటున్నది. సురేఖ జీవితంలో ఇదొక మలుపు. అమ్మ మనస్సుని కష్టపెట్టాను. కష్టం కలిగిస్తున్నానని తెల్సు. జీవితానికి కొత్తసంఘటనలూ, కొత్తకోరికలూ కావాలి. అప్పుడే జీవితం రాణిస్తుంది. ఆ కోరికలతోనే నాన్నతో ఆ స్త్రీవిషయంలో వచ్చినపేచీలతో వచ్చేశాను. అవాంతరణంలోంచి పూర్తిగా బయటపట్టంతో, లీలావతి పరిచయంతో, స్నేహంతో పునర్జన్మ ఎత్తాను. వివాహంతో జీవిత లక్ష్యాన్ని సాధించాననే అనుకున్నాను, కాని భార్య పామైకరిచింది, జీవితానికి వక్రగతిపట్టింది. లీలావతి 'ప్ఫ్' నిట్టూర్చాడు. మేడమెట్లు ఎవరో ఎక్కుతున్నట్లుగా అలికిడైంది. వరండాలోకి వచ్చి చూశాడు. మామగారు. శ్రీనివాసరావుకింద పరుపుమీద కూర్చున్నాడు. మామగారు కుర్చీలో కూర్చున్నారు. ఒకరినొకరు పలకరించుకోలేకపోయారు. సంభాషణ ఎట్లా ప్రారంభించాలో ఎవరికీ తోచలేదు సిగరెట్ వెలిగించాడు శ్రీనివాసరావు.

"జరిగింది మర్చిపో బాబూ. కాపురం చెయ్యవలసిన వయస్సులో కలతలు పెంచుకోవటం మంచిదికాదు, ఇంటికి వెళదాం రా".

"భర్తతో చెప్పకుండా స్నేహితుల ఇళ్ళకు వెళ్ళి రాత్రిళ్ళు ఉండి వచ్చే భార్యతో ఏ భర్తా కాపురం చెయ్యలేడు. మానవుడికి అహంకారం ఉంటంలో తప్పులేదు. అహంకారమే లేకపోతే మానవుడి బ్రతుకుబాటలో అనేక అవరోధాలు ఏర్పడుతయ్యి. కాని ఆ అహంకారంతో ఏ భార్యాభర్తకాళ్ళముందు పల్లేరుకాయలు పొయ్యదు".

"జరిగింది మర్చిపోమని ప్రాధేయపూర్వకంగా వేడుకుంటున్నాను. నా మాట కాదనకు బాబూ".

"జరిగిన ప్రతి విషయమూ మర్నాటికి మర్చిపోయేందుకు ఇది వాస్తవ జీవితం, సినిమా జీవితం కాదు".

"క్రమేపి దాని తప్పేమిటో లీలావతికూడా తెల్సుకుంటున్నది. దాని కాపురంలో నిప్పులు పొయ్యకు".

"ఏమిటీ, మీ అమ్మాయి కాపురంలో నిప్పులు పోశానా. తన వేలితో తన కన్నే పొడుచుకున్నది. మొన్న శనివారంనాడు మా బ్యాంకు

దగ్గర బస్‌స్టాప్‌లో బస్సెక్కింది. ఇక్కడి బస్‌స్టాప్‌లో నావెనకనే దిగింది. నేను ఎటు వెళ్ళుతున్నానో చూసి వెళ్ళిపోయింది. ఇదంతా నేను చూడలేదనే అనుకున్నది. బహుశా మీకూ చెప్పి ఉండకపోవచ్చు."

"చెప్పింది".

"ఇదికూడా నేను మర్చిపోవాలంటారా".

ఆయన మాట్లాడలేకపోయాడు.

"చిన్న చిన్న సంఘటనలే పెద్ద పెద్ద కథలుగా ఊహించుకుని జీవితాల్ని సుఖాలనుండి దూరంచేసుకోవటం మంచిదికాదు బాబూ — నా మాట వినవూ" అర్థిస్తూ అడిగాడాయన.

"ప్రతి చిన్న విషయంలోనూ ఎవరు అహంకారాన్ని ప్రదర్శిస్తున్నారో ఎవరి మనస్సుకు వారికి తెల్సు. ప్రతిరోజూ పోట్లాడుకుంటూ కాపురంచేసేకన్నా, ఎవరికివారు విడిగా ఉంటంలోనే స్వేచ్ఛ, ఆనందమూ ఉన్నది. లీలావతికి కావలసింది స్వేచ్ఛ, భర్తకాదు" అన్నాడు శ్రీనివాసరావు. ఆయన ఏమీ మాట్లాడలేదు.

అవతల ప్రక్క వాటాలోఉన్న ఇంటాయన వచ్చాడు.

"భోజనమైందా శ్రీనివాసరావూ".

"అయిందండీ"

"ఓ, ఎవరో బంధువులు వచ్చినట్లున్నారు, మాటలు వినిపిస్తుంటేను, చూద్దామని వచ్చాను".

"అవునండీ బంధువులొచ్చారు".

"మీరేమవుతారో వారికి, మా బంధువుల్లో చక్కని పిల్ల ఉన్నది. చాలా బుద్ధిమంతురాలు. కట్న కానుకలకూ లోటులేదు. నువ్వు సరే అంటే మాట్లాడుతాను. మా మేడమీదనే ఇంకోగదికూడా ఇస్తాను. చిలకాగోరువంకల్లా కాపురం చేద్దురుగాని. ఏ వయస్సులోవేడుకలు ఆ వయస్సులో జరిగితేనే జీవితానికి వన్నెతెచ్చేది, సరే తరువాత మాట్లాడుకుందాం" అని వెళ్ళాడాయన.

"మళ్ళీ పెళ్ళి ప్రయత్నంకూడా సాగుతోందా"

ఆయన కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. ఆవేదన పొంగిపొర్లుకొస్తున్నది. క్షణంలో సగమైపోయాడాయన.

"ఇంటాయన భావాలకు నేను బాధ్యుడనుకాదు. ఆయనకూ స్వేచ్ఛా స్వాతంత్ర్యం ఉన్నదికదా" ముభావంగా అన్నాడు శ్రీనివాసరావు.

# 19

సంవత్సరీకాలు అయ్యాక, గోగులేశ్వరంనుంచి అందరూ తిరిగి వచ్చేసి పదిరోజులైంది. పరీక్షలు దగ్గరపట్టంతో సురేఖ, జయలక్ష్మి, అనుపమ శ్రద్ధగా చదువుతున్నారు. నళిని ఆఫీసుకు వెళ్ళుతున్నది. జీతం కూడా పాతికరూపాయలు పెంచారు. ఇప్పుడు నళిని జీతం నూట డెబ్బై అయిదు రాజేశ్వరికి ఉద్యోగం లేదు. ఎక్కడా ప్రయత్నంకూడా చెయ్యటం లేదు. ఇంట్లోనే ఉండి జయలక్ష్మి, అనుపమకు, రాధారమణకు పాఠాలు చెప్తోంది.

"నా గుండెలమీద మూడు కుంపట్లు ఉన్నయ్యి. ఒక్క కుంపటి దింపలేకపోతున్నాను" అని మనస్సులో బాధపడ్తున్నది సుభద్రమ్మ.

ఒకరోజున నళినితో అన్నదావిడ.

"రాజేశ్వరికి పెళ్ళిచేస్తే మన బాధ్యత కొంత తప్పుతుంది నళినీ. ఎదిగినపిల్ల ఎన్నాళ్ళని ఇంట్లోఉంటుంది. దానికి పెళ్ళిచేస్తే యింకో మూడు నాలుగేళ్ళవరకు కాస్త నిద్రపోవచ్చు. తరువాత జయలక్ష్మి సంగతి ఆలోచిద్దాం"

ఈ మాటలకు కొంచెం విస్తుపోయింది నళిని. తల్లి ఆందోళన ముందు తన ఆలోచన వెనక్కుతగ్గింది.

"అట్లాగేనమ్మా—సంబంధాలు చూద్దాం"

"చూద్దామంటేకాదు, చూడాలి. మీ ఆఫీసులో పెళ్ళికాని కుర్రాళ్ళు లేరూ" అన్నదావిడ—

"కనుక్కుంటానమ్మా. నువ్వేమీ ఆందోళనపడకు. కళ్యాణఘడియ రావాలికదా" అన్నది నళిని.

ఆవిడ ఇంకేమీ మాట్లాడలేదు. తల్లి మాటలకు మనస్సులో నవ్వు కున్నది నళిని. "అమ్మ దృష్టిలో నేను పెళ్ళికాని పెద్దకూతుర్నికాదు, సంపాదించే ఇంటి యజమానిని" అనుకుంది.

ఆరోజు సాయంత్రం ఇంటికిరాగానే రాజేశ్వరితో అన్నది నళిని.

"నీకు పెళ్ళిచేసి నా బాధ్యత తీర్చుకుందామని అనుకుంటున్నానే రాజూ". మనస్సులో నవ్వు వస్తున్నా పెదవులు దాటి బయటికి రానీయ లేదు. "ఈ ఇంటి యజమానివి నువ్వు, మేమంతా నీ పిల్లలం, పోనీ నిన్ను 'నాన్నా' అని పిలవమంటావా" ఎగతాళిగా అన్నది. సురేఖకూడా అక్కడే ఉన్నది. "ఏం బావా ఎదిగిన ఆడపిల్లని ఎంతకాలం ఇంట్లో పెట్టుకూర్చుంటావు. నీకు నిద్ర ఎట్లా పడుతున్నదయ్యా. ఏ దారేపోయే దానయ్యకో ఇచ్చి ముడిపెట్టాలిగానీ. ఇట్లా నిమ్మకు నీరెత్తినట్లుగా ఉంటే ఎట్లా" గంభీరంగా అన్నది సురేఖ.

"అవును బావా. నా సంసారపరిస్థితి నువ్వు చూస్తూనే ఉన్నావుకదా, పెళ్ళంటే మాటలా" అన్నది నళిని.

"నాన్నా. నేను పెళ్ళిచేసుకోను. చదువుకుని ఉద్యోగంచేస్తా" అన్నది రాజేశ్వరి.

ఈ మాటలన్నీ అనుపమ, రాధారమణ వింటున్నారు. వాళ్ళకేదో అనుమానం వచ్చి తల్లితో చెప్పి ఆవిడని తీసుకొచ్చారు.

"ఏమిటే మీరు ముగ్గురూ నాటకం వేస్తున్నార్ట. ఏం నాటకం, ఆడ పిల్లలకు నాటకాల పిచ్చేమిటే. హవ్వ" అన్నదావిడ.

"ఈ నాటకంలో పురుషపాత్రలు లేవమ్మా. అందరూ స్త్రీలే" అన్నది నళిని అంతా ఒక్కసారిగా నవ్వేశారు. సుభద్రమ్మ "పిదపకాలం" అనుకుంటూ వెళ్ళింది.

మరో రెండురోజులు గడిచాయి. నలుగురు పిల్లలూ నళినిని చుట్టు ముట్టారు ఆ నలుగురిలోనూ పెద్దది జయలక్ష్మి అన్నది.

"అక్కయ్యా, నాన్న బ్రతికున్నప్పుడు ఏదో పండక్కి మా నలు గురికి ఒక్కజత బట్టలు కుట్టించారు. సంవత్సరం దాటిపోయింది. ఇంత వరకూ ఉన్న వాటితోనే సర్దుకుంటున్నాం. మా నలుగురిలో ఎవ్వరికీ సరైన బట్టయి లేవు తలొక రెండు జతలు మాత్రమే ఉన్నాయి. ఒకజత ఉతికి ఒకజత కట్టుకుంటున్నాం. ఎంత సబ్బు పట్టించి ఉతుక్కున్నా నీర్కాయిపట్టి అసహ్యంగా ఉన్నయ్యి. నాలుగయిదు సార్లు అమ్మని అడిగితే అమ్మ కేక లేసింది. అక్కయ్య జీతంతో బట్టలు కూడా ఎక్కడ కుట్టిస్తుందే అని తను కళ్ళనీళ్ళు పెట్టుకుని అవతలకు వెళ్ళేది. నేను పెద్దదాన్ని అయ్యాను. ఈ చిరిగిన ఓణితో బడికి ఎట్లా వెళ్ళను. అంతా నావైపే చూస్తారు. మీటరు రూపాయి పావులా రకమైనా సరే మాకు బట్టలు కుట్టించవే అక్కయ్యా" అన్నది.

నళిని మనస్సు పూర్తిగా విచారంలో మునిగిపోయింది. శ్రూన్యంపడి చూస్తూ కూర్చుంది, ఆ నలుగురి పిల్లలవైపూ. ఆఖరివాడు లక్ష్మణరావుకి నిక్కరుకూడా లేదు. గుండీలేని చినిగిపోయిన చొక్కా వేసుకున్నాడు. నళిని కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"అట్లాగేనమ్మా అందరికీ బట్టలు కుట్టిస్తాను. ఒరేయ్ లక్ష్మణా నీకు మంచి నిక్కరూ, చొక్కా కొనిపెడతాను. వెళ్ళి ఆడుకో" అన్నది నళిని. అందరూ అక్కడినుంచి అవతలకు వెళ్ళిపోయారు. నళిని ఆలోచిస్తూ కూర్చున్నది. సురేఖ వచ్చింది. రాజేశ్వరి స్నేహితురాలింటికి వెళ్ళింది.

"నా వయస్సు ఆడపిల్లలు చీకూ చింతా లేకుండా కోరిన బట్టలు వేసుకుని, మనస్సంతా ఎంతో ఆనందాన్ని నింపుకుని, ఆ రాబోయేభర్తను గూర్చి కలలు కంటూ అంచనాలు వేసుకుని అంబర వీధిలో విహరిస్తారు. వయస్సుతో పాటు మనస్సుకూడా పొంగి పులకింతలతో పరవళ్ళు తొక్కుతుంది. నాకు అలాంటి ఆలోచనలూ, అంచనాలూ ఏవీ అక్కర్లేదు. కనీ, పెంచి పెద్దచేసిన నాన్న నా నెత్తిన ఈ పెళ్ళి బరువూ బాధ్యతకూడా పెట్టకుండా నా జీతాన్ని వీలయినంత వరకూ దాచి ఏ రెండు మూడువేలో

అయితే కట్నానికి ఆశించని ఏ ఉదార స్వభావుడో జీవితంలో తారసపడితే పెళ్ళి ఖర్చుకూడా నాన్న నెత్తిన వెయ్యకుండా నేను దాచినజీతం డబ్బుతో నా పెళ్ళి, రాజేశ్వరి పెళ్ళి జరిపించుదామనుకున్నాను. ఆలోచనలకు అర్థం ఉన్నా ఆచరణలో అర్థం లేకుండా పోయింది. ఈ సంసార సాగరాన్ని ఈదడంలో నా శాయశక్తులా, మనస్ఫూర్తిగా కృషి చేస్తాను సురేఖా" అన్నది నళిని.

నళిని ఎందుకు బాధ పడుతుందో సురేఖకు అర్థం కాలేదు. తల్లి ఏమైనా కోప్పడ్డదేమో ననుకొంది.

"అత్తయ్య ఏమైనా అన్నదా నళినీ"

"ఏమీ అనలేదు సురేఖా, పిల్లలంతా బట్టలు లేవని గొడవచేస్తుంటే మనస్సు వికలమై పోయింది. ఈ రోజులలో కొందరి జీవితాలకు అర్థం లేదేమో?"

ఆర్థిక విషయాలకు బాధ పడుతోందని తెలుసుకుంది సురేఖ.

"రాజేశ్వరికి కూడా ఏదయినా ఉద్యోగం చూడు నళినీ, కొంత ఇబ్బంది తీర్తుంది కదా".

"చూడాలి సెక్రటరీ ఉద్యోగం అయింది. ఇంక ప్రెసిడెంటు పదవికి పోటీ చేయిస్తాను".

"పోటీనా ఇవేమన్నా ఎలక్షన్లా" ఆశ్చర్యపోతూ అడిగింది సురేఖ.

"సెలక్షన్లు" కళ్ళు చమర్చాయి.

"నళినీ"

"ఏమిటో అనేశాను ఏమీ అనుకోకు సురేఖా. పిల్లలంతా కట్టుకునేందుకు బట్టల్లేవని బాధపడుతుంటేను, ఇంత అసమర్థురాల్ని వాళ్ళని ఎట్లా పోషించగలనా అని ఆలోచిస్తున్నాను. ఇంకో నాలుగు నెల్లు పోతే తిండి కూడా పెట్టలేక వాళ్ళ పొట్టలు వీపుకు అతుక్కుపోయేటట్లుగా చేస్తానేమో" అన్నది నళిని.

"బాధపడకు నళినీ. రాజేశ్వరికూడా ఉద్యోగం చేస్తే కొంతఇబ్బంది తీర్తుంది"

వారం రోజులు గడిచాయి. నళినికి జ్వరం తగిలి నాలుగు రోజులైంది. మందులూ, మాత్రలూ వాడినా ఏ మాత్రం నార్మల్‌కు రాలేదు. మరో నాలుగు రోజులు గడిచాయి. డాక్టరు టైఫాయిడ్ అన్నారు. సుభద్రమ్మ నిలువునా నీరైపోయింది. పిల్లలంతా దిగాలుపడి కూర్చున్నారు. సురేఖ పరిస్థితులన్నీ తండ్రికి ఉత్తరం రాసింది. ఉత్తరం చూడగానే రాఘవరావు వచ్చాడు. రెండురోజులు ఉండి కావలసినవన్నీ కొని, డాక్టరుతోకూడా మాట్లాడి ఏమాత్రం మందులోపం చెయ్యవద్దని చెప్పి ఆయనకు ముందుగానే ఏభై రూపాయలు ఇచ్చి, జమాబందీ రోజులవటంతో ఆయన ఉండటానికి వీల్లేక వెళ్ళిపోయారు.

మరోవారం జరిగింది. నళిని చాలా నీరసించిపోయింది. ఎంతో ప్రయత్నంమీద పక్కమీద లేచి కూర్చోగలుగుతోంది. ఎప్పటికి తగ్గుతుందోనని అంతా ఆదుర్దాగా ఉన్నారు. డాక్టరు రాజేశ్వరితో చెప్పాడు. "టైఫాయిడ్‌కూ మందున్నది, కాని మానసిక వ్యాధికి మందులేదు. మీ కుటుంబవిషయాలు తెలియవు. మీ అక్కయ్యకు మానసికవ్యాధి లేకుండా చెయ్యటం మీ విధి".

"అట్లాగే డాక్టర్. వైద్యలోపం జరగటానికివీల్లేదు, మానసిక ఆందోళన సంగతి నేనూ చూస్తాను" అన్నది రాజేశ్వరి.

"వెరీగుడ్" డాక్టరు వెళ్ళిపోయాడు.

సురేఖతో సంప్రదించింది రాజేశ్వరి. ఆ రోజున నళిని చెప్పిన విషయాలన్నీ చెప్పింది సురేఖ. అంతా విన్నది రాజేశ్వరి.

"నువ్వు ఉద్యోగంలో చేరు రాజా"

"అట్లాగే"

"ఎక్కడన్నా ఉద్యోగం దొరికిందా" సంతోషంతో అన్నది సురేఖ. పేలవంగా నవ్వింది రాజేశ్వరి.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటల తరువాత రాజేశ్వరి హరిసర్వోత్తమరావుగారి కాస్మొటిక్స్ కంపెనీకి వెళ్ళింది. ఆయన ఆఫీసుకు

వచ్చి పదినిమిషాలైంది. నమస్కరించి నిల్చుంది రాజేశ్వరి. ఆయన తలెత్తిచూశాడు. ఆ కళ్ళలోని ఆర్ద్రతను చూసింది.

"వచ్చావమ్మా, కూర్చో" ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"ఏమ్మా, అంతా కులాసాగా ఉన్నారా" అన్నాడాయన.

"అంతా కులాసానేనండీ. అక్కయ్యకు టైఫాయిడ్ జ్వరం, పదిహేనురోజులు దాటింది. ఇంకా నార్మలుకు రాలేదు".

"డాక్టరుగారు ఏమంటున్నారు. ఆయనవల్ల కాకపోతే మా డాక్టర్ను పంపుతాను. నావల్ల సహాయం ఏమైనా కావాలంటే నిస్సంకోచంగా చెప్పమ్మా" అన్నాడాయన.

"మీ కంపెనీలో ఏదైనా ఉద్యోగం కాళీగా ఉందేమోనని అడుగుదామని వచ్చాను. సెక్రటరీ ఉద్యోగంకాదు".

"ఆ ఉద్యోగానికే నువ్వు జీతం తీసుకోలేదు. మళ్ళీ ఏ కారణంచేతనైనా నువ్వు మధ్యలో మానేస్తే, కనీసం జీతమైనా తీసుకువెళతావా" నవ్వుతూ అన్నాడాయన.

"వాతావరణాన్నిబట్టి ఏ ఉద్యోగమైనా చెయ్యగలుగుతాననే నమ్మకం నాకున్నదండీ, కూటికిపేదవారమైనా గుణానికి పేదవారంకాదు, పేదరికాన్ని అలుసుగా తీసుకుని గుణాన్ని అసమర్థతగా తీసుకుంటే, అప్పుడు జీతాన్నే వదిలి వెళతానో ప్రాణాన్నే వదిలి వెళతానో ఇప్పుడే చెప్పలేనుకద"

అప్రతిభుడై చూశాడాయన.

"నీ ఇష్టం రాజేశ్వరీ. ఏ దురుద్దేశ్యంతోనూ, దూరదృష్టితోనూ నీకు మా కంపెనీలో ఉద్యోగం ఇవ్వటంలేదు. ప్రస్తుతం కాళీలు లేకపోయినా నీకోసం ఉద్యోగం ఇస్తున్నాను. జీతం నూట ఏభై మాత్రమే".

నిష్కర్షగానే చెప్పాడాయన. నిరభ్యంతరంగానే చేరుదామనుకున్నది రాజేశ్వరి. రెండు రోజుల్లో చేరుతానని చెప్పి గంపెడు సంతోషంతో ఈ వార్త త్రివేణి చెల్లెలికి చెప్దామని ఇంటికి వెళ్ళింది.

ఈ వా ర్త విన్నతరువాత రాజేశ్వరి సంతోషంలో నూరవవంతు సంతోషంకూడా నళినికి కలుగలేదు. రాజేశ్వరి అవతలకు వెళ్ళింతరువాత సురేఖతో అన్నది నళిని "మళ్ళీ దీనికి ఆ యజమానే దొరికాడు".

మూడురోజుల్లో రాజేశ్వరి ఉద్యోగంలో చేరింది. "జీతం బత్తెంలేని ఉద్యోగాలన్నీ దీనికే దొరుకుతయ్యి" అన్నది తల్లి. ఆవిడ మనస్తత్వానికి నవ్వుకుంది రాజేశ్వరి.

పద్దిరోజులు గడిచాయి నళినికి జ్వరం తిరుగుముఖంపట్టింది. రాజేశ్వరి కాస్మెటిక్స్ కంపెనీలో ఉద్యోగం చేస్తూనే ఉన్నది. ఒకరోజున రాజేశ్వరి ఇంటికి వెళ్ళేటప్పుడు హరిసర్వోత్తమరావు,

"ఇప్పుడు నువ్వు గాంధారి సెక్రటరీవికావు. కాని ఒకసారి నిన్ను మా ఇంటికి తీసుకురమ్మన్నది నా భార్య. జరిగిన విషయాలు మర్చిపోయి పూర్వాపరాలు బాగా ఆలోచించుకుని, నీకు ఇష్టమైతే ఎల్లుండి ఆదివారం ఉదయం ఇంటికిరా, వస్తావుకదూ" అన్నాడు.

"అట్లాగేనండీ" అన్నది రాజేశ్వరి.

ఏమీ ఆలోచించకుండానే ఆదివారం ఉదయం తొమ్మిదిగంటలకు వారింటికి వెళ్ళింది రాజేశ్వరి.

"నువ్వు రావని నాకుతెలుసు. కాని వస్తావనే లవలేశమైన ఆశ కూడా లేకపోలేదు. వచ్చావు చాలా సంతోషం" అన్నదావిడ.

"ఇప్పుడు నువ్వువాడితో మాట్లాడనే అక్కర్లేదు రాజేశ్వరీ. వాడు పూర్తిగా మారిపోయాడు" అన్నాడు హరిసర్వోత్తమరావు. ముగ్గురూ కాఫీ తాగారు.

"నమస్కారం నాన్నగారూ, పిల్చారట" తండ్రిపక్కనే సోఫాలో కూర్చున్నాడు హరిప్రసాద్. రాజేశ్వరినిచూసి "కులాసాగా ఉన్నారా, అక్కయ్యకు టైఫాయిడ్ జ్వరమని నాన్నగారు చెప్పారు. ఎట్లాఉంది" అన్నాడు హరిప్రసాద్.

మాటల్లోని గౌరవం, నమ్రతచూసి కొంచెం ఆశ్చర్యపోయింది రాజేశ్వరి.

"ఏమీలేదు, రేపు మంచిది. కలకత్తా ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు చేశాను. నాలుగురోజుల్లో అన్నిపన్లూ చక్కబెట్టుకొని అయిదోరోజున వచ్చేయ్" అన్నాడాయన.

"అట్లాగే నాన్నగారూ" అని మేడమీదకు వెళ్ళాడు హరిప్రసాద్.

ఇతను ఇంత మంచిగా తనంత తానుగా మారిపోయాడా లేక ఇది ఒకరకమైన అభినయమా, అనుకున్నది రాజేశ్వరి. మరో పావుగంట కూర్చొని ఏదో పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకున్నారు ముగ్గురు.

నళినికి మరో పదిరోజుల్లో జ్వరం పూర్తిగా తగ్గి పథ్యం తీసుకున్నది. మరో నెలరోజులవరకూ విశ్రాంతి తీసుకోమన్నాడు డాక్టరు. పరిస్థితులన్నీ తెల్సిన హరగోపాల్ పూర్తిజీతం మీదనే శలవు ఇచ్చారు. రాజేశ్వరి మొదటి నెలజీతం నూటఏభై రూపాయలూ తల్లిచేతుల్లో ఉంచగానే సుభద్రమ్మ అన్నది.

"నువ్వు నిజంగానే ఉద్యోగం చేస్తున్నావనే నమ్మకం ఇప్పుడు కలిగింది రాజూ".

"కాని సెక్రటరీ ఉద్యోగమే చాలా మంచిది అత్తయ్యా. జీతం నెలకు రెండువందలు. అలవెన్సూ నెలకు ముప్పై రోజులు" అన్నది సురేఖ.

కళ్ళతోనే కోపాన్ని వెలిబుచ్చింది రాజేశ్వరి.

"ముందు ముందు ఈ కంపెనీ ఉద్యోగమే వృద్ధిలోకి రావచ్చు. ఇంక్రిమెంట్లూ, బోనసులూ ఉంటాయికదా" అన్నది సుభద్రమ్మ.

"మన మనస్సును బట్టీ, చొరవను బట్టీ అన్నీ ఉంటయ్యి" అన్నది సురేఖ. సుభద్రమ్మ ఏమీ అనలేదు.

ఇవతలకు వచ్చాక రాజేశ్వరి అన్నది.

"సురేఖా నా ఉద్యోగాన్ని గురించి వింత వ్యాఖ్యానం చేస్తున్నావేం. మళ్ళీ ఆ కంపెనీలోనే చేరానని కొంచెం అలుసుగా ఉందికదూ".

"అలుసుకాదు రాజూ, నలుసులాంటి ఏ అభాండాన్ని నెత్తిన వేసుకోకు. నళిని ఆదుర్దాను నేను చెప్పాను" అన్నది సురేఖ

"అట్లాగా" అన్నది రాజేశ్వరి.

"గుడ్ మార్నింగ్ రాజేశ్వరీ" తలవంచుకుని నడుస్తున్నదల్లా తల ఎత్తి చూసింది.

"...... ......"

"మా ఇంటిముందు నుంచీ వెళుతూ ఇంటికి రాకుండా వెళు తున్నారేం" అన్నాడు హరిప్రసాద్.

"స్నేహితురాలి ఇంటికి వెళుతున్నాను. శలవు, వెళ్ళొస్తాను" వెళ్ళ బోయింది రాజేశ్వరి

"కాసేపు కూర్చుని వెళుదురు కాని రండీ, అమ్మ ఇంట్లోనే ఉన్నది ప్లీజ్" రాజేశ్వరికి పచ్చి వెలక్కాయ పగలగొట్టి తినబోతున్నట్లే అనిపించింది. గేటులోనుంచి ఇంట్లోకి వెళ్ళబోయింది.

"కాసేపు ఇక్కడ కూర్చుందాం. మా తోటలోని పూల మొక్కలన్నీ చూద్దురుగాని. కొన్ని కొత్త మొక్కలు కూడా తెప్పించి నాటాను. ఈ సిమెంటు బల్ల మీది కూర్చుని చుట్టూ చూస్తే అన్నీ కనిపిస్తయ్యి" అన్నాడు హరిప్రసాద్.

"మొక్కలు కొత్తవైనా, ఆవరణ పాతదే. వాతావరణంలో మార్పేమీ ఉండదు".

"ఒక రకంగా నిజమే కావచ్చు. పాత నిజం కొత్త అబద్ధంగా ఎంచ కూడదు కదా"

"నిజం అబద్ధమైనా, అబద్ధం నిజమయినా, అనుభవాలు మనస్సు విడిచి పోవు కదా, క్షమించండి. అమ్మగార్ని చూసివెళ్ళి పోతాను" అన్నది రాజేశ్వరి.

"ప్లీజ్, ఒక్కమాట".

"ఏమిటది"

"కటిక దరిద్రుడు లక్షాధికారి అయ్యాడంటే నవ్వుకుంటారా?"

"వప్పుకుంటాను. లాటరీలో లక్ష రూపాయలు రావచ్చుకదా".

"దుర్మార్గుడు సన్మార్గుడయాడంటే వప్పుకుంటావా?"

"లేదు. నాకు నమ్మకం లేదు"

"ఎందుకని?"

"మానవనైజం జీవిత సత్యాన్ని తుడిచి పెట్టలేదు".

"అంటే?"

"ఉన్న ఇంటిని ఒక్కరోజులో పడగొట్టి నేలమట్టం చెయ్యవచ్చు. కాని ఒక్కరోజులో మళ్ళీ అంత ఇల్లూ కట్టలేరు"

"ఆస్థిపాస్తులకు విలువఉంది. కాని చలనం లేదు. కాని మనస్సు అట్లాకాదు. చంచలమైన మనస్సుకూడా కొన్ని పరిస్థితుల ప్రభావంవల్ల విలకడగానే ఉంటుందేమో"

"చంచలమైన మనస్సు కలవారికి ఇతరుల అభిప్రాయాలతో నిమిత్తం లేదు. వాళ్ళ మాటల్లో వాళ్ళకే నమ్మకం ఉండదు".

వెనక్కి తిరిగింది రాజేశ్వరి.

"జరిగినవన్నీ మర్చిపోండి. ఆ రోజున జరిగిన సంఘటనలే నా జీవితాన్ని పూర్తిగా మార్చివేశాయి. నన్ను మీరు మనిషిగా చేశారు. నాలో మంచితనానికి ప్రాణప్రతిష్ట చేశారు. ఇప్పుడు తాగటం కూడా మానేశాను"

అతనివైపు తిరిగి చూడకుండానే విన్నది రాజేశ్వరి.

"సంభాషణలు బాగానే ఉన్నయ్యి. మీరే రచయితగా ఒక సినిమా తియ్యవచ్చు" అని గాంధారి దగ్గరకు వెళ్ళింది రాజేశ్వరి.

"రా తల్లీ రా. నీకు చెయ్యెత్తి నమస్కరించవచ్చు, కాని వయస్సు అడ్డువస్తుంది. నీకు ఆయుక్షీణం కాకూడదు" అన్నదావిడ.

"స్నేహితురాలి ఇంటికి వెళుతూ మిమ్మల్ని చూసి పోదామని వచ్చాను, వెళతాను" తిరిగి చూడకుండానే వెళ్ళింది రాజేశ్వరి. మేడమీది నుంచీ చూస్తూ నిలబడ్డాడు హరిప్రసాద్.

ఆ రోజు సాయంత్రం వాణి రాజేశ్వరిని అడిగింది.

"ప్రొద్దున్న నువ్వు స్నేహితురాలి ఇంటికే వెళ్ళావా?"

"ముందు ప్రొప్రయిటరుగారింటికి వెళ్ళాను. తరువాత స్నేహితురాలి ఇంటికి వెళ్ళాను"

"హరిప్రసాద్ కనిపించాడా. అతనితో మాట్లాడావా?"

రాజేశ్వరి ఆశ్చర్యపోలేదు. నళిని మనస్సులోని భావాలను వెతుక్కుంది.

"మా ప్రొప్రైటరు, ఆయన భార్యా పెద్దవారు. వాళ్ళతో మాట్లాడినా తప్పులేదు. కాని మీ ప్రొప్రైటరు, ఆయన భార్య చిన్నవారు" అన్నది. రాజేశ్వరి. నళిని ఆశ్చర్యంతో చూసింది.

"నీ మాటల్లోని అంతర్యం ఏమిటి రాజూ?"

నళిని కంఠంలోని విచార భావాన్ని గమనించింది రాజేశ్వరి.

"ఏమీలేదు అక్కయ్యా! పరువు ప్రతిష్టలు కాపాడుకోవడంలో ఒకరి కొకరు తీసిపోము. రక్త స్పర్శ ఒకటైనా అదృష్టాలు వేరుకావచ్చు. ఉద్యోగాలు చేసే ఆడపిల్లలు సహృదయులైతే ఎక్కడికి వెళ్ళినా తప్పు లేదు. పతనమనేది చదువునుబట్టీ, ఉద్యోగాన్ని బట్టీ నిర్ణయించలేం" అన్నది. రాజేశ్వరి.

విభ్రాంతురాలైంది నళిని.

"అవును రాజూ! నేను నీకన్న వయస్సుకు పెద్దదాన్నే కాని, మనస్సుకు చిన్నదాన్ని. క్షమించు".

వారం రోజులు గడిచాయి. ఆ రోజున కంపెనీ బాధ్యతల నన్నింటినీ హరిసర్వోత్తమరావు, కొడుకు హరిప్రసాద్‌కు అప్పగించాడు. ఆ రోజున ఆఫీసులో చిన్న సమావేశం ఏర్పాటైంది. ఆఫీసు స్టాఫ్, పనివారు అంతా హాజరయినారు. స్టాఫ్ మెంబర్సునీ, పనివారినీ హరిసర్వోత్తమరావు హరిప్రసాద్‌కు పరిచయం చేశాడు.

హరిప్రసాద్ యాజమాన్యం వహిస్తుంటే కొంతమంది సంతోషించారు. కొంతమంది నిరాశా భావం వెలిబుచ్చారు. ఎప్పటికయినా కొడుకు పెత్తనం రాక తప్పదుకదా అని కొంతమంది సరిపెట్టుకున్నారు.

"ఇక్కడికి వచ్చినా నా దురదృష్టం నన్ను వదల్లేదల్లే ఉన్నది" మనస్సులో అనుకుంది రాజేశ్వరి. ఆ కంపెనీలో తను కాక ఇంకా ఇద్దరు ఆడవాళ్ళు ఉన్నారు. కాని వాళ్ళు కొంచెం పెద్దవాళ్ళు పదిసంవత్సరాలుగా ఉద్యోగం చేస్తున్న వాళ్ళు.

ఆ మర్నాడు వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు. "కొడుకు ప్రవర్తన పూర్తిగా మారిపోటం నుంచే బాబుగారు తాళం చెవులు కొడుక్కియిచ్చారు".

"దొంగకు తాళం చెవి ఇస్తే ఆ బాధ్యత తెలుస్తుందనే నిరాశతోనూ ఈ ఉపాయం ఆలోచించారేమో? ఏదయినా రోజులు గడిచినకొద్దీ అబ్బాయిగారి మోజు ఎట్లా ఉంటుందో తెలుస్తుందిగా".

మరో నాలుగు రోజులు గడిచాయి. బాబుగారు రమ్మంటున్నారని ఆఫీస్‌బాయ్ వచ్చి చెప్పాడు. రాజేశ్వరి హరిప్రసాద్ గదిలోకి వెళ్ళింది.

"ఆఫీసుపని నేర్చుకుంటున్నారా" అన్నాడు.

"అవునండీ"

"నేను వచ్చింతర్వాత వాతావరణం కొంచెం మారిందా".

"నాకు తెలియదండీ"

"మీ దృష్టిలో నేను అట్లాగే ఉన్నాను కదూ"

"ఆఫీసు వాతావరణానికి, ఇంటి వాతావరణానికీ తేడావుంటుంది".

"నేనిప్పుడు నీ అధికారిని"

"నాకేకాదు ఆఫీసులో అందరికీ మీరు అధికారే, ఇష్టం కాకపోతే ఉద్యోగం తీసెయ్యవచ్చు. కాని ఇతరుల మనస్సుమీద మీకు అధికారం లేదు"

"మీ ఉద్యోగం తీసివేస్తే"

"మనశ్శాంతి ఉంటుంది"

"అయితే ఇప్పుడు మనశ్శాంతి లేకుండానే ఉద్యోగం చేస్తున్నారా?"

"అట్లా అని అనలేదు"

"నా ఆఫీసులోనే మీరు పనిచేస్తుంటే నా మనస్సు పరిపరి విధాల పోతుంది. అధికారం ఉన్నదని ఏమైనా అనవచ్చు. కాస్త సహనం చూపాలి"

నిర్విణ్ణురాలైంది రాజేశ్వరి. పైన పంకాతోపాటు తన తలకూడా తిరిగిపోతున్నట్లు అనిపించింది, పరీక్షలో పరీక్షగా ఉంది అనుకుంది.

"మాట్లాడరేం?"

"ఉద్యోగ ధర్మం నిర్వహించటంలో తప్పక సహనాన్ని అలవర్చుకుంటాను. స్వవిషయంలో జోక్యం కలిగించుకుంటే సహనాన్ని కోల్పోవటమే కాకుండా ఏమైనా అనవచ్చు,అప్పుడు మీరు కాస్త సహనం చూపాల్సి వస్తుంది".

"వెరీగుడ్. వెళ్ళి మీ పని చూసుకోండి" అన్నాడు హరిప్రసాద్. తన సీట్లో కూర్చుంది రాజేశ్వరి.

"ప్రొప్రైటరుగారు చాలాసేపు మాట్లాడారేమిటి" అన్నారు వాళ్ళు ద్దరూ.

"అధికారాన్ని అడ్డు పెట్టుకుని కొంతమంది అభిప్రాయాల్ని వెలిబుచ్చుతూ ఉంటారు. భక్తికోసం ఉద్యోగం చేస్తున్నాం కనక భక్తితో ఆ సూక్తులు వినాలని వాళ్ళ ఆవేదన" అన్నది రాజేశ్వరి ఈ మాటలకు వాళ్ళేదో అర్థం చేసుకున్నారు.

"పడుచువాళ్ళు పట్టాభిషిక్తులైతే పరువంలో ఉన్న ఆడపిల్లలు పరువుగా బ్రతకలేరు రాజేశ్వరీ" అన్నదొకావిడ.

"అదృష్టం అందలం ఎక్కించినా, బుద్ధి బురద గుంటలోకే లాగుతోంది" అన్నది మరొక ఆవిడ.

రాజేశ్వరి ముఖం కందగడ్డ అయింది. 'ఛీ ఛీ లోకులు కాకులు కాదు, కాష్టంలో కాలుతున్నా వాళ్ళ వక్రబుద్ధి చావదు' అనుకుంది.

సాయంత్రం వెళ్ళేముందు రాజీనామా కాగితం రాసి ఆఫీసుబోయ్ చేత హరిప్రసాద్‌కు పంపింది.

ఆ కాగితం యిచ్చి అతను వచ్చేశాడు.

"అయ్యగారు ఏమీ అనలేదమ్మా, కాగితం చూసి ఊరుకున్నారు" అన్నాడు.

అందరికన్నా పావుగంటముందే వెళ్ళిపోయింది రాజేశ్వరి. అంతా ఆశ్చర్యపోయారు.

ఇంటికి వెళ్ళగానే రాజేశ్వరి గంభీరంగా చూస్తూ అప్పుడే ఆఫీసు నుంచి వస్తున్న నళినితో అన్నది.

"ఉద్యోగానికి రాజీనామా చేశాను మనస్సులోని భావాలకు సింహాసనం పట్టి నీ ముందు ఉంచుతున్నాను. నీ ఆఫీసులోనే నాకూ ఒకఉద్యోగం చూడు. నేను ఆ కాస్మెటిక్స్ ప్రొడక్ట్సు కంపెనీలో ఉద్యోగం చెయ్యను".

నళిని మాట్లాడలేదు. రాజేశ్వరి ఏమీ చెప్పలేదు. రాత్రి భోజనాలయి ఎవరి పక్కలమీదికి వాళ్ళు చేరాక నళిని అడిగింది.

"నీ ఉద్యోగాధ్యాయం త్వరత్వరగానే ముగుస్తున్నది కారణం?"

"నన్ను ఆ ఇంటి కోడలుగా చేసుకోవాలని వాళ్ళ అభిలాష" కోపంతో అన్నది రాజేశ్వరి.

"మంచిదేకదా. నీకు హరిప్రసాద్ నచ్చాడా"

"ఆహా"

"హరిసర్వోత్తమరావుగారితో మాట్లాడవచ్చు కదూ".

"నిరభ్యంతరంగా".

"నువ్వతన్ని ప్రేమించావా".

"అట్లా అని నీకెట్లా తెల్సు నళినీ?"

"నీ ఉద్యోగాధ్యాయాన్ని తల్చుకుంటే అట్లాగే అనిపించింది. ప్రేమించి పెళ్ళి చేసుకోవటంలో తప్పేమీలేదు రాజూ? వయస్సుతో పాటు మనస్సుకూడా పెరిగినప్పుడు మమతల్ని మత్యపెట్టుకోవడంలో అర్థంలేదు.

మమతల్ని మభ్యపెట్టుకుంటే మనని మనమే మోసం చేసుకుంటున్నట్లే అవుతుంది. నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఏమీ చెయ్యను" అన్నది నళిని.

రాజేశ్వరిలో నిజంగానే సహనం నశించింది. అక్కయ్య నన్ను నిజంగానే అపార్థం చేసుకుంది. అంతేకాదు, నా మనస్సుని కూడా వక్ర దృష్టితో చిత్రించింది అక్కయ్య. ఈ అభిప్రాయానికి నా మీద కోపం చేత వచ్చిందా? నా ఉద్యోగంలో జరిగిన అవకతవకలనుంచీ వచ్చిందా? నేనేదో పెళ్ళికి తొందరపడుతున్నాననీ, తొందరగా పెళ్ళి చేస్తే అమ్మ మనస్సును కాస్త సంతోష పెట్టిందాన్ని అవుతాననే పెద్దరికాన్ని నెత్తిన వేసుకుని తనంతట తానుగానే తన అభిప్రాయాల్ని సూటిగా బయటపెడు తున్నదా? అక్కయ్య ఎందుకిట్లా తన విషయంలో మారిపోయింది? లేక నేనే వాళ్ళింటికి రెండుమూడు తడవలు వెళ్ళి రావటంతో నేను హరి ప్రసాద్‌ను అర్థం చేసుకున్నానని అపోహపడిందా? కారణం ఏమిటి?

"నళినీ. ఒక్కసారిగా నువ్వు నన్ను గురించి ఇలాంటి అర్థంలేని అభిప్రాయానికి వచ్చావంటే నువ్వు అక్కయ్యవు కాబట్టి సహించి ఊరు కున్నాను. ఈ సంఘటనలతో నాలోనూ సహనం ఉన్నదని మరొకసారి తెల్సుకున్నాను. ఇంకొకళ్ళు ఈమాటే అనివుంటే వాళ్ళ లెంపలు వాయ గొట్టి, యింకా మన ఇంటిగుమ్మం తొక్కవద్దని బుద్ధి చెప్పేదాన్ని. నువ్వే ఈ మాటలు అనడంతో నాకు సావకాశం లేకుండా పోయింది" అన్నది రాజేశ్వరి.

క్షణంసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

"మరి ప్రేమించానని చెప్పావుకదా".

"కోపం నీకు ఎప్పుడూ రాదు. అంత కోపం వచ్చినప్పుడు చస్తే బావుండునని చాలాసార్లు అన్నావు. అదే నిజమైతే అమ్మకు పెద్దకూతుర్ని నేనే అయ్యేదాన్ని" అన్నది రాజేశ్వరి.

ఆ రాత్రి నళినికి నిద్రపట్టలేదు. రాజేశ్వరి నిద్రపోలేదు. జీవితాను భవాన్ని ఎన్నడో విస్మరించిన సురేఖకు ఏ ఆలోచనలూ మనస్సులో జొర బడక పోవడంతో హాయిగా నిద్రపోయింది.

# 20

"జీతం యిచ్చి జీవితాన్ని కొనుక్కుందామనే తత్వంగల ఏ యజమానీ, తన జీవితంలో తానుగా రాణించడు. జీతం తక్కువ యిచ్చినా యజమాని ఆదరాభిమానాల్ని ఆకళింపు చేసుకున్న ఏ వ్యక్తీ ఎక్కువ జీతం కోసం ఆశపడడు వ్యక్తిత్వాన్ని చంపుకోలేకనే రాజేశ్వరి ఉద్యోగానికి రాజీనామా చేసింది" అన్నది నళిని. రాజేశ్వరి రాజీనామాను గురించి తెల్సుకుందామని హరిసర్వోత్తమరావు వీళ్ళింటికి వచ్చాడు. ఒకవేళ జీతం చాలక రాజేశ్వరి మానుకుందేమోనని ఆయన అభిప్రాయపడ్డాడు. ఒకవేళ రాజేశ్వరి మళ్ళీ వచ్చి ఉద్యోగంలో చేరకపోయినా జీతం యివ్వకుండా ఉద్యోగం చేయించుకోవడం తన అభిమతం కాదని రెండువందల రూపాయల చెక్కు రాజేశ్వరి పేరుతో వ్రాసింది నళినికి యిచ్చాడు హరిసర్వోత్తమరావు.

"కొడుకు ప్రవర్తనలో మార్పుకోసం తండ్రి తన బాధ్యతను నిర్వర్తించాలి కాని, కొడుకు తప్పిదాన్ని మన్నించేందుకు ఏ తల్లిదండ్రులూ ప్రయత్నించకూడదు" అన్నది నళిని. ఈ మాటకు చిన్న బుచ్చుకున్నాడాయన.

"వాడు ఇదివరకు మాదిరి కాదమ్మా, రాజేశ్వరి తనకు తెలియకుండానే అప్రయత్నంగానే వాడిని మనిషి చేసింది. తనలో మానవత్వం ఉందని వాడు ఆలోచించుకొనే స్థితికి వచ్చాడు. పాత హరిప్రసాద్ చచ్చిపోయాడు. వాడికి రాజేశ్వరి పరిచయం పునర్జన్మనిచ్చింది. మొన్న సాయంత్రం రాజేశ్వరి రాజీనామా కాగితం పంపిందట. నాకు తెలీదు. కంపెనీ బాధ్యతను పూర్తిగా వాడి చేతులలోనే ఉంచాను. నిన్నట్నుంచీ వాడు కంపెనీకి వెళ్ళనంటున్నాడు. మేడమీద కూర్చుని రోజంతా ఏమిటో ఆలోచన".

ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరగడం నళిని చూసింది. ఈ మాటలు చెప్తుంటే ఆయన నళినిని అర్థించి అడుగుతున్నట్లుగానే ఉన్నది కాని ఒక పెద్దసంస్థ యజమానిగా హుందాగా మాట్లాడుతున్నట్లు అనిపించనేలేదు.

"రాజేశ్వరి ఏ విషయాల్లోనూ తొందరపడి రాజీనామా చెయ్య లేదండీ, నేనూ ప్రైవేటుసంస్థలోనే ఉద్యోగం చేస్తున్నాను. కాని మీ కంపెనీలో యజమాని మన స్తత్వం జీవితాలపై దెబ్బతీసేదిగా ఉన్నది. ఆ కారణంచేతనే రాజేశ్వరి ఉద్యోగం మానుకుంది".

ఈ మాటలకు ఆయన నవ్వాడు.

"రాజేశ్వరి ఉద్యోగం చెయ్యవలసిన అవసరం లేదమ్మా. అనుభ వాన్ని ఇదివరకు కొనుక్కునేవాడు. ఆ కారణంచేతనే వాడికి ఎట్లా మాట్లా డాలో నిజంగానే తెలీలేదు. ఇప్పుడు శాశ్వత బంధాన్ని కోరుకున్నాడు. వాడు రాజేశ్వరిని ప్రేమించాడమ్మా. రాజేశ్వరి మా కోడలైతే ఈజీవితంలో మాకు కావలసిందేమీలేదు. మా కోరిక మన్నించండీ" అన్నాడాయన ప్రాధేయపూర్వకంగా.

నళినికి మాట పెగల్లేదు.

"రాజేశ్వరి అభిప్రాయం తెల్సుకోవాలి. కాని దాని అభిప్రాయం భిన్నంగా ఉన్నట్లే కనిపిస్తున్నది" అన్నది నళిని.

"అంత త్వరగా రాజేశ్వరి వప్పుకోకపోవచ్చు, వేటగాని చేతిలో మొదటిసారిగా దెబ్బతినబోయి తప్పించుకున్నది అదే అభిప్రాయం రాజే శ్వరి మనస్సులో నాటుకుపోయింది. కాని వేటగాడు మామూలు మనిషి అయ్యాడమ్మా. మంచిమనిషి అయ్యాడు. కాని మీరు నమ్మరు. ఎట్లా నమ్మించాలో నాకూ తెలీటంలేదమ్మా నళినీ".

ఈసారి కళ్ళల్లో నీరేకాదు. మనస్సులోని ఆవేదన, హృదయంలోని ఆప్యాయతా కూడా చూసింది నళిని. ఏం చెప్పాలో నళినికి తోచలేదు. పాత అనుమానం పోయి కొత్తసమస్య ఎదురయింది.

"బాబుగారూ రాజేశ్వరితో ఈ విషయమై సంప్రదిస్తాను" ఇంక ఏమీ అనలేకపోయింది.

"సరేనమ్మా". హరిసర్వోత్తమరావు వెళ్ళిపోయాడు.

ఆరోజే నళిని రాజేశ్వరితో సంప్రదించింది.

"ఈ చెల్లెలిపీడ వదిలించుకుందామని అనుకుంటున్నావా నళినీ"

"అంత మాటనకు రాజూ, నీ జీవిత భాగస్వామిని ఎంచుకునే స్వేచ్ఛ నీకు పూర్తిగా ఉన్నది. ఆయన అన్నమాటలు చెప్పాను" అన్నది నళిని.

"ఇంక నా పెళ్ళి ప్రస్తావన ఎప్పుడూ తేకు నళినీ, నాకు పెళ్ళిచేసుకోవాలనిలేదు. ఒకవేళ నా నిర్ణయాన్ని మార్చుకుంటే నువ్వు ఎవర్ని పెళ్ళాడమన్నా నాకు అభ్యంతరంలేదు. నేనంత స్వార్థపరురాల్ని కాదు. నీ పెద్దరికాన్ని ఎప్పుడూ గౌరవిస్తాను" అన్నది రాజేశ్వరి.

ఆరోజు హరిప్రసాద్ పుట్టినరోజు, ఎంతో బలవంతంమీద గాంధారి సుభద్రమ్మకు నచ్చచెప్పి నళినినీ, రాజేశ్వరినీ ఈ సందర్భంలో భోజనానికి పిల్చింది. ఈ ఆడపిల్లల ఉద్యోగాలూ, వీళ్ళ మనస్తత్వాలూ సుభద్రమ్మకు ఏమీ అర్థంకాలేదు. దక్షతలేని తను ఏం చెయ్యటానికీ తోచక, అంతా మీ ఇష్టమేనని ఊరుకున్న దావిడ.

అప్పచెల్లెళ్ళిద్దరూ గాంధారితో వాళ్ళింటికి వెళ్ళారు. ఎంతో మందినిపిల్చి ఘనంగా పెద్ద ఆర్భాటంతో పుట్టినరోజువేడుక జరుగుతుందనే ఉద్దేశ్యంతో వెళ్లారు. తీరా వెళితే అక్కడ ఏ ఆర్భాటమూ లేదు. ఏ బంధువులూ స్నేహితులూ లేరు, ఇంట్లో ఈ ముగ్గురే ఉన్నారు.

"నమస్కారమండీ" ముకుళితహస్తాలతో నమస్కరించాడు హరిప్రసాద్. ఇద్దరూ ప్రతినమస్కారంచేశారు. హరిప్రసాద్‌ని విశితంగా చూసింది నళిని.

"నా కోరిక మన్నించి వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది. కూర్చోండి" ముగ్గురూ కూర్చున్నారు.

"గొప్పవారి పుట్టినరోజు వేడుక ఇంత క్లుప్తంగా జరుగుతుందని అనుకోలేదు. కనీసం మీ కంపెనీ స్టాఫ్‌నయినా పిలవలేదు" అన్నది నళిని.

"కంపెనీ స్టాఫ్‌కూ నా పుట్టినరోజుకూ ఏమీ సంబంధం లేదండీ ! మనస్సు ఎవరికోసం వెతుక్కుంటుందో వాళ్ళుంటే చాలు. అంతకుమించిన వేడుక ఏదీ ఉండదేమో".

గాంధారి కాఫీ ఫలహారాలూ పళ్ళూ తెచ్చింది. హరి సర్వోత్తమ రావు కూడా వీరిలో కలిశాడు. అయిదుగురూ కబుర్లు చెప్పుకుంటూ అర గంటసేపు గడిపారు. గాంధారి విందుభోజనం ఏర్పాట్లు నిమిత్తం వెళ్ళింది. హరిసర్వోత్తమరావు డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి పేపరు చదువుకుంటు న్నాడు. పెద్దవారిద్దరి మనస్సులూ ఒక నిర్ణయానికి వచ్చాయి. చిన్నవాళ్ళ మనస్సులు తమను చిన్నపుచ్చుతయ్యేమోననే అనుమానం వారిని కలక వేస్తూనే ఉన్నది.

"నాన్నగారు అన్నివిషయాలు చెప్పాడుకదూ" అన్నాడు.

"కొడుకు మంచివాడు కాడని ఏ తండ్రీ చెప్పడుకదా, కొడుక్కి న్యాయంకలిగేటట్లే ఆయనా మాట్లాడారు" అన్నది నళిని.

"నన్ను గురించి ఆయన ఎప్పుడూ అట్లా చెప్పరు. నా ప్రవర్తన ఆయనకు జుగుప్స కలిగించే రోజుల్లో తనకు ఒక కొడుకు ఉన్నాడనే సంగతికూడా కొన్నాళ్ళు మర్చిపోయారు" అన్నాడు

"రాజేశ్వరిని మీరు ప్రేమించారా, లేక...."

"అందుచేతనే నేను పూర్తిగా మారిపోయాను. మార్పు మానవ సహజమని మీరు అనవచ్చు. కాని ఒక వ్యభిచారి, త్రాగుబోతు ఒక సంఘ టనతో మారిపోయాడంటే ఎవరికయినా ఆశ్చర్యమే కలుగుతుంది. అంతే కాదు నమ్మరుకూడా. అతను ఆడే నాటకంలో ఇదీ ఒక భాగమేనని త్రోసి పుచ్చవచ్చు. ఏది ఏమైనా నా మనస్సు నాకు చేయవలసిన ద్రోహమేదో ఇదివరకే చేసింది. అంతేకాదు ఆ చదపురుగులన్నీ నశించిపోయాయి".

"తను త్రాగుబోతుననీ వ్యభిచారిననీ బాహాటంగా చెప్పే యువకుని ఏ ఆడపిల్లమాత్రం పెళ్ళిచేసుకుంటుందనే ఆలోచన మీకు కలుగలేదు కదూ" అన్నది నళిని.

రాజేశ్వరి భావాలు మనస్సులో రొద చెయ్యసాగాయి. కాని తను మాట్లాటానికి తరుణంకాదు. వాళ్ళిద్దరూ మాట్లాడుతుంటే తను శ్రోతగానే కూర్చున్నది.

"నిజమే. కాని చెడ్డగుణాల్ని మభ్యపెట్టి సద్భావాల్ని పంచదార గుళికల్లా మింగింప చేస్తూఉంటే నోరు తియ్యగానే ఉంటుంది. కాని ఆ తియ్యదనం పోయి చేదు బయటపడితే ఆ మాత్రలన్నీ కక్కటం అసాధ్యం కదా".

"కాని పతనమనేది జీవితంలో ఏ ఒక్కసారి జరిగినా ఆ మచ్చ జీవితంలో పోదు. ఇప్పుడు మీరు మారిపోయారనీ, రాజేశ్వరిని ప్రేమిస్తున్నానని అంటున్నారు. ఇవ్వాళ రాజేశ్వరిని ప్రేమిస్తున్నారు. రెండేళ్ళుపోయాక ఇంకొక అందమైన అమ్మాయి కనిపిస్తే అప్పుడూ ఈ మాటనే చెప్తారేమో ?" అన్నది నళిని.

హరిప్రసాద్ తల దించుకున్నాడు. అతనిలో సంచలనం అభిమానంతో కృంగదీసింది. ఒక్కసారి తలెత్తి రాజేశ్వరివైపు చూశాడు. అతనివైపు చూడనేలేదు రాజేశ్వరి.

"కాదు నళినీ, నా మనస్తత్వం మీకు పూర్తిగా అర్థంకాలేదు. కాదేమోకూడా, నా గత జీవితంలో నేను డబ్బుతో ఆనందాన్ని, అనుభవాల్ని కొనుక్కున్నాను. కాని ప్రేమించాననే మాటలు చెప్పి ఎవ్వరినీ మోసం చెయ్యలేదు. ఆ స్త్రీలుకూడా నా డబ్బును ప్రేమించారు. కాని నన్నుకాదు ఆ రోజుల్లో నాకు ప్రేమంటే ఏమిటో తెలియదు. అలాంటి భావమే నాలో కలుగలేదు. నాలో మానవత్వంకాని, ప్రేమతత్వంకాని, కలిగాయంటే దానికి కారణం రాజేశ్వరి. ఇంతకన్నా చెప్పలేను నళినీ" జేబురుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు. అతనిలో సంచలనం, అలజడీ బయల్దేరాయి. మనిషిలో వ్యక్తిత్వం, సత్ప్రవర్తన లేకపోతే ఎంతగొప్పవాడైనా నీచంగానే చూడబడతాడని పూర్తిగా గ్రహించాడు హరిప్రసాద్.

"నాకుడబ్బుంది, వ్యాపారముంది. కాని మా వంశ గౌరవమే ఇంతకాలం నాకు శ్రీరామరక్షగా నిల్చింది. కాని నా ప్రవర్తనవల్ల డబ్బూ,

వ్యాపారం, గౌరవ ప్రతిష్టలూ అన్నీ పోతయ్యనే నిర్ధారణ చేసుకున్నాను. మావాళ్ళు ఎంతో నచ్చచెప్పారు. కాని నేను వినలేదు. వారి హితోక్తులు చెవికెక్కలేదు. చుక్కానిలేని పడవలా ఉన్న నా జీవితానికి రాజేశ్వరి ఆ కొరత తీర్చింది. ఇప్పుడు నేను ఏ ప్రమాదమూ లేకుండా మంచిరేవుకే చేరుకున్నాను" అన్నాడు మళ్ళీ.

"కానీ రాజేశ్వరి మిమ్మల్ని ప్రేమించలేదు, నేను మిమ్మల్ని ప్రేమించాననుకోండి. నన్ను పెళ్ళాడుతారా" ఆఖరి అస్త్రం ప్రయోగించింది నళిని అప్రతిభురాలై చూసింది రాజేశ్వరి. కళ్ళార్పకుండా నళిని వైపు చూశాడు అతను.

అయిదు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడలేదు.

"నన్ను పెళ్ళి చేసుకోటానికి అభ్యంతరం ఏమిటి?" మళ్ళీ ఎదురు ప్రశ్న వేసింది నళిని.

"రాజేశ్వరి కన్నా మీరు కొంచెం అందంగానే వున్నారు. చదువు ఎక్కువేనేమో, కాని నేను మిమ్మల్ని ప్రేమించను. ప్రేమించలేను. మీ మీద నాకు ఏ కోరికాలేదు ఇప్పుడేకాదు ఎప్పుడూకలగదు. రాజేశ్వరిఅక్కయ్యగా మీకు గౌరవం ఇస్తున్నాను. మీ వ్యక్తిత్వానికి ఆధిక్యత యిచ్చి వ్యక్తిత్వ మంటే ఏమిటోకూడా తెల్సుకున్నాను. రాజేశ్వరి నన్ను ప్రేమించలేదంటున్నారు, కావచ్చు నేను తనకు తగిన వాడిని కానని రాజేశ్వరి అభిప్రాయపట్టంలో తప్పేమీ లేదు. అదే నిజమైతే...." అర్ధోక్తిలో ఆగిపోయాడు.

"మళ్ళీ తాగుడూ, వ్యభిచారమూ ప్రారంభిస్తారా" అన్నది రాజేశ్వరి. ఇట్లా అన్నానేమిటా అని మనస్సులో నొచ్చుకుంది.

"కాదు" అన్నాడు రాజేశ్వరి వైపునుండి చూపు మరల్చుకుని.

"మరి" అన్నది నళిని.

"ఏం చేస్తానో నాకే తెలియదు. పిచ్చివాని చేతిలో రాయిలానే ఉంటానేమో!"

"అప్పుడు ఆ రాళ్ళు కూడా మీకే తగలవచ్చునేమో!" నవ్వుతూ అన్నది నళిని. హరిప్రసాద్ మాట్లాడలేదు.

"రాజేశ్వరి ఎవరినైనా ప్రేమించిందేమోననే అనుమానం మీకెందుకు కలగలేదు" అన్నది నళిని.

"అక్కయ్యా! ఏమిటా మాటలు" అన్నది రాజేశ్వరి.

"చిందర వందరగా పడిన బంగారపు ముక్కలన్నీ మూసలోపోసి కరిగించి, ఆ కరిగిన ముద్దను గీటు రాయిమీద చూస్తున్నదినళిని."ఇందులో తప్పేమీలేదు రాజేశ్వరీ" అన్నాడు హరిప్రసాద్.

"సరైన సమాధానం చెప్పలేదు" అన్నది నళిని.

"ఈ అక్కయ్య అలాంటి సావకాశాన్ని కలిగించదని నా మనస్సుకు తెల్సు" అన్నాడు.

రాజేశ్వరి సోఫాలోనుండి లేచి గాంధారి దగ్గరకు వెళ్ళింది.

"వదినెగారి పరీక్ష పూర్తయినట్లేనా"

"వదినె" కోపంతో అని తను గాంధారి దగ్గరకు వెళ్ళింది నళిని.

* * *

రెండురోజులు గడిచాయి. రాఘవరావు, ముకుందమాధవరావు గోగులేశ్వరం నుంచి వచ్చారు. వచ్చేటప్పుడు యథాప్రకారం బియ్యం, నెయ్యి, పప్పులూ తీసుకు వచ్చారు కాని ఈసారి తండ్రిలో ఏదో వైవిధ్యం ఉన్నట్లుగా గ్రహించింది సురేఖ. ఆ రోజు కుశలప్రశ్నలతో మామూలు కబుర్లతో గడిచిపోయింది మర్నాడు రాఘవరావు సురేఖను పిల్చి ఒక ఉత్తరం ఇచ్చాడు. ఆ ఉత్తరం చదువుకుంది సురేఖ. నళిని, రాజేశ్వరి కూడా చూశారు. మరొకసారి ఉత్తరాన్ని చదివింది సురేఖ.

హైద్రాబాద్.

సురేఖా!

నీ ఉత్తరం చేరింది. మనం ఒకరి నొకరం తెలుసు కోకుండానే వదినా, మరదళ్ళమయ్యాము. కొన్ని పరిస్థితుల్లో మా వివాహం జరిగింది. హృదయపూర్వకంగా మరదలిని చూడాలనే కోరిక నీ ఉత్తరం చదివాకనే నాకు కలిగింది. కాని ఆ వాతావరణం కూడా ఇప్పుడు తారుమారైంది.

ఇందుకు ఎవరు బాధ్యులన్నదే నేను చెప్పలేను. నన్ను చూడక పోయినా, నా మనస్తత్వం నీకు తెలియకపోయినా ఒక రకంగా నన్ను నేను పరిచయం చేసుకుంటున్నాను. నేనొక కథకురాలను, కథలు వ్రాయటం నా హాబీ. నా కలం పేరు 'కోమలి' కథలు చదివే వారికీ తద్వారా నేను సుపరిచితురాల్ని. అదొక ప్రపంచం కాని నా జీవితంలో నేనొక పెద్ద తప్పు చేశానని ఇప్పుడు తెల్సుకున్నాను. కాని ఏమయినా జరిగిన పొరపాటు సరిదిద్దుకోటానికి వీల్లేదు. అనుభవాలు వస్తున్నయ్యి. కాని నన్ను నేను సమర్థించుకుని జీవితంతో రాజీపడలేక పోతున్నాను. జీవితంతో రాజీ పడట మంటే మన అసమర్థతను మనం బయట పెట్టుకుని సరిదిద్దు కోవటమే అవుతుంది. వ్యక్తిత్వం అనేది స్త్రీ పురుషులకు సమానంగానే ఉండాలి. ఇది నా అభిమతం. కాని మీ అన్నయ్యలో ఆధిక్యత ఉన్నది. మేడమెట్లు భార్యాభర్తలిద్దరూ సమంగా ఎక్కుతేనే ఒక్కసారిగా గమ్యం చేరుకుంటారు. నేను మేడఎక్కి, మెట్లక్రిందనే ఉండవలసిన నిన్ను పైకి రానివ్వనని అంటున్నారు మీ అన్నయ్య. ఇందుకు నేను ప్రతిఘటించాను. ఫలితం: వారు విడిగా ఉంటున్నారు. ఇప్పటికి రెండు మాసాలు కావస్తున్నది, ఇద్దరిలో ఏ ఒక్కరమూ దగ్గరగా రాలేకపోతున్నాము. వైవాహిక జీవితంలో ఇదొక సంఘటన. అంతేకాదు లోగడ నేను వ్రాసిన కథల్లోని కొన్ని పాత్రలు నాలోనే ఉన్నట్లుగా నా మనస్సులో తిరుగాడుతున్నయ్యి. నా ఆలోచనలకు కథా గమనానికి అనుకూలంగా, ఆ పాత్రల జీవితాలు తీర్చి దిద్దానే కాని, వాస్తవ జీవితంలో ఆ ఆదర్శాలకూ, స్వేచ్ఛకూ, అభిప్రాయాలకూ కట్టుబడి ఉండలేక పోతున్నాను. ఆచరణయోగ్యం చేసుకోవాలనే బలీయమైన అభిప్రాయం ఉంటంచేతనే మీ అన్నయ్య నాకు దూరంగా వెళ్ళిపోవటం తటస్థించింది.

కథల్లో అయితే "కాల ప్రవాహానికి ఎదురీది ఆ భార్యాభర్తలు గమ్యం చేరుకుని ఒకరి కౌగిట్లో మరొకరు కరిగి పోయారని" కథను ముగించేదాన్ని. కాని నా జీవితకథను ఆలోచనల్లో, మేధస్సా ముగింపలకు

తేలేకపోతున్నాయి. ఇందుకు బాధ పడ్డా ప్రయోజనం శూన్యం. కారణం ఏమైనా కావచ్చు. అంటే జీవితంతో రాజీకి రాలేక పోతున్నానన్నది తేలి నట్లేకదా!

నీ ఉత్తరంలోని అన్ని విషయాలూ చదివి ఆకళింపు చేసుకున్నాను. కాని మనస్సు విప్పి మాట్లాడుకోటానికి, వ్యక్తిగతంగా మాట్లాడుకుంటే ఎంతో బావుంటుంది. ఆ సమయం, సందర్భం రాకపోదేమో?

పెద్దవారికి నమస్కారములు. పిన్నలను ఆశీర్వదించే సామర్థ్యం నాలో లేదు. నళిని, రాజేశ్వరి అంటే-ఎందుకో మీ ముగ్గుర్నీ చూడాలని అనిపిస్తోంది.

ఆ అవకాశం కోసం ఎదురు చూస్తున్నాను.

మీ వదిన,
లీలావతి.

"ఏమిటీ కథకురాలు కోమలి మీ వదినె లీలావతా!" ఆశ్చర్య పోయి అన్నారు నళిని, రాజేశ్వరి, జయలక్ష్మి. సురేఖకూడా ఆశ్చర్య పోయింది.

"మీకు తెలుసా" అన్నాడు రాఘవరావు.

"వ్యక్తిగతంగా తెలీదు. కాని కథకురాలుగా మూడేళ్ళనుంచి పత్రి కల ద్వారా తెలుసు" అన్నారు ముగ్గురూ.

"వాళ్ళకు తెల్సినంత మాత్రమైనా మనకు తెలీదు. ఈ రోజుల్లో ఆడపిల్లలు మొగుళ్ళతో కన్నా పత్రికలు, నవలలతోనే కాపురాలు చేస్తు న్నారు" అన్నది సుభద్రమ్మ.

"ఆ రచయిత్రి మనస్తత్వం తెల్సిన మీరు, ఈ విషయంలో ఏమం టారు నళినీ" అన్నాడు రాఘవరావు.

"ఏమనేదేముంది. ఇద్దరూ ఒకర్ని మరొకరు వదిలేశారు. పెళ్ళి జరిగిందీ మనం చూశ్ళేదు-వాళ్ళ కాపురాలు చూశ్ళేదు-విడాకులు పుచ్చు కున్నామన్నా విని ఊరుకోవడం తప్ప మీరు చెయ్యగలిగింది మాత్రం ఏమిటి ?" అన్నది సుభద్రమ్మ.

"నువ్వూరుకోవే అమ్మా. అందులో విడాకుల ప్రసక్తి ఏమీలేదు. నీదంతా ఎందుకూ పనికిరాని ముందాలోచన" అన్నది రాజేశ్వరి.

"ఎవరి కర్మకు ఎవరు కర్తలు సుభద్రా! జాతకచక్రాలూ, సాంప్రదాయాలూ, వంశ గౌరవ ప్రతిష్ఠలూ చూసే సురేఖ పెళ్ళిచేశాను. దాని మాంగల్యం సంవత్సరం కాపురంతోనే మాయమైంది. అదే కావాలని గంపెడు చీకటి నెత్తిన వేసుకొని పుట్టింటికి చేరిందా? మన ప్రతాపం ఏమీలేదు. మాటలు చెప్పటంవరకే, సర్లే మీ అమ్మాయిలు ఏమంటున్నారు" అన్నాడు.

"మొగుళ్ళు కావాలని ఎవరూ అనటంలేదు మావయ్యా. ఇంకా కొన్నాళ్ళపాటు అమ్మవళ్ళో బజ్జుందామనే అనుకుంటున్నాం" అన్నది నళిని నవ్వుతూ.

"నా గుండెలమీదినుంచి ఈ మూడు కుంపట్లూ దిగే మార్గం చూడన్నయ్యా. బాధ్యతలన్నీ నీనెత్తినే పెట్టి వెళ్ళిపోతారని కల్లోనైనా అనుకోలేదు" అని కళ్ళొత్తుకుంది సుభద్రమ్మ.

"తండ్రిలేని పిల్లలకు వాళ్ళ బాధ్యతలు వాళ్ళకే తెలుస్తాయి. పూర్వ కాలంలో ఆడపిల్లకు ఎనిమిదోఏటనే పెళ్ళి చేసేవారు. ఇప్పుడు ఎనిమిదిని నాలుగుతో హెచ్చవెయ్యాలి" అన్నాడు ఛలోక్తిగా.

"కరెక్టు మావయ్యా! ఇంకా మాకు దాదాపు పదేళ్ళు టైముంది" అన్నది నళిని

"అవునవును. అప్పటికి తలకూడా సగంపైగా నెరుస్తుంది" అన్నాడు ముకుందమాధవరావు నవ్వుతూ.

"హారిపిడుగా, నీకూ మాటలొచ్చాయే, మావయ్యా పెద్దకొడుకు పెళ్ళి ఆ తీరుగా అయిందా. ఇంక వీడిపెళ్ళి వెంటనే చేసెయ్యి. ఏడెనిమిదేళ్ళ పిల్లనిచ్చి చేశామంటే అన్ని అచ్చట్లూ ముచ్చట్లూ తీర్తయ్యి" అన్నది రాజేశ్వరి.

"సరేగాని, ఆ ఉత్తరానికి సమాధానం ఏం రాస్తావు సురేఖా" అన్నాడు రాఘవరావు.

"ఏమీ అక్కర్లేదు. ఒక్కసారి గుంటూరురమ్మని రాస్తాను. ఒక వేళ వస్తే అప్పటి పరిస్థితి ఆలోచించవచ్చు" అన్నది సురేఖ.

"అంతే మామయ్యా. అదేబావుంది" అన్నది నళిని.

ఆరోజే రాఘవరావు, ముకుంద మాధవరావు గోగులేశ్వరం వెళ్ళారు.

# 21

శ్రీనివాసరావు మామగారి ఇంటివద్దనుంచి వచ్చేసి విడిగాఉంటం ప్రారంభించే రెండు మాసాలు దాటింది. అల్లుడు విడిగాఉన్నా, అమ్మాయి కోసమైనా వస్తాడని అత్తమామలు ఆశించారు. లీలావతికూడా మొదట్లో అట్లాగే అనుకుంది. కాని అతను రానేలేదు. పెద్దవాళ్ళు నొచ్చుకున్నారు. ఒక్కగానొక్క కూతురు, ప్రేమించి పెళ్ళిచేసుకున్నా దీని గీత ఇట్లా మారిందేమా అని విచారపడ్డారు. వెళ్ళి బ్రతిమాలితే వస్తాడేమోనని ఆ రోజున అల్లుడి గదికి మావగారు వెళ్ళాడు. ఆనాటి సంభాషణ అట్లా అంతమైంది. తరువాత అత్తగారూ, మావగారూ ఇద్దరూ వెళ్ళారు. అప్పటికే శ్రీనివాసరావు దారికి వస్తాడనే నమ్మకం సన్నగిల్లింది.

"కూతురూ-అల్లుడూ కలకాలం సుఖంగా ఉండాలని మీరు ఆశించటంలో ప్రత్యేకత ఏమీలేదు. ఉన్న ప్రత్యేకత ఏమిటంటే, లీలావతి మనస్సును మీరు మార్చలేకపోవటమే" అన్నాడు శ్రీనివాసరావు.

"జరిగింది మర్చిపోయి స్పర్థలు పెంచుకోక పెద్దవాళ్ళమాట మన్నించు బాబు" అన్నది అత్తగారు.

"నా మాట మీ అమ్మాయి వినటంలేదనీ, ఇందుకు తల్లిదండ్రులై మీరుకూడా ఏమీ చెయ్యలేకపోయారనీ మరొకసారి ఋజువైంది. విరిగిన మనసులు అతకవు. ఇంక ఎవరి దారి వారిదే, శలవు" అన్నాడు శ్రీనివాసరావు.

హతాశులై వెళ్ళిపోయారు వారిద్దరూ. లీలావతితో తల్లి విచార పడుతూ చెప్పింది "నీ కాపురాన్ని సరిదిద్దటం మావల్లకాదు. నీకాపురంలో నువ్వే నిప్పుపోసుకున్నావు. ఫలితం అనుభవించు".

"అసలు నావల్ల తప్పేమిటమ్మా" ఎదురుప్రశ్న వేసింది లీలావతి.

"భర్తకివ్వవలసిన గౌరవంమాత్రం యివ్వలేదు. అతని అభిప్రాయాన్ని నువ్వు మన్నించలేదు. పైగా శ్రీనీ అని పేరుపెట్టి పిలుస్తున్నావు. అతను తాళికట్టిన భర్త. స్నేహితుడుకాదు" మనస్సులో గుబులు పొంగి పొర్లుకువస్తుంటే ఈ మాటలు అన్నదావిడ.

"ఈ ప్రశ్ననే తిప్పి చదువుకోమంటున్నావమ్మా ! నా మెళ్ళో తాళికట్టినంత మాత్రాన నాలో మానవత్వం నశించి బానిసత్వం ప్రవేశించలేదు. అతని అభిప్రాయాలే సాగాలనే కోరికా, పట్టుదలా అతనికి ఎంత ఉందో, నేనూ అంతే " నిష్కర్షగా చెప్పింది లీలావతి.

"అయితే అఘోరించు" అన్నదావిడ వళ్ళుమండి.

"అంత అవసరం నాకు లేదమ్మా, పెళ్ళికాని ఆడపిల్లలు బ్రతకలేకపోతున్నారా ?"

ఇంక మాట్లాడ్డం తనదే తప్పనుకుందావిడ.

శ్రీనివాసరావు బ్యాంకునుంచీ వస్తున్నాడు, వచ్చేటప్పుడు అతను అనుకోకుండానే చార్మినార్‌వైపు వెళ్ళే బస్సు ఎక్కేశాడు. అతని ఆలోచనలు గుర్రాల్లా పరుగెత్తుతూంటే మనస్సుతో కళ్ళెంవేసి ఆపలేకపోతున్నాడు. ఇటీవల అతను సిగరెట్లు కాల్చడంకూడా ఎక్కువే అయింది. అప్పుడప్పుడూ స్నేహితులతో గ్లాసులుకూడా ఖాళీ చేస్తున్నాడు !

చార్మినార్‌వద్ద బస్సుదిగి టికెట్టు తీసుకొని పైకి ఎక్కాడు. అంత మందిలోనూ తనొకడు. అందరి ఆలోచనలూ వేరు, పైకి అందరూ మనుష్యులే. పసి భావాలు కొందరివైతే పశుత్వపుకోరికలు కొంతమందివి. చారిత్రాత్మక దృష్టితో కళానైపుణ్యం తీరును కొందరు ప్రశంసిస్తూంటే,

కనుచూపు మేరవరకూ పట్టణ సౌభాగ్యాన్ని కొంతమంది తిలకిస్తున్నారు. ఈ చూసేవారందరినీ చూస్తున్నాడు శ్రీనివాసరావు. ఇక్కడనుంచీ కిందకి దూకితే ? ఆత్మహత్య అంటారా ? ప్రమాదం అంటారా ? ఏదయినా ప్రాణంపోతుంది. ప్రాణంతోపాటు అన్ని అనుభూతులూ, ఆలోచనలూ, కోరికలూ, పోతయ్యి. అసలు నే నెందుకు దూకాలి ? నాకీ ఆలోచన ఎందుకు కలగాలి ? అసలు ఆత్మహత్య ఎందుకు చేసుకుంటారు ? భగ్న ప్రేమికులు ఆత్మహత్య చేసుకుంటారు ఎక్కడికయినా వెళ్ళిపోయి జీవించ లేని అప్రయోజకులైన ప్రేమికులు ఆత్మహత్య చేసుకుంటారు. ఆత్మను హత్యచేసుకోవటమే ఆత్మహత్య దీనికోసం ప్రాణంతీసుకోటం ఎందుకు ? నా ఆత్మను నేను రెండునెలల క్రితమే హత్యచేసుకున్నాను. ప్రాణం తీసు కోవడం అనవసరం. చచ్చి ఎవర్ని సాధించాలి ? ఆత్మను చంపుకోలేక అమ్మ నాన్నతో చెప్పకుండా హైదరాబాద్ వచ్చేశాను ప్రేమను నమ్మి గౌరవంఇచ్చి. ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. పెళ్ళితో ఆత్మవంచన చేసు కున్నాను. ఇప్పుడు ఆత్మను హత్యచేసుకున్నాను. నేను బ్రతికే ఉన్నాను. నన్ను నేను చావనివ్వను.

"అమ్మయ్యో. ఇక్కడినుండి దూకేశాడు. అబ్బా తల పగిలి పోయింది. చచ్చిపోయాడు". అంతా ఒక్కసారిగా గావుకేకలు పెట్టారు. గట్టిగా అరిచారు. ఖంగారుపడ్డారు. ఆ దృశ్యం చూసేసరికి కళ్ళు తిరిగి పోయాయి కొందరికి. కళ్ళుమూసుకొని కూలబడ్డారు కొందరు. గబగబా కిందికిదిగి రక్తపుమడుగులో ప్రాణాలుపోయిన ఆ యువకుని శవాన్ని చూస్తున్నారు.

అందరితోపాటు శ్రీనివాసరావుకూడా క్రిందికిదిగి ఆ యువకుని శవాన్ని చూశాడు. తల పగిలి మాంసపుముద్ద బయటికి వచ్చింది. ఎవరో ఏమిటో పోలీసులు వచ్చారు. ఎవరో ? అడ్రసు దొరుకుతుందేమోనని జేబులు వెతికారు. ఒక ఉత్తరం సారాంశం ? ఆర్నెల్లక్రితం తను పెళ్ళి చేసుకున్న భార్య ఎవరితోనో వెళ్ళిపోయింది. అవమానం భరించలేక తాను ఈ ఆత్మహత్యకు తలపెట్టాడు.

నిరాశ, నిస్పృహతో నవ్వుకున్నాడు శ్రీనివాసరావు. ఆ యువకుని శవాన్ని కొన్ని వందలమంది చూస్తున్నారు. బహుశా అతని భార్యా, ఆ కొత్త ప్రియుడు కూడా ఆ జనంలోనే ఉన్నారేమో? ఎందుకు ఉండకూడదూ. పరిస్థితి చూసి కిక్కురుమనకుండా వాళ్ళు వెళ్ళిపోయి ఉండవచ్చు.

మళ్ళీ సిటీబస్సు ఎక్కి కూర్చున్నాడు. మరో పది నిమిషాలలో బస్సు బయలుదేరింది. నయాపూల్ బస్‌స్టాప్‌లో చాలామంది ఎక్కారు. నిల్చునే వాళ్ళుకూడా ఎక్కువే ఉన్నారు. వెనక్కి తిరిగి చూశాడు. లీలావతి నిల్చున్నవాళ్ళలో ఉన్నది. మనిషిలో మార్పేమీ కనబడలేదు. తనను చూడలేదు. ఆమె నిల్చునేవున్నది. తనుతలవంచుకుని కూర్చున్నాడు. లీలావతిని చూస్తే పలకరించవలసి వస్తుందేమో ? ఏం పలకరిస్తే ? ఎందుకు పలకరించాలి?

పబ్లిక్ గార్డెన్ వద్ద చాలామంది దిగారు. తనూ దిగాడు. అప్పటికి రాత్రి పదిన్నరయింది. ఒకరి నొకరు చూశారు.

"కులాసాగా ఉన్నావా శ్రీనీ" ముందుగా లీలావతి పలకరించింది.

"ఆ"

"చాలా రోజులకు కనబడ్డావు. తొందరపని ఉందా ? అట్లా గార్డెన్‌లో కూర్చుందామా?" ఏ భావము లేని ముఖావకంగానే అన్నది లీలావతి.

"సరే" ఇద్దరూ పబ్లిక్ గార్డెన్స్‌లోకి వెళ్ళి ఒక చోట కూర్చున్నారు.

"నీకు ఈ వంటరి జీవితమే బాగుందా శ్రీని?" అన్నది లీలావతి.

"ఏ జీవితమైనా మనిషి మనస్సును బట్టి ఉంటుంది"

"నా మీద కోపం కూడా అలవాటైంది కదూ".

"ఎవరి అలవాట్లను వారు గౌరవించు కుంటున్నప్పుడు ఒకరి అలవాట్లను గురించి మరొకరు ఆక్షేపించ నవసరము లేదు"

సిగరెట్ వెలిగించి గట్టిగా పీల్చి పొగవదిలాడు. "నా అభిప్రాయాల్ని నువ్వెప్పుడూ మన్నించవు. నేనంటే కూడా అదేఅభిప్రాయంతో ఉన్నావా"

"నువ్వూ అభిప్రాయాలూ ఒకటే, మనిషివేరు మమతవేరు కాదు"

"నేనంటే ఇష్టంలేదా, అంత కష్టంగా మాట్లాడుతున్నావేం?"

"నా ఇష్టా ఇష్టాలతో ప్రమేయం ఏముంది. నీకు కావలసింది స్వేచ్ఛ, పట్టుదల, నీ మాటలయందు ఇతరులు గౌరవం చూపాలనేకోరిక. ఇన్నింటితో నిండిన మనస్సులో నా యిష్టాయిష్టాలతో ప్రమేయం ఏముంది?"

"ఒకరి అభిప్రాయాలు మరొకరు మన్నించక పోయినా, కించపర్చ కూడదు. ఆ రోజున నువ్వు చెయ్యెత్తికొట్టబోయావు. అందుకు ఆమోదించి ఉంటేఈ పరిస్థితులు ఏర్పడేవి కావు. ఇదేనా నువ్వనేది?"

కోపాన్ని అదిమిపట్టి పట్టుదలను సడలనివ్వక పశ్చాత్తాపమనే ఆలోచనే రానీయక అన్నది లీలావతి.

"లీలా! నేలవిడిచి సాము చేసినందువల్ల ప్రయోజనం లేదు నేను నీకు కావాలా? అక్కర్లేదా? భర్తగా నా అభిప్రాయాలకు విలువ నివ్వదల్చు కున్నావా? నేను కాదన్న విషయాన్ని నువ్వు అవుననకుండా సంసారం చెయ్యదల్చుకున్నావా? నన్ను బళ్ళో పిల్లాడిలా 'శ్రీని' అని పిలవటం మానేసి 'మీరు' అనటం నేర్చుకుంటావా? ముందు ఈ విషయాలమీద నీ అభిప్రాయం ఏమిటి?"

అతని ముఖంలోకి రెండు నిమిషాలు చూసింది లీలావతి.

"ఇవన్నీ పార్కులో కూర్చుని, పార్కు కట్టేసే లోపల తేల్చుకునే విషయాలు కావు. ఇంటివద్ద సావకాశంగా మాట్లాడుకోవచ్చు" అన్నది

"ఎవరిల్లు" ప్రశ్నార్థకంగానే చూశాడు.

"మీ ఇల్లు-కాదు కాదు మనఇల్లు"

"మన ఇల్లు. హుం. మనకు ఇల్లులేదు, నా గదికి వస్తే అక్కడ మాట్లాడుకుందాం".

"నీ గదికా, రాను. ఎవరైనా ఏమైనా అనుకోరూ".

"అవును అనుకుంటారు, నీలో ఇంకా అభిజాత్యం చావలేదు లీలా. భర్త వుండే చోటుకు భార్య వస్తే ఎవరైనా ఏమైనా అనుకుంటార్వా? ఈ

ఆలోచన నీకు ఎట్లా కలిగిందో నాకు అర్థం కావటం లేదు లీలా. నీకు ఇష్టం లేని పని ఏదీ చెయ్యవద్దు. నిన్ను శాసించే అధికారం నాకు లేక పోవచ్చు. భర్తగా అడుగుతున్నాను. నేను నీకు కావాలనుకుంటే మన సంసార జీవితం సవ్యంగా సాగిపోవాలంటే మనం విడిగా కాపురం ఉందాం, ఆలోచించు" అన్నాడు.

రెండు నిముషాలు ఎవరూ మాట్లాడలేదు. తలొంచుకుని పచ్చని గడ్డి మొక్కలను పీకి పారేస్తున్నది లీలావతి.

"ఒక్కసారిగా ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నాను శ్రీని. నువ్వునా భర్తకాదని నేనెన్నడూ అనలేను. అనుకోను. నాలోనూ కోరికలూ, స్త్రీత్వం లోని వాంఛ ఉన్నయ్యి నాకు పెళ్ళయినా పెళ్ళికాని యువతి మనసులో ఉండే స్వేచ్ఛాయుతమైన మనస్తత్వం నుంచీ నేనింకా తేరుకోలేక పోతున్నాను" అన్నది.

"అయితే నేను బోయ్ ఫ్రెండ్‌గానే ఉంటాను. శారీరకంగా నువ్వు వివాహిత యువతివే కాని, మనసికంగా కాదు. నీ ఉద్దేశ్యం అదే కదూ".

"అవునూ, కాదు అని నేనే నిర్ణయించుకోలేక పోతున్నాను శ్రీనీ"

"పోనీ ఎవర్నయినా ప్రేమించావా" సూటిగా ప్రశ్నించాననుకున్నాడు.

"అంత సైర్యానికి దిగలేదు. నన్ను నేను ప్రేమించుకోడానికే అప్పుడు గర్భవిచ్ఛిత్తికూడా చేసుకున్నాను. ఇంతతొందర్లో ప్రకృతిసహజమైనా నేను తల్లిని కావటానికి ఇష్టపడను. క్షమించు శ్రీనీ, నేను వెళతాను. నీ గదికిరాలేను. నీ కోరికను మన్నించే స్థితిలో నేను శారీరకంగా ఆరోగ్యంగా ఉన్నా, మానసికంగా నేను రోగిని" వెళ్ళటానికి సంసిద్ధురాలైంది. అతనూ లేచాడు.

ఇద్దరూ బస్‌స్టాప్‌కి వచ్చారు. ఎవరిబస్సు వారెక్కి వెళ్ళిపోయారు.

శ్రీనివాసరావు మనస్సులోని ఆలోచనలు కందిరీగల్లా కుట్ట సాగాయి, 'ఇది భార్యకాదు, స్త్రీత్వాన్ని చంపుకున్న దెయ్యం' అనుకున్నాడు.

ఆ మర్నాడు సాయంత్రం లీలావతి ఆఫీసునుంచి ఇంటికిరాగానే ఒక వుత్తరం యిచ్చింది తల్లి.

ఆ ఉత్తరం గుంటూరునుంచే వచ్చింది.

గుంటూరు

అక్కయ్యా, వదినా, అక్కా,

నీ ఉత్తరం చదివాము. కోమలి పేరుతో చాలా కథలు చదివాం గాని, బంధుత్వం సంగతి తెలీదు. కోమలి, లీలావతి అనీ, శ్రీనివాసరావు భార్య అనీ తెలియదు. తెల్సింతరువాత నిన్ను చూడాలనే కోరిక త్రిగుణీకృతమైంది, కోరికలు గుఱ్ఱాలైతే మాటలు డెక్కలచప్పుడులా ఉంటాయట. ఏ కథలోనో నువ్వు వ్రాసినట్లు గుర్తు. నీ ఉత్తరం చదువుతుంటే కథ చదివినట్లేవుంది. కథలు కలలు కావుకదా. ఏమైనా మీ దంపతులిద్దరూ వెంటనే ఇక్కడికివస్తే అందరమూ మనస్సువిప్పి మాట్లాడుకుని వీలయినంతవరకూ ఒక పరిష్కారానికి రావచ్చునేమో ?

మీ సమస్యనే కాదు. మా సమస్యలూ మీరు పరిష్కరించ వచ్చునేమో ? కొంతమంది మనస్తత్వాలు వారికే అర్థంకావు. ఇతరుల జీవితాల్లోకి తొంగిచూసి వారికి తగు సలహాలు ఇవ్వగలరు కాని స్వవిషయాల్లో నిస్సహాయులే !

మీ దంపతుల రాకకై వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్నాం. అంతే కాదు తిరుగుటపాలో రండి, ఉత్తరంకాదు మీ దంపతులు.

నిరీక్షించే,

నళిని.

సురేఖ.

రాజేశ్వరి.

ఉత్తరం చదివిన లీలావతికి కొత్త ఆలోచనలు కలిగాయి. ఈ ఉత్తరం తీసుకుని శ్రీనివాసరావు గదికి వెళితే, అతను గుంటూరు వస్తాడేమో ? రాత్రి భోజనమయ్యాక ఏడున్నరకు బయల్దేరింది లీలావతి. అంతకుముందు తల్లితో, తండ్రితో తర్కాతర్కాలు జరిగాయి.

"నీతో నేనుకూడా వస్తానమ్మా. ఒక్కర్తివే వెళ్ళటం మంచిది కాదేమో" అన్నాడు తండ్రి.

"నా భర్త దగ్గరకు నేను వెళ్ళటంలో ఏం తప్పులేదు నాన్నా. మీరు రానక్కర్లేదు".

లీలావతి మేడమెట్లు ఎక్కుతూంటే అలికిడివిని, "ఎవరూ" అన్నాడు శ్రీనివాసరావు

"నేను" గదిలోకి వచ్చింది లీలావతి. నేలమీద పరుపువేసుకొని కూర్చున్నాడతను. పక్కనే కూర్చుంది.

"ఎవరైనా చూస్తారేమోనని భయపడివదానివి, ఎవరూ చూడకుండా ఈరాత్రి వచ్చావా"

"లేదు, అందరూ చూస్తుండగానే వచ్చాను"

"ఎవరైనా ఏమైనా అనుకోరూ"

"ఇంటివాళ్ళు చూస్తే నిన్నే గది కాళీచెయ్యమంటారు"

"అప్పుడు మీ ఇంటికి వస్తానని అనుకుంటున్నావా"

"అనుకోవడం కాదు, రావాలని కోరుకుంటున్నాను. శ్రీనీ. తప్పు క్షమించమని, అర్థించటానికి రాలేదు. అంత తప్పు నేను చెయ్యలేదనే ఆత్మ విశ్వాసం నాకున్నది".

"స్త్రీత్వంలోని కోరికలు తీర్చుకోటానికి వచ్చావా" కటువుగా అన్నాడు.

"శ్రీనీ" పొంగి పొర్లుకువస్తున్న ఆవేదనను అదిమిపట్టింది.

"ఏం, పౌరుషం వచ్చిందా" పౌరుషంగానే అన్నాడు. కళ్ళు తుడ్చుకొంది లీలావతి.

"ఈ ఉత్తరం చూపించుదామని వచ్చాను" ఉత్తరం ఇచ్చింది. చదువుకున్నాడు.

"ఓహో, వ్యవహారం చాలాదూరం నడిచింది. నీ అంత అభిజాత్యం కలవారుకాదు. అక్కడికి వెళ్ళావా వాళ్ళు నిన్ను పూర్తిగా మారు

స్తారు. నీ స్వేచ్ఛ స్వేచ్ఛగానే ఎగిరిపోతుంది. భార్య భర్తకు విధేయురాలై ఉండాలని చెపుతారు"

గదంతా చూసింది. చాలా క్లుప్తంగా ఉన్నది. గదినిండా సిగరెట్టు పీకలు.

"అభిప్రాయాలకోసం కాదు. వాతావరణం మార్పుకోసం వెళదాం. నువ్వూ రావాలి".

"నేను రాను. నువ్వు ఎక్కడికి వెళ్ళినా నాకు అభ్యంతరంలేదు. గుంటూరుకాదు అమెరికావెళ్ళినా నాకు చెప్పనక్కర్లేదు" నిశ్చయంగానే అన్నాడు.

"అంతేనా"

"అంతే"

"భార్యగా అడుగుతున్నాను. మీ మేనత్తగారింటికి వెళదాం".

"భర్తగా చెప్తున్నాను, నేను రాను, నువ్వెళ్ళచ్చు".

రెండు నిమిషాలు కూర్చుని వెళ్ళింది లీలావతి.

"ఇది నా భార్య. ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. ప్రేమపోయింది. కాదు చచ్చిపోయింది. మేం మిగిలాం, మేం భార్యాభర్తలం కాపురం చెయ్యం. మాకూ ఎన్నో కోరికలు ఉన్నయ్, కాని కాపురం నిలబెట్టుకుందా మనే కోరిక ఎవ్వరికీ లేదు" నిరాశ నిస్పృహతో మూల్గింది అతని హృదయం.

# 22

ఉదయం ఎనిమిది గంటలైంది. గుమ్మంలో రిక్షాదిగిన లీలావతిని చూసి అనుపమ "అక్కయ్యా ఎవరో వచ్చారు" అన్నది. రాజేశ్వరి, సురేఖ, నళిని ముగ్గురూ ఒక్కసారే వీధిలోకి వచ్చారు. పోల్చుకున్నారు.

"నేను లీలావతిని"

"పోల్చుకున్నాం. రండి" అన్నది సురేఖ.

"బావ రాలేదేం" అన్నది రాజేశ్వరి.

"అవును. శ్రీని రాలేదు. రానన్నాడు" ముగ్గురూ ఒకరిముఖా లొకరు చూసుకున్నారు. సుభద్రమ్మ, పిల్లలూఅంతా చుట్టుముట్టారు.

అందర్నీ పరిచయంచేసి, తనను తాను పరిచయంచేసుకుంది నళిని. మరో అరగంటలో కాలకృత్యాలు తీర్చుకుంది లీలావతి. కాఫీ పూర్తయ్యాక నళిని అన్నది.

"రాత్రి ప్రయాణంలో బడలికగా ఉందేమో, విశ్రాంతి తీసుకోండి. నేను ఆఫీసుకు వెళతాను. పిల్లలూ సురేఖ స్కూలుకుపోతారు. రాజేశ్వరి మీతో కబుర్లు చెపుతుంది"

మధ్యాన్నం భోజనాలయాక లీలావతి కొంచంసేపు నిద్రపోయింది.. నిద్ర లేవగానే సుభద్రమ్మ కాఫీ, ఫలహారం తయారుచేసి లీలావతితో అన్నది.

"మా శ్రీనివాసరావు ఎప్పుడైనా మమ్మల్ని తల్చుకుంటాడమ్మా. వాడి జీవితం, పద్ధతీ అంతా ఆ రోజుల్లో విచిత్రంగానే ఉండేది. ఇప్పుడే మయినా మారాడేమో"

"జీవితానికి మార్పు సహజం. వయస్సు పెరిగినకొద్దీ మనస్సుకూడా మారాలికదా" అన్నది లీలావతి.

కాఫీ ఫలహారాలు పూర్తయాక రాజేశ్వరి, లీలావతి వరండాలో కూర్చున్నారు. "మీ ఇంట్లో మీరొక్కరే. పెద్దపిల్ల, ఎడపిల్ల, చంటిపిల్ల అన్నీ మీరే. మా ఇంట్లోమాదిరి ఎక్కడచూసినా పిల్లల్లేరు కదా" అన్నది రాజేశ్వరి.

"అదేనయం, పిల్లలు నలుగురైదుగురు ఉంటే ఎవరి మనస్సులు వారికే ఉంటయ్. మా ఇంట్లో నేనొక్కర్తెనే కావడంతో నాది ఏ వయస్సు మనసో నాకే తెలీటంలేదు" అన్నది లీలావతి.

శ్రీనివాసరావుతో పరిచయం, పెళ్ళి, ఉద్యోగం అన్నీ మాటలధోరణితో చెప్పింది లీలావతి. పరిస్థితులు ఆకళింపుచేసుకుంది రాజేశ్వరి.

"మా ఆడపడుచు సురేఖకు చిన్నతనంలోనే వైధవ్యం ప్రాప్తించింది".

"అవును. ఒక సంవత్సరం కాపురం చేశాక".

"ఈ చదువు ధోరణిలో ఆ విచారాన్ని పూర్తిగా మర్చిపోయింది కదూ. కాని అనుభవాలు కలకవెయ్యవూ".

ఈ మాటలకు రాజేశ్వరి కొంచం నొచ్చుకుంది. సురేఖవిషయంలో ఇట్లా ఎందుకు అన్నదో రాజేశ్వరికి అర్థంకాలేదు.

"అనుభవాల్ని అనుభవించినప్పుడే వాటి విలువ, మంచి చెడూ తెలుస్తుంది కాని అవన్నీ మర్చిపోతే ఏ కలతా ఉండదు".

"నిజమే, నా ఉద్దేశ్యమూ అంతే. అందుచేతనే నేనూ నా పద్ధతిని మార్చుకోలేకపోతున్నాను".

లీలావతిని చూస్తున్నంతసేపూ రాజేశ్వరి ఆమె మనోభావాల్ని అంచనా వేస్తున్నది కొంచం పెంకి రకమే ననుకుంది. ఏ అభిప్రాయానికీ రాలేకపోయింది. అందచందాలూ, వేషభాషల్లో ఆప్యాయత, ఆకర్షణా ఉన్నా, అభిప్రాయాలు వెల్లడించడంలో ఆమె కుందేటికి మూడే కాళ్ళను కుంది.

తమ కుటుంబగాధనంతా చెప్పింది రాజేశ్వరి.

"ఆప్తబంధువులం. ఒకరి కష్టసుఖాలు మరొకరు చెప్పుకోవటంలో తప్పులేదు కదూ. ఈ రాజేశ్వరి ఏమిటో సోదంతా చెప్పేస్తున్నదని విసుగ్గా ఉన్నదా."

"లేదు, నా కథల్లో బీదరికాన్ని చూశాను. తల్లి, తండ్రిలేని కుటుంబాలను గూర్చి ఊహించి నా ఊహలకు మెరుగులు దిద్దుకున్నాను. జీవితానికి ఆలోచనలు అధికారపార్టీ అయితే కొన్ని అనుభవాలు ప్రతిపక్షమే అవుతుంది. అయినా మీ ఇంట్లో వాతావరణం ఒక్క పూటలోనే నాకు

ఎంతో నచ్చింది. మీ ఇంటి అనుభవాలు, ఆతిధ్యమూ నన్ను నేను హెచ్చరించుకొనేటట్లుగానే చేస్తున్నయ్యి" అన్నది లీలావతి.

మరో రెండు రోజులు గడిచాయి. నలుగురూ కూర్చుని ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. కథకురాలుగా లీలావతికి నివాళులర్పించారు. బంధువుగా అతిధి సత్కారాలు చేశారు. శ్రీనివాసరావు భార్యగా గౌరవించారు. రెండు మూడు సంవత్సరాలు తేడాగా సమవయస్కులు కావడంతో సరదాగా ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. ఆత్మీయత అంటే ఏమిటో అర్థమైంది లీలావతికి. సరదాలకు పరదాలు పర్చుకున్నారు. కాని ముగ్గురిలోనూ లీలావతిని గురించి ఒకే ఒక ప్రశ్న నిల్చిపోయింది. భార్యాభర్తలు ఆత్మీయులుగా ఉన్నట్లులేదు. నవదంపతులు ఒకర్నిగురించి మరొకరు చెప్పుకునే తీయని కబుర్లు ఏవీకూడా లీలావతి చెప్పలేదు. ప్రేమించి పెళ్ళి చేసుకున్నంతవరకే విదితమైంది. "పెళ్ళయ్యాక ప్రేమపోయి పెళ్ళి మిగిలిందా?" క్వశ్చన్ మార్కు. ప్రశ్నకు ఆన్సరు దొరకలేదు.

"వదినా అన్నయ్య ఎప్పుడైనా మమ్మల్నికాని, మా అమ్మనుగాని తల్చుకుంటాడా లేక తనే తన మనస్సంతా నీలోనే నింపుకున్నాడా" నవ్వుతూ ప్రశ్నించింది సురేఖ.

లీలావతిలో గాంభీరముద్ర రంగులు మార్చుకుంది.

మనస్సులు మనుష్యులతో నింపుకోవటమనేది భ్రమ. కొంతమంది అనుభవాలకోసం, తను మనస్సుని తామే దువ్వుకుంటూ ఉంటే, కొంతమంది ఆధిక్యతతో తమ మనస్సుని ముంచి తేలుస్తారు. కొంతకాలం కాపురం చేసినదానివి కనుక అడుగుతున్నాను సురేఖా, అసలు ప్రేమంటే?"

"నాకు తెలీదు"

"భర్తతో సంవత్సరం కాపురం చేశావు కదా. నువ్వాయన్ని ప్రేమించలేదా. పోనీ ఆయన నిన్ను ప్రేమగా చూసేవారేనా"

నళిని, రాజేశ్వరి శ్రోతలే అయ్యారు.

"అత్తగారింట్లో నా జీవితం యాంత్రికంగానే జరిగిపోయింది. కాని, గుర్తుంచుకోవలసిన సంఘటన లేవీలేవు. వారు నన్ను ప్రేమించిన దాఖలా

లేదు. నిరాకరించి తృణీకరించిన సంఘటనా లేదు. అత్తింటి కోడలుగా ఉన్నాను. అరళ్ళేమీ బడలేదు. భార్యగా వారికి సహకరించాను"

ఆశ్చర్యపోయింది లీలావతి. ఈ విషయాలు తమకు ఎన్నడూ సురేఖ చెప్పకపోవడంతో వారిద్దరూ కూడా కొత్తగానే విన్నారు.

"ఆయన ఎప్పుడైనా నిన్ను కొట్టడం జరిగిందా?" అన్న లీలావతి ప్రశ్నకు ముగ్గురూ ఏదో ఆలోచించుకుని తమకు తాము సమాధానం చెప్పుకున్నారు.

"లేదు, కాకపోయినా నేను అటువంటి వాతావరణాన్ని కల్పించలేదు. అన్నయ్య నిన్ను కొట్టాడా వదినా"

"ఆ ఉద్దేశ్యం ఆయనకు ఉన్నది. కాని అసలు జరగలేదు" నిర్లిప్తతతోనే సంతోషంగా అన్నది లీలావతి.

"అయితే మేం ఊహించింది నిజమే కదూ" అన్నది నళిని.

"ఏమిటా నిజం" లీలావతి మాటల్లోని ఉద్రిక్తతను చూసి రాజేశ్వరి గతుక్కుమని నళిని వైపు చూసింది.

"ఏమీ లేదు" అన్నది నళిని.

"మీ ఊహ కొంత వరకూ నిజం. మనసులు కలిసినా మనస్తత్వం కలవలేదు. పర్యవసానం ఇద్దరం విడిగా ఉంటున్నాం" అన్నది. మనస్సులో బాధపడింది సురేఖ.

"మీ అన్నయ్య వదినెను వదిలిపెట్టలేదు. వదినకు ఆ ఉద్దేశ్యమూ లేదు" అన్నది లీలావతి.

"ఉద్దేశ్యం ఉన్నదానివైతే మా ఇంటికి వచ్చేదానివే కాదు"అన్నది నళిని.

"భార్యకూడా తనలాగే స్వాతంత్ర్యం ఉండాలని ఏ మగవాడూ అనుకోడు. అనుకుంటే భార్యకు లోకువై పోయి తన ఆధిక్యత తక్కువైపోతుందేమోనని భయం. భార్య మనస్తత్వం, భావాలూ, కాలిపోయే కొవ్వొత్తిలా ఉండాలని భర్త అనుకోవడంలో ఎంత స్వార్థం ఉందో మీకు

చెప్పినా అర్థంకాదేమో!" ఎడమ అరచేతిని చూసుకుంటూ తల ఎత్తకుండా అన్నది లీలావతి.

"భర్త మనస్సు అట్లా ఉంటుందేమోనని అసలు భార్య అనుకోవటం ఎందుకు? అలాంటి అనుమాల రంగు కళ్ళద్దాలు మనస్సుకు ఎందుకు తగిలించుకోవాలి" సురేఖ అన్నది.

"అనుమానాలు కాదు, నగ్నసత్యం. శ్రీనివాసరావులో నేనూహించినంత మంచితనం లేదు. ఏరు దాటింతరువాత తెప్ప తగలేసే రకం" అన్నది లీలావతి.

"అతనూ ఇట్లాగే అనుకున్నాడేమో" అన్నది రాజేశ్వరి.

"దానికి నేను బాధ్యురాల్ని కాదు".

"అతనూ అదే అనుకున్నాడు. మా అన్నయ్య తత్వం నాకు బాగా తెల్సు" అన్నది సురేఖ

కోపంతో చూసింది లీలావతి.

"డొంక తిరుగుడుగా చెప్పక అసలు జరిగిందేమిటో చెప్తావా వదినా" అనునయంగా అడిగింది సురేఖ.

"నా భావాల్ని చిన్నతనంగా చూసి విలువనివ్వకపోతే నేనుసహించలేను సురేఖా. నాది పెంకితనమే అనుకో. పెంకి మనస్సే అనుకో, ఎట్లా అనుకున్నా నీ యిష్టం" అన్నది లీలావతి.

"భర్తను కొంగుకు కట్టుకు తిరగాలనే స్వభావం భార్యకు ఉండకూడదు లీలావతీ. స్వాతంత్ర్యం కావాలంటావు. స్వాతంత్ర్యానికి కూడా హద్దులున్నయ్యి. భర్త మనస్సు తెలుసుకోలేని భార్య తనకు స్వాతంత్ర్యం లేదని వాపోవటంలో ఏమీ అర్థంలేదు. మనస్సులేక మమతను చంపుకోవటమే అవుతుంది" అన్నది రాజేశ్వరి.

మనస్సులోని ఆలోచనలు క్షణంసేపు వెనక్కునెట్టి రాజేశ్వరివైపు చూసింది లీలావతి.

"పెళ్ళి కాకపోయినా అర్థాంగికి ఉండవలసిన లక్షణాలన్నీ ఇట్టే అలవర్చుకున్నావు రాజేశ్వరీ. ఏం లేదు, ఎవర్నయినా ప్రేమిస్తున్నావా?" నవ్వుతూ అన్నది లీలావతి.

"ఓడిపోయావు లీలావతీ. నీలోని భావాలు నీకు తెలియకుండానే బయట పడ్తున్నయ్యి" అన్నది నళిని.

"ఓడిపోవటమేమిటి?" కొంచం ఆశ్చర్యంగా అడిగింది లీలావతి.

"అర్ధాంగికి ఉండవలసిన లక్షణా లేమిటో చెప్పావు. పురాణం శాస్త్రిగారి ఉల్లిపాయ శాస్త్రంలా ఫ్రీగా నీకు తెల్సి ఆచరణలో పెట్టవలసిన విషయాలను నువ్వు ఆచరణలో పెట్టటానికి ఇష్టపడక ఇతరులను ఆచరించ మంటున్నావా లీలావతీ" అన్నది నళిని.

మొట్టమొదటిసారిగా లీలావతి అహం దెబ్బతిన్నట్లయింది. ముఖ కవళికలు చూసి మళ్ళీ మాట్లాడ్డానికి సాహసించలేదు. ఆ రోజు గడిచింది.

మర్నాడు అనుపమ సురేఖతో అన్నది.

"శ్రీనివాసరావు బావతో లీలావతి పోట్లాడి వచ్చిందా?"

"నీ కెందుకే ముది నాపసాని మాటలూ నువ్వూనూ" అని కేక లేసింది రాజేశ్వరి.

"ఎట్లాగయినా కొంచెం పెంకిఘటం" అన్నది జయలక్ష్మి.

"ఇంటికి వచ్చిన వాళ్ళమీద ఇన్ని అభిప్రాయాలు వెలిబుచ్చ కూడదు" అన్నది సురేఖ.

"వదిన గారంటే ఎంత అపేక్ష" అన్నది జయలక్ష్మి.

నవ్వింది సురేఖ. అన్నీ విన్నది లీలావతి. ఆ రోజంతా ఎవరితోనూ. తానుగా మాట్లాడలేదు. సురేఖతో అన్నది.

"రేపు నేను హైద్రాబాద్ వెళ్ళిపోతాను. సెలవు లేదు",

"మనస్సు విప్పి మాట్లాడే మాటలకు విలువ ఇస్తావు కదూ"

అర్థించినట్లుగా అడిగింది.

"తప్పక సురేఖా"

"వయస్సుకు చిన్నదాన్నయి నా నాపసుపుకుంకుమను తుడిచివేసి అనుభవాలు నన్ను పెద్దదాన్ని చేసినయ్యి. కోరికలకు గోరీ కట్టగలిగాను. జీవితాన్ని మోడుగానే చేసుకున్నాను ఇంక ఈ జీవితానికి కావలసింది జీవి-

తాంతం వరకు తిండి, బట్టా ఈ రెండే. పుట్టింటికి చేరి కన్నవారి పంచ సున్నాను. నా జీవితం పుట్టింట్లోనే వెళ్ళిపోతుందనే నమ్మకం లేదు. కారణం పెద్దవాళ్ళు చిన్నవాళ్ళ కళ్ళముందే దాటిపోవాలని కోరుకుంటారు. కదా. ఆ పరిస్థితుల్లో నా శేష జీవితం అన్నగారింట్లో గడపవలసిందే. కాని అన్నయ్య మన స్తత్వం పూర్తిగా అర్థం చేసుకున్న నేను ఆ ఆశనూ చంపుకున్నాను. కారణం? అన్నయ్య ఆస్థి పంచలేదని నాన్నతో మాట్లాడ కుండా రెండేళ్ళు గడిపి చివరకు వెయ్యి రూపాయలు తీసుకొని ఎవరికీ చెప్పకుండా మాయమై హైద్రాబాద్‌లో మకాం పెట్టాడు. తరువాత వాడి సంగతి మాకు తెలీదు. జరిగిందేదో నీకు తెల్సు. ఈ పరిస్థితులన్నీ ఆలో చించే నేనూ చదువులో ప్రవేశించాను. కనీసం మెట్రిక్యులేషన్ ప్యాసయితే నా పొట్ట గడుస్తుందనే నమ్మకం నాకున్నది. భర్త చాటున బ్రతకవలసిన భార్య ఆ భర్త పోవటంతో ఇన్ని పరీక్షలకు గురికావలసి వస్తున్నది. నా జీవితం-ఏమీ అనుకోకుండా ఇట్లామారిపోయింది. నాకన్నఎక్కువచదువు కున్నదానివి, ఉద్యోగం చేస్తున్న దానివి. గృహిణీ జీవితమేమిటో, బాధ్యత లేమిటో నాకన్నా నీకే ఎక్కువగా తెలుసు. జీతితాన్ని నీ అంతట నువ్వే అయోమయం చేసుకోకు. తప్పంతా అన్నయ్యదే కావచ్చు. వాడు తొందర పడి నిన్ను కొట్టబోయాడే అనుకో. వాడి కోపానికి తలవంచ నక్కర్లేదు. వాడి అభిప్రాయాలు నీకు రుచించక పోవచ్చు. కాలానుగుణ్యంగా, భావాను సారంగా ఆడదాని మన స్తత్వం మారవచ్చునే గాని, సాంఘిక న్యాయ సూత్రాన్ని ఎవ్వరూ మార్చలేరు. మూడు కాలాల్లోనూ సూర్యుని ఎండ వేడిమిలో తేడా ఉంటుంది గానీ, సూర్యుడు తూర్పునే ఉదయించి పడమ రన అస్తమిస్తున్నాడు. భర్త, మంగళసూత్రం భార్యమెళ్ళో కడుతున్నాడు కాని భర్తమెళ్ళో భార్య కట్టటంలేదు దీర్ఘ సుమంగళీభవ అని పెళ్ళికూతుర్ని ఆశీర్వదిస్తున్నారు. కాని పెళ్ళి కొడుకుని కాదు. చప్పుడు రెండు చేతులు వాయి స్తేనే అవుతుంది. అట్లా అని ఆడదానికి పంతం పట్టింపూ ఉండ కూడదని కాదు. ఉండవలసిందే. కాని అది భ రతో విరోధం పెటుకునే

తీరులో ఉంటే, ఆ స్త్రీలో స్త్రీత్వంకన్నా, అహంకారమే ఎక్కువ ఉంది స్త్రీ హృదయంలోని సుకుమారత్వాన్నీ, మార్దవాన్నీ చీడపురుగులా కొట్టి వేస్తుంది. ఇంక మిగిలింది ఏమిటి? కోరికలు నసిసిపోయి, కోమలత్వం మోడుబారి, మనస్సునూ, మమతనూ, అహంకారం కోపం ఆక్రమించి ఆ స్త్రీ జీవితాన్నీ, ఆలోచనలనూ తమతోనే నింపుకుంటయ్యి. ఆ పరిస్థితికి ఆ స్త్రీ వచ్చిందంటే, ఆ భార్య భర్తను 'నువ్వూ' అని పిలవటంలో అబ్బుర పడవలసిందేమీలేదు. ప్రస్తుతంలో నువ్వు ఈ స్థితికే వచ్చావు. వదినా. ఒక్కమాట, చెడిపోయిన ఆడదానిలో ఇంత మానసిక పరిణామము రాదు. కోరికలకూ, మార్పుకూ తలవంచి, అనుభవాలకోసమే తన మన స్సుని పరిగెత్తిస్తుంది. కాని నీలో ఇలాంటి పరిణామం రాదు వదినా, ముమ్మాటికీ రాదు. నీ మనస్సులో, మమతలో కోరికల్లో కాలుష్యంలేదు. కాని అహంభావానికి, కోపానికీ, పెంకి పట్టుదలకు నీరాజనాలర్పించి నీ చుట్టూ వాటిని తిప్పుకుని బందీవైనావు. వాటినుంచీ తప్పుకుని బయటపడితే నువ్వు నిజంగా ధన్యురాలివి వదినా. అంతేకాదు ఆత్మాభిమానం కల ఆదర్శగృహిణివి" అన్నది సురేఖ.

లీలావతి మ్రాన్పడిపోయింది. ఆమె కళ్ళల్లోనీళ్ళు చిప్పిల్లాయి. ఆపాదమస్తకమూ వణికి పోయింది. మనస్సు కుమిలింపుతో మధన పడు తుంటే ఏం మాట్లాడాలో తెలీలేదు.

"సురేఖా...."

"వదినా" ఇద్దరూ మరి మాట్లాడలేదు.

ఆ మర్నాడే లీలావతి హైద్రాబాదు వెళ్ళిపోయింది.

వారంరోజులు గడిచాయి. లీలావతి ఉత్తరం వ్రాసింది. సంతో షంతో ముగ్గురూ చదివారు.

హైద్రాబాద్.

సురేఖా,

నా మనస్సంతా నువ్వే ఆక్రమించగా ఆనందంగా హైద్రాబాదు చేరాను.

తప్పుచెయ్యటం మానవుడి జన్మహక్కు—కాదు. కాని జీవితంలో ఏ ఒక్క—తప్పూ చెయ్యని మానవుడు ఈ ప్రపంచంలో ఎక్క—డాలేదేమో. తప్పులు చెయ్యటంలో మనిషికి నిబ్బరం అక్క—ర్లేదు. కాని చేసిన తప్పులు తెల్సుకుని నిలదొక్కు—కోవటంలోఎంతమనోనిబ్బరం కావాలో స్వానుభవం మీద అర్థమైంది. తప్పు చెయ్యటానికి గుండెధైర్యం ఎంత అవసరమో, ఆ తప్పును తెల్సుకుని దిద్దుకోటానికి ఓర్పు అంతకన్న పదిరెట్లు అవుసరం.

కాని ఇంతచేసినా మానవ సహజమైన మనోదౌర్బల్యం ఇంకో తీరుగానూ ఉంటుంది. మనిషిని మనిషి నమ్మకపోవటమే ! చేసింది పొర బాటని ఒప్పుకున్నా, ఇదే ఒక వంచనగానే ఇతరులకు కనబట్టంలో ఎంత ఔచిత్యంఉన్నదో ఆలోచిస్తే మనసు వికలమైపోతున్నది. దొంగమనస్సు పూర్తిగా మారిపోయి మంచితనానికి కట్టుబడి హృదయ పరివర్తన చెందినా లోకులు ఆ దొంగని దొంగగానే భావిస్తారు. అంతేకాదు ఆ దొంగ దొంగగా చెలామణి అవుతున్న రోజుల్లో అతన్నిచూసి భయపడినవాళ్ళు అతనిలో పరివర్తన కలగటంతో, ఆనాటి దొంగవు నీవేకదూ. నీకు పరి వర్తన ఏమిటని పరిహసిస్తారు. అంతేకాదు అతనిమీద ఉండవలసిన నమ్మకం చులకనగా మారిపోతుంది. ఈదశలో అతన్ని ఇంకా ఈసడింపుగా చూస్తే మళ్ళీ ఈసారి దొంగతనంకాదు, ఇంకా ఏంచేస్తాడో తెలియదు. హృదయ పరివర్తన కలిగినవారికిసంఘం చేసే మేలు ఇదేనేమో? అప్పుడు లోకులు దొంగలౌతారు. ఈ దొంగ భీరువై పోయి జీవచ్ఛవంలా ఉంటా దేమో ? ఎక్క—డికి వెళ్ళినా వెళ్ళవచ్చు. ఫలితం కాలమే నిర్ణయిస్తుంది.

నీ వదిన

లీలావతి.

# 23

అందరి పరీక్షలూ అయాక సురేఖతోపాటుగా నలుగురు పిల్లలూ గోగులేశ్వరం వెళ్ళారు వేసవి కాలం రెండు నెల్లూ పిల్లల్ని పంపించమని రాఘవరావు ముందుగానే ఉత్తరం రాసి ముకుందమాధవరావుని పంపాడు. సురేఖ వెళ్ళేముందు నళినితో అన్నది రాజేశ్వరి లేకుండా చూసి, "రాజేశ్వరి మనస్సు మార్పుని కోరుతున్నది నళినీ. ఆ మార్పేమిటో అర్ధం చేసుకుని తగిన పరిష్కారం ఆలోచించవలసిన బాధ్యత నీ మీదనే ఉన్నది".

నవ్వి ఊరుకున్నది నళిని. లీలావతి వచ్చి వెళ్ళిన సంగతీ, ఆ పరిస్థితులూ గోగులేశ్వరం వెళ్ళాక తల్లిదండ్రులతో చెప్తానన్నది సురేఖ.

మరో వారం గడిచింది. వంటపన్లు, ఇంటిపన్లు కాగానే సుభద్రమ్మ ఏ రామాయణమో, భాగవతమో చదువుకుంటూ కూర్చునేది. నళిని ఆఫీసుకు వెళ్ళేది. రాజేశ్వరికి ఏమీ తోచేది కాదు. ఎన్ని పుస్తకాలూ, పత్రికలూ చదివినా కాలక్షేపమే అవుతుంది కాని, జీవితానికి కావలసిన మార్పులేవి జరిగేందుకు దోహదపడవు. పెద్ద కూతుళ్ళిద్దరూ మరీ పెద్దవాళ్ళయిపోతున్నారే అనే బాధ సుభద్రమ్మ మనస్సును ముంచెత్తినా, ఏమీ చెయ్యలేక, ఏమీ అనలేక కంట తడిపెట్టి, తనకు తానే నిరాశతో సమాధానం చెప్పుకునేది. కాని ఆ సమాధానం తనకే నచ్చేదికాదు. భగవంతుడి మీద భారం వేసి ఆయన తన కూతుళ్ళ పెళ్ళిళ్ళు జరిపిస్తాడని ఆశాభావంతో, విరక్తిగా అనుకున్నది. ఆ రోజున మనస్సు సరిపెట్టుకోలేక రాజేశ్వరిని పిలిచింది.

"పెళ్ళిళ్ళ సంగతి మాట్లాడానికి పిల్చావా అమ్మా" అన్నది నవ్వుతూ.

"అవునమ్మా. నువ్వూ ఈ సంగతి ఆలోచిస్తున్నావా, అక్కయ్య మగపిల్లవాడైతే ఎంత బావుండేది".

"ఇప్పుడు మాత్రం ఏమైందమ్మా. ఆడపిల్లయినా ఇంటి యజమాని బాధ్యతలను అక్కయ్య నిర్వహిస్తున్నది. అక్కయ్య ఒక్కర్తే నీ కూతురు. కాని అక్కయ్యకు అయిదుగురు పిల్లలు".

తల్లి చేతిలోని భాగవతం పుస్తకం తీసుకుని పేజీలు తిప్పసాగింది.

"అవేం మాటలే, మీనాన్న పోయారని, నేనూ పోయాననుకుంటున్నావా. మీరందరూ నా పిల్లలు. సరేగాని పెళ్ళిసంగతే అక్కయ్య ఎప్పుడూ ప్రస్తావించలేదు".

"ఎవరి పెళ్ళి"

"దాని పెళ్ళిసంగతే, పెళ్ళి సంగతులు మాట్లాడాలంటే ఇదివరకు మాదిరి చొరవగా అక్కయ్యతో మాట్లాడలేక పోతున్నాను. దాన్ని చూస్తుంటే నీతో మాట్లాడినంత చొరవగా మాట్లాడలేక పోతున్నాను".

పకపక నవ్వింది రాజేశ్వరి.

"మొన్నటిదాకా ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సులోనే జరిగితే బావుంటుంది. నళిని పెళ్ళయితే బావుండును అనుకున్న దానివి ఇప్పుడు మనస్సు మార్చుకున్నావా అమ్మా. నీలోనూ స్వార్థం నీకు తెలియకుండానే ప్రవేశించింది" బింకంగా చూస్తూ అన్నది.

తెల్లపోయి చూసిందావిడ.

"నాలో స్వార్థం ప్రవేశించిందా, ఏమిటే నువ్వనేది. కాలేజీ చదువులు తల్లిదండ్రుల్ని బాధ పెట్టేవిగా తయారవుతాయనుకోలేదు" పమిటచెంగుతో కళ్ళు తుడ్చుకుందావిడ.

"కొత్తగా బాధపడవలసిన సంగతేమీ కాదమ్మా. అనుభవాలు మనిషినే కాదు, మనస్సునూ మార్చివేస్తయ్యి. నీలో ఉన్నది స్వార్థంకాదు. అనుభవం. అక్కయ్య ఉద్యోగం చేస్తున్నది. దాదాపు రెండేళ్ళు కావస్తున్నది. ఈ రోజుల్లో చాలా ఇళ్ళల్లో చూస్తున్నాము. వద్దెనిమిదేళ్ళ ఆడ

పిల్ల ఇంట్లో కూర్చుంటే తల్లిదండ్రులకు గుండెలమీద కుంపటిగానే ఉంటుంది. ఉద్యోగం చేసి ప్రతినెలా జీతం తెచ్చి సంసారానికి సాయపడే పెళ్ళికాని ఆడపిల్లకు పాతికేళ్ళు వచ్చినా, ఆ ఉద్యోగస్తురాలైన పెళ్ళికాని ఆడపిల్ల ఆ తల్లిదండ్రులకు గుండెలమీద కుంపటి కాదు, పంచదార బిళ్ళ. పెళ్ళి చేస్తే అమ్మాయి జీతం తమకురాదు. తన జీతాన్ని తల్లిదండ్రులకు ఇస్తూ తన జీవితాన్ని కొవ్వొత్తిలా చేసుకోవాలి" అన్నది.

సుభద్రమ్మ దుఃఖం అంచులు తట్టింది. "నా పిల్లల కోసం నళిని బ్రహ్మచారిణిలా ఉండాలని నేనెన్నడూ అనలేదు పెళ్ళి చేసుకుని అత్త వారింటికి వెళ్ళిపోతానంటే నేనూ చాలా సంతోషిస్తాను. నా పిల్లల్ని ముష్టెత్తి పోషిస్తాను. చిన్నవాళ్ళకోసం మీ జీవితాలు బలిచేసుకోవద్దు. మీరిద్దరూ పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోండి. మా జీవితాలు ఎట్లాగో వెళ్ళిపోతాయి" ఇంత మాట పెగిలిరాలేదు. ఇక తల్లి మనస్సు బాధపెట్టకూడదనుకుంది రాజేశ్వరి.

పోస్టు జవాను ఉత్తరం పడేసి వెళ్ళాడు. కవరు చించి ఉత్తరం చదువుకుంది రాజేశ్వరి

ఆశ్చర్యపోలేదు. కాని ఆశించలేదు. ఎంత ఆలోచించినా మనస్సు సరిపుచ్చుకోలేక పోయింది సాయంత్రం ఇంటికి వచ్చిన నళినితో అన్నది.

"అమ్మ మనల్ని వెళ్ళిపొమ్మంటున్నది'

"ఎందుకు, ఎక్కడికి?"

"పెళ్ళి చేసుకుని అత్తవారింటికి".

"సంబంధాలు కుదిరాయా"

"ఆ"

"ఇద్దరికీనా"

"అవును"

"ముహూర్తాలుకూడా నిశ్చయించేశారా"

"ఆహా"

"ఏమిటే నీ వాగుడు"

"వాగుడు కాదు నళినీ, మనకు పెళ్ళిళ్ళు కాలేదని అమ్మ చాలా బాధపడుతోంది"

"అంతేకద. అది సహజమైన కోరిక".

"అక్కయ్యా"

"ఏమిటే"

"నా మనస్సు నీకు తెల్సుకదూ".

"ఇటీవల అర్థం కావటంలేదు".

ఆశ్చర్యపోయింది రాజేశ్వరి. ఏదో తప్పుచేసి పట్టుబడినదానిలా ఉన్నది. నళిని మాట్లాడలేదు.

రాత్రి పదకొండు గంటలైంది. ముగ్గురూ నిద్రపోతున్నారు. నిద్ర పోతున్న నళినిని లేపింది రాజేశ్వరి.

"హరిప్రసాద్ ఉత్తరం రాశాడు" ఉత్తరం ఇచ్చి లైటు వేసింది.

వుత్తరం చదివింది నళిని.

మా ఇల్లు,
గుంటూరు.

నళినీ,

ఇంటి యజమానురాలివని నీకు ఉత్తరం రాస్తున్నాను. దొంగ మారిపోయాడంటే ఎవ్వరూ నమ్మనట్లుగానే, నేను మారిపోయానన్నా మీరు నమ్మరు. డబ్బు, ఆస్తిపాస్తులు, వ్యాపారం అన్నీ ఉన్నాయి.గత జీవితాన్నుంచీ నేను విముక్తి పొందినా ఆ మాయని మచ్చ నాకు నిల్చిపోయింది. గౌరవాన్నీ, మర్యాదనీ, నేను హృదయ పరివర్తన కలిగినా పొందలేక పోతున్నాను.

మానసికంగా ఎంతో నలిగిపోతున్నాను. ఏదీ నాకు సంతృప్తి నివ్వడంలేదు నా మనస్సులో ఏదీ శాశ్వతంగా ఆ రోజుల్లో నిల్చి పోలేదు. కాని ఈనాడు నిల్చిపోయింది రాజేశ్వరి. మనిషిగా నేను చచ్చి,

మళ్ళీ పుట్టక పోయినా నాకు పునర్జన్మను ప్రసాదించింది రాజేశ్వరి. ఆలోచించి కాకిచేత కబురు చే స్తే అమ్మ, నాన్న వచ్చి ముహూర్తాలు నిర్ణయిస్తారు.

హరిప్రసాద్.

ఉ త్తరాన్ని కవరులో ఉంచి రాజేశ్వరికి ఇచ్చింది.

"అతను నీకు కనబడ్డాడా రాజూ"

"లేదు, ఇవాళ ఈ వు త్తరం రావటమే".

"జరిగిపోయిన విషయాలు తెలుసు. జరగవలసిందేమిటి"

"ఇలాంటి ఉ త్తరాలు వ్రాయవద్దని తగిన బుద్ధి చెప్పాలి"

"మళ్ళీ ఉ త్తరం వ్రాస్తావా"

"నాకు ఉ త్తరం రా స్తే దవడ పగల కొట్టేదాన్ని, నీకు వచ్చింది ఉ త్తరం, సమాధానం నువ్వేరాయి"

"సమస్యల్ని చులకనగా చూసినా, అవి మనస్సుని మార్చలేవు. నేనొక నిర్ణయానికి వచ్చాను. అందుకు కట్టుబడి ఉంటాను"

"ఏమిటా నిర్ణయం" ఆదుర్దాగా అడిగింది రాజేశ్వరి.

"నా పెద్దరికంలో నీకు విశ్వాసం ఉన్నదంటావా"

"తప్పకుండా, ఆ అనుమానం ఎందుకు కలిగింది"

"జీవితంతో రాజీ పడ్డవాళ్ళు జీవితంలో సుఖ దుఃఖాల్ని సమానంగానే చూసి కాల ప్రవాహంలో ప్రాణాపాయంరాకుండా కొట్టుకు పోవాలని చూస్తారు. నేను ఆ నిర్ధారణకే వచ్చాను".

రాజేశ్వరికి ఏమీ అర్థం కాలేదు. "నిద్రమత్తులో ఏదో మాట్లాడేస్తున్నావు. రేపు మాట్లాడవచ్చులే"

రాజేశ్వరి తన పక్కమీదికి వెళ్ళబోయింది. చెయ్యి పట్టుకు కూర్చో పెట్టింది నళిని. విభ్రాంతితో చూసింది రాజేశ్వరి.

"నువ్వు హరిప్రసాద్‌ని ప్రేమిస్తున్నావు రాజూ. నీ మనస్సులోని ఆలోచన హృదయస్పందన నాకు తెలుసు" అన్నది నళిని.

రాజేశ్వరి కోపం ఒక్కసారిగా తారస్థాయికి వెళ్ళింది.

"అక్కయ్యా, పెద్దరికం పేరుతో ఇష్టం వచ్చినట్లు మాట్లాడకు. నేనూ అట్లాగే అంటాను. నువ్వే అతన్ని ప్రేమించావు. కాని నన్ను ప్రేమిస్తున్నట్లు అతను బుకాయిస్తున్నాడు" మాట్లాడకుండా వెళ్ళి తన పక్కమీద పడుకుంది రాజేశ్వరి నిరుత్తరాలైంది నళిని.

నాలుగు రోజులు గడిచాయి. నళినిని చూసి రాజేశ్వరి తప్పుకు తిరుగుతోంది. ఎదరపడ్డా తల వంచుకుని తప్పుకుంటోంది ఎన్నో ఆలోచనలు దొర్లిపోతుంటే మనస్సును కట్టివేసినట్లుగానే తనను తాను నచ్చచెప్పుకో సాగింది.

అయిదో రోజు నళిని-పుస్తకంలో తలదూర్చిన రాజేశ్వరి గడ్డం పుచ్చుకొని ముఖంలోకి చూసింది నళిని నవ్వు రాజేశ్వరి కన్నీరుని ఆప్యాయంగా పలకరించింది.

"బాధపడుతున్నావా రాజూ. వయస్సు మనస్సులోని కోరికలకన్న బలవత్తరమైనది. కాని మనస్సు వయస్సుకన్నా ముందు పరుగెడుతుంది. నీకు తెలీకుండానే అతన్ని ప్రేమించావు కదూ" రాజేశ్వరి కన్నీటిబొట్లు నళిని గాజులమీద పడ్డయ్యి.

"నే నతన్ని ఎన్నడూ ప్రేమించలేదు. నా మీద అభాండం వెయ్యకు అక్కయ్యా. అమ్మ ఈ మాటలు వింటే ఏమనుకుంటుంది". ఏదో తప్పుచేసిన దానిలా చూస్తున్నది రాజేశ్వరి.

"పిచ్చిదానా, ఎవరైనా వయస్సును దాచుకో గలరు. కాని మనస్సును దాచుకోలేరు. నీ మనస్సు నాకు తెలుసు, అమ్మ ఏమీ అనుకోదు. నా రాజు ప్రేమించి పెళ్ళి చేసుకోబోతున్నదని సంతోషపడుతుంది".

నవ్వుతూ అన్నది నళిని. ఆ నవ్వు ముఖంలో నళినిని చూసిన రాజేశ్వరికి ఏదో చైతన్యం కలిగింది.

"అతనిని ప్రేమించావా రాజూ?"

"లేదు"

"పిచ్చిపిచ్చిగా ఉత్తరాలు వ్రాస్తే చట్టరీత్యా తగిన చర్య తీసికుంటానని అతనికి ఉత్తరం వ్రాస్తావా. సమాధానం వ్రాయకపోతే ఆ ప్రేమలేఖను ఆమోదించినట్లే అవుతుందికదా"

"ఈ నాలుగు రోజుల నుంచీ ఎంతో ఆలోచించాను. సమస్యలను నేనే సృష్టించుకుని మథనపడి నేనే సమాధానం చెప్పుకున్నాను.పరిస్థితులకు లొంగిపోయాను నళినీ. మనస్సు ఎదురు తిరిగినా, మన కుటుంబ పరిస్థితులు నా మనస్సును లొంగ తీసినయ్యి".

నవ్వింది నళిని.

"సరే, తొందరేమీ లేదు, ఆలోచించి నీ నిర్ణయం చెపితే నేను వెళ్ళి హరిసర్వోత్తమరావుగారితో మాట్లాడి, రాఘవరావు మామయ్యకు కబురు చేస్తాను. పీటలమీద కూర్చోవలసింది వాళ్ళేకదా''.

"నేను అతన్ని ప్రేమించలేదు. ఆ సంబంధానికి తలవంచను. కాని నా ఒక్క కోరిక, ముందు నీ పెళ్ళి కావాలి. మగవాడు పెళ్ళికాకుండా జీవితాంతం గడపటానికి పూర్తిగా కాకపోయినా కొంత సావకాశంఉన్నది. సంఘం దృష్టి అతనిమీద అంతగా పడదు. కాని ఆడది పెళ్ళిచేసుకోకుండా జీవితాంతం గడపలేదు. ఒకవేళ అట్లా ఉన్నా స్వార్థపరులకు తలవంచక తప్పదు" తన నిర్ణయాన్ని చెప్పింది రాజేశ్వరి.

"రాజూ, దూరం ఆలోచించావు కాని, దగ్గర విషయాలు ఆలోచించ లేదు. యదార్థాన్ని అందంగానే చెప్పావు. కాని సమస్యల్ని సామరస్య దృష్టితో ఆలోచించి నిజాన్ని, నిజంగా గ్రహించలేక పోయావు".

"అంటే"

"అమ్మ పిలుస్తోంది, సాయంత్రం చెప్తాను".

నళిని అట్లా సమస్యల్ని దాటవెయ్యడం రాజేశ్వరికి నచ్చలేదు. తన పెద్దరికపు పలుకుబడితో తన అభిప్రాయాన్ని చెప్పింది కాని, స్వవిషయంలో మనస్సును దాటవేసింది. అక్కయ్య ఎవర్నీ ప్రేమించలేదా? ఆ సంగతి నీకెందుకు అనే తూష్ణీభావంతో చెప్పకుండా దాటవేసిందా?

సాయంత్రం సుభద్రమ్మ గుళ్ళోకి వెళ్ళింది. ఇద్దరే ఉన్నారు.

"నళినీ, నా ప్రశ్నకు సమాధానం ఈ పూట చెప్తానన్నావు"అన్నది రాజేశ్వరి.

"గుర్తుంది. నీకు గుర్తున్నదో లేదోనని చెప్పలేదు".

"నీ మనస్సు నాకూ తెలుసు దాటవెయ్యబోకు".

"అయితే ఏమిటో చెప్పెయ్యి, మీ బావ ఎవరో తెలిసిందా"నవ్వుతూ అన్నది నళిని. రెట్టించిన సంతోషంతో అడిగింది రాజేశ్వరి

"ఎవరు నళినీ"

"ఎవరో ఒకరు, ఎవరైనా నీకు బావగారేకదా"

"ఆ బావగారే ఎవరని, ఈ నళినీ మానసచోరుడు ఎవ్వరో కదా, ఎవరు నళినీ?"

"ఆట పట్టించబోకు రాజూ, ఈ సంసారంలో నా తరువాతముగ్గురు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావాలి. నా బాధ్యత నాకు తెలుసు. ఒక విషయం ఆలోచించు. పాతికేళ్ళ పై బడ్డ మగ పిల్లవాడు ఏదైనా సంబంధం వస్తే తనకు పెళ్ళిడుకు వచ్చిన చెల్లెలు ఉన్న పక్షంలో ఏమంటాడో నేనూ అదే అంటాను"

"చెల్లెళ్ళ పెళ్ళికాకుండా నువ్వు పెళ్ళి చేసుకోవా నళినీ" హృదయాంతరాళంలోని బాధ మాటల్లో వ్యక్తమైంది.

"అవును రాజూ, నేనూ పెళ్ళీడుకు వచ్చిన ఆడపిల్లను. ఏ వయస్సులో అనుభవాలు ఆ వయస్సులో అనుభవించాలని తెలుసు. అనుభవాల కన్నా బాధ్యత ఎంతో ముఖ్యమైనదే కాదు పవిత్రమైనది. అనుపమకు పదో ఏడు దాని పెళ్ళికూడా నా సంపాదనతోనే చెయ్యాలి. నేను పెళ్ళి చేసుకుంటే నా సంపాదన నా భర్తకే చెందుతుంది లేక నా పిల్లలకు చెందుతుంది కాని నా చెల్లెళ్ళకు కాదు".

ఉద్విగ్న మనస్కురాలై అన్నది నళిని.

క్షణంసేపు కళ్ళార్పకుండా చూసింది రాజేశ్వరి.

"ముగ్గురు చెల్లెళ్ళ పెళ్ళి అయ్యేవరకూ పెళ్ళిచేసుకోని అన్నగార్ని సంఘం సానుభూతితో అర్థంచేసుకుంటుంది నళినీ. కాని ఒక్క చెల్లెలి పెళ్ళి అయింతరువాత అప్పగారి పెళ్ళికావటం చాలాకష్టం. లోకంకోడై కూసి

తలవంపులు తెస్తుంది. అమ్మాయిలో ఏదో దోషం ఉందనీ అందుకే తనకు పెళ్ళికాకుండా చెల్లెలిపెళ్ళి అయిందనీ ఆడిపోసుకుంటారు".

"సంఘానికి కళ్ళు, నోరూ ఉన్నవికాని మనస్సూ, ఆలోచనా శక్తి లేదు రాజూ ఆ లెక్కలో ముగ్గురు చెల్లెళ్ళ పెళ్ళి అయిన అప్పగారి పెళ్ళి కావటం ఈ జన్మలో జరగదేమో !"

"అక్షరాలా నిజం"

"ఆ నిజాన్ని చేదు మాత్రగాకాక పంచదార మాత్రగా మింగుతాను. రాజూ. అందుకోసమే వెయ్యికళ్ళతో నిరీక్షిస్తున్నాను".

ఉద్వేగం ఆనందంగా మారి నళిని కళ్ళుచెమర్చాయి. కన్నీటితో ఆవరించిన నళిని కళ్ళకు రాజేశ్వరి మసగ మసకగా కనిపించింది. తల వంచుకున్న అక్కయ్య కళ్ళు తుడిచింది చెల్లెలు.

"హరిప్రసాద్‌ను పెళ్ళిచేసుకోవటానికి మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నావా రాజూ"

ఆందోళన ముందుపోతుంటే రాజేశ్వరి మనస్సు వెనక వస్తున్నది.

"నువ్వు మనస్ఫూర్తిగా అంగీకరిస్తే నాకు అభ్యంతరంలేదు నళినీ. పెళ్ళికి ఇష్టపడ్డాననే సంతోషంకన్నా ఈ చెల్లెళ్ళకోసం నువ్వు బలి పశువువై పోయినందుకు చాలా బాధపడుతున్నాను. ఈ ఇంటికి పెద్దకొడుకులా నీ బాధ్యత నువ్వు నిర్వహించాలని పట్టుదలతో ఉన్నా, సంఘం దృష్టిలో నువ్వు పెళ్ళికాని ఆడపిల్లవే కాని పెద్దకొడుకువు కాదు" అన్నది రాజేశ్వరి. నళిని ముఖాన్ని చూడలేక ఆమె వళ్ళోకి తలవాల్చి బావురుమన్నది. "నేను బి.కాం. పరీక్ష పాసయినట్లు తెల్సినరోజునే అన్నాను రాజూ. పెద్దకొడుకుగా ఉద్యోగంచేసి నాన్నకు చేదోడుగా ఉంటానని మాట యిచ్చాను. నా మాటయందు నమ్మకం ఉన్నది. కనుకనే నేను ఉద్యోగంలో చేరటానికి నాన్న సమ్మతించారు. పెళ్ళికాని ఆడపిల్లనైనప్పటికీ, సంసార భారాన్ని మోయవలసిన ఇంటి యజమానిగా నా కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటాను రాజూ ఏ లోకంలో ఉన్నా నా కర్తవ్యనిర్వహణకు తగిన

మనోబలాన్ని నాన్న తప్పకుండా ప్రసాదిస్తాడు. ముగ్గురి చెల్లెళ్ళ పెళ్ళి చేసిన అన్నగారికి పెళ్ళికాదంటావా, అలాంటి తీర్పుని సంఘం ఇస్తే సంతోషంతో అంగీకరించటానికి వెనుకాడను" అన్నది నళిని.

నళినిని నిలువెల్లా చూసి కొత్తభావాలను సంతరించుకుంది రాజేశ్వరి.

"పెళ్ళికాని ఆడపిల్లలు ఇట్లా మాట్లాడటంలో ఔచిత్యం లేకపోయినా కాలానుగుణ్యంగా భావాలకు పదును పెట్టకతప్పదు. అందుచేతనే దాపరికం లేకుండా అడుగుతున్నాను".

"ఏమిటది ?"

"మాకు పెళ్ళిళ్ళయి కాపురాలుచేస్తూ కనీసం తొలిచూలుకయినా పురిటికి పుట్టింటికి వచ్చినప్పుడైనా నీ చెల్లెళ్ల బిడ్డ తల్లులైతే వారిని చూసినప్పుడైనా, నీ మనస్సులోని భావాలు నీకు తెలియకుండానే తిరగబడి నిన్ను వ్యధపెట్టవా నళినీ ? అప్పుడు నీ మనస్సు ఎట్లా ఉంటుంది ?"

పకపక నవ్వింది నళిని.

"ఆడపిల్లలైనందుకు ఆడజన్మలోని అనుభూతిని చాలా అందంగా చెప్పావ్ రాజూ. ఈ ఆలోచనలు నాకు రాలేకపోలేదు. ఈ అక్కయ్య మనస్సుని వివిధ కోణాల్లో తిరిచి చూస్తున్నావా రాజూ. మనిషికి విగ్రహపుష్టికన్నా నిగ్రహపుష్టి కావాలి, మనో నిగ్రహాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాలంటే బాధ్యతల బరువు ఎంతో అవసరం. మన ఇంటి బాధ్యతల బరువు నాకు చాలు" అన్నది నళిని.

ఆఖరి అస్త్రం ప్రయోగించింది రాజేశ్వరి. "ఆదర్శాలను వల్లెవేయటం ఎంతో తేలిక ఆచరణలో పెట్టాలంటే కొన్ని సమయాల్లో సాధ్యం కాదు నళినీ రోజులు నిరాహారదీక్ష వహించి ప్రజలందరి సానుభూతి పొంది, చివరకు తన ప్రాయోపవేశానికి కారణమైన ఆ కోరికతు సిద్ధించక ముందే దీక్షను విరమించిన రాజకీయవాదిలా ఉంటుందేమో నీ జీవితం ?" అన్నది రాజేశ్వరి నవ్వుతూ.

"కోరికలను ఏ పరిస్థితిలోను తాకట్టుపెట్టుకోను రాజూ. నువ్వు నన్ను నమ్మకపోయినా, నా మనస్సు నన్ను నమ్ముతుంది. నువ్వుమాత్రం కోటలో పాగావెయ్యటానికి సమ్మతించావు, నాకదే పదివేలు" అన్నది నళిని. నివ్వెరపోయింది రాజేశ్వరి.

# 24

గుంటూరునుండి వచ్చిన మర్నాడే లీలావతి శ్రీనివాసరావు గదికి వెళ్ళింది. అప్పటికి సాయంత్రం ఆరున్నరయింది. సిగరెట్ కాలుస్తూ ఏదో పుస్తకం చదువుతున్నాడు శ్రీనివాసరావు. లీలావతిని చూడగానే,

"ఓ నువ్వా, రా. కూర్చో" అన్నాడు. మళ్ళీ పుస్తకంలో తల దూర్చాడు.

"నేను వచ్చినందుకు ఆశ్చర్యపడుతున్నావా శ్రీనీ ?"

"లేదు, అసహ్యపడుతున్నాను"

"ఎందుకని".

"సాయంత్రంవేళ ఒక మగవాడి గదికి ఆడపిల్ల ఒంటరిగా రావటం ఏం మర్యాదగా ఉంటుంది. ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు. ఇద్దరి పరువూ పోతుంది. నామాటవిని వెళ్ళిపో లీలా. ఇంటివాళ్ళు చూస్తే నా పరువుదక్కదు వెళ్ళిపో, ఊఁ, వెళ్ళు లీలా" కఠినంగా అన్నాడు. పేలవంగా నవ్వింది లీలావతి.

"తప్పుచెయ్యటం గొప్పకాదు శ్రీనీ. ఆ తప్పు తెల్సుకోవటంలోనే గొప్పతనం ఉంది. నా తప్పు నాకు అర్థమైంది"

"నేను పేదవాడిని. నీ గొప్పతనం నాకు అర్థంకాదు వెళ్ళు లీలా".

"వెళ్ళటానికి రాలేదు. నిన్ను తీసుకువెళ్ళటానికే వచ్చాను. నన్ను క్షమించు శ్రీనీ. వెళదాం రా. అమ్మా నాన్నా చాలా బాధపడుతున్నారు".

"మా అమ్మా, నాన్న బాధలే నాకు అర్థంకావడంలేదు. మీవాళ్ళ బాధ నాకెందుకు లీలా. తప్పుచెయ్యడం, అది తెల్సుకుని క్షమాపణ వేడు

కోడం, అంతా నీ ఇష్టమే అయితే ఇంక నా ఇష్టా ఇష్టాలతో ప్రమేయం ఏముంది".

అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది. పేలవంగా నవ్వుతూ అతని కళ్ళలోకి చూసింది "భార్యగా అడగటానికి నాకు హక్కు ఉన్నా, అర్థించి అడుగుతున్నాను. ఈ గది ఖాళీచెయ్యి శ్రీనీ, మా ఇంటికి పోదాం. పోనీ పంతాలూ పట్టింపుల సంగతి వదిలెయ్యి. నాతో కాపురం చెయ్యటం నీకు ఇష్టంలేదా శ్రీనీ".

"సంసారం. హుఁ, మళ్ళీ గర్భవిచ్ఛిత్తికి ప్రయత్నించటానికా. పెళ్ళయింది. కాని సంసార స్త్రీకి ఉండవలసిన ఆదర్శాలూ, కోరికలూ, అనురాగమూ నీలో లేవు లీలా. నీలోని స్త్రీత్వం అహంకారానికి బందీ అయిపోయింది. అహంకారపు అడ్డుగోడల్ని ఛేదించే భావం ఇంకా నీలో కలగలేదు".

లీలావతికి కడుపులో దేవినట్లయింది. ఓడిపోతున్నాననే యథార్థం మనస్సుకు తట్టగానే దుఃఖపూరితమైన ఆవేదనతో కూడిన ఆవేశం పొంగి పొర్లుకొచ్చింది. మనస్సులోని ఉద్వేగానికి తట్టుకోలేక చేతుల్లో ముఖాన్ని దాచుకుని భోరున ఏడ్చింది.

అయిదు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడలేదు.

"నన్ను క్షమించు శ్రీనీ, క్షమించు. నాలో ఏ అహంకారమూ లేదు. నాకు కావలసింది నువ్వు"

ఇంక మాట్లాడలేకపోయింది.

"శ్రీనివాసరావూ ఎవరా అమ్మాయి ?" ఇంటాయన రెండుచేతుల్తో గుమ్మాన్ని పట్టుకుని గదిలోకి తొంగిచూస్తూ అడిగాడు.

ఇద్దరూ ఖంగారు పడ్డారు. కళ్ళు తుడ్చుకుంది లీలావతి.

"ఎవరమ్మాయి నువ్వు ?" అన్నాడాయన కోపంతో చూస్తూ.

"నా భార్య లీలావతి" అన్నాడు శ్రీనివాసరావు.

"భార్యా ! ఆ మధ్య పెళ్ళిసంబంధాల ప్రస్తావన వస్తే నీకు పెళ్ళయినట్లుగా చెప్పలేదే" ఆశ్చర్యంగా అడిగాడాయన.

"నన్ను దృష్టిలో ఉంచుకుని మీరు అడిగారనుకోలేదు" నవ్వుతూ అన్నాడు శ్రీనివాసరావు.

"భార్య అయితే ఈ చాటు వ్యవహారం ఎందుకూ, కట్నంపేచీతో కార్యం చేసుకోనన్నావా".

"అదేమీ కాదండీ"

"మరి".

"మా ఇద్దరి మధ్యా అహంకారపు అఘాతం ఉన్నది ఇద్దరం చెరొక ఒడ్డునా కూర్చున్నాం. వారధి కట్టుకోలేక పోతున్నాం"

"ఏమ్మా లీలావతీ అంతేనా" నిశితంగా చూస్తూ అన్నాడాయన.

"భార్యా భర్తల మధ్య అనేక స్పర్థలుంటయ్యి. మాలో మేం సర్దుబాటు చేసుకుంటాం. మీ సలహా కావలిస్తే తప్పక అడుగుతాను"కోపంతో చూస్తూ అన్నది.

"అయితే మీరు భార్యాభర్తలని నమ్మమంటావ్. తెగించిన వాళ్ళు ఎంతకయినా సాహసులే! శ్రీనివాసరావూ ఇది సంసార్లయిల్లు. రాత్రిళ్ళు ఇలాంటి అమ్మాయిల్ని ఇక్కడకు తీసుకురాకు. వెంటనే ఈ అమ్మాయిని పంపించివెయ్యి. రెండు నిమిషాల్లో వెళ్ళిపోవాలి". వరండాలో నిల్చుని చుట్ట కాల్చుకుంటున్నాడాయన.

అభిమానంతో, అవమానంతో కృంగిపోయింది లీలావతి.

"శ్రీనీ. ఈ అవమానం భరించలేను. పరాయి స్త్రీనని అంటుంటే విని ఊరుకున్నావా, నీ భార్యకు ఇంత అవమానం జరుగుతుంటే కాదని ఎదిరించలేక పోయావ్. ఛీ ఛీ నీలో మానవత్వం లేదు. భార్యంటే అనురాగం లేదు, ప్రేమలేదు, అభిమానం లేదు, ఆ రోజులలో గుడ్డిగా నీ మాటలు నమ్మి నిన్ను పెళ్ళి చేసుకున్నాను. ఫలితం అనుభవిస్తున్నాను. ఈనాడు నీ సమక్షంలోనే పరాభవమూ అనుభవించాను. నువ్వు భర్తవు కాదు. రాక్షసుడివి. నా పాలిట యముడివి. నా మనస్సు విరిగిపోయింది. వెళ్ళిపోతాను నీ భార్యవని చెప్పలేని వాడివి నువ్వు నాకు భర్తవు కావు.

నన్ను వంచనచేసి నా మెళ్ళో తాళి కట్టిన కిరాతకుడివి" ఆవేశంలోఅనేసి గబగబా మేడదిగి వెళ్ళి పోయింది.

స్థాణువులా చూస్తూ నిల్చున్నాడు శ్రీనివాసరావు. విభ్రాంతితో చూస్తూ ఏమీ అర్థంకాక శ్రీనివాసరావు భుజం తట్టాడాయన. శ్రీనివాసరావు మనస్సు, ఆలోచనలూ ఈ లోకంలో లేవు.

మర్నాడు ఉదయమే లీలావతి తండ్రి శ్రీనివాసరావు గదికి వచ్చాడు. గది తాళంవేసి ఉంది. తిరిగి వెళ్లిపోయాడు. పది గంటలకు బ్యాంకుకు వెళ్లాడాయన. పన్నెండు గంటలవరకూ చూశాడు. శ్రీనివాసరావు బ్యాంకుకు రాలేదు. మళ్ళీ గదికి వెళ్లాడు. గది తాళం అట్లాగే ఉన్నది.

లీలావతి తండ్రి మూడు రోజులు శలవు పెట్టి ఎన్నోచోట్ల వెతికాడు. శ్రీనివాసరావు కనిపించలేదు. బ్యాంకు వారికి రెండు నెల్లు శలవు కాగితం వచ్చింది. ఆశ నిరాశచేసుకుని వెళ్లాడాయన. తల్లి మనస్సు వికలమైపోయింది. కూతురు కాపురం నట్టేటిలో మునిగిపోయిందని ఆమె ఏడ్చింది. రెండు రోజులు ఆ ముగ్గురూ భోజనం చెయ్యలేదు. తండ్రికూడా కంటతడి పెట్టాడు. తల్లి విచారానికి అంతులేదు. లీలావతికి ఏడుపు రాలేదు. మానసికంగా కృంగిపోయింది. హృదయంలో పరివర్తన కలిగినా ఆనాటి పరాభవంతో ఆమె ఔన్నత్యం ఎండి మోడయిపోయింది. హృదయమంతా నిరాశ అనే బండిరాయి ఆక్రమించింది. అప్పుడే ఒక ఉత్తరం సురేఖకు వ్రాసింది. ఆ భావంతో విరక్తితో వ్రాసిన ఆ ఉత్తరంలో శ్రీనివాసరావు కనబడ్డంలేదని రాయలేదు. ఆఫీసుకు రెండుమాసాలు శలవు కాగితం పంపించింది. ఆ ఇంట్లో ఎవ్వరి ముఖాన కత్తివేస్తే నెత్తురు చుక్కలేదు.

ఆ రోజునే శ్రీనివాసరావువున్న ఇంటాయనతో అన్ని విషయాలూ చెప్పి, పెళ్లినాటి ఫోటోలు కూడా చూపించాడు లీలావతి తండ్రి.

"ఇంత కల్లోలం జరుగుతున్నా మాట మాత్రమయినా అప్పుడే చెపితే తను ఆనాడు వారిద్దర్నీ అనుమానించి అన్న మాటలు అనే అవసరమే ఉండేది కాదనీ, తన మాటలే శ్రీనివాసరావుని వెళ్లిపోయేటట్లు చేశాయనీ" ఆ ఇంటాయన వాపోయాడు.

వారం రోజులు గడిచాయి. శ్రీనివాసరావు జాడ లేదు, గదికి రానే లేదు. అతని రాకకోసం ఇరవై నాలుగ్గంటలూ కళ్లల్లో వత్తులు వేసుకుని కూర్చున్నాడు ఇంటాయన.

మరోవారం గడిచింది. లీలావతి ఎప్పుడూ కిటికీలో నుంచి వీధిలోకి చూస్తూ కూర్చునేది. ఆలోచనలు మోడై పోయి భావాలు ఎండిపోయాయి. మనిషిమాత్రం ఉన్నది.

"తల్లిదండ్రులక్కూడా తెలియనివ్వకుండా నీ కోరిక ప్రకారం పెళ్లి చేశాం. కన్నతండ్రి ఇంటికి వస్తే చూసీ చూడనట్లే ఊరుకున్నాం. ఆ ఇంటి ఘోష ఈ రీతిగా బెడిసికొట్టింది" అన్నది తల్లి, నెత్తీ నోరూ బాదుకుంటూ.

నిట్టూర్పు విడిచి అన్నది లీలావతి.

"చెడును చెడుగా ఆలోచిస్తే మంచి అనేది మన మనస్సులో ప్రవేశించేదమ్మా. కాని అట్లా జరగలేదు. చెడును మనం మంచిగా అంచనా వేసుకోవటంతో చెడు పరిణామాలు మన కళ్ళకూ, మనస్సుకూ మంచిగానే కనుపించాయి. దాని ఫలితం ఇప్పుడు కనబడింది".

"ఏమీ కాదు. నీ తర్క వితర్కాలూ, మాటలతో మనిషిని చులకనగా ఎంచే స్వభావమే నిన్ను ఈ స్థితికి తెచ్చింది లీలా నీ కాపురంలో నిప్పులు నువ్వే పోసుకున్నావు" అన్నదావిడ.

"నిజమేనమ్మా. కాని ఒక్కొక్కప్పుడు నిజం నిప్పులాంటిది. కాని ఆ నిజమే పరిస్థితిని బట్టి మంచులా కరిగిపోతుంది. ఈ రెంటి పరిణామాల్ని అర్థం చేసుకొనే స్థితికి ఇప్పటికి వచ్చాను".

"కథల్లో మాటలు జీవితంలో పనికిరావు లీలా" అన్న దావిడ వల్ల మండి.

"నిజమేనమ్మా, కాని నా జీవితమూ ఒక కథగానే ఉన్నదికదా".

"ఇంతవరకూ నీ మనస్సే పెంకెగా ఉన్నది. ఇప్పుడు నీ జీవితం కూడా అంతకన్నా పెంకెగానే మారిపోయింది" అన్న దావిడ. కళ్లొత్తుకుంది లీలావతి.

నెల గడిచింది. శ్రీనివాసరావు ఎక్కడవున్నదీ తెలీలేదు. లీలావతి ప్రాణాలు కళ్లల్లో వున్నయ్యి. ఇప్పుడు ఎక్కువగా మాట్లాట్టమే లేదు. ఎడతెగని ఆలోచనలతో ఆమె శరీరం శుష్కించిపోయింది ఒకరోజున తల్లీతండ్రితో అన్నది.

"ఊహించనిది జరిగిపోయింది, భార్యాభర్తలమధ్య స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనురాగంతో, అనుకూల దాంపత్యంతో ఏర్పర్చుకోవాలి గాని, రాగద్వేషాలవల్ల కాదు. పంతాలూ, పట్టుదలలూ స్త్రీకి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు తెచ్చిపెడతాయని అనుకుని ఆదరించటం ఆత్మహత్యతో సమానమే అవుతుంది. ఆ స్థితిలోకి వచ్చాక స్వేచ్ఛకూ, స్వాతంత్ర్యానికీ అర్థమే ఉండక ఆ రెండూ మరణించినట్లే అవుతుంది మనిషిని మనిషి అర్థంచేసుకునే ప్రయత్నం ఈ రకంగా చెయ్యటమంటే తనను తాను ద్రోహం చేసుకోవటమే. ఎదుటివారిని ఓడించదలచి ఆ ప్రయత్నంలో నేనే పూర్తిగా ఓడిపోయాను. కాని గెలుపూ ఓటమీకూడా మానవ సహజమే, ఒక్క కోరిక" అన్నది ఆయాసంతో మరి మాట్లాడలేకపోయింది.

"ఏమిటమ్మా" అన్నాడు తండ్రి.

"నీ కోరిక ఏదయినా తీరుస్తాతల్లీ. అనుమానపడక ఏమిటో చెప్పమ్మా" అన్నది తల్లి ఆదుర్దాగా.

"మనం గోగులేశ్వరం వెళదాం. అత్తగారినీ, మామగారినీ అందర్నీ చూడాలి; అక్కడికి వెళితే కాస్త మనశ్శాంతి లభిస్తుందేమో!"

తండ్రి ఆలోచించాడు.

"నా కొడుకుని ఏం చేశారని అత్తగారు అడిగితే ఏం సమాధానం చెపుతావమ్మా, వద్దుతల్లీ అక్కడికి వెళ్లొద్దు" అన్నాడాయన.

"అవునమ్మా, ఏ ముఖం పెట్టుకుని అక్కడికి వెళతాం; నా కొడుకుని ఏదోచేసి ఆస్తికోసంవచ్చారా అని వాళ్లంటే ఏం సమాధానంచెప్పాలి" అన్నది తల్లి.

"నిజమేనమ్మా, కాని అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. నా అత్తగారింటికి నేను వెళ్ళాలనేకోరిక ఇప్పటికయినా భగవంతుడు నాకు కలిగించాడు. ఈ నిర్ణయానికి తిరుగులేదమ్మా".

*　　　*　　　*

ఆ మర్నాడే ముగ్గురూ బయల్దేరి గుంటూరువెళ్లి అక్కడనుంచీ గోగులేశ్వరం వెళ్లారు.

ఆ రోజు సాయంత్రం అతిదీనంగా మాట్లాడి లీలావతి వెళ్లిపోయాక ఇంటాయనతో ఏమీ అనలేదు శ్రీనివాసరావు. ఆ రాత్రి భోజనం చెయ్యలేదు. ఆలోచనలతో కడుపు నింపుకున్నాడు. అవమానంతో మనస్సు విరుచుకుపడింది, అతనిమీదనే తిరగబడ్డది. ఉన్న డబ్బుతీసుకుని గదికి తాళంవేసి ఉదయం అయిదుగంటలకే వెళ్లిపోయాడు శ్రీనివాసరావు.

హైదరాబాదులోనే ఒక మారుమూల ఉన్న లాడ్జిలో ఒక చిన్న గది తీసుకున్నాడు. లీలావతి అన్న మాటలతో అతనిమనస్సు విరిగిపోయింది.

నేనెందుకు బ్రతకాలి ? ఎవరికోసం బ్రతకాలి? అందరూ ఉన్నా ఎవ్వరూ లేరు ఎవ్వరూ లేరనుకుంటూనే అందరిమీద పగసాధించటానికి అట్లా వచ్చానేమో ? నా జీవితమే కాదు, నాకు కావలసిన వాళ్లందరి జీవితాలూ నా చేతిలోనే ఉన్నాయనుకున్నాను. కాని, నా జీవితమే నాకు కాకుండా పోయింది. అమ్మ, నాన్న, తాతయ్య, చెల్లెలు, తమ్ముడు ఇంతమందినీ త్రాసులో ఒకవైపు ఉంచాను. నా పట్టుదలను, వాదాన్ని త్రాసులో మరొకవైపు ఉంచాను. మొగ్గు నాదే, వాళ్లంతా తేలిపోయారు. జీవితంలో గెలుపు నాదే ననుకున్నాను.

అతని ఆలోచనలు మరికొంతదూరం వెళ్లాయి. మొదటిరోజుల్లోనే లీలావతి కనిపించింది. ఆనాటి లీలావతితో స్నేహం ప్రారంభమైంది. స్నేహం ప్రేమగా మారింది.

వారం పదిరోజులవరకూ ఆ గదిలోనుంచి బయటకు రాలేదు. ఒక రోజు భోజనం, రెండురోజులు ఏదో తిండి, కాఫీ. ఒక్కొక్కరోజున ఏదీ ఉండేదీకాదు. మనిషి చిక్కిపోయాడు. గెడ్డం పెరిగింది, కళ్లులోక్క-

పోయాయి. ఇతని వాలకంచూసి లాడ్జి ఖాళీచెయ్యమన్నాడు ప్రొప్రైటర్. "నీకు కావలసింది అద్దె. నే నెట్లా వుంటే నీ కెందుకు" అన్నాడు లాడ్జి ప్రొప్రైటర్‌తో.

"ఆ మాట నిజమే. కాని మిమ్మల్ని చూస్తుంటే ఎందుకో భయం వేస్తుంది" అన్నాడు ప్రొప్రైటర్.

"నేను దొంగను కాదు. భగ్నప్రేమికుణ్ని కాదు. పరీక్ష తప్పిన విద్యార్థినీకాదు. జీవితాన్ని పునశ్చరణ చేసుకుంటున్న ప్రాజ్ఞుడిని"అన్నాడు.

"అదికాదండీ రోజు రోజుకూ నీరసించిపోతున్నారు. ఆ కాస్త మాట మా లాడ్జిలోనే దక్కుతుందేమోనని భయంగా ఉంది".

సగర్వంగా చూస్తూ పకపకా నవ్వాడు శ్రీనివాసరావు. అమిత సంతోషంతో సిగరెట్టు వెలిగించాడు.

"చచ్చిపోతానని భయపడుతున్నారా, అట్లా ఎప్పటికీ జరగదు. ఆ అనుమానం నాకు కలిగినప్పుడు అర్ధరాత్రయినా మీ అద్దె చెల్లించి మీలాడ్జి ఖాళీచేసి రోడ్డుమీద చస్తాను".

నవ్వుతూ అన్నాడు.

"అంతమాట అనకండి" అన్నారు లాడ్జి ప్రొప్రైటరు.

రూంలో మంచంమీద పడుకున్నాడు. అతని ఆలోచనలు మరి కొంత వెనక్కి వెళ్లినయ్యి.

వలచి వలపించుకున్నది లీలావతి. ఇద్దరి మాటలూ ఒక్కటే అయాయి. మనస్సులూ, మమతలూ కలిశాయి. ఆ అనుబంధపు పారవశ్యంలో తల్లి దండ్రుల్ని కూడా పిలవకూడదన్న లీలావతితో మాటలకు కట్టుబడి పెళ్లి చేసుకున్నాడు.

ఆ రోజున అమ్మా, నాన్నా అందరూ మనస్సులో కనిపించారు. మనస్సులోనే వార్ని విదిలించుకుని భార్య బాహువల్లరిలో కరిగిపోయాడు.

రోజులు గడిచాయి. కళ్ల పొరలు కరిగిపోయాయి. అభిజాత్యంతో లీలావతి హృదయం కరుడుగట్టిపోయిందని అనుభవపూర్వకంగా తెలుసు కోటానికి ఎంతోకాలం పట్టలేదు

మరో పదిరోజులు గడిచాయి. చిక్కి శల్యమైనాడు శ్రీనివాసరావు. ఉదయం సాయంత్రం ఎక్కడెక్కడో తిరిగివస్తాడు. ఎక్కడికి పోవాలో అతనికే తెలీదు. గమ్యస్థానం చేరలేని పాంథునిలా కాళ్లు నెప్పిపుట్టేటట్లుగా తిరిగి ఏ అర్థరాత్రికో గదికి చేరేవాడు.

బ్యాంకు ఉద్యోగంలో చేరింతరువాత ఆ బ్యాంకులోకాక మరో బ్యాంకులో తన ఎకౌంట్ ఓపెన్ చేశాడు. సేవింగ్స్ ఎకౌంట్‌లో నాలుగు వందలున్నయ్యి. ఈ ఇరవై రోజుల్లో దగ్గరఉన్న డబ్బు అయిపోయింది. పాస్‌బుక్ తీసుకుని తన డబ్బుఉన్న బ్యాంకుకు వెళ్లాడు. కౌంటరులో క్లార్కు ఎగాదిగా చూశాడు.

"శ్రీనివాసరావుగారు మీరేనా ?"

"అవును. సంతకం సరిపోలేదా?"

కౌంటరులో క్లార్కు మరొకసారి అతనివైపు చూసి,

"సంతకం సరిపోయింది. మనిషిలో మార్పువస్తేను, సుస్తీగా వున్నారా, జుట్టు, గడ్డంపెంచారు. మొక్కుబడి వుందా" నవ్వుతూ అన్నాడు.

"అవునండీ సుస్తీపడ్డాను. ఇంకా నయంకాలేదు తిరుపతిమొక్కు."

అబద్ధాన్ని ఎంతో నిజంగా హుందాగా చెప్పగలిగినందుకు తనను తానే మెచ్చుకున్నాడు. నాలుగువందలూ తీసుకుని మళ్ళీ లాడ్జికి వెళ్లిపోయాడు రిక్షాలో.

మొత్తం నెలాపదిరోజులైంది. శరీరంతోపాటే మనస్సుకూడా శుష్కించి నీరసించిపోయింది.

ఆలోచనా తరంగాలు లీలగా మనస్సులో కదలాడసాగాయి.

ప్రేమించి పెళ్లిచేసుకున్న భార్యే పెడసరంగా తనను తెక్క చెయ్యక నెత్తిన మేకుకొట్టి వెళ్లిపోయింది. ఆఖరి క్షణంలోకూడా పోట్లాడింది, "నన్ను వంచనచేసి నా మెళ్లో తాకట్టిన కిరాతకుడివి" అన్నది.

అవును నేను కిరాతకుడినే కదా! తండ్రితో మాట్లాడను. దేవుడిని లెక్కచెయ్యను. తమ్ముడుతో ఎప్పుడూ తగాదా పడేవాడిని. తాతయ్యయందు గౌరవంలేదు, తోబుట్టువుయందు జాలీ, కనికరమూ ఉన్నా ఆమె భావాలతో నేను ఏనాడూ ఏకీభవించలేదు. నాకు ఇష్టమైనది అమ్మ. కాని ఆమె మనస్సు కష్టపడుతుందని తెల్సినా ఆమెకు దూరమయ్యాను. ఇంత మందినీ దూరంచేసుకుని నేను జీవితంలో సాధించేది ఏమిటి ? ఏమీలేదు, నా జీవితమే నన్నూ నా వ్యక్తిత్వాన్ని సాధించి చంపుతున్నది. అదృష్ట వంతులు చచ్చినా బ్రతికినట్లే. నాబోటి కిరాతకుడు బ్రతికినా చచ్చినవాడితోనే జమ"

రెండు రోజులుగా దగ్గు వస్తోంది. కళ్ళె తెగటంలేదు. ఆయాసం అధికమైంది. ప్రాణాలు కళ్ళల్లో ఉన్నాయి.

కళ్ళుమూసుకుని అమ్మను తల్చుకుంటూ పడుకున్నాడు. భోజనం చేసి మూడుపూటలయింది. లాడ్జి ప్రొప్రైటరు వచ్చాడు.

"కులాసాగా ఉన్నారా శ్రీనివాసరావుగారూ. బాగా దగ్గుతున్నారల్లే ఉంది, డాక్టరు దగ్గరకు వెళ్ళరండి" ఆప్యాయతలోనే కఠినత్వం గోచరించింది.

"అవును దగ్గు, నన్ను దగ్గరకుతీసుకుంది. ఎందుకయినా మంచిది. రేపు ఉదయం వెళ్ళిపోతాను" దగ్గుతూనే అన్నాడు.

"అట్లాగే. మీ ఊరు వెళ్ళరండి. ఈ హోటళ్ళలో భోజనసౌఖ్యం ఉండదు. ఆ మాట నేనే చెపుతున్నాను".

మర్నాడు ఉదయమే కొంచెం ఫలహారంచేసి, కాఫీ తాగి రైలెక్కాడు. రాత్రి పదింటికి విజయవాడలో దిగి స్టేషనులోనే ఒక బల్ల మీద పడుకున్నాడు. శుష్కించిన శరీరం ఈ రైలుప్రయాణంవల్ల ఇంకా శుష్కించిపోయింది. ఆ కటిక బల్లమీదనే నిద్రపట్టింది.

తెల్లవారింది. బడలిక తగ్గి కళ్ళునులుపుకుని నిద్రలేచాడు. తలదగ్గర పెట్టుకున్న పెట్టెలేదు. చేతి గడియారంలేదు. కాళ్ళకు తొడుక్కున

చెప్పులు లేవు. జేబులన్నీ వెతుక్కున్నాడు. వందరూపాయల కాగితం. కనిపించలేదు. ఇంకో జేబులో రెండురూపాయలూ, కొద్ది చిల్లరా ఉన్నది. ప్రాణం ఎంతో తేలికపడి నవ్వుకుని సిగరెట్టు వెలిగించాడు. ఇప్పుడా సిగరెట్టే అతని ప్రాణం.

ఉదయం ఆరుగంటల రైల్లో గుంటూరుచేరాడు. రిక్షాలో బస్సు స్టాండుకు వెళ్ళిచూస్తే బస్సు వెళ్ళిపోయింది. మళ్ళీ బస్సు పదకొండు న్నరకు, మేనెల ఆఖరురోజులు. రోహిణికార్తె ఆఖరిపాదం, వడ గాల్పులూ, ఎండా ఎక్కువగానే ఉన్నయ్యి.

బస్‌స్టాండ్ హోటల్లో కాస్త కాఫీతాగి ఎంతోసేపు నిరీక్షించి పదకొండున్నరకు బస్సుఎక్కాడు మధ్యాహ్నంఒంటిగంటకు గోగులేశ్వరం పోయే డొంకవద్ద బస్సు దిగాడు. రైలు, బస్సు ఛార్జీలకు పోను అర్ధ రూపాయి చిల్లర మిగిలింది. నాలిక పిడచగట్టుకపోతుంటే సోడాతాగాడు. ఎవరయినా తమ వూరివాళ్ళు కనబడతారేమోనని చూశాడు. ఎవ్వరూ లేరు. డొంకనపడి నడక ప్రారంభించాడు. చెప్పులు లేకపోవటంతో కాళ్ల బొబ్బ లెక్కినయ్యి. కాసేపు నడుస్తూ, కాసేపు చెట్లనీడన కూర్చుంటూ, ఆ ఎండలో మధాహ్నం రెండున్నరకు వాగు వద్దకు చేరాడు. వాగుదాటితే గోగులేశ్వరం అరమైలే ఉన్నది. ఈ చెవిలో గాడ్పు ఆ చెవిలోకి వస్తున్నది. కొంచెం వడ కొట్టింది. కాలు సాగలేదు. వాగువద్దున కూర్చున్నాడు. వాగు ఎండిపోయి ఇసుక తేలింది. కనుచూపుమేర వాగులో ఎక్కడా నీళ్లు కనిపించలేదు. స్పృహతప్పి పడిపోయాడు. ఎవరో చూశారు.. పొలాల్లో పనిచేసేవాళ్లు తాబేటి కాయలోని నీళ్ల ముఖాన చిలకరించారు. కళ్లు తెరచి తాబేటికాయలోని నీళ్లు తాగేశాడు.

"ఎవరయ్యా నువ్వు. ఏ ఊరు? యాడనుంచొస్తుండా, ఈ ఊరు కాదల్లే ఉందే" ఎవ్వరూ అతన్ని గుర్తుపట్టలేదు.

"మాది ఈ ఊరే. మా అమ్మ కులాసాగా ఉన్నదా. నన్ను మా ఇంటికి చేర్చండి" హీనస్వరంతో అన్నాడు. అతని వాలకం చూసి ఎవ్వరూ పోల్చుకోలేకపోయారు.

"ఎవరబ్బాయివి, ఎవరయ్యా మీ అయ్య" అన్నాడొక తాత.

"నేను శ్రీనివాసరావుని. కరణంగారి పెద్దకొడుకుని"

అక్కడ ఉన్న నలుగురూ శిలా ప్రతిమలే అయారు.

"దండాలండి బాబూ దండాలు. ఇట్లా అయాపేం బాబూ. పదండి మెల్లిగా నడిపించుకుపోతాం. అన్నట్లు హైదరాబాద్‌నుంచి ఆ పిల్ల, అదే మీ భార్య, ఆవిడా వచ్చి నాలుగు రోజులైంది. మీరు ఎక్కడా కనిపించ లేదని అంతా ఏడుస్తున్నారు. అంగోలు బాంగోలుగా ఉంది. అందరి రోజులూ బావుండి ఆ దేవుడు మిమ్మల్ని మళ్ళీ ఈ లోకంలో పడేశాడు" అన్నాడొక రైతు

వీళ్ళకన్నా ముందుగానే వెళ్లి ఒకరైతు రాఘవరావుతో చెప్పాడు. యావన్మందీ కూర్చున్నవాళ్లు లేచి తొందర తొందరగా నడుస్తూ వాగు వైపు వెళ్లారు.

ముగ్గురు పట్టుకోగా శ్రీనివాసరావు మెల్లిగా నడిచి వస్తున్నాడు. అందర్నీ చూసి తల వంచుకున్నాడు.

"ఏమండీ, వచ్చేశారా, నేనూవచ్చేశాను. మిమ్మల్ని విడిచి ఎక్కడికీ పోను. మీమాట వేదాకారంగా భావించి పాటిస్తాను" అన్నది లీలావతి.

మాట్లాడకుండా అందరివైపూ చూశాడు శ్రీనివాసరావు.

తల్లి, తండ్రి, తాతయ్య, సురేఖ, ముకుందమాధవరావు, సుభద్రమ్మ, నళిని, రాజేశ్వరి, జయలక్ష్మి, అనుపమ, రాధారమణ, లక్ష్మణ రావు, అత్తగారు, మామగారు, లీలావతి అందర్నీ చూశాడు. తండ్రి ప్రక్కన ఎవరో ఉన్నారు. ఆయన ఎవరో శ్రీనివాసరావుకు తెలీదు, ఆయన రాజేశ్వరి మామగారు హరిసర్వోత్తమరావు.

"అందర్నీ ఊరి పొలిమేరలోనే చూశాను. చాలా సంతోషంగా ఉన్నది. కాని ఇందులో నన్ను క్షమించేది ఒక్క అమ్మ మాత్రమే అను కుంటాను" తల్లివైపు చూస్తూ మెల్లిగా అన్నాడు.

"కాదు బావా. అందర్నీ క్షమించటానికే నువ్వు ఈ పరిస్థితిల్ నైనా ఇల్లుచేరావు. మా అందరికీ కావలసింది నీ క్షమార్పణ కాదు. నువు మా అందర్నీ క్షమిస్తేచాలు" అన్నది రాజేశ్వరి.

ఆనందంతో అందరి కన్నీళ్లు చెమ్మగిల్లాయి. తల్లి, తండ్రీ శ్రీనివాస రావుని పొదివిపుచ్చుకుని నడిపిస్తుంటే, లీలావతి అతని చెయ్యిపుచ్చుకుని అతని చేత్తో తన కన్నీరు తుడుచుకుంది.

— :స మా ప్తం: —

